# Somanath numchi kaasi viswanath daaka...

by

**Gabbita Durga Prasad**

First Edition: **march 2020**

Copies: 500



Price. Rs.**200/-**

Cover Design: **Kalasagar**

For Copies: **Gabbita Durga Prasad**
President, "Sarasabharathi"
H.No.2-405, Sivalayam Street,
Near Raja gari kota, Vuyyuru- 521 165
Krishna Dist. Phone:08676- 232797
Cell: 9989066375
e-mail: gabbita.prasad@gmail.com
sarasabharati.vuyyuru@gmail.com
http/sarasabharati.wordpress.com
http/suvarchalanjaneyaswamy.wordpress.com

Type Setting: **"Ramya Bharathi"** vja

Printed : **Rainbow Graphics,** vijayawada-2

# పుస్తక ప్రాయోజకులు



## శ్రీమతి సీతంరాజు మల్లిక

**మా** కుటుంబం అందరి చేతా "మల్లికాంబ గారు" అని ఆప్యాయంగా పిలువబడే శ్రీమతి సీతంరాజు మల్లికగారు ఎప్పుడో 35 ఏళ్ళక్రితం ఒక ఏడాది తమ కుటుంబంతో మా పెంకుటింట్లో అద్దెకున్నారు. భర్త శ్రీ వెంకటరావుగారు ఎలెక్ట్రిసిటి బోర్డ్ ఉద్యోగి. బహు నెమ్మదస్తుడు. ఈ దంపతులిద్దరూ అందరికీ తలలో నాలుకలాగా

ఉండే అన్యోన్య జీవులు. అప్పటినుంచి మా కుటుంబానికి, ఆ కుటుంబంతో ఆత్మీయ అనుబంధమేర్పడింది. మల్లికగారిని మాకు నిత్యం కనిపించే 'ఆడపడుచు'గా మేము భావిస్తాం. అలాగే శ్రీ అయినపర్తి రాంబాబుగారి భార్య శ్రీమతి భవానిగారు కూడా 'మా ఆడపడుచే' అంటాం. వీరిద్దరూ మా శ్రీమతి ప్రభావతికి అంతరంగిక స్నేహితులు. 'ఫామిలీ ఫ్రెండ్స్' మాత్రమే కాకుండా 'సరసభారతి' అభిమానులు కూడా. మా ఇంట్లో జరిగే శుభ కార్యాలన్నిటికీ మల్లికగారు, భవానిగారు తప్పక వస్తారు. అలాగే వారి ఇళ్ళల్లో జరిగే కార్యాలకూ మేము వెడుతూ ఉండటంతో ఆత్మీయత మరింత పెరిగింది.

మల్లికగారికి సాహిత్యం అన్నా సంగీతం అన్నా విపరీతమైన అభిమానం. స్వయంగా మంచి గాయని కూడా. బెరుకు ఎక్కువ. మాతో పాటు కేరళ, తమిళనాడు టూర్‌లో పాల్గొని మాకెంతో సాయం చేస్తూ, అండదండగా ఉన్నారు. చేజెర్ల, కోటప్పకొండ, త్రిపురాంతకం, పొన్నూరు, చందోలు, ద్వారకా తిరుమల మొదలైన సందర్శనలోనూ మాతో ఉన్నారు. మా ఇంట్లో ఏదైనా కార్యం తలపెడితే వెంటనే వచ్చి వాలిపోయి, మా శ్రీమతికి అన్ని విధాల సాయం చేసే మంచి మనిషి మల్లికగారు. సాహిత్య కార్యక్రమాలకు అతిధులను ఆహ్వానించి ఇంటివద్ద భోజనాలు ఏర్పాటు చేస్తే, ముందుగా మేము తెలియ బరచేది మల్లికగారికే. ఆమె వస్తే మాకు గొప్ప అండగా ఉన్నట్లే. అనుకొన్నది హాయిగా జరిగిపోయినట్లే. భేషజంలేని వ్యక్తి ఆమె. అలాగే కార్తీక పౌర్ణమినాడు మా పెరటి ఉసిరి చెట్టుక్రింద మేము చేసుకొనే రుద్రాభిషేకం, శ్రీ సత్యనారాయణ స్వామి వ్రతాలకు, ఆమె తప్పక హాజరై, తానుకూడా ఒకటో రెండో పదార్థాలు వండి, తెచ్చి, వడ్డనలో సహకరించి ఫలప్రదం చేస్తారు. అందరితో గలగలా నవ్వుతూ మాట్లాడే సహజ లక్షణం మల్లికగారిది. మా పిల్లలు ఆమెను 'మల్లికాంబగారూ' అని ఆప్యాయంగా పిలుస్తారే కాని 'ఆంటీ' అనరు. మా అమ్మాయి శ్రీమతి విజయలక్ష్మి అమెరికాలో ఉంటున్నా, మల్లికగారి సంగతులు ఎప్పటికప్పుడు ప్రత్యేకంగా మమ్మల్ని అడిగి తెలుసుకొంటుంది.

మల్లికగారు తమ కుమార్తెలను 'జయం' 'దుర్గాలు' అని ప్రేమగా పిలుచు కొంటారు. పెద్ద కుమార్తె శ్రీమతి జయలక్ష్మిని గుంటూరు వాసి శ్రీ యల్లాప్రగడ సుబ్రహ్మణ్యంగారికిచ్చి వివాహం చేశారు. వీరి సంతానం ఐశ్వర్య, భరద్వాజ. ఈ వివాహమైన కొన్నేళ్ళకే మల్లికగారి భర్త వెంకటరావుగారు అకస్మాత్తుగా మరణించారు. ఆయన చేసే ఉద్యోగంలో కుమారుడు మోహన్‌ను బోర్డ్‌వారు నియమించారు. భర్త మరణం తర్వాత కుటుంబ బాధ్యత చేబట్టి చిన్నమ్మాయి శ్రీమతి కనకదుర్గను మచిలీపట్నం వాస్తవ్యులు మల్లంపల్లి భానుప్రసాద్‌కిచ్చి పెళ్లి చేశారు. వీరికి చిన్ని కృష్ణ, మీనాక్షి సంతానం. కుమారుడు మోహన్ మల్లికార్జున్‌కు తిరుపతిలో ఉంటున్న శ్రీమతి

హరిప్రియతో వివాహం జరిపించారు. వీరికి చి.జితేంద్ర ఏకైక కుమారుడు, వంశోద్ధారకుడు. ఉయ్యూరులో మల్లికగారు స్వగృహం నిర్మించుకొన్నారు. కూతుళ్ళు, అల్లుళ్ళు కలుపుగోలుతనమున్నవారు. మోహన్‌కు తల్లిమాట వేదవాక్కే. కోడలు అనుకూలవతి. మోహన్ మా అబ్బాయిలతో మంచి స్నేహంగా ఉంటాడు.

మల్లికగారు నిత్యం ఇంట్లో పూజ చేసుకోనిది బయటకు అడుగు పెట్టరు. ప్రతిరోజూ ఏదో ఒక ఆలయ సందర్శనం తప్పనిసరి. కార్తీకమాసంలో ఇంట్లో అభిషేకం చేయించి, మాలాంటి వారిని పిలిచి షడ్రసోపేత భోజనం పెట్టి నూతన వస్త్రాలు ఇచ్చి ఆనందిస్తారు. మల్లికగారి స్నేహబృదం అపరిమితం. శ్రీ లలితా, శ్రీ విష్ణు సహస్ర పారాయణ బృందంలో ముఖ్యసభ్యులు. కవి సామ్రాట్ విశ్వనాథపై ఆయన స్వగ్రామం నందమూరులో, తండ్రి కట్టించిన శివాలయంలో సరసభారతి కార్యక్రమం నిర్వహించి నప్పుడు మాతో పాల్గొని యెంతో సంబరపడ్డారు. రెండు మూడుసార్లు మాతో చిన్న తిరుపతి, దారిలోనే ఉన్న మా రామారావుగూడెం అగ్రహారంలోని శ్రీ భక్తాంజనేయ స్వామి దేవాలయ దర్శనానికి వచ్చారు. ఆమెది విపరీతమైన భక్తి. దేవుళ్ళను చూస్తే పరవశమే. తనకొచ్చిన కీర్తనలు పాడుకొంటూ తన్మయురాలౌతారు. దాదాపు దేశంలోని అన్ని క్షేత్రాలనూ సందర్శించిన పుణ్యమూర్తి. ఈమధ్యే గుజరాత్ వెళ్లి తమ్ముడి కుటుంబంతో సోమనాథ్, ద్వారక మొదలైన క్షేత్రాలు సందర్శించి వచ్చారు.

శ్రీ శార్వరి ఉగాది వేడుకలో నేను రచించి సరసభారతి ప్రచురిస్తున్న 'సోమనాథ్ నుంచి కాశీవిశ్వనాథ్ దాకా' అనే యాత్రా సాహిత్య పుస్తకం ఆవిష్కరిస్తున్నామని తెలిసి తానే ముందుకు వచ్చి స్పాన్సర్‌గా ఉంటానని తెలియజేశారు. ఆమె సౌజన్యానికి ధన్యవాదాలు. సరసభారతి 2016లో 21వ పుస్తకంగా ప్రచురించిన 'మా అన్నయ్య' కవితా సంకలనంకు మల్లికగారే స్పాన్సర్ అని, దానిని తమ తలిదండ్రులు స్వర్గీయ శ్రీ తాడికొండ భోగ మల్లికార్జునరావు, శ్రీమతి బాలాత్రిపురసుందరీ లలితకుమారి దంపతులకు, ఆమె కోరికపై అంకిత మిచ్చామని మరొకమారు గుర్తు చేస్తున్నాను. ఇది ఆమె రెండవ స్పాన్సర్ షిప్ అన్నమాట. సరసభారతి కార్యవర్గ సభ్యురాలుగా శ్రీ మతి మల్లికగారి సేవలు అందరికి ఆదర్శ ప్రాయం. మరొకమారు మల్లికగారికి ధన్యవాదాలు.

ఇది సరసభారతి ప్రచురిస్తున్న 35వ పుస్తకం. నేను రాసిన 21వ పుస్తకం.

**- గబ్బిట దుర్గాప్రసాద్**

# ప్రస్తుతి

సరసభారతి సాహిత్య సాంస్కృతిక సంస్థ ప్రారంభించి 10 సంవత్సరాలు దాటి, 11వ సంవత్సరంలో ప్రవేశించింది. ఈ శ్రీ శార్వరి ఉగాది వేడుకల కార్యక్రమం 150వ కార్యక్రమం. సాహిత్య సంగీతాభిమానుల ఆదరణ, కార్యవర్గ సభ్యుల సహకారం, ప్రోత్సాహమే ఈ విజయాలకు కారణమని విన్నవిస్తున్నాను. 'సోమనాథ్ నుంచి కాశీ విశ్వనాథ్ దాకా' అనే యాత్రా సాహిత్య పుస్తకం నేను రాసిన 21వది, సరసభారతి ప్రచురించిన 35వ గ్రంథం. ఇందులో మేము 6 రాష్ట్రాలలో చేసిన యాత్రా విశేషాలున్నాయి. దీనిని ఈ మధ్యనే మేము సందర్శించిన ఒంటిమిట్ట శ్రీ సీతా లక్ష్మణ సమేత శ్రీ కోదండరామస్వామికి, శ్రీ సంజీవరాయ హనుమాన్‌కు అంకితమిస్తున్నాను.

ఈ పుస్తకానికి అందమైన ముఖచిత్ర రచన చేసిన శ్రీ కళాసాగర్‌కు, నాకు, సరసభారతికి బహు ఆత్మీయుడు, సాహిత్యోపజీవి, శ్రీ చలపాక ప్రకాష్ డిటిపి, ముద్రణ బాధ్యత అంతా తన భుజస్కంధాలపై వేసుకొని సమయానికి అందంగా ముద్రించి అందజేసినందుకు ధన్యవాదాలు.

**- గబ్బిటదుర్గాప్రసాద్**



# చరిత్ర సాక్ష్యాలతో 'యాత్రానుభవం' 'భవిష్యత్ తరాలకు' ప్రయోజకరం

**చా**లామంది 'యాత్ర'లకు వెళుతుంటారు. అలా తాము చూసిన ప్రాంతాలలోని గొప్పదనాలని, అనుభూతులని యాత్ర నుండి తిరిగి వచ్చిన తర్వాత తమ స్నేహితులకో, బంధువులకో చెప్పుకొని ముచ్చట పడుతుంటారు. ఆ ముచ్చట్లు అంతటితో పరిసమాప్తమవుతుంటాయి. కొన్ని మాత్రం జ్ఞాపకాలుగా జీవితాంతం మదిలో కొలువుండి పోతాయి. అటువంటి అపురూపమైన జ్ఞాపకాలను గుర్తున్నవి.... గుర్తుకొచ్చినప్పుడు మౌఖిక రూపంలో చెప్పుకోవడం తప్పించి లిఖిత రూపంలో భద్రపర్చక పోవడం వల్ల అవి భావితరాలకి అందకపోవచ్చు. ఆయా కాలాలలోని జరిగిన మార్పులు, పరిస్థితులు, చెందిన అభివృద్ధి, మంచిచెడులు వంటివి రికార్డు పర్చకపోవచ్చు. కాని ఈ గ్రంథ రచయిత గబ్బిట దుర్గాప్రసాద్‌గారు తాను చూసి వచ్చిన ప్రాంతాలలోని తన అనుభూతులను మాత్రమే కాకుండా ఆ ప్రాంతాల యొక్క చరిత్రను కూడా ఎంతో ప్రయోజకరంగా ఈ గ్రంథం ద్వారా అందించి, యాత్రికులనుండి సాధారణ పాఠకుడిలో కూడా ఆశక్తిని కలిగించేరీతిలో ఈ పుస్తకాన్ని మనకు అందించారు.

ఆ యాత్రానుభవాలు పాఠకుడితో పంచుకోవడంతోపాటు, ఆయా ప్రాంతాలను సందర్శించాలనుకునే వారికి అక్కడ లభించే భోజన వసతి సధుపాయాల వివరాలు సవివరంగా ఇందులో పొందుపర్చారు. అంతేకాకుండా చాలామంది ఆ ప్రాంతాలు చూసినప్పటికీ ఆ ప్రాంతాల యొక్క గొప్పతనం సంపూర్ణంగా తెలుసుకునే అవకాశం కలగకపోవచ్చు. అసలు తాము వెళ్ళిన ప్రాంతాలలో చూడదగ్గవి మరెన్నో ఉన్నాయన్న సంగతీ సంపూర్ణంగా అవగాహన కలగకపోవచ్చు.. కానీ ఈ గ్రంథం చదవడం వల్ల ఆ ప్రాంతాలు చూసినవారు సైతం మరెన్నో తాము చూడకుండా వచ్చేసిన ప్రాంతాల గురించి ఈ పుస్తకం ద్వారా తెలుసుకొని విస్మయానికి గురికాక తప్పదు. ఈసారి వెళ్ళినప్పుడు చూసిరావాలనే ఉబలాటమూ కలగక మానదు. 'సోమనాథ్ నుంచి కాశీ విశ్వనాథ్ దాకా' అనే ఈ గ్రంథంలో అంత సంపూర్ణ యాత్రా సమాచారం అందించారు గబ్బిట వారు.

ఈ పుస్తకం చదవడం ద్వారా మరెంతో ప్రయోజనం కూడా ఉందని చెప్పాలి. చరిత్రలో 'మంచి'– 'చెడు' అనేవి ఎంత కాలమైనా.. ఎన్ని తరాలైనా ఏ విధంగా వెంటాడి ముందుతరాలను ప్రభావిత పరుస్తాయో ఈ పుస్తకంలో చూడవచ్చు. మన దేశ సంస్కృతీ సంప్రదాయాలు ఉట్టిపడే విధమైన అలనాటి మన దేశాన్ని పాలించిన చక్రవర్తుల కాలంలో.. శిల్పకళా సంపద ఎంతటి విశిష్టతను కలిగించి.. మన దేశ

శిల్పుల గొప్పతనాన్ని ఇతర దేశాలకు ఇనుమడింపజేసిందో ఈ పుస్తకం ద్వారా తేట తెల్లమవుతుంది. ఈర్ష్యా ద్వేషాలతో 'మంచి'పై 'చెడు' ఎలా దండయాత్ర చేసి విధ్వంసం చేసిందో... దానికి ఎన్ని ఒడిదుడుకులు ఎదుర్కొని చివరికి 'చెడు' కాలగర్భంలో కలిసిపోయి 'మంచి' శాశ్వతంగా నిలిచిందో, ఈనాటి 'సోమనాథ్ దేవాలయ చరిత్ర'ను చదివితే మనకు అర్థమవుతుంది. 'సోమనాథ్ దేవాలయ నిర్మణం ఎంత అద్భుత కట్టడంగా' అలనాటి రాజులు తీర్చిదిద్దారో.. ఆ దేవాలయాన్ని ఎంతమంది దుర్బుద్ధిగల ముష్కర రాజులు ఈర్ష్యతో ముట్టడించి నాశనపరచారో, మళ్ళీ దానిని ఎవరెవరు ఎన్ని విధాలుగా కాపాడుకుంటూ మరింత అద్భుతరీతిలో నిర్మాణాలు జరిపి ఈనాటికీ చరిత్ర సాక్ష్యాలుగా నిలిచిన సోమనాథ్ దేవాలయ వృత్తాంతం చదివితే నిజమైన ఈ దేశ పౌరుడికి పౌరుషంతో చాతీ విస్తరించి తీరుతుంది. మన చరిత్ర, సంస్కృతిని నాశనం చేసే కుట్రలో ఇతర మత ప్రభువులు ఏ విధంగా తాము నాశనమై కాలగర్భంలో చరిత్రహీనులుగా మిగిలిపోయినదీ ఈ పుస్తకం చదవడం ద్వారా తెలుసుకొని పాఠకుడు... 'మంచి–చెడు' అనే తారతమ్యాలను అంచనా వేసుకోగలుగుతాడు.. మనలోని చెడును చెరిపేసుకొని మంచి కోసం పరితపించే ఆలోచనలకు ప్రేరేపిస్తాడు. అటువంటి చరిత్ర పాఠాలు మనకీ 'సోమనాథ్' దేవాలయ నిర్మాణం నేర్పిస్తుంది.

చాలామంది ఉద్యోగ పదవీవిరమణ చేసినవారు తమంతా చేయగలిగింది చేసేసామని.. ఇక చేయగలిగింది ఏమీ లేదని... శక్తీసామర్థ్యాలు సన్నగిల్లాయని సరిపుచ్చుకుంటుంటారు. కాని ఈ సమాజానికి ఏదోకటి తమ ఊపిరి ఉన్నంతవరకూ చేస్తూ ఉండాలనే లక్ష్యంగల వాళ్ళు చాలా తక్కువమంది మాత్రమే ఉంటారు. అనుకున్నది సాధించాలనుకునేవారికి వయస్సుతో పని లేదు. తము చివరి శ్వాస ఉన్నంతవరకూ ఏదోకటి సమాజానికి ఉపయోగపడే పనులు చేయలనుకునే వారు బహు అరుదు. అటువంటి అరుదైన వ్యక్తులలో గబ్బిట దుర్గాప్రసాద్‌గారు ఒకరు. 80 ఏళ్ళ వయస్సులో కూడా అలుపెరుగని అక్షర సైనికుడిలా ఎందరికో స్ఫూర్తినిస్తూ ఆదర్శప్రాయులవుతున్నారు. తాను విన్నవి, కన్నవి, మరిన్ని అతి కష్టపడి సేకరించినవి నేటి తరానికి, భావితరాలకు ఉపయోగపడే రీతిలో అయన తన అక్షర యజ్ఞాన్ని నిబద్ధతగల గురువుగా, భాషాభి మానిగా, రచయితగా, సరసభారతి అధ్యక్షులుగా, కార్యకర్తగా.. ఇలా ఎన్నో... ఎన్నెన్నో బాధ్యతలు నిర్వర్తిస్తున్నారు. వారి నిరంతర కృషికి ప్రతి తెలుగువాడూ అభినందించి తీరాలి. ప్రభుత్వమూ ఆయన సేవలను గుర్తించి తగురీతిలో గౌరవించి మరింత మందికి స్ఫూర్తిని కలిగింపజేయాలి.

**– చలపాక ప్రకాష్**

**ప్రధాన కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ రచయితల సంఘం**

# సోమనాథ్ నుంచి కాశీ విశ్వనాథ్ దాకా...

**1) జై సోమనాథ్**

**7) మా నవరాత్రి యాత్ర**

# సోమనాథ్ నుంచి కాశీ విశ్వనాథ్ దాకా...

## 1.జై సోమనాథ్

గమనిక– 2002లో మేము గుజరాత్‌లోని అహమ్మదాబాద్‌కు మా రెండో అబ్బాయి శర్మ వాళ్ళింటికి నేనూ మా శ్రీమతి ప్రభావతి మామనవడు హర్ష చిన్నతనంలో దసరాలలో వెళ్లాం.. అప్పటికి తొమ్మిది నెలలక్రితం పెద్ద భూకంపం వచ్చి గుజరాత్‌ను అల్లకల్లోలం చేసింది. ఆ తర్వాత పరిస్థితులు చక్కబడ్డాయి. అయినా ఆ శిధిలాలు నష్టం కనిపిస్తూనే ఉన్నాయి. ఒకరోజు బస్సుల్లో అహ్మదాబాద్‌లో పోర్ బందర్ రాజకోట్‌ల మీదుగా మహర్నవమి రోజున జ్యోతిర్లింగ క్షేత్రం సోమనాథ్‌కు, విజయదశమి రోజు ద్వారకకు, ఇంకో రోజు మేమిద్దరమే గాంధీనగర్‌లోని అక్షరధాం అనే స్వామి నారాయణ దేవాల యానికి ఇంకో రోజు ఇస్కాన్ దేవాలయానికి వెళ్లి వచ్చాం. ఇక్కడే వాల్మీకి మహర్షి రాసిన రామాయణం రెండుభాగాలలో నాగరి లిపిలో సంస్కృతంలో గీతా ప్రెస్ వాళ్ళు ప్రచురించిన అమూల్య గ్రంథాన్ని అది ఇంట్లో ఉంటె చాలు అనే ఉద్దేశ్యంతో కొన్నాను.

గుజరాత్‌లో దసరా స్పెషల్ అయిన స్త్రీ పురుషులు వృద్ధులు యువకులు బాలబాలికలు రాధా గోపికా కృష్ణ వేషాలు వేసుకొని వాయిద్యాల హోరులో గానం చేస్తూ అత్యుత్సాహంగా రాత్రి 10నుంచి తెల్లవారుజామువరకా చేసే 'దాండీ నృత్యం' రెండుమూడు రోజులు చూశాం. అర్ధరాత్రి అయినా స్త్రీలు అత్యుత్సాహంతో బజార్లలో తిరగటం మహా ఆశ్చర్యంగా ఉండేది. గుజరాత్‌కే ప్రత్యేకమైన ఓపెన్ అయిర్ సినిమా థియేటర్ 'డ్రైవ్ఇన్'లో అమీర్ ఖాన్ హిందీ సినిమా 'లగాన్' చూశాం. హాయిగా ఆరుబయట కూర్చుని, పడుకొని అన్నాలు టిఫిన్లు తింటూ సరదాగా చూడటానికి వీలుగా ఉంటాయి ఆరుబయలు సినిమాహాళ్ళు. విశాలమైన స్థలం ఎత్తుగా ఉండే వేదికపై తెర. ఏవైపు నుంచైనా భేషుగ్గా సినిమా చూడచ్చు. కార్లు పార్క్ చేసుకొని కారులో కూచునీ చూడచ్చు. రాత్రి 6 గంటలకు ప్రతి రోజు సినిమా ఉంటుంది. అప్పటికినాకు కంప్యూటర్ పరిజ్ఞానం హుళక్కి. చూసిన ప్రదేశాల వివరాలు నోట్‌బుక్‌లో రాసుకోవటమే చేసేవాడిని. కనుక ఈ ట్రిప్ గురించి ఎక్కడా రాయలేదు. ఈ యాత్రా విశేషాలను 'జై సోమనాథ్' శీర్షికతో అప్పటి సమాచార కేంద్రం ప్రచురించిన 'సోమనాథ్' పుస్తకాన్ని చదవి సోమనాథ్ పైనా, వీకీ పీడియా ఆధారంగా ద్వారక, స్వామి నారాయణ దేవాలయాలపై 2014లో రాసిన వివరాలివి. మేము చూసి అప్పటికే పన్నెండేళ్ళు అయింది. ఇప్పటికి 17ఏళ్ళు. కనుక తర్వాత జరిగిన అభివృద్ధి ఇందులో లేదని

గ్రహించమని ప్రార్థన .

## ప్రభాసతీర్థం-1

భారతదేశంలోని ద్వాదశ జ్యోతిర్లింగ క్షేత్రాలలో గుజరాత్‌లోని సోమనాథ్ క్షేత్రం అగ్రగామి. ఎన్నో దండయాత్రలకు తట్టుకొని నిలబడింది. దీనికే 'ప్రభాస తీర్థం' అని పేరు. "జై సోమనాథ్" పేరిట నేను రాస్తున్న విషయాలన్నీ ఇతిహాస, పురాణ, చారిత్రిక అంశాలకు చెందినవి. ఆ క్షేత్రం ఎలా మొదలైయెంత ఉత్కృష్ట దశ అనుభవించి పతనమైనదీ, మళ్ళీ ఏ విధంగా పునర్వైభవంతో భక్తజన సందోహానికి ఏ విధంగా స్ఫూర్తిదాయకం అయిందీ మొదలైన అంశాలను ఇందులో తెలియజేసే ప్రయత్నం చేస్తున్నాను. ఇది 'శ్రీ ముదిగొండ శివప్రసాద్'గారి చారిత్రిక నవల కాదు. అన్ని అంశాల ప్రస్తావన ఉన్న వ్యాస పరంపర.

## చరిత్రకు పూర్వ ప్రభాసం

"దేవతేర్పి దుష్ప్రాకో మెహ్ సంగ్యంస్య రూపో సర్వాంశముం - తీర్థానా ప్రధాన తీర్థస్య రూపః ప్రభాస్ తీర్థ ముత్తమం"

అన్ని తీర్థాలలో ప్రభాస తీర్థం ఉత్తమమైనదని దీని భావం. భారతదేశ పడమటి భాగంలో సౌరాష్ట్ర ప్రదేశం అరేబియా సముద్ర తీరంలో 'ప్రభాస తీర్థం' విరాజిల్లింది. ఇదే ప్రఖ్యాత సోమనాథ మహాలింగ క్షేత్రం. ఈ ప్రభాస తీర్థంలోనే భగవాన్ శ్రీ కృష్ణుడు తన అవతార సమాప్తి చేశాడు. సముద్ర తీర ప్రాంతం కనుక ఇక్కడ వేసవిలోనూ శీతాకాలంలోను ఉష్ణోగ్రతలలో పెద్దగా వ్యత్యాసం ఉండదు. ఇక్కడ వేసవి చల్లగా ఆహ్లాదకరంగా ఉండటమే ప్రభాస తీర్థం ప్రత్యేకత. ప్రభాస తీర్థానికి దగ్గర రైల్వేస్టేషన్ నాలుగున్నర కిలో మీటర్ల దూరంలో 'వేరేవాల్'లో ఉంది. 1948 వరకు ప్రభాస తీర్థాన్ని 'ప్రభాస పట్టణం' అనే వారు ఆ పేరుతోనే తాలూకా, మునిసిపాలిటీ కూడా పిలువబడేది. పూర్వపు జునాగడ్ రాష్ట్రంలో ఇది ప్రధాన పట్టణం. 1948 తరువాత ఈ మునిసిపాలిటీ తాలూకాను 'వేరేవాళ్' మునిసిపాలిటీలో కలిపేశారు. దీని వలన ఈ ప్రాంత సాంఘిక, రాజకీయ, వాణిజ్య ప్రాముఖ్యత తగ్గిపోయింది.

ప్రభాసా తీర్థం వైశాల్యం 2180 ఎకరాలు. దీనికి దక్షిణంలో సముద్రం, ఉత్తరం వైపు వ్యవసాయ భూములు, ఫల వృక్షాలు, ఉద్యాన వనాలున్నాయి. పడమర అంతా ఇసుక ఎడారి, స్మశానం. తూర్పున అంతా నిరూపయోగ భూమి ఉంది. కనుక దీని అభివృద్ధి తూర్పు వైపుకే సాధ్యంగా ఉంది. ఎవరికీ శ్రద్ధ లేకపోవటంతో చాలాకాలం ఇది అభివృద్ధికి నోచుకోలేదు. సోమనాథ దేవాలయ ట్రస్ట్ మాత్రం తన పరిధిలో కొంత అభివృద్ధి పనులు చేస్తూ ఉంది.

పూర్వకాలంలో ప్రభాస తీర్థం 'శీట్లా'లో సూర్యదేవాలయం వరకు విస్తరించి

ఉండేది. నగ్రాదిల్‌లో సూర్యాలయము ఉన్న ప్రాంతాన్ని 'నగర్ పూర్' అనేవారు. ఇక్కడే గంగానది, హిరణ్య సరితా నదులు సంగమిస్తాయి. దీన్ని సంగం ఆని పిలుస్తారు. ఇక్కడ త్రవ్వకాలు జరిపిన పురా వస్తు శాఖ వారికి వేదకాలం కంటే ముందున్న వస్తువులు లభించాయి. ఇదీ దీని ప్రాధాన్యత. 500కు పైగా నాగరకతలు ఇక్కడ వెల్లి విరిశాయని ఆ శాఖ పేర్కొన్నది. చరిత్రకు పూర్వమే ఇక్కడ అనార్య సంతతి అయిన 'మీనూర్' అనే జాతి ఉండేదని పరిశోధనలో తెలిసింది. ఇక్కడి నుండి అనేక ఆర్య ఓడరేవులకు వర్తక వాణిజ్యాలు ఎగుమతి దిగుమతులు జరిగేవి. ఇలా కొన్ని శతాబ్దాలు గడిచాయి తరువాత సూర్య వంశానికి చెందిన ఆర్యులు సముద్రం ద్వారా ఇక్కడికి చేరుకొని స్థానిక జాతులను వెడల గొట్టారు. వారు ఇక్కడ 'అర్క తీర్ధం' లేక భాస్కర తీర్ధం' అనే పేర యాత్రా స్థలం ఏర్పాటు చేశారు. కొంతకాలం తరువాత చంద్ర వంశానికి చెందినవారు ఇక్కడికి వచ్చి, బలాన్ని పొంది 'సోమతీర్ధం లేక చంద్రతీర్ధంగా మార్చారు. మరికొంత కాలం గడిచిన తర్వాత సూర్య, చంద్ర వంశీయుల మధ్య సయోధ్యత కుదిరి 'ప్రభాస తీర్ధం'గా ఈ ప్రదేశాన్ని పిలుచుకొన్నారు. అప్పటి నుంచి ఆ పేరే స్థిరపడి పోయింది.

## ప్రభాస్

స్కంద పురాణంలో ఒక కథ ఉంది. దక్ష ప్రజాపతి అల్లుడైన చంద్రుడు ఒక్క రోహిణినే చేర దీసి మిగిలిన భార్యలను దూరం చేసినందువల్ల దక్షుడు కోపించి చంద్రుడికి 'కుష్టు వ్యాధి' సోకాలని శపించాడు. అప్పుడు శాప విమోచనం చెప్పమని మామను ప్రార్ధిస్తే సోమనాధుని అర్చించమని చెప్పాడు. చంద్రుడు ఇక్కడికి వచ్చి శివుడిని గూర్చి తపస్సుతో సోమనాదార్చన చేసి వ్యాధి నుండి విముక్తుడైనట్లు ఉంది. అందుకే 'ప్రభాస తీర్ధం' అయింది. ఈ ప్రాంతంలో సూర్యప్రకాశం చంద్రశీతలం రెండూ సమానంగా ఉంటాయి కనుక 'ప్రాభాస తీర్ధం' అనే పేరు సార్ధకమయింది. ప్రభాసం అంటే ఉద్యయించే సూర్యుడు ఉన్న ప్రభాతం. స్కంద పురాణం మొదటి అధ్యాయంలో దీనికి నందన, శివ, ఉగ్ర, భద్రకా, సమిదాన్, కామద్, వశ్వరూప్, పద్మనాభ్, సుదర్శన్, మోక్ష మార్గ్ అనే పేర్లున్నాయి.

మహాభారత కాలంలో దీనికి భాస్కర తీర్ధం అని పిలిచారు. భాస్కర తీర్ధం, అర్క తీర్ధం, సోమ తీర్ధం అని కూడా పిలువబడింది. సరస్వతీ తీర్ధం అనీ పేరుంది. శివపట్నం అనీ అంటారు. జైన సాహిత్యంలో 'చంద్ర ప్రభాస్ పట్నం' అన్నారు. గుజరాతీ సాహిత్యంలో 'ప్రభావ దేవ పట్నం' అంటారు. మొగలాయిలు పట్టణ దేవ్ అంటే సోమ్‌పూర్ అని, సంవత్ అని విల్విపూర్ పట్నం అని, సుర్ పట్నం అని సోమనాధ్‌పురం అని పేర్లున్నాయి .

మహాభారత కాలంలో ప్రభాస్ ఒక గొప్ప ఆధ్యాత్మిక తపో కేంద్రంగా, పవిత్ర

తీర్థంగా ప్రసిద్ధి చెందింది. శ్రీ కృష్ణ విహార భూమి అవటంతో దీని ప్రాశస్త్యం మరీ పెరిగిపోయింది. పాండవులకు యాదవులకు యాత్రా స్థలం అయిందని భారతం అరణ్య పర్వంలో ఉంది. "సౌరాష్ట్ర దేశీయ స్తితే – సాగర తటే ప్రభాస తీర్థః" అని ఉంది. కృష్ణుని అన్న బలరాముడు ఈ క్షేత్ర దర్శనం చేసినట్లు భారతంలో శల్య పర్వంలో ఉన్నది. వన పర్వంలో యాదవ, పాండవులు ఇక్కడ ఆవాసం ఉన్నట్లు ఉంది.

## ప్రభాసతీర్థం-2

## పురాణాలలో ప్రభాస్

వామన, కూర్మ, గరుడ, భవిష్య, మత్స్య, పద్మ, విష్ణు పురాణాలలోను శ్రీమద్భాగవతం, దేవీభాగవతంలోను ప్రభాసతీర్థ ప్రస్తావన ఉంది. స్కందపురాణంలో ఒక అధ్యాయం దీనికే కేటాయించ బడింది. వృక్షశాస్త్ర విభాగంలోనూ ఇంతే ప్రసిద్ధి పొందింది. ఏడు ఎనిమిది శతాబ్దాలలో ప్రభాస్మరీ వెలుగులోకి వచ్చింది. అన్ని గ్రంథాల్లో ఈ క్షేత్రం గురించిన విశేషాలన్నీ ఉన్నాయి.

స్కందపురాణం ప్రభాసఖండంలో దీనిపై ఎన్నో కథనాలున్నాయి. అందులో కొన్నిటిని తెలుసుకొందాం. ప్రభాస ఖండం పూర్తిగా సోమనాథ లింగవైభవానికే ప్రాముఖ్యతనిచ్చింది. దక్షప్రజాపతి తన 27గురు పుత్రికలను చంద్రుడికిచ్చి వివాహం చేశాడు. కాని చంద్రుడు అందులో రోహిణిపై మాత్రమే ప్రేమ చూపించి మిగిలిన 26 గురిని దగ్గరకు తీయలేదు. వీరు తమకు జరుగుతున్న అన్యాయాన్ని తండ్రికి ఫిర్యాదు చేశారు. దక్షుడు చంద్రునితో అందర్నీ సమానంగా చూడమని నచ్చచెప్పే ప్రయత్నం చేశాడు. వినలేదు. కోపగించిన దక్షుడు అల్లుడు చంద్రునికుష్టువ్యాధి సోకి బాధపడాలని శపించాడు. దీనితో చంద్రుడు కాంతివిహీనుడై వెల వెలబోయాడు. దీనిప్రభావం భూమిమీద, సముద్రాలమీద పడింది. ప్రపంచం అల్లకల్లోలమైంది. ఈ బాధనుండి రక్షించటానికి మహర్షులు దక్షుని దగ్గరకు చేరి శాపం ఉపసంహరించమని కోరారు. శాపఉపసంహారం తనచేతిలో లేదని, కాని శివదేవుని అనుగ్రహం సంపాదిస్తే ఉపశమనం కలగవచ్చునని సలహా చెప్పాడు.

చంద్రుడు శివుని గురించి ఘోరతపస్సు చేశాడు. సంతోషించిన పరమేశ్వరుడు ప్రత్యక్షమై తాను చంద్రుని పూర్తిగా స్వస్తుడిని చేయలేనని కాని నెలలో పదిహేను రోజులు ప్రకాశవంతంగా, మిగిలిన పదిహేను రోజులు కళతగ్గి కనిపించేట్లు చేయగలనని చెప్పాడు. సరే అంతవరకైనా నయం అని సంతోషించాడు. అందుకే చంద్రునికి నెలలో శుక్ల, కృష్ణపక్షాలు ఏర్పడి మొదటిదానిలో కళలు పెరిగి రెండవపక్షంలో క్రమంగా తరిగిపోతాయి. ప్రభాసతీర్థంలో సోమనాథ్ జ్యోతిర్లిన్గాన్ని అర్చించి చంద్రుడు ఈ తపస్సుచేసి శివుడిని

మెప్పించాడు. స్వామి కోడి అంగం పోలికతో దర్శనమిచ్చాడు. ఆ రూపశివలింగాన్నే చంద్రుడు ఇక్కడ ప్రతిష్టచేసి యజ్ఞయాగాలు నిర్వహించాడు. సోముడు అంటే చంద్రుడు ప్రతిష్టించాడు కనుక సోమనాథలింగం అయింది.

దేవదానవుల యుద్ధంలో రాక్షసులను జయించటం అసాధ్యం అని భావించిన దేవతలు దధీచి మహర్షిని ఆశ్రయించి ఆయన శరీరంలోని ఎముకలను దానం చేయమని అర్థించారు. వాటితో దేవతలు ఆయుధాలు చేసుకొని రాక్షససంహారం చేస్తారని వేడుకొన్నారు. దేవతల ప్రార్థన మన్నించి దధీచి మహర్షి యోగసమాధి చెంది, స్వచ్ఛంద మరణం పొందాడు. దేవతలు దధీచి మహర్షి ఎముకలను శరీరం నుండి వేరు చేశారు. ఇంద్రుడు దధీచి ప్రక్కటెముకతో వజ్రాయుధం తయారు చేయిన్చుకొన్నాడు. అలాగే మిగిలిన దేవతలు ఎముకలను తీసుకొని తమ తమ ఆయుధాలను తయారు చేయించుకొన్నారు. మహర్షి శరీరంలోని రక్తమాంసాలను కామధేనువు నాకేసి ఖాళీచేసి తోడ్పడింది. ఈ సంఘటన జరిగినప్పుడు దధీచి మహర్షి కొడుకు పిప్పలాదుడు చిన్నపిల్లాడు. అతను పెద్దవాడై తన తండ్రికి జరిగిన అవమానకరమైన, బాధాపూరితమైన మరణానికి, దేవతల కుటిలత్వానికి ప్రతీకారం తీర్చుకొవాలనుకొన్నాడు. దీనికోసం అగ్నిదేవుడి అనుగ్రహం సంపాదించాలని తపస్సుచేసి మెప్పించి సముద్రంలో ఉండే 'బడబానల' తనలో చేరేట్లు వరం పొందాడు. తన తండ్రి దధీచి మరణాకి కుట్రచేసిన దేవతలనందర్నీ నాశనం చేయమని బడబానలాన్ని ఆదేశించాడు. దీనికి భయపడ్డ దేవతలు విష్ణుమూర్తిని శరణు వేడుకొన్నారు.

విష్ణువు ఆదరాబాదర పరిగెత్తుకొచ్చి పిప్పలాదుని రోజుకు ఒక్క దేవతను మాత్రమే చంపెట్లు ఒప్పించాడు. మొదటగా వరుణ దేవుడిని చంపాలని నిశ్చయించుకొన్నాడు. సరస్వతీదేవిని భూమిమీదకు బడబానలాన్ని తీసుకురమ్మనమని కోరాడు. అలాగే చేసింది సముద్రతీరాన బడబాన అగ్ని సరస్వతి చేసిన పనికి సంతృప్తి చెంది వరం ప్రసాదిస్తానన్నాడు. విష్ణుమూర్తి ముందుగా చేసిన హెచ్చరికతో సరస్వతిదేవి బడబానలాగ్ని మూతిని సూది బెజ్జం అంత చిన్నదిగా చేసుకొని సముద్రజలాలను పీల్చి ఖాళీ చేయమని కోరింది. ఆ కోరికను మన్నించాడు బడబానలుడు. సరస్వతికి వరం ప్రసాదించాడు. తర్వాత సముద్రాన్ని ఆ బుల్లిమూతితో తాగి ఖాళీచేసే ప్రయత్నం చేస్తూనే ఉన్నాడు కాని శక్యం కాలేదు. కనుక వరుణదేవుడిని సంహరింపలేకపోయాడు బడబానలుడు. ఇచ్చిన మాటకు నిలబడి బడబానలాగ్ని సముద్రంలోనే ఉండిపోయింది.

## ప్రభాసతీర్థం-3

### ప్రభాస్ ఉత్థాన పతనాలు

క్రీ.పూ. 100వ శతాబ్దంలో ఉత్తర భారత దేశమంతా శకుల పాలనలోకి

వచ్చింది. ఇరవై నాలుగేళ్ల తర్వాతా శక రాజు నేహప్నల్ సప్తకర్ని కుమారుడైన గౌతమి అధీనంలోని ప్రాంతానికి స్వేచ్ఛ నిచ్చాడు. నఃపాల్ బౌద్ధాన్ని అనుసరించినవాడు కాదు. అతని అల్లుడు ఉద్ధవదత్తు ప్రభాస తీర్ధానికి యాత్ర చేశాడు. అక్కడ ఎనిమిది మంది బ్రాహ్మణ కన్యలకు ఎనిమిది మంది బ్రాహ్మణ బ్రహ్మచారులతో వివాహాలు జరిపించాడు. ఈ విషయం నాసిక్‌లో ఉన్న ఒక గుహలోని శిలా శాసనం వలన తెలుస్తోంది. ఇందులో ఏ సంవత్సరంలో ఇది జరిగిందో తెలుపలేదు. నేహప్నల్ కాలం క్రీ. శ. 124గా భావిస్తారు. సోమనాథ దేవాలయం పేరు కూడా పేర్కొనలేదు. బహుశా ఉద్ధవదత్తు కాలానికి ప్రభాస్ ప్రభావం అంతగా లేకపోయి ఉండవచ్చు. అందుకే ఆ పేరు ఉండి ఉండక పోవచ్చు.

క్రీ.పూ. 390లో శకుల పాలన అంతమై గుప్తసామ్రాజ్య పాలన వచ్చింది. అప్పుడు ఈనాడు జునాగడ్ అని పిలువబడే ఆనాటి గిర్నార్ రాజధానిగా ఉండేది. మళ్ళీ ప్రభాస్‌కు మంచి రోజులొచ్చి ఒక వెలుగు వెలిగింది. అప్పుడే దైత్య సూడాన్, విష్ణు, చక్రదర్ విష్ణు, నారాయణ్ హరి మొదలైన దేవాలయాల నిర్మాణం జరిగిందిక్కడ. గుప్త చక్రవర్తికి సామంతరాజుగా ఉన్న రాజా పరమార్ సోమనాథ దేవాలయానికి నిర్వహణ కోసం ఒక గ్రామాన్ని దానంగా రాసిచ్చాడు. స్కంద గుప్తుని వలననే స్కంద పురాణ రచన జరిగింది. ఇందులో ప్రభాస తీర్ధ వివరాలను ప్రభాస్‌కు చెందిన ఒక విద్వాంస కవి రచించాడు. ఈ రచన ఐదవ శతాబ్దిలో ప్రారంభమైంది. రెండు వందల ఏళ్ళ వరకు రచన కొనసాగి ఏడు లేక ఎనిమిది శతాబ్దాలలో రచన పూర్తయ్యింది.

క్రీ.శ. 480లో స్కంద గుప్తుడి మరణం తర్వాత అతని సైన్యాధ్యక్షుడు భట్టారకుడు తన స్వంత రాజ్యాన్ని వల్లభిపురంలో ఏర్పరచాడు. అదే తర్వాత సామ్రాజ్యంగా విస్తరిల్లింది. అతను వేయించిన చాలా శాసనాలు ఇప్పటికీ భద్రంగా ఉన్నాయి. కాని వాటిలో సోమనాథ దేవాలయ విషయాలేవీ లిఖింప బడలేదు. వల్లభి సామ్రాట్ సూర్య ఆరాధకుడు. అందువలన ప్రభాస్‌లో 16 సూర్య దేవాలయాలను నిర్మించాడు.

క్రీ.శ. 770లో వల్లభి దురాక్రమణలకు గురి అయింది. ఆరబ్ జెనరల్ జునీద్ వల్లభి రాజు శిలాదిని చంపి సామ్రాజ్యాన్ని లోబరచుకొన్నాడు. ధన సంపదలను దోచుకొన్నాడు. బిల్దూరి అనే ముస్లిం చరిత్రకారుడు రాసిన దాని ప్రకారం జునీద్ తొమ్మిది పట్టణాలను వశ పరచుకొన్నాడు. అందులో ప్రభాస్ పేరు లేదు. కాని కేదారేశ్వర ఖండంలో దండయాత్రలకు ఖేదం పొందిన కేదారేశ్వరుడు అవమానం భరించలేక సముద్రంలో దూకి ఆత్మహత్య చేసుకోన్నాడని ఉంది. కనుక ప్రభాస్‌ను జునేద్ వశ పరచుకోలేదని అంటారు. వల్లభి పాలన చౌడా, చపోటకట్ రాజుల పేర్లున్నాయి. వల్లభి వంశ పాలకులలో ఒకడైన జై షికార్ తన ప్రాణాన్ని రాజ్యాన్ని రాజా భువడ్‌తో జరిగిన యుద్ధంలో కోల్పోయాడు. చాలా కాలం తర్వాత జై షికార్

కుమారుడు వన రాజు కోల్పోయిన సామ్రాజ్యాన్ని మళ్ళీ దక్కించుకొన్నాడు. గుజరాత్ ఉత్తర ప్రాంతంలో ఉన్న 'అనిహిల్వార్'ను స్థావరంగా చేసుకొని దానికి ప్రభాస పట్టణం అని నామకరణం చేశాడు. 1410 వరకు ఈ ప్రాంతం అంతా గుజరాత్ పటన్ గడ పేరుతోనే పిలువబడింది. వన రాజు కొడుకు యోగరాజు తర్వాత ఇతని కొడుకు క్షేమ రాజు అయ్యారు. క్షేమరాజు ప్రభాస్ రేవులో లంగరు వేయబడిన విదేశీ నౌకను దోచుకోవటం జీర్ణించు కోలేని తండ్రి యోగ రాజు ఆత్మహత్య చేసుకొన్నాడు. వనరాజు తర్వాత చాలాకాలానికి చౌడ వంశ పాలనప్రభాస్‌లో కొనసాగింది. చౌడ సామ్రాజ్యాం ఎనిమిదో శతాబ్దం వరకు సాగింది.

ఏడు ఎనిమిది శతాబ్దాలలో సోమనాథ దేవాలయం కీర్తి దూరదేశాల వరకు వ్యాపించింది. అనేక దేశాల రాజులు స్వామికి కానుకలు పంపేవారు. రాజులు స్వయంగా ప్రభాస తీర్థానికి వచ్చి సోమనాద దర్శనంతో పూజతో తరించేవారు. క్రీ.పూ. 806లో కనోజ్ రాజు నాగభట్టు వచ్చి స్వామి సేవలో పాల్గొన్నాడు. క్రీ.శ.960లో చేదిరాజు హయ హయ లక్ష్మణ్, సిలార్ రాజు అనంత దేవుడు సోమనాథ యాత్ర చేశారు. క్రీ.శ.975లో చంద్ర చూడ రాజు కుమారుడు వంతాలియా యాదవ్ ఒక చిన్న రాజ్యాన్ని స్థాపించినా ప్రభాస్‌పై అతనికి ప్రభావం లేదని తెలుస్తోంది. కాని అతని మునిమనుమడు రాగ్రిహార్ సౌరాష్ట్ర ప్రాంతాన్ని పాలించినట్లు ఉంది. ఇతనినే జైనులు గ్రహిప్ అన్నారు. అతని పాలనలో ప్రభాస్ కూడా ఉంది.

క్రీ.పూ.975లో మూల రాజు సోలంకి తన స్వామి మాతుల్ సామంత్ సింగ్ చౌడాను చంపి రాజ్యాన్ని స్వాధీనం చేసుకొని, గుజరాత్ మహారాజయ్యాడు. సౌరాత్ అంటే సౌరాష్ట్రపై అనేక విఫల దాడులు చేశాడు. చివరికి క్రీ.శ.979 లో గ్రిహార్‌ను ఓడించి విజయం సాధించాడు. ఈ విజయం సాధించిన తర్వాత ప్రభాస్‌కు యాత్ర చేసి సోమనాథుడిని భక్తి ప్రపత్తులతో అర్చించాడు. అప్పటి నుంచి తమ రాజవంశ ఇల వేలుపు, సోమనాథుడేనని ప్రకటించాడు.

## ప్రభాసతీర్థం-4

### గజనీ

క్రీ.శ.1023లో గజనీ మహమ్మద్ ప్రభాస్‌పై దాడి చేశాడు. 1026 జనవరి గురువారం రోజు సోమనాథ్ దేవాలయంపై దండెత్తాడు. కోటకాని రక్షణ కాని లేక పోవటం, అనేక మంది రాజులు అడ్డుపడినా వేలాది హిందువులు ఆపటానికి ప్రయత్నించినా ఆపలేక పోయారు. గజని విజేత అయ్యాడు. ఆలయంలోకి ప్రవేశించి సోమనాథ మహాలింగాన్ని స్వయంగా ధ్వంసం చేశాడు. ఆలయానికి చెందిన అపూర్వ సంపదనంతా కొల్ల గొట్టాడు. అందులో బంగారం వెండి, వజ్రాలు, మాణిక్యాలు

ముత్యాలు మొదలైన విలువైన సంపదనంతా దోచుకెళ్లాడు. ప్రభాస్‌లో 18రోజులు ఉండి స్వయంగ దోపిడీకి ప్రేరేపించాడు గజినీ. కచ్ సింద్ ద్వారా స్వదేశానికి వెళ్ళాడు. కాని హిందూ రాజులేవరితోనూ యుద్ధానికి దిగలేదు.

గజనీకి ధన దాహం ఎక్కువ. ఇక్కడి సంపద కోసమే అతని ఆరాటం. సోమనాథ్ దేవాలయంతోబాటు అనేక దేవాలయాలను ధ్వంసం చేసి సంపదను లూటీ చేశాడు. యువతుల్ని బలాత్కరించి చెఱచి చెరబట్టి బానిసలుగా స్వదేశానికి తీసికెళ్ళాడు. ఈ సంపద లూటీలో గజనీ సైన్యంలో మూడు వంతుల మంది చనిపోయారు. మిగిలిన నాలుగో వంతుతోనే స్వదేశం చేరాడు. ఇది అతనికి తీరని నష్టమే. మాల్వారాజు భోజుడు, అజ్మీర్ రాజు బీసల్దేవ్‌లు సైన్యాలతో ప్రభాస్ చేరుకొనే సరికే గజనీ ఉడాయిం చేశాడు. జునాగాద్ అజ్మీర్, మాల్వా రాజులు కలసికట్టుగా సోమనాథ దేవాలయాన్ని పునర్నిర్మించారు. క్రీ.శ.1045లో మాల్వా రాజు సేవక్ పరమార్, 1120లో కర్నాటక రాజు ఇలాడీ ప్రభాస తీర్థానికి యాత్రకు వచ్చి సోమనాథ లింగాన్ని అర్చిన్చుకొన్నారు. వల్లభ దేవ మహారాజు స్వామి కైంకర్యానికి ఒక గ్రామాన్ని రాసిచ్చాడు. రాజా అప్రదిల్ ప్రాధాన్ లక్ష్మణ్ అదే సమయంలో ఇక్కడికి వచ్చి సోమనాథ స్వామిని పూజించాడు.

1113లో సౌరాష్ట్ర రాజు రః కేంగార్‌ను రాజ సిద్ధరాజ్ సింగ్ ఓడించి రాజ్యాన్ని స్వాధీన పరచుకొన్నాడు. సోమనాథ దేవాలయాన్ని ప్రభుత్వ పన్నుల నుండి మినహాయించాడు. తల్లి రాజమాత మీనల్ దేవితో ఇక్కడికి యాత్రగా వచ్చి సోమనాథుడిని పూజించి రాజ్యానికి యాత్రికులు చెల్లించాల్సిన పన్నులన్నిటినీ మినహాయించాడు. అంటే యాత్రిక పన్ను రద్దు చేశాడన్న మాట. సిద్ధరాజు మరణం తరువాత అతని వారసుదు కుమార్ పాల్ రాజయ్యాడు. జైన ఆచార్యుడు హేమంత్ పూరి 1225లో భద్రకాళి ఆలయాన్ని నిర్మించాడు. బృహస్పతి ఆచార్యుల ప్రేరణతో మళ్ళీ సోమనాథాలయాన్ని నిర్మించాడు.. ఆచార్య భావ బృహస్పతి ప్రభాస్ కోటను, బ్రాహ్మణులకు సత్రాలు, నీటి రిజర్వాయర్లు నిర్మించాడు. ఇవన్నీ శిలాశాసన లిఖితాలే. 1146లో కుమార పాలుని ప్రధాని దావల్ బోల్ రెండు దేవాలయాలను నిర్మించాడు. అతని కుమారుడు శ్రీధరుడు మోహిని స్వామి, అవనిజయ దేవాలయాలను కట్టించాడు. కాని వాటి ఆనవాళ్ళు కనిపించటం లేదు.

1227లో గుజరాత్ రాజు భీమదేవుడు సోమనాథాలయానికి ముందు ఆవరణలో శిఖరం నిర్మించాడు. ప్రాచిలో సూర్య దేవాలయాన్ని నిర్మించాడు. ఈ ఆలయం ఇప్పటికీ సజీవంగా ఉంది. దీన్ని భీమ ఆలయం అని పిలుస్తారు. తన భార్య లీలావతి పేర లీలేశ్వరాలయాన్ని నిర్మించాడు. 1232లో గుజరాత్ రాజు అమల్, ఆబు పలితన్నతో కలిసి జైన వాస్తు శిల్పులు వాస్తుపాల్, తేజ్ పాల్‌లతో అష్టాదశ ప్రసాద జైన దేవాలయం నిర్మించాడు. రాజు స్వయంగా జైన మతావలంబి అయినా

సోమనాథ దేవాలయాన్ని తరచూ సందర్శించేవాడు. 1270లో భావ బృహస్పతి ఆచార్యుని ఆధికారం అంతమైంది. ఆయన స్థానంలో మహా పండితుడైన పురోహిత్ నియమింప బడ్డాడు. ఈ కాలంలో జునాగడ్ అధీనంలో ప్రభాస్ ఉండటం, అభివృద్ధి చెందటం జరిగింది. సోమనాథుడిని తమ ఇలవేల్పుగా భావించాడు.

1298లో దిల్లీసుల్తాన్ అల్లాఉద్దీన్ ఖిల్జీ పట్టణంపై దండెత్తి చివరి గుజరాత్ హిందూ రాజైన రాజా కరణ్‌దేవ్ భాగేలాను ఓడించి, చంపి పట్టణాన్ని, ఖామ్బాత్‌లను దోచుకొన్నాడు. సంపదనంతా కొల్ల గొట్టాడు. సోమనాథ్ దేవాలయాన్ని ధ్వంసం చేసి జ్యోతిర్లిన్గాన్ని పగల కొట్టాడు. ఆ ప్రాంతం అంతా అల్లకల్లోలం చేశాడు. బాధలు పెట్టి ప్రజల్ని భీతావహుల్ని చేశాడు. వేలాది యువతీ యువకులను బానిసలుగా చేశాడు. ఈ ఆక్రమణ ప్రదేశం అంటా ఖిల్జీ వశమైంది. కొన్నేళ్ళకు నాలుగవ రాజా రావణ వర్ధన్ ఖిల్జీ సైన్యాన్ని ఓడించి ఈ ప్రాంతాన్ని అంతటికీ స్వేచ్ఛను కలిగించాడు. ప్రభాస్‌ను స్వేచ్ఛా ప్రాంతంగా మార్చి సోమనాథాలయాన్ని పునర్నిర్మించాడు. యధాప్రకారం అభిషేకాలు పూజలు జరిగే కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేశాడు.

1316లో అల్లాఉద్దీన్ ఖిల్జీ చనిపోయిన తరవాత ముబారక్ ఆలి ఖిల్జీ ధిల్లీ రాజయ్యాడు. ప్రభాస్ నుండి బానిసగా తెచ్చుకొన్న ఒక గొల్ల బానిసను ముస్లింగా మారి ఖుశాక్ పేరు పెట్టుకొని సైన్యాధ్యక్షుని స్థాయి సంపాదించాడు. కొన్నేళ్ళ తరువాత ఇతను ముబారక్‌ను హతమార్చి సింహాసనాన్ని అధిష్టించాడు. కాని ఇది మూడు నెలల ముచ్చటే అయింది. ఘాజుద్దీన్ తుఘ్లక్ ఖుశాక్‌ను చంపి డిల్లీ సామ్రాట్ అయ్యాడు. అతి తర్వాత కొడుకు మహమ్మద్ బీన్ తుఘ్లక్ చక్రవర్తియ్యాడు. యితడు నిరంకుశుడు, క్రూరుడు. అందర్నీ గజ గజ లాడించాడు. విపరీతమైన క్రూర దండనలు విదించేవాడు. అంతటా టెర్రర్ సృష్టించాడు. అతని సైన్యాదికారుల్లో ఒకడు ఈ బాధ పడలేక జునాగాద్ చేరి తల దాచుకొన్నాడు. తుఘ్లక్ జునాగడ్‌పై దాడి చేశాడు. సోమనాథ దేవాలయాన్ని ధ్వంసం చేసి, సంపదనంతా దోచుకొన్నాడు. ప్రభాస్ రాజు బిజిలీ బాజా మహమ్మద్ బీన్ తుఘ్లక్ సైన్యాన్ని ఎదిరించి పోరాడాడు. కాని యుద్ధంలో చంప బడ్డాడు. అతని సైన్యం సోమనాథ్ దేవాలయాన్ని ధ్వంసం చేసింది. ఇది మూడవసారి సోమనాథాలయం ముట్టడింప బడటం, ధ్వంసం అవటం జరిగిందన్న మాట.

## ప్రభాసతీర్థం-5

### మేదిరాజు

మహమ్మద్ బీన్ తుగ్లక్ కొడుకు ఫిరోజ్ తుగ్లక్ సింద్‌లో తీవ్రంగా ఓడిపోయాడు. దీంతో గుజరాత్‌లో తీవ్ర రాజకీయ సంక్షోభం ఏర్పడింది. ప్రభాస్ రాజు మేదిరాజు ఇదే అదను అనుకొని జునాగాద్ రాజు రహ్ ఖేన్గార్‌తో కలిసి ధిల్లీసుల్తాన్ సేనలను

తరిమికొట్టాడు. ఈ ప్రాంతాన్ని మళ్ళీ స్వాధీనపరచుకొని సోమనాథ దేవాలయాన్ని, సోమనాథ మహాలింగాన్ని పునరుద్ధరించాడు. ఈ విషయం తెలుసుకొన్న గుజరాత్ గవర్నర్ జాఫర్ షరీఫ్ భారీ సైన్యంతో ప్రభాస్‌పై విరుచుకు పడ్డాడు. రాజా మేధ రాజ్ యుద్ధం చేసినా ఓడిపోవటమే కాదు ప్రాణాలూ కోల్పోయాడు. తెగించిన సుల్తాన్ సేనలు సోమనాథ ఆలయ ధ్వంసం చేశారు. ఇది చరిత్రలో సోమనాద్‌పై జరిగిన నాలుగవ విధ్వంసం.

1377లో స్వర్గీయ రాజా మేదిరాజ్ సోదరుడు రాజా భాజాటే ఇదే సరైన సమయం అని ఎంచి సోమనాథ ఆలయాన్ని మళ్ళీ నిర్మించి సోమనాథ జ్యోతిర్లిన్గాన్ని పునః ప్రతిష్టించాడు. ప్రభాస్‌లో పటిష్టమైన కోటను నిర్మించి బయటివారి నుండి దాడులను ఎదుర్కోవటానికి పూర్తి బందోబస్తు చేశాడు. 1396 వరకు సోమనాథ్ ఆలయంలో నిరాటంకంగా పూజాదికాలు జరిగాయి. అదే ఏడాది గుజరాత్ గవర్నర్ జాఫర్ ఖాన్ వజీర్ ఉల్లాక్ ప్రభాస్‌పై తీవ్రంగా సైన్యంతో దాడికి దిగాడు. ఈ ముష్కర సేన సోమనాథ దేవాలయాన్ని, లింగాన్ని సమూలంగా ధ్వంసం చేశారు. ఇది సోమనాథాలయంపై జరిగిన అయిదవ దాడి. ఇక్కడ ఏ రకమైన హిందూ ప్రార్ధనలు కాని పూజలు కాని జరపరాదని తీవ్ర ఆంక్షలు పెట్టి అమలు చేశాడు. ఇన్ని ఆంక్షలున్నా హిందూ భక్తులు దేనికీ వెరవకుండా అకుంఠిత దీక్షతో సోమనాథాలయ నిర్మాణాన్ని, సోమనాథ లింగ ప్రతిష్టను చేబట్టారు. దీన్ని గమనించిన జాఫర్‌ఖాన్ తోక తొక్కిన పాములాగా బుసకొట్టి మళ్ళీ విజృంభించి సైన్యంతో విరుచుకుపడి ఆలయాన్ని లింగాన్ని ధ్వంసం చేశాడు. ఇది సోమనాథ్‌పై జరిగిన ఆరవ దాడి, విధ్వంసం.

జాఫర్ ఖాన్ సైన్యం ప్రభాస్‌ను వదిలిపెట్టి వెళ్ళిన మరు క్షణం నుంచి సోమనాథ ఆలయ పునర్నిర్మాణ కార్యక్రమాలు అంతే పట్టుదలతో మొదలైనాయి. గొప్పదేవాలయాన్ని కట్టి సోమనాథ లింగాన్ని ప్రతిష్టించి నిత్య పూజాదికాలు కొనసాగించారు. దీనితో తేలు కుట్టిన కోతిలాగా జాఫర్ ఖాన్ మళ్ళీ సోమనాథాలయాంపై దాడి చేశాడు.. స్థానిక రాజులకు ఖాన్ సైన్యానికి మధ్య భీకర యుద్ధమే జరిగింది. ప్రభాస్ రాజు రాజా వినయరాజు యుద్ధంలో చంప బడ్డాడు. కసితో ఖాన్ సేన ఇక్కడ భీభత్సాన్ని సృష్టించి అందిన ప్రతి దాన్నీ దోచుకు వెళ్ళింది. ఈ విధ్వంసంలో సోమనాథ్‌కు ప్రాభాస్‌కు తీవ్ర నష్టమే కలిగింది. ఇది సోమనాథ్‌పై జరిగిన ఏడవ విధ్వంసకర దాడి.

13వ శతాబ్దపు అరబ్బు ఖగోళ శాస్త్రవేత్త జకారియా అలాద్వాజ్వి రాసిన వండర్స్ ఆఫ్ థింగ్స్ ఎక్స్యూవేటేడ్ అండ్ మార్వెల్స్ ఆఫ్ థింగ్స్ ఎక్స్‌పెక్టెడ్ సారాంశం కింద ఇవ్వబడింది. ఇది సోమనాథ్ ఆలయ వివరణ మరియు దాని ధ్వంసం గురించి వివరిస్తుంది. “సోమనాథ్: భారతీయులచేత పవిత్రక్షేత్రంగా భావించబడి సముద్ర తీరాన ఉపస్థితమైన క్షేత్రం సోమనాథ్. ఈ ఆలయ విచిత్రాలలో ఒకటి చంద్రుడు ఈ

ఆలయలింగాన్ని ప్రతిష్టించడం. ఆలయం మధ్యభాగంలో భూమి లోపల ఎటువంటి ఆధారం లేకుండా ఈ లింగం నిలిచి ఉండడం ఒక ప్రత్యేకత. హిందువులచేత అధికంగా కొనియాడబడుతున్న ఈ ఆలయ ప్రధాన దైవమైన పరమశివుడు భూమికిపై భాగంలో గాలిలో తేలినట్లుండి ఈ లింగరూపంలో నిలిచి ఉండడం ఒకవేళ ముసల్మాన్కాని నాస్థికుడు కాని ఎవరికైనా ఒక వర్ణించలేని అద్భుతం. చంద్రగ్రహణ కాలంలో లక్షకంటే అధికులైన హిందువులు ఇక్కడకి పవిత్ర యాత్రార్ధం రావడం ఆనవాయితీ.

ఎప్పుడైతే సుల్తాన్ మింముద్దౌలా మహమ్మద్ సుభుక్తి జి భారతదేశం మీద మతపరమైన దండయాత్ర చేసాడో ఆయన సోమనాథ్ను స్వాధీనపరచుకొని ధ్వంసం చేయడానికి గొప్ప ప్రయత్నం చేసాడు. అందువలన హిందువులు ముహమ్మదీయులుగా మారతారని విశ్వసించబడింది. ఫలితంగా వేలమంది హిందువులు బలవంతంగా ఇస్లామ్మతానికి మార్చబడ్డారు. ఆయన అక్కడికి 416 ఎహెచ్ (ఎడి 1025 డిసెంబరు) "రాజు ఈ లింగరూపాన్ని చూసి విస్మయం చెందాడు. తరువాత ఇక్కడి నిధులను మళ్ళించడానికి పడగొట్టడానికి అదేశాలు జారీచేసాడు. అక్కడ గొప్ప ప్రముఖులచేత ఆలయానికి దానంగా ఇవ్వబడిన అనేక స్వర్ణ మరియు రజత విగ్రహాలు, ఆభరణాలతో నిండిన పాత్రలు కనుగొనబడ్డాయి. ఆలయంలో కనుగొనబడిన వస్తువుల విలువ 20 వేల దినార్లకు పైబడి ఉంది.

1407లో జాఫర్ ఖాన్ ముజఫర్ షా అనే పేరు ప్రకటించుకొని, గుజరాత్కు స్వతంత్ర సుల్తాన్ అయ్యాడు 1411లో. ఖాన్ మనవడు ఖాన్ను హత్య చేసి తానే సుల్తాన్ అని ప్రకటించాడు. ఏడవసారి విధ్వంసం జరిగిన తరువాత మళ్ళీ సోమనాధ ఆలయాన్ని ఎవరూ నిర్మించే ప్రయత్నం చేయలేదు. 1415లో అహమ్మద్ షా ప్రభాస్కు వచ్చి అక్కడ విధ్వంసమైన సోమనాధాలయానికి మిగిలిన ఆలయాలకూ చెందిన ఏ చిన్న వివరమూ ఉండటానికి వీలులేదని అన్ని విగ్రహాలను లింగాలను పూర్తిగా నాశనం చెయ్యాలని హుకుం జారీచేశాడు. హిందువులందరూ ముస్లింలుగా మారిపోవాలని శాసించాడు. భయపెట్టికాని బాధపెట్టి కాని ప్రలోభ పెట్టికాని హిందువులను ముసల్మాన్లుగా మార్చమని అధికారులకు తీవ్ర అధికారాలిచ్చాడు. అహమ్మద్ షా చాలా క్రూరుడు. కపటి, మాయావి, కుటిలుడు, నియంత. నిర్దాక్షిణ్యంగా హిందూ మతాన్ని కాలరాయాలని నిర్ణయించాడు. జునాగాద్ రాజు మాన్లిక్ఇల్లా సాహసంతో సుల్తాన్ సైన్యాన్ని ప్రభాస్ నుండి తరిమేయటానికి తీవ్ర కృషి చేసి పలాయనం చిత్తగించేట్లు చేసి సఫలీ క్రుతుడయ్యాడు. 1451-56 మధ్య కాలంలో అతి వేగంగా సోమ నాదాలయాన్ని పునర్నిర్మించాడు. వేదమంత్రాలతో సోమనాధ జ్యోతిర్లిన్గాన్ని పునః ప్రతిష్టించాడు.

1451లో గుజరాత్ సుల్తాన్ అహమ్మద్ బెగాడా అధీనంలోకి వచ్చింది. అతను

బలపడటానికి కొంతకాలం పట్టింది. జునాగడ్ రాజును నిర్మూలించాలని ఇతనికి చాలా కాలంగా కోరిక ఉంది. జునాగడ్ మీద వరుసగా అయిదుసార్లు దాడి చేశాడు. చివరికి 1469లో రాజా రాఃమండ్లిక్‌ను ఓడించి జునాగాద్‌ను స్వాధీన పరచుకొన్నాడు. దీనితో జునాగాద్‌లో హిందూ రాజ్యపాలన అంతమైంది. ఈయనే చివరి హిందూరాజు. ప్రభాస్‌ను సుల్తాన్ సామ్రాజ్యంలో బెగాడా విలీనం చేశాడు. దీనితో ప్రభాస్‌లో1490లో ముస్లిం మత ప్రచారకులు విపరీతంగా వేలాది హిందువులను మతం మార్చారు. విగ్రహారాధన నిషేధించాడు. ఎన్నో దేవాలయాలను నేల మట్టం చేశాడు. విపరీతమైన రక్తాపాతం, హింస దౌర్జన్యాలతో ఆ ప్రాంతమంతా అట్టుడికి పోయింది. ప్రభాస్‌కు చెందిన వీరులు హమిర్జి లాతియా, బెగాడా భీల్ వీరోచితంగా తురుష్కులతో పోరాడి అసువులు బాశారు. వారి త్యాగానికి గుర్తింపుగా నిర్మించిన స్మారక స్తూపం ఇప్పటికీ మనం దర్శించవచ్చు. 1455, 1543కు చెందిన రెండు శిలాశాసనాల వలన ఇక్కడ ముస్లిం పాలకులు యెంత నిర్దాక్షిణ్యంగా హిందూ విగ్రహారాధనను నిషేధించారో తెలుస్తోంది. దీనికి విరుగుడుగా హిందువులు సరస్వతి నదిని పూజించటం ప్రారంభించి కొనసాగించారు. 1546 వరకు ప్రభాస్‌లో శాంతియుత వాతారణమే నెలకొని ఉంది. కాని సాహసించి ఏ హిందువూ కూడా దేవాలయాలకు వెళ్ళటం విగ్రహాలను అర్చించటం మాత్రం జరగలేదు.

## ప్రభాసతీర్థం-6

## మొగల్ సామ్రాజ్యం

1547లో దయ్యూ డే కోస్తానేకు చెందిన పోర్చుగీసు గవర్నర్ సుల్తాన్ సేనలను దయ్యూలో ఓడించి సౌరాష్ట్ర ఓడ రేవులని స్వాధీన పరచుకొన్నాడు. అక్కడి నుంచి ప్రభాస్ మీద పడి మసీదు, దేవాలయం అనే భేదం లేకుండా నిర్దాక్షిణ్యంగా దోపిడీ చేసి కూల్చి వేశారు. ప్రభాస్ అంతా శిధిలాలమయం అయిపోయింది. ప్రసిద్ధమైన 'భిఫూరక్ ప్రశస్తి' శిలాఫలకాన్ని లాగి పారేయించాడు. ఇప్పుడది పోర్చుగల్‌లోని 'సిత్రా'లో ఉంది. గుజరాత్ చివరి సుల్తాన్ ముజఫర్ ఇల్లా చాలా బలహీన పాలకుడు. ఆయన్ని పట్టించుకోకుండా రాజాధికారులు పరగణాలను పంచుకొని అనుభవించటం ప్రారంభించారు. సౌరాష్ట్రను దౌలత్ ఖాన్ అనేవాడు లోబరచుకొన్నాడు. పేరుకు మాత్రమే సుల్తాన్. అస్తవ్యస్త పరిస్తితులలో ప్రాంతం అంతా అతలాకుతలంగా, అనిశ్చితంగా ఉంది. దీన్ని చక్కపెట్టె ఆలోచనతో సుల్తాన్ ఎట్ మద్ ఖాన్ మంత్రి ఒకరు ఢిల్లీ చక్రవర్తి అక్బర్‌కు విన్నపం పంపుతూ గుజరాత్‌లోని రాజకీయ సంక్షోభాన్ని నివారించమని కోరాడు. వెంటనే అక్బర్ అహమ్మదాబాద్‌కు 1573లో చేరుకొన్నాడు. ముజఫర్ సుల్తాన్‌ను అరెస్ట్ చేయించి ఢిల్లీకి పంపేశాడు. గుజరాత్‌ను మొగల్

సామ్రాజ్యంలో కలిపేశాడు.

కాని నక్క జిత్తుల ముజఫర్ ఢిల్లీ నుండి కన్నుగప్పి1578లో తప్పించుకొని గుజరాత్ చేరాడు. మాజీ అధికారుల అండతో మళ్ళీ తన సుల్తానేట్‌ను పొందాలని ప్రయత్నం చేశాడు. విషయం తెలిసిన అక్బర్ సేనలు బందీగా పట్టుకొనే ప్రయత్నం చేస్తే జామ్ నగర్‌కు పారిపోయి అక్కడ జామ్ సత్తాజీ అనే ఆయన వద్ద శరణార్ధిగా ఉన్నాడు. పాదుషా సేనలు ముజఫర్‌ను తమకు స్వాధీనం చేయమని కోరినా సత్తాజీ లెక్క చేయలేదు. ముజఫర్‌ను అప్పగించలేదు. బూచార్ మోతి వద్ద అక్బర్ సేనకు, సత్తాజీ సేనకు భీషణ యుద్ధం జరిగింది. సత్తాజి ఓడిపోయాడు. ముజఫర్ 'కచ్' చేరి ఎవరికీ కనబడకుండా ఉన్నాడు. చివరికి అక్బర్ సేనలు వీడిని పట్టుకొని బంధించి ఢిల్లీకి తోలేస్తుండగా మధ్యలోనే ఆత్మహత్య చేసుకొని చనిపోయాడు ముజఫర్. దీనితో గుజరాత్‌లో సుల్తానుల పాలన అంతమైంది. ఢిల్లీ చక్రవర్తి అక్బర్ సౌరాష్ట్రకు రాష్ట్ర ప్రతిపత్తి నిచ్చాడు. దీనినే 'సర్కార్' అంటారు. జునాగద్ ప్రాంతానికి గవర్నర్‌ను నియమించి ప్రభాస్‌పై అధికారాన్ని కూడా అప్పగించాడు అక్బర్. శిస్తు వసూలు కోసం రెవిన్యు విధానం ప్రవేశపెట్టి అక్బర్ నగర్ రఘునాద్ జీ, విష్ణుజి మరియు గోగి విష్ణుజీలకు దేశాయ్ హోదానిచ్చి పరిపాలన చేయించాడు.

అక్బర్ మరమత సహనం ఉన్న వాడు కావటంతో మళ్ళీ సోమనాధ దేవాలయ నిర్మాణానికి స్థానికులు పూనుకొని సోమనాధ జ్యోతిర్లింగ ప్రతిష్టకు కార్యక్రమం మొదలెట్టి పూర్తిచేశారు. 1647లో ఔరంగా జేబ్‌ను గుజరాత్ గవర్నర్‌గా అక్బర్ నియమించాడు. ఇప్పటి వరకు సోమనాద్ ఆలయంలో నిరంతరంగా నిరభ్యంతరంగా పూజలు జరిగాయి. ఔరంగ జేబ్ ప్రభాస్‌లో విగ్రహారాధన జరగరాదనీ ఆలయ ధ్వంసం చేయాలనే ప్రణాళికలో ఉన్నాడు. ఈ విషయం తెలిసిన అక్బర్ అతన్ని అక్కడి నుంచి తప్పించేశాడు.

1665లో ఔరంగాజేబ్ చక్రవర్తి అయ్యాడు. వెంటనే సోమనాథాలయాన్ని నిర్మూలించమని ఆదేశాలు ఇచ్చాడు. జేబుగారి ఆజ్ఞను నేరవేర్చటానికి అఫ్జల్‌ఖాన్ అనే సేనాని కొద్ది సైన్యంతో ప్రభాస్ చేరాడు. మ్లేక్ జియా అనే అఫ్జల్ ఖాన్ ముఖ్య సైనికాధికారి పథకం అమలు జరుపుతూ అక్కడ ఒక బ్రాహ్మణుడిని, గోమాతను ముందు చంపాడు. వెంటనే ఘోర సంగ్రామం ప్రారంభమైంది. రక్తపాతం జరిగింది. సైన్యం కొద్దిగా ఉండటంతో అఫ్జల్‌ఖాన్ వెనుదిరిగాడు. ఈ సంఘటన హిందువులలో భయాందోళనలను కలిగించింది. పెద్ద సైన్యంతో వచ్చి మీదపడతాడేమోనని భావించారు. కాని జునాగడ్ గవర్నర్ ఇద్దరినీ కూర్చోబెట్టి మాట్లాడి ఒక ఒప్పందం కుదిర్చాడు. జునాగడ్ గవర్నర్ వివేకి, చాకచక్యం ఉన్నవాడు. అయినా సోమనాధ ఆలయంలో పూజాదికాలు జరపటానికి భయపడ్డారు హిందువులు.

1704లో ఔరంగ జేబ్ సోమనాధాలయాన్ని కూల్చేయమని మళ్ళీ హుకుం

జారీ చేశాడు. ఇంక అక్కడేప్పుడూ ఏ పరిస్థితులలోను సోమనాథార్చన జరగరాదనీ ఔరంగ జేబ్ అనుకొన్నాడు. కాని అతని ఫర్మానా జారీ అయి అమలు జరిపేలోపే ఔరంగజేబు 1707లో చనిపోయాడు. ఈ కాలంలో పూజారులు బ్రాహ్మణులూ శశి భూషణ మహా దేవాలయానికి వెళ్లి శివార్చన చేసేవారు. జేబు మరణంతో ప్రభాస్‌లో మళ్ళీ కల్లోల పరిస్థితులేర్పడ్డాయి. న్యాయం చట్టం లేకుండా పోయాయి. భీతావహ పరిస్థితులేర్పడ్డాయి. స్వైర విహారం ఎక్కువైంది. స్థానిక నాయకుడు దేశాయ్ ఈ పరిస్థితులను చక్కదిద్ది శాంతి నెలకొల్పాడు. ఈ ప్రాంతాన్ని చక్రవర్తి తరఫున దేశాయి పాలించేవాడు. ఈ సమయంలో మాలిక్ జియా కొడుకు మాలిక్‌ఖాన్ ప్రభాస్‌పై దాడి చేశాడు. దేశాయిల నుంచి అధికారం లాక్కున్నాడు. ఇరుప్రక్కల పెద్ద యుద్ధమే జరిగింది. దేశాయ్ మహావ్ జి, సోదరులు దేశాయ్ ఆనంద్ జీ, శేఖరన్‌లతో సహా యుద్ధంలో ప్రాణాలు కోల్పోయారు. కాని మాధవ్ జీ కొడుకు సూరజ్ మల్ చక్రవర్తి సేనల సహకారంతో శాంతి, న్యాయం చట్టాలను స్థాపించాడు. ప్రభాస్‌ను శత్రు సేనల నుండి కాపాడాడు. సూరజ్ మల్ చేసిన అద్భుతానికి చక్రవర్తి సంతోషించి సూరజ్ మల్‌కు విస్తృతంగా ప్రదేశాలను అప్పగించాడు. ఇలా మళ్ళీ ప్రభాస్‌లో శాంతి పరిస్థితులు నెలకొల్పిన ఘనత సూరజ్ మల్ దే.

మొగలాయీ సామ్రాజ్య క్షీణ దశలో గుజరాత్‌లో ముఖ్యంగా సౌరాష్ట్రలో మళ్ళీ అస్తవ్యస్త పరిస్థితులేర్పడ్డాయి. దేశాయి ప్రభుతులు జూనియర్ గవర్నర్ మొజి షేర్ ఖాన్ బాబీకి ఒక సందేశం పంపి ఇక్కడ శాంతి భద్రతలు నెలకొల్పమని ఈ ప్రాంతాన్ని యేలమని జునాగడ్ రమ్మని కోరారు. బేబీ వీరి కోరిక మన్నించి 1747లో జునాగడ్‌లో బాబీ వంశ పాలనకు నాంది పలికాడు. ఈ సమయంలో ప్రభాస్ మాత్రం అతని పరిపాలనలో లేదు. అప్పుడిక్కడ నియామత్ ఖాన్ పరిపాలన ఉండేది. ప్రభాస్ మాత్రమే కాక వేరావాల్, కుల్యన్న మొదలైన వన్నీ ఢిల్లీ చక్రవర్తి అనుమతి పత్రం తెచ్చుకొని పాలించాడు. నియామత్ ఖాన్ లోడీ వంశీకుడు. ఖాస్బియాస్ అనే రాజునూ అణచి ఉంచాడు. ఇదే సమయంలో మహారాష్ట్ర నౌకాది పతి మనాజీ ఆంగ్రే నౌకను వేరావాల్ నౌకాశ్రయంలో లంగరు వేయించాడు. నియామత్ ఖాన్ లోడి అతనికి భారీ నజరానాలు సమర్పించి ఇక్కడినుండి తప్పుకోవలసిందిగా చెప్పకనే చెప్పాడు. ఇదే అదను అనుకొని పోర్చుగీసువారు నిజామ్త్ ఖాన్‌ను తమకు కూడా అలాగే నజరానా భారీగా చెల్లించమని కోరి, పొంది, నెమ్మదిగా అతన్ని తప్పించే ప్రయత్నం చేశారు. ఈ కానుకల చెల్లింపులతో కోశాగారం ఖాళీ అయి నియామత్ ఖాన్ ఆర్థిక ఇబ్బందుల్లో పడ్డాడు. దీనితో ప్రజల మీద పన్నులు అధికంగా వేసి పీడించి వసూలు చేయటం మొదలెట్టాడు. హింసించి డబ్బు వసూలు చేయించాడు. ఖాన్ దుర్మార్గాలను సహించ లేకపోయారు ప్రజలు. దేశాయిలు కాస్బియాలు కలిసి ఖాన్‌పై తిరుగుబాటు చేశారు.

నియామత్ ఖాన్‌ను ఓడించారు. ఖాన్ కుల్యన్నాకు పారిపోయాడు.

## ప్రభాసతీర్థం-7

### రాణి అహల్యాబాయి

కుల్యన్నలో నియామత్ ఖాన్ మిస్కాన్ స్వాత్ పీర్‌తో సయోధ్యగ లేదు. పరిస్థితులూ అనుకూలించక చనిపోయాడు. జునాగడ్ రాజు షేర్ ఖాన్ బాబీ మరణించాడు. 1758లో బాబీ మరణం తర్వాత కొడుకు మహామత్ ఖాన్ పనికి రాని వాడని తేలిపోయాడు. భార్య సుల్తానాతో తగాదా పడ్డాడు. పినతల్లితో సంబంధం పెట్టుకొన్నాడు. ఆమె చాలా తెలివి గలది ధైర్యవంతురాలు. ప్రభాస్‌ను వేరావాల్‌ను అధీనంలోకి తెచ్చుకుంది. దీనికి వేరావాల్ దేశాయి తోడ్పడ్డాడు. 13 ఏళ్ళు చాలా రాక్షసంగా పాలించింది. క్రమంగా దేశాయి ఆమెను తిరస్కరించటం ప్రారంభించాడు. మంగ్రోల్ రాజు సేక్ మియాన్ ఖాజీ ఆమెను ప్రభాస్, వేరావాల్ నుంచి నెట్టేశాడు. వాటిని మియాన్ ఖాజీకి అప్పగించాడు. ఈ వార్త పోర్బందర్ రాజు సత్రంజి విని వేరావాల్‌పై దాడికి దిగాడు. అయితే ఇద్దరి మధ్య ఒప్పందం కుదిరి ఈ ప్రాంతాన్ని ఇద్దరూ పంచుకొన్నారు.

ఈ సమయంలో నవాబ్ మహావర్ ఖాన్‌కు చెందిన అరబ్ సైనికులు ఎదురు తిరిగి అరెస్ట్ చేశారు. జునాగడ్ కోటను స్వాధీన పరచుకొన్నారు. అప్పుడు పద్దెనిమిదేళ్ళ కుర్రాడు వీరుడు మంగ్రోల్‌కు చెందిన వీర అమరాజీ జునాగడ్ చేరి నవాబ్‌ను చెర విడిపించాడు. దీనికి కృతజ్ఞతగా అమర్జీని సైన్యధికారిని చేశాడు నవాబు. చురుకుదనం సాహసం తెలివి తేటలతో అమరజీ సర్వ సైన్యాధ్యక్షుడిగా ముఖ్యమంత్రి అయ్యాడు. 1773లో నవాబు అతన్ని ఖైదు చేశాడు. షేక్ మియాన్‌ఖాన్‌కు అవకాశం ఇచ్చి వేరావాల్‌పై దాడి చేసి ఆక్రమించుకోవటానికి అనుమతినిచ్చాడు. అప్పుడు జునాగద్ నవాబు అమరజీని జైలు నుంచి విడుదల చేయించాడు. 1784లో నవాబు మోసం చేసి అతన్ని హత్య చేశాడు. దీనితో కోపించిన గైక్వాడ్ సింధియాలు నవాబును తీవ్రంగా వ్యతిరేకించి హెచ్చరించాడు. మెత్తబడిన నవాబు అమర్జీ కొడుకు దివాన్‌ను చేశాడు. జరిగిన దానికి పశ్చాత్తాపం ప్రకటించాడు.

1786లో ఇండోర్ మహారాణి అహల్యా బాయి హోల్కార్ మళ్ళీ సోమనాథ దేవాలయ నిర్మాణాన్ని చేబట్టింది. శాస్త్రోక్తంగా సోమనాథ జ్యోతిర్లింగ ప్రతిష్టను 1788లో చేయించింది. దీనికి దేశాయ్ చబీల్దాస్ గొప్ప సహకారం అందించాడు. 1788లో దివాన్ రఘునాద్ వేరావాల్‌ను స్వాధీనం చేసుకొన్నాడు కాని ప్రభాస్ మాత్రం షేక్ మిలాన్ అధీనంలోనే ఉంది. 1793లో దేశాయ్ జి భాయి షేక్ మియాన్ పాలన నుంచి ప్రభాస్‌ను విడిపించాడు. ఖాన్ జామ్ నగర్ చేరిన తర్వాత మళ్ళీ ప్రభాస్ ఖాన్

అధీనంలోకి వచ్చింది.

## ప్రొక్లెమేషన్ ఆప్ గేట్స్

ప్రొక్లెమేషన్ ఆఫ్ గేట్స్ 1782-1783లమధ్య శ్రీనాధ్మహదాజీ షిండే (ఉజ్జయిని, గ్వాలియర్ మరియు మధుర పాలకుడు) లాహోరు పాలకుడైన ముహమ్మద్ షాను ఓడించిన తరువాత విజయోత్సాహంతో లాహోరు నుండి మూడు వెండి ద్వారాలను తీసుకువచ్చాడు. గుజరాత్ పండితులు ఆచర్యను నిరాకరించడంతో పాలకుడైన గైక్వాడ్ వాటిని సోమనాథ ఆలయంలో పెట్టించాడు. ఈ ద్వారాలు ప్రస్తుతం ఉజ్జయిని ఆలయాలలో ద్వారములుగా నిలబడి ఉన్నాయి. ప్రస్తుతం వాటిని మహాకాళేశ్వర జ్యోతిర్లింగ మందిరం మరియు గోపాల్మందిరంలలో చూడవచ్చు. 1842లో 1 ఎర్ల్ ఆఫ్ ఎడిన్ బర్గ్ ప్రసిద్ధి చెందిన ప్రొక్లెమేషన్ ఆఫ్ గేట్స్ పేరుతో చేసిన ప్రకటనలో ఆఫ్ఘనిస్తాన్లోని గజనీలో ఉన్న గజనీ మహ్మూద్సమాధిలో ఉన్న ఈ ద్వారాలను గజనీనుండి తీసుకువచ్చి భారతప్రభుత్వానికి అందించమని ఆదేశాలను జారీచేసాడు. వీటిని గజనీ మహ్మూద్ సోమనాథ్ ఆలయంనుండి తీసుకువెళ్ళబడినట్లు విశ్వసించబడింది. సోమనాథ ఆలయ ఈ ద్వారాల గురించిన చర్చ 1843లో లండన్లో హౌస్ ఆఫ్ కామన్స్లో జరిగినట్లు ఆధారాలు ఉన్నాయి. బ్రిటిష్ ప్రభుత్వం మరియు ప్రతిపక్షాల మధ్య జరిగిన చెలరేగిన చర్చల మంటల తరువాత ఈ ద్వారాలు వెలికితీసి విజయవంతంగా వెనుకకు తీసుకురాబడ్డాయి. కాని వచ్చిన తరువాత అవి అసలైన ద్వారాలకు ఖచ్చితమైన నమూనాలని తెలుసుకున్నారు. అవి ప్రస్తుతం ఆగ్రాస్టోర్రూమ్లో ఇంకా అలా పడి ఉన్నాయి.

1810లో బరోడా గయక్వాడ్ దివాన్ బితాల్ రావు దేవాజి ప్రభాస్ లో సోమనాథ ఆలయం వద్ద దేశాయి ధర్మశాలను నౌబత్ ఖానాను నిర్మించాడు.. దేశాయ్ ఉమా శంకర్ భాయిజి సహాయంతో ఒక గ్రామాన్ని దైత్య సూదన దేవాలయానికి నిర్వహణ, పూజాదికాల కోసం రాసిచ్చి దానికి 'దుదన్యా' అని పేరు పెట్టాడు. పీష్వాలు కూడా అనేక దేవాలయ పునరుద్ధరణకు కొత్త ఆలాయాల నిర్మాణం చేబట్టారు. 1806లో ప్రభాస్ బ్రిటిష్ పరిపాలనలోకి వచ్చింది. నేరగాళ్ళు బందిపోటు దొంగలు స్వైర విహారం చేశారు. ప్రజలు బరోడా మహారాజుకు విన్నపాలు పంపి ఈ ప్రాంతాన్ని హింసా భీభాత్సాల నుండి కాపాడటానికి సహాయం కోరామన్నారు. ఈస్ట్ ఇండియా కంపెనీ వారి కెప్టెన్ మాక్ మేరాడోను జునాగడ్ పంపింది. 1813లో ఈస్ట్ ఇండియా కంపెని జునాగడ్ నవాబుల మధ్య ఒప్పందం జరిగింది. నవాబుకు ఈ ప్రాంత శాంతి రక్షణ బాధ్యతలను కంపెని అప్పగించింది. ప్రభాస్లో యాత్రీకులకు ఇబ్బంది కలగకుండా చూడమని కోరింది.

బరోడా రాజు ప్రభాస్‌లో దర్బారు నిర్వహించాడు. 1893నాటికి ప్రభాస్‌లో శాంతి నెలకొన్నది.. కాని కొద్ది కాలానికే పరిస్థితులు కల్లోల రూపం దాల్చాయి. బ్రిటిష్ చొరవతో వెంటనే శాంతి ఏర్పడింది. కల్నల్ హంటర్ ఆధ్వర్యంలో ఒక కమిషన్‌ను ఏర్పాటు చేసి రాష్ట్రాలలోని హిందూ ప్రజల హక్కులను కాపాడే ప్రయత్నం జరిగింది. ఇన్ని జరిగినా ఈ ప్రాంతంలో దోపిడీలు దాడులు, చట్ట వ్యతిరేక కార్యక్రమాలు, న్యాయ ఉల్లంఘనలు యధావిధిగా జరిగిపోతున్నాయి.

## స్వాతంత్రం అనంతరం ఆలయ పునర్నిర్మాణం

స్వాతంత్ర్యం రాకముందు జునాగధ్ రాజు సంస్థానం ప్రభాస్ పటాన్ అధీనంలో ఉంది. సమైక్య భారతదేశంలో జునాగఢ్విలీనం అయిన తరువాత అప్పటి ఉపప్రధాని అయిన సర్దార్ వల్లభాయ్ పటేల్ 1947 నవంబరు 12న భారతీయసైన్యాలను క్రమపరిచే నిమిత్తం ఇక్కడకు వచ్చి అదే సమయంలో ఈ ఆలయపునర్నిర్మాణానికి ఆదేశాలను జారీచేసాడు. ఎప్పుడైతే సర్దార్ పటేల్, కె ఎం మున్షి మరియు ఇతర నాయకులతో గాంధీని దర్శించి ఈ ప్రస్తావన తీసుకువచ్చినప్పుడు గాంధీ ఆ ప్రస్తావనకు ఆనందంతో అంగీకరించి ఆలయపునరుద్ధరణకు కావలసిన నిధులను ప్రభుత్వము నుండి మంజూరు చేయకుండా ప్రజలనుండి చందాలను గ్రహించి చేయవలసినదిగా సలహా ఇచ్చాడు. అయినా త్వరలోనే పటేల్మరియు గాంధీ మరణించారు. ఆలయ పునరుద్ధరణ కార్యక్రమాలను కె ఎం మున్షీ నిర్వహణలో జరిగింది. కె ఎం మున్షి అప్పుడు నెహ్రూ ప్రభుత్వంలో ఫుడ్ అండ్ సివిల్ సప్లయ్ మంత్రిగా పని చేస్తున్నాడు. 1950 అక్టోబరు మాసంలో శిథిలాలు తొలగించబడి ప్రస్తుత మసీదు కొన్ని మైళ్ళ దూరానికి తీసుకుపోబడింది. 1951లో భారతప్రభుత్వ ప్రథమ రాష్ట్రపతి అయిన రాజేంద్రప్రసాదు ఆలయ కుంభాభిషేకానికి కె ఎం మున్షి చేత అహ్వానించబడ్డాడు. ఆయన తన ప్రసంగంలో " నా దృష్టిలో ఈ పునాదుల నుండి అద్భుతమైన ఈ బృహత్తర ఆలయం పునర్నిర్మించ బడడమే కాక పురాతన సోమనాధ ఆలయ పునరుద్ధణ వలన భారతీయ శిల్పకళావైభవానికి ఈ ఆలయం ఒక తార్కాణంగా నిలిచింది. అయన తన ప్రసంగం పొడిగిస్తూ "పునర్నిర్మించే శక్తియొక్క గొప్పతనం పడగొట్టే శక్తి కంటే ఘనమైనది అనడానికి సోమనాధ ఆలయపునర్నిర్మణం ఒక ఉదాహరణ" అని ఉద్ఘాటించాడు. ఈ పూర్తి సంఘటన అప్పటి ప్రధానమంత్రి అయిన జవహర్‌లాల్ నెహూ రాష్ట్రపతుల మధ్య పెద్ద అఘాతాన్ని సృష్టించింది. జవహర్‌లాల్ నెహ్రు దీనిని హిందువుల ప్రతిఘటనగా భావించగా రాష్ట్రపతి రాజేంద్రప్రసాదు మరియు కెఎమ్మున్షీ ఈ ఆలయ పునరుద్ధరణ స్వాతంత్ర ఫలంగా మరియు తమకు జరిగిన అన్యాయానికి హిందువుల ప్రతిస్పందనగా భావించబడినది. రాజేంద్రప్రసాదు మరియు కె ఎం మున్షీలచేత పునరుద్ధరించబడి

దేశానికి సమర్పించిన ఈ సోమనాథ ఆలయం ఇప్పుడు సోమనాథ ఆలయట్రస్ట్ చేత నిర్వహించబడుతుంది. కైలాస మహామేరు ప్రసాదంగా పిలవబడే నేటి ఆలయకట్టడం చాళుక్యుల నాటి ఆలయ నిర్మాణశైలిని లేక కైలాశ్ మహా మేరు ప్రసాద్ శైలి ప్రతిబింబిస్తుంది. 1951లో ఈ నూతన ఆలయంలో జ్యోతిర్లింగ ప్రతిష్టాపన గావించిన నాటి రాష్ట్రపతి డా.రాజేంద్రప్రసాద్ "సృష్టించే శక్తి నాశనం చేసే శక్తికన్నా గొప్పది అనడానికి సోమనాథ్ ఆలయం ప్రతీక" అని అన్నారు. ఈ ఆలయం గుజరాత్ శిల్పాచార్యుల సోమపుర నిర్మాణశైలిని ప్రతిబింబిస్తుంది. ఈ ఆలయం నిర్మించిన స్థలానికీ, ఎక్కడో దక్షిణాన ఉన్న అంటార్కిటిక్ ఖండానికీ మధ్య భూభాగమన్నదే లేదు. ఈ విశేషాన్ని సంస్కృతభాషలో తెలియచేస్తున్న ఒక శాసనం అక్కడి బాణస్థంభం (యారోపిల్లర్) మీద చెక్కబడి యున్నది. వెయ్యి సంవత్సరాలపై బడినదిగా భావిస్తున్న ఈ బాణస్తంభం అక్కడి సముద్రతీరాన ఉన్న రక్షణకుడ్యముపై నిర్మింపబడింది. ఈ బాణస్తంభం ఉత్తర దక్షిణ ధ్రువాల కేంద్రబిందువుగా భావించబడుతుంది.

## బంగూర్మ్యూజియం

బంగూర్మ్యూజియం పాతబస్టాండ్లో ఉంది. ఈ మ్యూజియం అరుదైన చారిత్రక వస్తువులు, నాణేలు మరియు ఆయుధాలు ప్రదర్శిస్తుంది. ఈ మ్యూజియానికి స్థానికంగా పేరొందిన బంగూర్జువార్ అనే నేత పేరు పెట్టారు.

## ప్రభాసతీర్థం-8

## సోమనాధ మహా జ్యోతిర్లింగం

"సూర్య బింబ సంప్రఖ్యం-ఏవం సమకారమహా మేఖల మండితంకుక్కుటాండ సమానం తద్ భూమి మధ్యే వ్యవస్థితం"

'సోమనాధ జ్యోతిర్లింగం సూర్యకాంతితో సర్పాలు ఒకదానికొకటి చుట్టుకు పోయినట్లు కాంతివంతంగా ప్రకాశిస్తుంది. అది కోడి గుడ్డు ఆకారంలో భూమికి కేంద్ర స్థానంలో ప్రతిష్టితమై ఉంది' అని దీని భావం. చంద్రదేవుడు ఆ లింగాన్ని బ్రహ్మ పీఠంపై ప్రతిష్టించాడు. అయితే ఎంత పరిమాణంలో ఉంది ఆ లింగం? దీనికి సరైన వివరణ ఎక్కడా లభించలేదు. ఆలయం అనేకసార్లు దాడికి గురి అయి ధ్వంసమైంది. అనేకసార్లు పునర్నిర్మింప బడింది. అయితే శివలింగం మాత్రం కాల ప్రభావానికి తట్టుకొని నిలబడింది. 1026లో గజని మహమ్మద్ అసలు శివలింగాన్ని ధ్వంసం చేశాడు. అదే పురాతనమైన అసలైన జ్యోతిర్లింగం. అల్లాఉద్దీన్ 1300లో మళ్ళీ ధ్వంసానికి పూనుకొన్నాడు. దీని తర్వాత కూడా చాలాసార్లు ఆలయమూ జ్యోతిర్లింగ్గామూ ధ్వంసమైనాయి. మహారాణి అహల్యా బాయి హోల్కార్ సకలేశ్వర దేవాలయంలో

ప్రతిష్టించిన శివలింగం ఇటీవలిది అంటారు కాని దాఖలాలు లేవు. శివ విగ్రహంలో విలువైన వజ్రాలు, మాణిక్యాలు శివ విగ్రహ ఖాళీ ప్రదేశంలో ఉన్నాయని విదేశీ చరిత్ర కారులు రాసింది అసత్యం అని తేల్చేశారు. శివ లింగానికే పూజ కాని విగ్రహానికి కాదు అని అందరికి తెలిసిన విషయమే. మహమ్మద్ నిజాం అనే చరిత్రకారుడు సోమనాధ్ దేవాలయంలో శివలింగమే ఉంది కాని శివ విగ్రహం లేదని రాశాడు.

## సోమనాధ దేవాలయంలో సింగ్ ద్వారాలు

ఆగ్రాలో ఆగ్రా కోటకు ఇప్పటికీ ఉన్న ముఖ్యద్వారాలు దేవదారు కలపతో చేయబడ్డాయి. ఇవి సోమనాధ దేవాలయ ద్వారాలని గజని వీటిని 1026లో దోచి ఆగ్రాకు తరలించాడని అంటారు. 1836లో ఈస్ట్ ఇండియా కంపెని కాబూల్‌ను ఓడించింది. బ్రిటిష్ జెనరల్ 'నాట్' మహమూద్ యొక్క 'గద'ను సోమనాధ ద్వారాలను అతని సమాధి నుండి తీసుకురమ్మని ఆదేశించాడు. గద దొరక లేదు. కాని ద్వారాలు మాత్రం కంపెనీకి చేరాయి. వీటికి వైభవోపేత స్వాగత సత్కారాలు జరిగాయి. జునాగాడ్ నవాబును ఈ ముఖ్య ద్వారాలను సోమనాధ దేవాలయానికి అమర్చమని హుకుం జారీ చేశాడు. వీటిని అమరుస్తుండగా 1884 మార్చి 9న బ్రిటిష్ పార్లమెంట్‌లో తీవ్ర వాదోపవాదాలు జరిగాయి. దీనితో భయపడిన బ్రిటిష్ ప్రభుత్వం ఈ ద్వారాలను ఆగ్రా కోటకే అమర్చి ఉంచేశారు.

సోమనాధ ఆలయం ద్వారాల సంగతి ఇంకా వివాదంగానే ఉంది. ఇదమిద్ధమని తేలలేదు. ఇవి దేవదారు కలపతో చేయబడ్డాయి. వీటికి బిగించిన బందులూ వగైరా ఈ ఆలయానికి సరిపోలేదని అందుకే ఆగ్రా కోటకే ఉండిపోయాయని అన్నవారూ ఉన్నారు. పడమటి భారత దేశంలో దేవదారు కలపను వాడనే వాడరు. వీటిని ఆఫ్ఘనిస్తాన్‌లోనే ఎక్కువగా వాడుతారు. కనుక ఈ ఆగ్రా గేట్లు సోమనాధ దేవాలయానికి చెందినవి కావు అని ఖచ్చితంగా చెప్పవచ్చు.

## పురాతన భారతీయ నగరం ప్రభాస్

భారత దేశ ప్రాచీన నగరాలలో ప్రభాస్ కూడా ముఖ్యమైనది. ఇప్పటికీ దీనికి మునిసిపాలిటీ హోదా లేదు. పంచాయితీ కూడా లేదు. సరైన రోడ్లు లేవు. కరెంటు మంచి నీరు పారిశుధ్యంపై అధికారుల నిర్లక్ష్యం స్పష్టంగా కనిపిస్తుంది. వేరావాల్ మునిసి పాలిటీయే దీని అవసరాలను చూస్తుంది. ప్రభాస్ చారిత్రాత్మక, ఆధ్యాత్మిక పర్యాటక కేంద్రం అయినా అందరి నిర్లక్ష్యానికి గురి అయింది. కనీసం రైల్వే స్టేషన్ కూడా లేదు. వేరావాల్ దగ్గర స్టేషన్. అక్కడి నుంచి ఇక్కడికి రహదారి సురక్షితంగా లేదు. పర్యాటక సంస్థ ప్రభుత్వం ఎంతో శ్రద్ధ పెట్టాల్సింది.

## ప్రభాస్ కోట

చాళుక్యుల కాలానికి చెందిన ప్రభాస్ కోట నిర్మాణ కౌశలానికి మచ్చు తునకగా నిలుస్తుంది. కోట పశ్చిమ భాగం ఇసుకలో కూరుకుపోయింది. తూర్పు భాగం దాదాపు శిధిలమై కూలేందుకు సిద్ధంగా ఉంది. మిగిలిన రెండు వైపులా కోట పటిష్టంగా ఉండి దాని ప్రతిభను వైభవాన్ని చాటుతోంది. దీని రక్షణకై ప్రభుత్వం శ్రద్ధ చూపక పోవటం విచారకరం. లేకపోతే దాని ఆనవాళ్ళు కూడా లభించకపోయే ప్రమాదం ఉంది. 1026లో గజని దండయాత్ర సమయంలో కోట లేదు. అప్పటికేవరికీ సోమనాధ దేవాలయ ఇతర ఆలయాలకు రక్షణకు ఒక కోట అవసరం అన్న ఆలోచనే రాలేదు. 'త్వారిఖ్ ఉ హిందూ' అనే ఉర్దూ గ్రంథంలో సోమనాధాలయానికి చుట్టూ బలిష్టమైన గోడ ఉండేదని ఉంది.

## 'కమిర్‌ఉట్-త్వారిఖ్'

అంటే సంపూర్ణ చరిత్ర. ఇది 1230లో వెలువడిన గ్రంథం. దీనిలో సోమనాధాలయం చుట్టూ బలమైన గోడ ఉండేదని రాసి ఉంది. స్కంద పురాణం ప్రభాస ఖండములో కూడా ఈ విషయం ఉంది. దేశంలో ఎవరూ కూడా సోమనాధ ఆలయ ధ్వంసానికి పాల్పడే సాహసం చేయలేదు. కాని ఆఫ్ఘనిస్తాను నుంచి వచ్చిన గజినీ మహమ్మద్ మొదటిసారిగా ఈ ఆలయాన్ని, జ్యోతిర్లింగాన్ని విధ్వంసం చేశాడు. అందువల్ల రాజా కుమార్ పాల్ కొత్త ఆలయ రక్షణకు బలమైన కోట నిర్మించాలని భావించి నిర్మించాడు. 1168 భద్రకాళి ఆలయ శాసనం ప్రకారం ఇది యదార్ధమేనని రుజువైంది. అప్పటిదాకా ప్రభాస్ ప్రజలు ప్రభాస్‌కు చాలా మైళ్ళ దూరంలో 'నగ్రాపూర్'లో నివసించేవారు. ఆలయ భద్రత కోసం ప్రజలు ప్రభాస్‌కు వచ్చి స్థిరపడ్డారు. అల్లాఉద్దీన్ ఖిల్జీ సేనాని ఆలం ఖాన్ ప్రభాస్‌పై 1300లో దాడి చేశాడు. సంపూర్ణ వినాశనం సృష్టించాడు. 1386లో స్థానిక రాజు ప్రభాస్ పర్మనే కోటను పునర్నిర్మించాడు. ఈ విషయం 1396 శాసనంలో కనిపిస్తుంది.

నియామత్ ఖాన్ లోడి పడమటి ద్వారంపై 1747లో శిఖరం నిర్మించాడు. అందుకే దీన్ని 'లోడీ కోట' అంటారు. 1766లో కోటను పునర్నిర్మించాడు. 1788లో జునాగాద్ వీరుడు 'అమరజీ' కోటను శత్రు దుర్భేద్యం చేశాడు. కోట చుట్టూ లోతైన అగడ్త నిర్మించాడు. 'సన్నిహిత నది' నుండి ఈ అగడ్తలోకి నీటిని పంపి నింపేశాడు. కోట కింద తప్పించుకు పారిపోవటానికి ఒక సోరంగమార్గాన్ని కూడా ఏర్పాటు చేశాడు. ఇప్పుడిది ఉపయోగంలో లేదు. కనుక మూసేశారు. పడమటి ద్వారం వద్ద ఒక ఏనుగు సమాధి ఉంది. ఈ గజరాజు యుద్ధంలో వీరోచిత సేవలందించి వీర మరణం పొందింది. అందుకే ఈ స్మృతి చిహ్నం.

## ప్రభాస్ తీర్థయాత్ర

1300 నుండి 1707వరకు ప్రభాస్ లోని దేవాలయాలు అనేక విధ్వంసాలకు గురి అయ్యాయి. జననష్టం, ఆలయ ధ్వంసం, విగ్రహ విధ్వంసం జరిగాయి. లూటీలు గృహ దహనాలు దోపిడీలు నిత్య కృత్యమైపోయాయి. అత్యున్నత దశలో ప్రభాస్ ఉన్నప్పుడు 'ఆలయ నగరం'గా వినుతి కెక్కింది. ఆలయ ప్రదేశాలు మారాయి. కొత్త ఆలయాలు నిర్మాణమై అభివృద్ధి చెందాయి. లక్షలాది యాత్రికులు సందర్శించి అర్చనలు జరిపి తరించేవారు. 'ఆది జ్యోతిర్లింగం'గా సోమనాథ జ్యోతిర్లింగం ప్రసిద్ధి చెందింది. ప్రభాస్‌లోనే శ్రీ కృష్ణ నిర్యాణం జరిగింది. వేదకాలం నుండి మహాభారత కాలం దాకా ఒక వెలుగు వెలిగింది. ఇప్పుడు కూడా ప్రభాస్ ఒక ముఖ్య యాత్రా కేంద్రంగానే ఉంది. 'హోలీ ఆఫ్ హోలీస్' అని పించుకోంది. అంటే పవిత్రాతి పవిత్ర దేవాలయం అన్నమాట.

ప్రభాస్ కేవలం భక్తి తీర్థమే కాదు. ఇక్కడ పితృదేవతలకు శ్రాద్ధ క్రియలు జరిపే క్షేత్రంగా కూడా ప్రసిద్ధి ఉంది. ఏడాదిలో ప్రతి రోజూ పితృవిధి జరపటానికి ఇక్కడికి వస్తూ ఉంటారు. ముఖ్యంగా చైత్ర, భాద్రపద, కార్తీక పవిత్ర మాసాలలలో పితృకార్యాలు జరపటానికి వేలాది మంది వస్తారు. శ్రాద్ధ క్రియలకు మాత్రమేకాక 'త్రివేణి ఆశ్రాన్' అంటే త్రివేణీ నదిలో పవిత్ర స్నానాలు చేయటం ప్రత్యేకత. ప్రతి అమావాస్య, చంద్ర గ్రహణాలలో త్రివేణి నదిలో తప్పక పవిత్ర స్నానం చేసి సోమనాథ జ్యోతిర్లిన్గాన్ని దర్శించి పునీతులౌతారు. ఇది పురాణ కాలం నుంచి వస్తున్న సంప్రదాయమే. ప్రభాస్‌లో బ్రాహ్మణులు వేదం శాస్త్రాధ్యయనం చేసి కర్మకండలు చేయించటంలో ఉద్దండు లనిపించుకొన్నారు. శ్రద్ధాభిషేకం, పూజా, శ్రార్ధ తర్పణం మొదలైన వాటిని చాలా శాస్త్రోక్తంగా జరిపించే సామర్థ్యం ఉన్నవారు. బాగా మత భావాలు జీర్ణించుకొని వేద ప్రామాణికంగా విధులు నిర్వహించి అందరిని సంతృప్తి పరుస్తారు. గొప్ప ఆతిధ్యాన్నిచ్చే సహృదయులు కూడా. దైవభక్తి దైవ భీతి ఉన్నవారు. కార్తీక మాసంలో అంటే విక్రామి నెలలో సోమనాథస్వామికి గొప్ప ఉత్సవాన్ని శశిభూషణ మహాదేవాలయం వద్ద ప్రతి సోమవారం జరుపుతారు. ప్రభాస తీర్థంలోని ప్రజలు అందరు ఉదారులు సౌజన్యులు స్నేహశీలురు, పవిత్ర భావనలో ఉంటారు. పెద్దమనిషి తరహాలో వ్యవహరిస్తారు. అదీ ప్రభాస తీర్థ ప్రజల గొప్పతనం.

## ప్రభాసతీర్థం-9 (చివరిభాగం)

## ప్రభాస్‌లో దర్శనీయ దేవాలయాలు

స్కాంద పురాణంలో ప్రభాస ఖండంలో స్థానిక పవిత్ర యాత్రాస్తలాల ప్రస్తావన

ఉంది. ప్రభాస్‌కు తూర్పున అరేబియా సముద్రం, సరితా నది సంగమపవిత్ర క్షేత్రం ఉంది. పురాతన క్రితుమ్బార్ పర్వతం ఉంది. తర్వాత ప్రభాస పట్టణ పూర్తి వర్ణన ఉంది. ప్రభాస్‌లో శివాలయాలు 135– అందులో యాత్రాస్థలాలు 8 మాత్రమే పేర్కొన్నారు. విష్ణ్వాలయాలు 5. వీటిలో యాత్రాస్థలాలు 3 మాత్రమే. దేవి ఆలయాలు 25లో దర్శించ గలిగేది 2 మాత్రమే. సూర్య దేవాలయాలు 16లో చూడదగినది అరణ్య ప్రాంతంలో ఉన్నది మాత్రమే. వినాయక ఆలయాలు 5లో ఒకటే ఆశ్రమస్థానంలో దర్శింప గలిగేది. ఒకే ఒక నాగ దేవాలయం ఉంది. ఇది స్మశాన స్థలం. క్షేత్రపాలక ఆలయము ఒకటే. స్నాన కుండాలు 19 పేర్కొనగా అందులో రెండు మాత్రమే స్నానానికి అనువుగా ఉన్నాయి. వాగులు 9లో రెండు వాపిలు మాత్రమే అనువు. గజని మహమ్మద్ దండ యాత్ర తర్వాత 21 కొత్త దేవాలయాలు నిర్మింపబడ్డాయి అని శాసనం ఉన్నా సాక్ష్యంగా ఒక్కటీ కనిపించదు.



## ఈనాటి దర్శనీయ దేవాలయాలు

### 1) శ్రీ సోమనాధ జ్యోతిర్లింగ దేవాలయం

సోమనాధ టెంపుల్ ట్రస్ట్ నిర్మించినది. ఇక్కడే రాజా కుమార్ పాల్ పూర్వాలయాన్ని నిర్మించాడు. ఆనాటి సౌరాష్ట్ర ముఖ్యమంత్రి ఉచ్చాంగ్ రాయి నావల్ శంకర్ దేబర్ (యు యెన్ దేబర్) ఇక్కడ 1940 ఏప్రిల్ 19న త్రవ్వకాలు జరిపించాడు. కేంద్ర పురావస్తు శాఖ త్రవ్వకాలలో బ్రహ్మశిల కనిపించింది. దీనిపై జ్యోతిర్లింగం ఉంది. సౌరాష్ట్ర మాజీ పాలకుడు దిగ్విజయ్ సింగ్ 1950 మే నెల 8న సోమనాధ ఆలయానికి శంకుస్థాపన చేశాడు. మే 11న ప్రధమ రాష్ట్రపతి బాబూ రాజేంద్ర ప్రసాద్ శివలింగ ప్రతిష్ట చేశారు. 1962కు ఆలయ నిర్మాణం పూర్తయ్యింది. 1970లో జామ్ నగర్ రాజమాత తన భర్త స్మారకార్థం 'దిగ్విజయ ద్వారాన్ని' నిర్మించి భగవాన్ సత్యసాయిబాబాతో ఆవిష్కరింపజేసింది. దీనికి దగ్గరలోనే రాజ మార్గం, దానిపై సర్దార్ పటేల్ భారీ విగ్రహం ఉన్నాయి. సోమనాధ ఆలయ నిర్మాణానికి పటేల్ పూనిక, దీక్ష శ్లాఘనీయమైనవి. నెహ్రూ ఒప్పుకోకపోయినా ధైర్యంగా నిర్మాణాన్ని పూర్తి చేయించాడు సర్దార్. రాష్ట్రపతిని వెళ్ళ వద్దన్నా రాజేంద్ర ప్రసాద్ వచ్చి లింగ ప్రతిష్ట చేశాడు. సముద్రం దగ్గర ఆలయానికి

దక్షిణాన ఒక స్తంభాన్ని నెలకొల్పారు. దీనిపై ఒక బాణం గుర్తు ఉంటుంది. ఇది దక్షిణ ధృవానికి, సోమనాధ ఆలయానికి మధ్య భూభాగం అనేది లేదు అని తెలియజేస్తుంది. ఈ ఆలయానికి దగ్గరే పురాతన సోమనాధ దేవాలయం ఉంది. ముందు దీన్ని దర్శించే ఇప్పుడున్న దేవాలయ దర్శనం చేస్తారు. ఈ పాత ఆలయంలోనే శివ పార్వతులు విహరించారని పురాణ కథనం. సోమనాధ ఆలయాన్ని సోమనాధ ట్రస్ట్ నిర్వహిస్తుంది. ప్రభుత్వం తగినంత భూమిని దేవాలయానికి సమర్పించి దిన వారీ ఖర్చులకు సహాయపడింది.

2) ఆలయంలో శ్రీ హనుమాన్, హంరిజి దియోది విగ్రహం, పేరడి వినాయక ఆలయం నవ దుర్గా ఖోదియార్, రాణి అహల్యా బాయి ప్రతిష్టించిన జ్యోతిర్లింగం అహల్యేశ్వర లింగం అన్నపూర్ణ గణపతి కాశి విశ్వనాధ ఆలయాలున్నాయి భైరవేశ్వర ఆలయమూ దగ్గరలోనే ఉంది. మహాకాళి మందిరమూ సమీపంలోనే ఉంది. కాళీ మందిరం దగ్గరే మహిషాసురమర్దిని అయిన దుర్గాదేవి మందిరం చూడదగినది.

3) సిద్ధయోగ తపస్సంపంనుడైన శ్రీ దుఃఖ హరన్జీ సమాధి ఉంది. ఆయన 1884లో మహా నిర్యాణం చెందారు. కుమార్ వాడలో పంచముఖ మహాదేవ మందిరం ఉంది. బిలేశ్వర మందిరం, త్రికం రాయ్ మందిరం భద్రకాళి మందిరం దర్శనీయం. అక్కడే రామ మందిరం ఉన్నది.

4) దైత్య సూదన మహావిష్ణు మందిరం హాటకేశ్వర మహాదేవ మందిరం దగ్గర ఉంది. చక్రదారి మందిరం గుప్తుల కాలానిది. 1733లో ప్రభాస్‌కు చెందిన దేశాయ్ సూరజ్ మల్‌కు విష్ణుమూర్తి కలలో కనిపించి తాను చక్రతీర్ధంలో ఉన్నానని బయటికి తీసి ప్రతిష్టించమని కోరగా నిర్మించిన ఆలయం ఇది. నాగర్‌ల ఇలవేల్పు హాటకేశ్వరుడు.

5) దర్జీవాడలో హింగ్లాదేవి ఆలయం ఉంది. ఇక్కడే చిత్ర గంధర్వేశ్వరాలయం ఉన్నది. కొత్త ఖడ్కిలో రావణేశ్వర మందిరం, కాసారవాడలో కాళికా మందిరం, వానియ వాడలో సముది మందిరం, గోలావాడలో జమదగ్ని మందిరం, చౌగాన్‌లో భంసల్వావ్ మందిరాలు దర్శనీయాలు.

6) సాల్ట్‌వాడలో మామివావ్, నారీశ్వార్ మహేశ్వర్ మందిరం, శాఖ చౌక్‌లో బాలాజీ మందిరం, రాం పుష్కర్ కుండ్, రామేశ్వర మందిరం శ్రీ రామ మందిరం, సత్యనారాయణ మందిరం శ్రీ రామనాధ మందిరం చూడదగినవి.

7) కపూర్ ఫాలియాలో చంద్రేశ్వర మందిరం, ధోబి వాడాలో శాం ఖేశ్వర మందిరం, కుండ్ల భావాని మందిరం బ్రహ్మపురిలో బ్రహ్మేశ్వర మందిరం ఓంకార నివాస్‌లో కోట్ నాద మందిరం చూడాలి.

8) బీదియా ఖాడ్కిలో భీడ్ భంజన్ దేవాలయం, పాత చక్లాలో నరసింహ దేవాలయం, చీబీ ఖడికిలో నాగనాధ ఆలయం, భట్‌వాడాలో భద్రేశ్వరాలయం దర్శించాలి.

## ప్రభాస తీర్ధానికి సమీపంలోని ఆలయాలు

1) ప్రభాస్‌కు వేరావాల్‌కు మధ్య శశిభూషణ మందిరం, అక్కడే భీద్ భంజన్ గణపతి మందిరం బంనేశ్వరాలయం, చంద్రేశ్వర రత్నేశ్వరాలయాలు కపిలేశ్వరాలయం, స్వర్ దగ్దేశ్వరాలయం దర్శనీయాలు.

2) వేరావాల్ సముద్ర తీరంలో 'భాలూకా తీర్ధం'లో శ్రీ కృష్ణ భగవానుడు ఒక చెట్టుకు ఆనుకొని శయనించిన స్థలం, పాదంలో వేటకాడు బాణం వేసిన ప్రదేశం చూడాలి. ఇక్కడే భాల్కేశ్వరాలయం, ప్రాగతెశ్వరాలయం పాదం కుండ్, క్షేత్రపాలక్, పాండవ కూపం కనకా కనకేశ్వరాలయం చూడదగ్గవి.

3) చోటా దర్వాజా దగ్గర ద్వారకానాథ దేవాలయం, త్రివేణి మార్గంలోని బాలాజీ మందిరం, లక్ష్మీనారాయణ మందిరం, రుద్రేశ్వరాలయం, శాఖా మఠం, కామనాథ మందిరం బ్రాహ్మీస్వామి చూడ తగినవి.

4) సిద్ధ నాద దేవాలయం, మార్కండేయ ఆశ్రమం, శ్రీ ముఖ్ వివార్ అనే నాగ దేవాలయం, హింగ్లా గూఫా, గాయత్రిదేవి సూర్యమందిరం త్రివేణి మందిరం రామమందిరం మంకేశ్వార్ మందిరం ఇక్కడే ఉన్నాయి.

5) త్రివేణి నది ఒడ్డున నాగర్ శ్మశానం ఉంది. జై ప్రభాస్‌లో ఇంద్రవారుణ అశ్విని బ్రహ్మకుండాలనే పవిత్ర స్నానకుండాలున్నాయి. ఆదిల్ ప్రభాస్‌లో శ్రావణేశ్వర, విశ్వ కర్మేశ్వర ఆదిలేశ్వర దేవతలకు చెందినవి.

6) పరశురామ క్షేత్రంలో పరశురామ మందిరం ఇటీవలి నిర్మాణమే. మహాశ్మశాన్ అనేది ప్రజల కోసం ఏర్పాటైన శ్మశాన భూమి. సముద్రం దగ్గర ఉన్న బ్రహ్మకుండం బ్రహ్మేశ్వరస్వామికి చెందింది. సముద్ర తీరంలో యోగేశ్వరి వాగేశ్వరి దేవా వాలయాలున్నాయి. ఇక్కడే రత్నేశ్వర మందిరం ఉంది. సీసతో చేసిన శ్రీ హనుమాన్ మందిరం ఇక్కడే ఉంది.

7) గౌరీ కుండ్, గౌరీ తపోవనం, గౌరీ నామేశ్వరాలయం, గాలవేశ్వర, అగస్త్యేశ్వర, కపిలేశ్వర మహాదేవ మందిరాలు దర్శనీయాలు. ఇక్కడే విష్ణు కుండం ఉంది. వాణేశ్వరాలయం ఉంది. ఇక్కడి శివలింగానికి 'జుట్టు మొలిచి' ఉండటం విశేషం. ఒకప్పుడు ఒక యువతిని దుండగులు వెంటాడుతుంటే ఆమె ఈ ఆలయానికి చేరి స్వామిని ప్రార్థిస్తే తనలో కలుపుకొన్నాడు. అందుకే కేశాలు కనిపిస్తాయని స్థానిక చరిత్ర.

8) దేహోత్సర్గ స్థలం – హిరణ్య తల ఘాట్ వద్ద ఉంది. ఇక్కడే శ్రీ కృష్ణ బలరాములు తమ పార్థివ దేహాలను విడిచి పెట్టారని కథనం. సోమనాథ ట్రస్ట్ నిర్మించిన గీతా మందిరం ఉంది శేష నాగావతారం అయిన బల దేవా గుహ ఉంది. లక్ష్మీ నారాయణ మందిరం శిధిలమైపోతోంది. ఇక్కడే ఓంకారేశ్వర మందిరం శ్రీ వల్లభాచార్యులు

నడయాడిన పవిత్ర ప్రదేశం ఉన్నాయి.

9) దశాశ్వ మేదేశ్వర మందిరం, భీమనాదాలయం, కాశీ విశ్వనాధ మందిరం రణ ముక్తేశ్వర మందిరం, నరసింహ మందిరం, ఖాఖి అఖండ మందిరం ఇక్కడే ఉన్నాయి.

10) శీట్లాలో సూర్య దేవాలయం ఉంది. ఇది చాళుక్య రాజుల కాలం నాటిది. శిధిలావస్థలో ఉన్నా శిల్ప రామణీయకతకు ఆశ్చర్యపడతాం. ఇక్కడే శీతల మందిరం, నగరేశ్వరాలయం, అవదూతెశ్వర మందిరం, హిరం ఎశ్వరాలయం చిత్ర విచిత్ర మందిరాలు చూడాల్సినవి.

## ప్రభాస్‌కు దూరంలో ఉన్న ఆలయాలు

మూల ప్రాచీ దేవాలయం అజోతాకు ఎనిమిది కిలోమీటర్లు గోరఖ్ మాది పది హేను కిలోమీటర్లు. ప్రాచి ఇరవై, భీమ దేవాలయం ఇరవై నాలుగు, గంగా కుండ్ ముప్పై, కోటేశ్వరాలయం నలభై, బ్రహ్మ గయ ముప్పై, మూల ద్వారక, నలభై (శ్రీ కృష్ణ నిర్మితం) గుప్త ప్రయాగ ఎనభై, తులసి శ్యాం యాభై, గిరివన్ క్షేత్రంలో ఉష్ణ కుండం ఉంది. భీమ చాస్ బైజాల్ దుర్గ, ద్రోణేశ్వర మహాదేవ్ డెబ్బై, విష్ణుగయ ముప్పై, జక్ర తీర్ధ ఇరవై, గాయత్రి కుండ్, చ్యవన మహర్షి ఆశ్రమం పదిహేను, సూర్య దేవాలయం ఇరవై అయిదు, మహా బల్ ఇరవై, వరాహ మందిరం పది, కిలో మీటర్ల దూరంలో ఉన్న చాడాల్సిన ప్రదేశాలు.

## ద్వార(రి)క

ప్రభాసతీర్ధానికి 24 మైళ్ళలో (40 కిలోమీటర్ల) దూరంలో శ్రీకృష్ణుడు నిర్మించిన



ద్వారకా పట్టణం ఉంది. ఇది కూడా అందులో భాగమేనని పురావస్తుశాఖ ధృవీకరించింది. ప్రభాస్ విస్తీర్ణం అరేబియా సముద్రానికి భద్రానదికి మధ్య ఉన్న తులసీ శ్యాంఉష్ణ గుండంను మాధవ్పూర్వరకూ ఉండేది అనేవారు. అసలు ద్వారక కూడా ఇందులోని భాగమే. అందువల్ల ప్రభాసతీర్ధానికి ద్వారక ప్రత్యేక ప్రాముఖ్యాన్ని కలిగించింది. మహాభారత కధనం ప్రకారం యాదవులు రెందు మూడు గంటలలో ద్వారకకు ఇక్కడి నుండి చేరుకొనేవారని తెలుస్తోంది. అర్జునుడు ప్రభాసతీర్ధానికి వచ్చాడన్న సంగతి శ్రీకృష్ణుడికి తెలిసి స్వయంగా ఇక్కడికి వచ్చి తనవెంట ద్వారకకు తీసుకొని వెళ్ళాడు. అలాగే పాండవులు ప్రభాస్‌లో ధ్యానమగ్నంలో ఉన్నప్పుడూ

వారిని కలిసి వెళ్ళాడు.

తన అవతారసమాప్తికి ముందు శ్రీకృష్ణుడు ప్రభాస తీర్థాన్ని సందర్శించాడు. అప్పుడే ద్వారకలో యాదవకులంలో ముసలం పుట్టటం వారిలో వారు కలహించుకోవటం జరిగింది. కృష్ణ నిర్యాణం ప్రభాస్లోనే జరిగింది. శ్రీకృష్ణ నిర్యాణం తరువాత ద్వారక సముద్రంలో మునిగిపోయింది. స్మారక చిహ్నంగా ఒక చిన్న గ్రామం మాత్రమే మిగిలి ఉంది. క్రీ.శ..మొదటి శతాబ్దంలో బారాదాస్ అనేవాడు ఫ్రాంక్సుశ్రవన్సమక్షంలో ఈ స్మారక గ్రామాన్ని విధ్వంసం చేశాడు. ఆ తర్వాత రాజా ఆశ్వర్జిచౌడా 'ఓఖాను' కూడా కలిపి ఇప్పుడున్న ద్వారకను అభివృద్ధి చేశాడు. ఇప్పుడు ద్వారక సమగ్రంగా సంపూర్ణ యాత్రాస్థలం అయింది. శ్రీకృష్ణుని ద్వారక 24 చదరపు కిలోమీటర్ల వైశాల్యం కలది. ఆరోజుల్లోని ప్రభాస్కు చెందిన హరికోట, ఈనాడు ప్రభాస్కు చెందిన హిరాకోట కలిసి కోడినార్దాకా వ్యాపించి ఉంది.

## చారిత్రిక విశేషాలు

చరిత్రకు పూర్వపురోజుల్లో ప్రభాస్ ప్రాంతం అనార్యుల ఆధీనంలో ఉండేదని చెప్పుకొన్నాం. అప్పుడు వారి సంస్కృతీ అత్యున్నత స్థాయిలో ఉండేది. ఆర్యులు ఇక్కడికి వచ్చి అనార్యులను లొంగదీసుకొని ప్రభాస్పై పెత్తనం సాగించారనీ తెలిసిందే. ఆర్యసంస్కృతిని బాగా అభివృద్ధిచేసి దాన్ని కేంద్రీకృతం చేశారు. మొహంజోదారోహరప్పా నాగరికత కాలంలో ప్రభాస్ అత్యంత నాగరక ప్రదేశంగా విలసిల్లింది. అతి విస్తృత ప్రాంతం అంతా ప్రభాస్ అధీనంలో ఉండేది. అయిదువేల ఏళ్ళక్రితం అంటే మహాభారత కాలానికి ముందు ప్రభాస్ పవిత్ర యాత్రాస్థలంగా విరాజిల్లింది. యాదవుల అధీనంలో ఈ ప్రాంతం 'నగరం' అయింది. ఇప్పుడు దీన్ని 'నాదర్' అంటున్నారు. ధృతరాష్ట్రుని భార్య, పట్టపురాణి అయిన గాంధారీదేవి శాపం, ఋషుల శాపం వలన యాదవులు అంతఃకలహాలతో ఒకరినొకరు నరుక్కు చచ్చారు. అప్పుడు నిర్వేదం చెందినా శ్రీకృష్ణుడు ఇక్కడి బ్రాహ్మణుల కోసం ఆహారపదార్థాలను ప్రభాస్కు తరలించి బతకటానికి తోడ్పడ్డాడు. తన నిర్యాణం దాకా ఇక్కడే ఉండమని బ్రాహ్మణులను కోరాడు కృష్ణుడు.

యాదవులు ఆహారపదార్థాలను ఇక్కడికి తెచ్చినప్పుడు ముఠాలుగా విడిపోయి సరస్వతినది ఒడ్డున హాయిగా విశ్రమించారు. 'వారుణి' మద్యంతాగి మత్తులో జోగుతూ ఉంటే కోతులదండు వచ్చి వారు తెచ్చుకొన్న ఆహారపదార్థాలను పూర్తిగా తినేసి ఖాళీ చేశాయి. అప్పుడే శ్రీకృష్ణుడికి, తమ్ముడు సాత్యకికి తీవ్ర వాదోపవాదాలు జరిగాయి. సాత్యకి కృతవర్మ తలను కోపంతో నరికేశాడు. దీనితో యాదవుల మధ్య తీవ్రపోరాటాలు సాగాయి. ఒకరినొకరు నరికి చంపుకున్నారు. శ్రీకృష్ణుని కుమారుడు చనిపోయాడు. అప్పుడు కృష్ణుడు రంగప్రవేశం చేశాడు. గడ్డిపరకలను చేతిలో తీసుకొని కొట్లాడే

యాదవమూకలపై విసిరాడు. యాదవులు సమూలంగా దీనితో నాశనమైపోయారు. బతికినవారిలో బాభ్రువాహనుడు, దారుకుడు మాత్రమే మిగిలారు. అప్పటికే బలరాముడు అవతార సమాప్తి చెందటానికి తపస్సుకోసం అరణ్యాలకు వెళ్లిపోయాడు. యాదవ వినాశ వార్త విన్న బలరాముడు అవతారం చాలించేశాడు.

యాదవుల పరస్పర హననంకు కలత చెందిన శ్రీకృష్ణుడు తను ఈ లోకంలో అవతరించిన కార్యం సమాప్తి అయినట్లు భావించి, అవతార సమాప్తికి సిద్ధపడి ప్రభాస తీర అరణ్యం చేరాడు. ఒక చెట్టుకు తల ఆనించి కాళ్ళుసాచి పడుకున్నాడు. చీకటిలో ఆయన పాదకాంతి లేడికన్నులుగా భావించిన బోయవాడొకడు వాటిపై బాణాలు సంధించాడు. శ్రీకృషుడు తనువు చాలించటానికి ఇది ఒక నెపం మాత్రమే. కృష్ణుని ఆత్మ పరమాత్మలో ఇక్కడే ప్రభాస క్షేత్రంలో లీనమైంది. శ్రీకృష్ణ పార్థివ శరీరానికి సరితానది ఒడ్డున అంత్యక్రియలు నిర్వహించారు. కృష్ణ సమాధిని మనం ఇక్కడ దర్శించవచ్చు.

యాదవము సలం తర్వాత, మౌర్య సామ్రాజ్య ఆవిర్భావం వరకు చారిత్రాత్మక అంశమే దీరికార్డు కాలేదు. మౌర్యపాలనలో సౌరాష్ట్ర ప్రదేశం మౌర్యసామ్రాజ్యంలో ఉంది. క్రీ.పూ. 6వ శతాబ్దిలో బౌద్ధం బాగా విజృంభించింది. దీనితో ఆర్య, అనార్యుల మధ్య సఖ్యత ఏర్పడింది. ఈ రెండుజాతులవారూ సంయుక్తంగా సోమనాధ్జ్యోతిర్లింగాన్ని పూజించి అర్చించాలి అనే నిర్ణయానికి వచ్చారు. దీంతో మళ్ళీ సోమనాథ్ పునర్వైభవాన్ని పొందింది. దేశంలోని వివిధ ప్రాంతాలనుండి యాత్రీకులు ప్రభాస్కు వచ్చి సోమనాధ్లింగార్చన చేసి తరించారు. దేశంలో ఒక గొప్ప యాత్రాస్థలంగా మళ్ళీ సోమనాధ్వైభవస్థితికి వచ్చింది.

క్రీ.పూ. 219–295 కాలంలో మౌర్యచంద్రగుప్తుని సామ్రాజ్యంలో సౌరాష్ట్ర దేశం భాగంగా ఉండేది. చంద్రగుప్తుని గురువు, అర్ధశాస్త్ర రచయితా, నందవంశ నిర్మూలకుడు, ఆర్యచాణక్యుడు సామ్రాజ్యంలో పెరిగిపోతున్న బౌద్ధాన్ని అదుపు చేయాలని, వైదికధర్మాన్ని పునరుద్ధరించాలని సంకల్పించి ప్రభాస్లో ఆలయాన్ని నిర్మింపజేశాడని ఉంది. కాదు, క్రీ.శ. ఒకటవ శతాబ్దిలో మాత్రమే సోమనాథ దేవాలయ నిర్మాణం జరిగినదని కొందరి భావన. మౌర్యసామ్రాజ్యపు చివరి పాలకుడు బృహద్రదుడి హత్య తర్వాత సుంగవంశానికి చెందినా పుష్యమిత్రుడు స్వయంగా మగధచక్రవర్తిగా ప్రకటించుకొన్నాడు. సోమనాథ్ దేవాలయం అందులో లేదు. క్రీ.శ. 185లో గ్రీకు సేనాని 'డ్రేంట్రిఏస్' సింద్ను ఆక్రమించి 'బాలర్తనే' పట్టణాన్ని స్వాధీన పరచుకొన్నాడు. కొందరి చరిత్రకారుల దృష్టిలో బాలర్తనే అంటే 'ప్రభాస పట్టణమే'. మరికొందరు ఈ వాదాన్ని అంగీకరించలేదు. బాలర్తాన్ అంటే సింధ్లో భాగమైన 'పటాన్పూర్' పట్టణమే.

## ద్వారకా పట్టణం

గుజరాత్‌లోని ఈ దివ్యధామం శ్రీకృష్ణుని పాదస్పర్శతో పునీతమైంది. జరాసందుని బారినుండి తప్పించుకొనేందుకు ఈ నగరాన్ని నిర్మించినట్లు పురాణాల ద్వారా తెలుస్తుంది. ఇక్కడి ద్వారకాధీశుని మందిరం అతి పురాతనమైంది. ఈ మందిరాన్ని పదో శతాబ్దంలో నిర్మించినట్లు చారిత్రక ఆధారాల ద్వారా తెలుస్తుంది. అయితే శ్రీకృష్ణుని మనుమడు అయిన వజ్రనాధుడు ఈ మందిరాన్ని మొట్టమొదటిసారిగా నిర్మించినట్లు పురాణాలలో ప్రస్తావన ఉంది. శ్రీకృష్ణుని ద్వారకా నగరం సముద్రగర్భంలో ఇంకా వుందని పరిశోధకుల అభిప్రాయం.

## నాగేశ్వర లింగము:



ద్వాదశ జ్యోతిర్లింగాలలో 10వది 'నాగేశ్వర లింగము'. గుజరాత్ రాష్ట్రంలో ద్వారక నుంచి గోపితలావ్ వెళ్లే బస్సులో నాగనాధ్ వద్ద దిగి వెళ్ళవలెను. (గోమతి ద్వారక నుంచి సుమారు 14 కి.మీ.దూరము) చాలా చిన్న గ్రామం. దారుకా వనమున తారకాసురుడు తన పరివారముతో నివసించి, ఆ వనమున పోవు ప్రయాణికుల ధనమును దోచి, నానా హింసలు పెట్టుచున్నాడు. సుప్రియుడను వైశ్యుడు గొప్ప వ్యాపారి, గొప్ప శివభక్తుడు. సుప్రియుడు వ్యాపార నిమిత్తం ద్వారకా వనమున పోవుచుండగా, తారకుని అనుచరులు సుప్రియుడును, అతని సిబ్బందిని బంధించుకుపోయి, కారాగారమున ఉంచిరి. మహాభక్తుడగు సుప్రియుడు శివలింగధారి, మెడయందున్నలింగమునుతీసి, అరచేతియందుంచుకుని, పూజచేయుచుండెను. దానిని చూచిన రాక్షససేవకులు తారకాసురునికి చెప్పిరి. తారకాసురుడుసు ప్రియునితో "నీవు దైవారాధన చేయవద్దు" అని చెప్పినా, శివ పంచాక్షరీ మంత్రజపము చేయుచున్నసు ప్రియుడు సమాధానము చెప్పలేదు. తారకాసురుడు కోపమును పట్టలేక తనచేతిలోని గద చేతలపై కొట్టబోవునంతలో, శంకరుడు అక్కడనే జ్యోతిరూపమున ఆవిర్భవించి, తారకుని సంహరించెను. సుప్రియుడు కోరికపై దారుకా వనమునందే "నాగలింగేశ్వర" నామముతో లింగరూపము ధరించెను. ఈ ప్రదేశమున పూర్వకాలమున నాగజాతి ప్రజలు నివసించేవారు. కావున ఈ జ్యోతిర్లింగమునకు "నాగేశ్వరలింగము" అని పేరు వచ్చింది.

మోక్షదాయకములైన సప్తపురములలో ఒకటి అయిన "ద్వారక" శ్రీ కృష్ణ భగవానుడు సింహాసనాన్ని అధిష్టించి, పరిపాలించింది. భారతదేశములో నాలుగుమూలాలు వున్న నాలుగు ధామాలలో ద్వారక ధామము ఒకటి. మిగతావి రామేశ్వరం, పురీజగన్నాథ్, బదరీనాథ్ధామం.

"అయోధ్యా మథురా మాయా కాశీ కాంచి అవంతికా ॥
పూరీ ద్వారావతీ చైవ సప్తైతే మోక్ష దాయికా॥ – గరుడపూర్ణిమ"

క్షేత్రం అంటే పవిత్రమైన ప్రదేశం. దైవిక శక్తికి కేంద్రం. జీవుడికి తుది గమ్యమైన మోక్షమును అందించే మోక్షపురి. గరుడపురాణం పేర్కొన్న ఏడు మోక్షపురాలు వరుసగా అయోధ్య, మథుర, మాయా, కాశి, కాంచి, అవంతిక, పూరి మరియు ద్వారావతి.

## ద్వారకాధీశుడి ఆలయం

ప్రస్తుత ద్వారకాధీశుని ఆలయం సాధారణ శకం (కామన్ ఎరా లేక కేలండర్ ఇయర్) 16వ శతాబ్దంలో నిర్మించబడింది. అసలైన ఆలయం శ్రీకృష్ణుడి మునిమనుమడైన రాజైన వజ్రుని చేత నిర్మించబడినదని విశ్వసిస్తున్నారు. 5 అంతస్తుల ఈ ఆలయం లైమ్స్టోన్మరియు ఇసుకతో నిర్మితమైనది. ఈ ఆలయగోపురం మీద ఉన్న జండా ఒకరోజుకు అయిదు మార్లు ఎగుర వేస్తారు. ఈ ఆలయానికి రెండు ద్వారాలు ఉంటాయి. ఒకటి స్వర్గద్వారం, రెండవది మోక్షద్వారం. భక్తులు స్వర్గద్వారం గుండా ఆలయ ప్రవేశంచేసి మోక్షద్వారం గుండా వెలుపలికి వస్తారు. ఈ ఆలయము నుండి గోమతీ నదిసముద్రంలో సంగమించే ప్రదేశాన్ని చూడవచ్చు. ద్వారకాపురిలో ఇంకా వసుదేవ, దేవకి, బలరామ, రేవతి, సుభద్ర, రుక్మిణీదేవి, జాంబవతీదేవి మరియు సత్యభామాదేవి ఆలయాలు ఉన్నాయి. బెట్ద్వారకా ఆలయానికి వెళ్ళేమార్గంలో రుక్మిణీదేవికి ప్రత్యేక ఆలయం ఉంది. ఈ ఆలయాన్ని బోటులో ప్రయాణించి చేరుకోవాలి.

## పవిత్ర నగరం



ఈ నగరం పేరులోని ద్వార్ అనే పదానికి సంస్కృత భాషలో వాకిలి, ద్వారం లాంటి అర్ధాలు ఉన్నాయి. ద్వార్ అనే పదము ఆధారంగా ఈ నగరానికి ఆ పేరు వచ్చింది. అనేక ద్వారాలు ఉన్న నగరం కనుక ద్వారక అయింది. హిందువులు అతిపవిత్రముగా భావించే చార్ధామ్ (నాలుగు ధమాలు) ద్వారకాపురి ఒకటి.

మిగిలిన మూడు పవిత్ర నగరాలు బద్రీనాథ్, పూరి, రామేశ్వరం. ఈ నగరం వైష్ణవులచేత గౌరవించబడింది. ద్వారకాధీశుని ఆలయం జగత్మందిరం అని పిలువబడుతుంది. ఈ ఆలయ ప్రధాన దైవం శ్రీకృష్ణుడు. ద్వరకాపురి సమీపంలో జ్యోతిర్లింగాలలో ఒకటి అయిన నాగేశ్వరలింగం ఉంది. ద్వారకలో శంకరాచార్యుడు ద్వారకా పీఠం స్థాపించబడింది. ఈ మఠం శ్రీకృష్ణభగవానుడికి సమర్పించబడింది. ఆదిశంకరాచార్యుడితో ప్రతిష్ఠించబడిన నాలుగు మఠాలలో ఇది ఒకటి. మిగిలినవి శృంగేరి, పూరి మరియు జ్యోతిర్మఠం. ద్వారకాపీఠాన్ని కాళికాపీఠంగా కూడా అంటారు.

## శ్రీ ద్వారకనాథ్ మహత్యం

ఆదిశంకరులు ద్వారకాధీశుడిని దర్శించి ద్వారకాపీఠాన్ని ప్రతిష్ఠించాడు. ఇక్కడ కృష్ణుడు క్షత్రియ రాకుమార వివాహ అలంకరణలో దర్శనం ఇస్తాడు. 108 దివ్య దేశాలలో ఈ క్షేత్రం ఒకటి.

## దర్శనం సేవలు మరియు ఉత్సవాలు

ద్వారకానాధుడికి అనేక సేవలు దర్శనాలు ఉంటాయి. దర్శనలకు తగినట్లు వస్త్రధారణలో మార్పులు జరుగుతుంటాయి. ఈ దర్శనాల వల్లభాచార్యులచేత వ్రాయబడిన పుష్టి మార్గాంలో వ్రాయబడినట్లు జరుగుతాయి. ద్వారకానాధుని ఆలయం పుష్టిమార్గ ఆలయం. దర్శనాలు వరుసగా ద్వారకాసామ్రాజ్యం, మహాభారతం, హరివంశం, స్కందపురాణం, భాగవత పురాణం మరియు విష్ణుపురాణంలలో ద్వారకాపురి ప్రస్తావన ఉంది. ప్రస్తుత ద్వారకాపురి సమీపంలో శ్రీకృష్ణ నిర్మితమైన ద్వారాపురి ఉండేదని. పురాణేతిహాసాలలో వర్ణించబడిన విధంగా అది సముద్రగర్భంలో కలసి పోయి కనిపించకుండా పోయిందని విశ్వసిస్తున్నారు.

శ్రీకృష్ణుడు యుద్ధాల వలన జరిగే అనర్ధాలనుండి ద్వారకా వాసులను ద్వారకా నగర నిర్మాణంచేసి యాదవులను ఇక్కడకు తరలించి సురక్షితంగా పాలించాడని పురాణ కథనాలు వర్ణిస్తున్నాయి. శ్రీకృష్ణుడు కంస వధ అనంతరం కంసుడి తండ్రి అయిన ఉగ్రసేనుడిని చెరసాలనుండి విముక్తిడిని చేసి మథురకు రాజును చేసాడు. కంసవధకు కినుక చెందిన అతడి మామగారైన జరాసంధుడు తన స్నేహితుడైన కాలయవనుడితో కలసి 17 మార్లు మథుర మీద దండయాత్ర చేసాడు. యుద్ధాలనుండి ప్రజలను రక్షించే నిమిత్తం శ్రీకృష్ణుడు యాదవ ప్రముఖులతో సమాలోచనలు జరిపి సముద్ర పరివేష్టితమైన భూమిలో ద్వారకా నగరిని నిర్మించిడానికి మథురలోని యాదవులను తరలించాడు. 17 మార్లు జరిగిన దండయాత్రలలో అతడు తన సైన్యాలంతటిని క్షీణింపజేసుకున్నాడు. ఒక్కోమారు జరాసంధుడు 18 అక్షౌహినుల సైన్యంతో దాడి

చేసేవాడు. మహాభారత యుద్ధంలో పండవుల మరియు కౌరవుల సైన్యం మొత్తము 18 అక్షౌహినులు. శ్రీకృష్ణుడు 18వ దండయాత్రకు ముందుగా మథురను వదిలి వెళ్ళాడు. జరాసంధుడు 800 నుండి 1000 సంవత్సరాలు జీవించినట్లు అంచనా. భీష్ముడు కూడా 800 నుండి 1000 సంవత్సరాలు జీవించినట్లు అంచనా.

ద్వారకా నగరం శ్రీకృష్ణుడి ఆజ్ఞానుసారం విశ్వకర్మ నిర్మించాడని ప్రతీతి. సౌరాష్ట్ర పడమటి సముద్రతీరంలో ఈ భూమి నగర నిర్మాణార్థం ఎంచుకొనబడింది. ఈ నగరం ప్రణాళిక చేయబడి తరువాత నిర్మించబడింది. గోమతీ నదీతీరంలో ప్రణాళికాబద్ధంగా నిర్మించబడిన నగరం ద్వారక. ఈ నగరాన్ని ద్వారామతి, ద్వారావతి మరియు కుశస్థలిగా పిలువబడింది. ఇది ఆరు విభాగాలుగా నిర్వహణా సౌలభ్యం కొరకు విభజించి నిర్మించబడింది. నివాస ప్రదేశాలు, వ్యాపారప్రదేశాలు, వెడల్పైన రాజమార్గాలు, వాణిజ్య కూడలులు, సంతలు, రాజభవనాలు మరియు అనేక ప్రజో పయోగ ప్రదేశాలతో నిర్మితమైనది. రాజ్యసభా మంటపం పేరుసు ధర్మసభ రాజు ప్రజలతో సమావేశం జరిపే ప్రదేశం ఇదే. ఈ నగరం సుందర సముద్రతీరాలకు ప్రసిద్ధం. ఈ నగరంలో 7,00,000 ప్రదేశాలు స్వర్ణ, రజిత మరియు మణిమయమై నిర్మించబడ్డాయి. శ్రీకృష్ణుడి 16108 మంది భార్యలకు ప్రత్యేక మందిరాలు ఉన్నాయి. వీటితోపాటు ఈ నగరంలో సుందర సరస్సులతో సర్వకాలంలో పుష్పించి ఉండే వివిధమైన వర్ణాలతో శోభిల్లే ఉద్యానవనాలు ఉంటాయి.

## సముద్రంలో మునుగుట

శ్రీకృష్ణుడు తన అవతారమును చాలించి వైకుంఠము చేరిన తరువాత ఈ పవిత్ర నగరం సముద్రపు జలాలలో మునిగిపోయింది. ఈ నగరం మహాభారత యుద్ధం జరిగిన 36 సంవత్సరాల అనంతరం సముద్రగర్భంలో కలిసిపోయింది. యాదవ ప్రముఖులు గాంధారి శాప ప్రభావాన మునుల శాప ప్రభావాన తమలో తాము కలహించికొని నిశ్శేషంగా మరణించిన తరువాత శ్రీకృష్ణుని ఆదేశం మీద అర్జునుడు యాదవకుల సంరక్షణార్థం ఇక్కడకు వచ్చి శ్రీకృష్ణ బలరాములకు అంత్యక్రియలు నిర్వహించి ద్వారాకాపుర వాసులను ద్వారక నుండి దాటించిన మరునిమిషం ద్వారకా నగరం సముద్రంలో మునిగిపోయింది. ద్వారకా నగరాన్ని దాటిన యాదవులు ద్వారకా నగరం సముద్రజలాల్లో మునిగిపోవడం వెనుతిరిగి చూసి హాహాకారాలు చేసారు. అర్జునుడు ఈ విషయం హస్తినాపురంలో వర్ణిస్తూ " ప్రకృతి ద్వారకా నగరాన్ని తనలో ఇముడ్చుకుంది. సముద్రం నగరంలో ప్రవేశించి ద్వారకా నగర సుందరమైన వీధులలో ప్రవహించి మెల్లగా నగరాన్ని సంపూర్ణంగా తన జలాల్లో ముంచి వేసింది. అందమైన భవనాలు ఒకటి తరువాత ఒకటి మునగడం నేను కళ్ళారా చూసాను. అంతా మునిగి

పోయింది. అక్కడ నగరం ఉన్న సూచనలు ఏమీలేవు. చివరకు ఒక సరస్సులా ఆ ప్రదేశం కనిపించింది. అక్కడ నగరం ఉన్న జాడలు లేవు. ఇక ద్వారక ఒక పేరు మాత్రమే. ఒక జ్ఞాపకం మాత్రమే". విష్ణు పురాణం ద్వారకా నగర మునక గురించి ప్రస్తావించింది. ఇలా ద్వారకా నగరం సముద్ర గర్భంలో కలసిపోయి అంతటితో ద్వాపరయుగం అంతమై కలిపురుషుడు ఈ లోకంలో ప్రవేశించి కలియగానికి నాంది పలికాడు.

## ఆధునిక నిర్మాణశాస్త్ర నిపుణుల పరిశోధనలు

2001 మే 19న అప్పటి భారతీయ సైన్స్ 'ఇ' టెక్నాలజీ మంత్రి అయిన మురళీమనోహర్జోషీ ద్వరకా నగర శిథిలాలను గల్ఫ్ ఆఫ్ఖంభాత్సముద్రగర్భంలో కనుగొనబడినట్లు ప్రకటించాడు. గల్ఫ్ ఆఫ్ఖంబాత్లో ఈ శిథిలాలు గుజరాత్ సముద్రతీర సమీపంలో 40 మీటర్ల లోతులో 9 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంలో ఉన్నట్లు కనుగొనబడ్డాయి. నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఓషన్టెక్నాలజీకి చెందిన ఒక బృందం చేసిన పరిశోధనలలో సముద్రగర్భంలోని ద్వారాపురి కనుగొనబడింది. ఆరు మాసాల పరిశోధనానంతరం 2000 డిసెంబరు మాసంలో కనుగొన్నారు. ఈ పరిశోధనానంతరం అదే విద్యాసంస్థ 2001లో జరిపిన పరిశోధనలో సముద్రజలాల్లో మునుగిఉన్న కళాఖండాలను స్వాధీన పరచుకున్నారు. అలా లభించిన కళాఖండాలలోని భాగాలు యుకెలోని ఆక్స్ఫర్డ్, జర్మనీలోని హానోవర్ అలాగే పలు భారతీయ విద్యాసంస్థలకు కాలనిర్ణయ పరిశోధనా నిమిత్తం పంపబడ్డాయి.

## బెట్ ద్వారక

బెట్ ద్వారక ప్రధాన దైవమైన శ్రీకృష్ణుని ఆలయాలు ఇక్కడ ఉన్నాయి. పురాతన హిందూ సంప్రదాయానికి బెట్ద్వారక ప్రసిద్ధి చెందింది. ఇక్కడ సముద్రతీర ప్రదేశాలు పురాత నవస్తువులకు ప్రసిద్ధి చెందినవి. ఇక్కడ లభించే మట్టిపాత్రల అవశేషాలు క్రిస్టియన్ శకంలో సముద్రతీర దేశాలతో జరిగిన వ్యాపారం మరియు వాణిజ్యాలకు తార్కాణం. ఈ పుష్కలమైన రేవు పట్టణం మరియు మత ప్రధానమయిన కేంద్రం. శ్రీకృష్ణుడు అవతారం చాలించి వైకుంఠానికి వెళ్ళిన తరువాత సముద్ర గర్భంలో కలసిపోయిందని విశ్వసించబడుతుంది. నిర్మాణశాస్త్ర నిపుణుల బృందాల పరిశోధనా ఫలితంగా అనేక పురాతన కళాఖండాలు సముద్రగర్భం నుండి వెలుపలికి తీసుకురాబడ్డాయి. అత్యంత పుష్కలంగా పురాతన వస్తువులు లభించిన సాంస్కృతిక ప్రదేశాలు బెట్ద్వారకా I, II, VI, మరియు IX. బేట్ద్వారకలో లభించిన వస్తువులను రెండు బృహత్తర కాలాలకు సంబంధించినవిగా విభజించించారు. వీటిలో మూడు

తలలు కల జంతువుతో అలంకరించబడిన శంఖం ఒకటి, మూడు వ్రాత ఫలకాలు, ఒక రాగిచేపల గాలం మరియు హరప్పన్సాంస్కృతిక (క్రీ.పూ 1700-1400)ల చివరి కాలపు మృణ్మయ పాత్రలు మరియు చారిత్రక సమయాన్ని సూచించే నాణాలు మరియు కుండలు. ఈ సముద్ర తీర సముద్ర గర్భ పరిశోధనలు బెట్ద్వారకా ద్వీపం దాని చుట్టుపక్కల ప్రదేశాలు సముద్ర తీవ్రత మూలంగా భూఊచకోతకు గురి అయిన విషయాన్ని బలపరుస్తుంది. సముద్రపు పొంగు వలన మునిగిపోయిన ప్రదేశాలలో బెట్ద్వారక ఒకటి. సముద్రగర్భ బెట్ద్వారకా పరిశోధనలన అనేక ఆకారములలో రాతి లంగర్లు వెలుగులోకి వచ్చాయి.

త్రిభుజాకారము, గ్రేప్నెల్మరియు వృత్తాకారపు రాతి లంగర్లు లభించిన వాటిలో ఒకటి. అవి ఆయా ప్రాంతీయమైన రాయితో చేయబడినవి వాటి కాల నిర్ణయము కూడా ద్వారకలో ఉన్న రాళ్ళను పోలి ఉంది. సమీప కాలంలో రోమన్పరిశోధనలలో పురాతన వస్తువులలో మృణ్మయ కూజా పెంకులు మరియు సత్తు (లీడ్) పోతబిళ్ళలు, మరియు సత్తు లంగర్లు లభించాయి. బెట్ద్వారకలో రోమన్నౌకా అవశేషాలుఉన్నట్లు కనుగొనబడింది. ఈపరిశోధనలకారణంగాభారతదేశవిదేశీవాణిజ్యానికిముఖ్యంగా పశ్చిమ దేశాలతో సాగించిన వాణిజ్యానికి సంబంధించిన ఆధారాలు వెలుగులోకి వచ్చాయి. భారతదేశం రోమ్తో క్రీ.పూ 4 శతాబ్దం నుండి క్రీ.శ 4వ శతాబ్దం వరకు చురుకుగా నౌకాయాన వ్యాపారం సాగించిందని ఈ పరిశోధనల వలన రుజువైనది. ఈ పరిశోధనలలో కాలనిర్ణయం మీద ప్రత్యేక దృష్టితో పరిశీలించి ఇవి క్రీ.పూ 1వ క్రీశ 2 శతాబ్ధాల నాటివని కనిపెట్టారు. బెట్ద్వారకలో లభించిన ఈ మృణ్మయ కూజాలు భారతదేశానికి రోమన్దేశాలతో పురాతన కాల వ్యాపార సంబంధాలు వెలుగులోకి వచ్చాయి. ఇక్కడ లభించిన ఏడు కూజాలకు ఉపయోగించిన సీలు పరిశోధిస్తే అవి రోమన్లు ద్రాక్షారసం మరియు ఆలివ్ ఆయిల్ ఎగుమతికి ఉపయోగిస్తారని భావిస్తున్నారు. మృణ్మయ పెంకులపై జరిగిన విస్తారమైన పరిశోధనలు క్రీస్తు శకం ఆరంభంలో బెట్ద్వారకకు అంతర్జాతీయంగా ఉన్న వ్యాపార సంధాలు సూచిస్తున్నాయి. ప్రస్తుత పరిశోధనలు బెట్ద్వారకా సముద్రగర్భంలో రోమన్వ్యాపార సంబంధాలను ఋజువు చేయగల నౌకా అవశేషాలు లభిస్తాయని భావిస్తున్నారు. మృణ్మయ పాత్రలు బెట్ద్వారకకు రోమ్తోకల వ్యాపార సంబంధాలు ముందు ఊహించిన దానికంటే ముందునుండి ఉన్నాయని నిరూపిస్తున్నాయి. ఈ పూరాతత్వ పరిశోధనలలో లభించిన లంగర్లు భారతదేశ పశ్చిమ తీరాలలో అనేక రేవులు, ఓడలు నిలుపు గట్లు మరియు లంగరువేయు కేంద్రాల అవశేషాలు ఉన్నట్లు సూచిస్తున్నా బెట్ద్వారక సమీపంలో అలాంటిగట్లు ఏమీ లేవు. అయినా ఇక్కడ లభించిన రాతి లంగర్లు మాత్రం ఎత్తైన బెట్ద్వరకా సముద్రతీరాలు నౌకలు లంగర్వేసి నిలవడానికి వీలుగా ఉన్నాయని భావిస్తున్నారు. కనుక బెట్ద్వారక

సహజసిద్ధమైన రేవు పట్టణం. ఇక్కడ అధికసంఖ్యలో లభించిన అనేక విధములైన రాతి లంగర్లు పురాతన కాలంలో ఉన్న రేవుపట్టణాలలో బెట్ద్వారక చాలా ప్రముఖమైనదని సూచిస్తున్నాయి. బెట్ద్వారక పరిసరాలు నౌకలుసు రక్షితంగా నిలవడానికి అవకాశం కల్పిస్తూ ఈ నగరాన్ని శక్తివంతమైన సముద్రతరంగాల నుండి రక్షించిందని తెలియజేస్తున్నాయి. సముద్రగర్భంలో ఉన్న ద్వారకా నగరాన్ని చూపడానికి తగిన ఏర్పాట్లు చేయడానికి సన్నాహాలు చేస్తూ ప్రతిపాదన చేయబడింది. గుజరాత్ రాష్ట్ర ప్రభుత్వం మరియు పర్యాటకరంగం ఈ ప్రతిపాదన మీద పని చేస్తున్నారు. రెండు దశాబ్ధాలపాటు జరిగే ఈ ప్రణాళిక పూర్తి చేసుకుంటే అది ప్రపంచంలో ఉన్న మొట్టమొదటి సముద్రాంతర వస్తు ప్రదర్శనశాల ఔతుంది. ఇది ముక్తిప్రద క్షేత్రములలో ఒకటి. సన్నిధికి సమీపముననే గోమతీ నది సముద్రములో సంగమిస్తుంది. అక్కడ నుండి బస్సు మార్గంలో పోయి బేటిద్వారక చేరాలి. ఇది శ్రీకృష్ణుని నివాస స్థలము. ఇచట 1500 నివాస గృహాలు ఉన్నాయి. ఇక్కడ మూలవరులు శంఖచక్ర ధారియై ఉపస్థితమై ఉన్నాడు. దీనికి 5 కి.మీ. దూరమున శంఖతీర్థము ఉంది. ఇక్కడ పెరుమాళ్ళ వక్షస్థలమున శ్రీదేవి ఉపస్థితమై ఉంది. రుక్మిణీదేవి ఉత్సవతాయార్. ఉక్కడ అనేక సన్నిధులు ఉన్నాయి. ప్రతి దినము తిరుమంజనము జరుగును. పసిపిల్లవాని వలె–రాజువలె–వైదికోత్తముని వలె అలంకారములు జరుగుతుంటాయి.

ద్వారక నుండి ఓఖ పోవు మార్గములో 5 కి.మీ. దూరమున రుక్మిణీదేవి సన్నిధి ఉంది. ఇదియే రుక్మిణీ కల్యాణము జరిగిన ప్రదేశము. ద్వారక సమీపమున తోతాద్రి మఠము ఉంది. విరావన్ట్షేషన్లోదిగి 160 కి.మీ. దూరమున గల రైవతక పర్వతమును చేరవచ్చును. ఇచట అనేక సన్నిధులు ఉన్నాయి. కృష్ణావతారమునకు ముందుగానే వెలసిన ప్రదేశంలో శయన భంగిమలో స్వామి ఉపస్థితమై ఉన్నాడు.

## సాహిత్యం

శ్లో. శ్రీగోమతీపుణ్యసరస్తటస్థే(శ్రీద్వారకాఖ్యనగరేవిరాజన్
కల్యాణనారాయణనామధేయ:కళ్యాణదేవ్యాపరిభూషితాఙ్గ:బబ
దివ్యాష్టమహిషీనాథో(ద్రౌపదీదృష్టిగోచర:
హేమకూటవిమానస్థ: పశ్చిమాభిముఖానస:బ
పరాంకుశకలిధ్వంసిగోదావిష్ణుమనస్తుత:బబ

## పాశురాలు

పా. కూట్టిలిరున్దుకిళియెప్పోదుమ్కోవిన్దా! కోవిన్దా! ఎన్న??క్కుమ్
ఊట్టక్కొడాదుశెఱుప్పనాగిల్ఉలగళన్దాన్! ఎన్ఱుఉయరక్కూవుమ్

నాట్టిల్లలైప్ప??యెయ్దియుజ్గళ్నమ్మియి?న్దత?యిడాదే
శూట్టుయర్మాడజ్గళ్యూ??న్దతోన్టుమ్మువరావదిక్కెన్నెయుయ్తుదుమిన్.
ఆణ్డాళ్-నాచ్చియార్తిరుమొ??

## ద్వారక మరియు కుశస్థలి

కుశస్థలి అనబడే ద్వారకా నగరం వాసుదేవ కృష్ణుడి చేత జరాసంధుడి యుద్ధాల నుండి ప్రజలను కాపాడే నిమిత్తం నిర్మించబడింది. యాదవులు మధుర నుండి ద్వారకకును రక్షితంగా తరలించ బడ్డారు. పశ్చిమ తీరానికి తరలివచ్చినఈయాదవనిర్మితఆనందమయనగరంకుశస్థలిఅనిపిలువబడింది. ఈ నగర సమీపంలో రైవతక పర్వతాలు ఉన్నాయి. యాదవులు ఇక్కడకు తరలివచ్చిన తరువాత ఈ నగరకోటను తిరిగి పటిష్ఠంగా నిర్మించి, శత్రు దుర్భేద్యం చేసారు.

శూరసేన సామ్రాజ్యం నుండి యాదవులు వలస వచ్చినట్లు ఇక్కడ సూచించబడినది.

వాసుదేవ కృష్ణుడు ఇక్కడ నివసించడం ఆరంభించిన విషయం సూచించ బడినది.

కుశస్థలిలో దేవతలు సమావేశం జరిపారు. కుబేరుడు విచార వదనాలతో ఉన్న యక్షులను 300 మంది మహాపద్ములను వెంటబెట్టు వివిధ ఆయుధములను పట్టుకుని వచ్చిన విషయం సూచింపబడినది.

## అర్జునుడి విజయం

అర్జునుడు తన 12 మాసాల తీర్థయాత్రా సమయంలో ద్వారకా నగరానికి విజయం చేసి, తన ప్రియనేస్తము, దగ్గరి బంధువు అయిన శ్రీకృష్ణుడిని కలుసుకున్నాడు. అర్జునుడు ఇంద్రప్రస్థం నుండి బయలుదేరి హిమాలయాలకు తీర్థయాత్ర చేస్తూ తూర్పు సముద్రతీరానికి చేరి, అక్కడ నుండి దక్షిణ సముద్ర తీరాలమీదుగా పశ్చిమ సముద్రతీరం వైపు పయనించి, ద్వారకకు చేరి కృష్ణుడిని కలుసుకుని, రైవతక పర్వతానికి తీసుకొని పోబడి, అక్కడి నుండి సమీపంలోని ద్వారక చేరుకున్నాడు.

## రైవత పర్వతం

రైవతకము ద్వారక సమీపంలో ఉన్న వేసవి విడిది. కృష్ణుడు మరియు అర్జునుడు ప్రభాస తీర్థములో కొంత సమయం విహరించి, తరువాత కొంతకాలం నివసించడానికి రైవతక పర్వతం చేరుకున్నారు. వారు రైవతకం చేరే ముందు శ్రీకృష్ణుడి ఆదేశానుసారం రైవతకం ఉత్సవార్థం అలంకరించబడింది. శ్రీకృష్ణుడి ఆదేశానుసారం

అక్కడ కావలసినంత ఆహారం పుష్కలంగా సమీకరించబడింది. వారిని సంతోషపరచడానికి కావలసిన నృత్య గానాదులకు అవసరమైన ఏర్పాట్లు కూడా చేయబడ్డాయి. అర్జునుడు కృష్ణుడితో చేరి నృత్యగీతాలను చూసి ఆనందించి తరువాత కళాకారులను వెనుకకు పంపి అర్జునుడు చక్కగా అలంకరించబడిన అద్భుతమైన మంచముమీద విశ్రమించాడు. మరునాడు ఉదయం వంధి మాగధుల స్తుతులతో బ్రాహ్మణుల దీవెనలతో వీణానాదాల మధ్య అర్జునుడు నిదుర నుండి మేల్కొలుప బడ్డాడు.

## స్వర్ణద్వారకను చూసి నమస్కరిస్తున్న కుచేలుడు

అర్జునుడు స్వర్ణరథంలో యాదవుల రాజధాని అయిన ద్వారకకు చేరుకున్నాడు. అర్జునుడి రాకను పునస్కరించుకుని అతడి గౌరవార్థం ద్వారకను అందంగా అలంకరించారు. పూదోటలను, గృహాలను, వీధులను చక్కగా అలంకరించారు. ద్వారకావాసులు అర్జునుడిని చూడాలన్న ఆతురత వలన పురవీధులలో ఇరువైపులా వేలమంది చేరారు. మిద్దెలు, మేడలు, వసారాలు ప్రజలతో నిండిపోయాయి. వేలకొలది స్త్రీలు కూడా వారితో చేరారు. భోజులు, అంధకులు, వృష్ణులు అర్జునుడికి ఆదరంతో, గౌరవంతో స్వాగతం పలికారు. అర్జునుడు ద్వారకలోని పెద్దలకు నమస్కరించి పూజించి వారి ఆశీర్వాదం పొందాడు. యాదవ యువకులు అర్జునుడిని ప్రేమాభిమానాలతో స్వాగతించారు. అర్జునుడు వారిని ఆదరంతో కౌగలించుకుని, వారి క్షేమసమాచారాలను కనుక్కొన్నాడు. తరువాత అర్జునుడు ఆనందమయమైన కృష్ణమందిరం చేరుకున్నాడు. రత్నమణిమయ భూషితమైన శ్రీకృష్ణమందిరాన్ని చూసిన అర్జునుడు ఆనందించి, అక్కడ శ్రీకృష్ణుడితో కొంతకాలం నివసించాడు.

## రైవత పర్వత ఆరాధన

పర్వతారాధన అనేది యాదవులలో సాధారణ మతపరమైన సంఘటన. వారు శూరసేన సామ్రాజ్యంలో ఉన్న సమయాన గోవర్ధనగిరిని పూజించిన విషయం భాగవతంలో వివరించబడింది. కొద్దిరోజుల అనంతరం భోజక, అంధక, వృష్ణి వంశస్థులు మహోత్సవ సందర్భంగా రైవత పర్వతానికి ఒకటిగా చేరారు. రైవతక పర్వతం బహుసుందరంగా అలంకరించబడింది. తాత్కాలిక విడుదులు ముదురు వర్ణాలు దిద్దబడి మణిమయములతో కృత్రిమ వృక్షాలతో అలంకరించబడింది. వాద్యకారులు వాద్యములను మీటసాగారు, గాయకులు గీతాలాపన చేయసాగారు, నృత్యకారులు నృత్యములు చేయసాగారు. వృష్ణివంశయువకులు చక్కగా అలంకరించుకున్నారు. అన్ని ఆభరణాలను అలంకరించుకుని సుందరంగా కనిపించారు. వారి బంగారు రథములను అధిరోహించి రావడం చూడడానికి ఆకర్షణీయంగా ఉంది.

వేలాది పౌరులు తమ రథముల మీద కాలి నడకన సకుటుంబ బంధుమిత్ర సహితంగా వచ్చారు. (1,222). అర్జునుడు తిరిగి ద్వారక చేరుకున్నాడు. సుభద్ర అర్జునుడిని వివాహమాడింది. అర్జునుడు అక్కడ కొంతకాలం ఉండి, బయలుదేరి పుష్కరక్షేత్రంలో కొంతకాలం ఉండి హస్తినకు చేరాడు.

## రైవత పర్వతము మీద జరిగిన మరొక ఉత్సవం

మణిమయ ఖచితమైన కోశములతో కప్పబడిన అనేక వస్తువులతో రైవత పర్వతం అలంకరించ బడింది. అలంకరించబడిన బంగారు దీపస్తంభాలతో రైవత పర్వతం పగలు రేయి వ్యత్యాసం లేకుండా వెలిగిపోయింది. గుహలు మరియు జలయంత్రాల (ఫౌంటెన్) శోభతో రైవతకం వెలిగిపోయింది. అన్ని వైపులా ఎగురవేయబడిన ధ్వజములకు కట్టబడిన చిరుగంటలు గాలికి నిరంతరం మ్రోగుతూ సంగీతంలా మధురంగా వీనుల విందు చేసాయి. పర్వతం మొత్తం స్త్రీ పురుషుల మాటలతో ప్రతిధ్వనించింది. అనేక దుకాణాలు చక్కగా అలంకరించబడి సుందరమైన వస్తు సముదాయములతో, వివిధ రకములైన ఆహార పదార్థములతో నిండి ఉన్నాయి. దుస్తులు మరియు పూలమాలలు కొండలుగా పోయబడి ఉన్నాయి. ఎక్కడ చూసినా వీణా, వేణు, మృదంగ నాదాలు మారుమ్రోగసాగాయి. ద్రాక్షరసంలో మిశ్రితమైన అనేక విధములైన అహార పదార్థములు అక్కడక్కడా నిలువ చేయబడి ఉన్నాయి. గ్రుడ్డివారికి, అసహాయులకు, అశక్తులకు నిరంతరంగా బహూకరించబడ్డాయి. పర్వతశిఖరం మీద అనేక పవిత్రమైన నిర్మాణాలు నిర్మించబడ్డాయి.

## అర్జునుడు సుభద్రను ఎత్తుకుపోవడం

రైవతక పర్వత ఉత్సములో అర్జునుడి మనసు శ్రీకృష్ణుడి చెల్లెలు సుభద్ర మీద లగ్నమైంది. కృష్ణుడు అర్జునుడికి సుభద్రను తీసుకువెళ్ళడానికి అనుమతి ఇచ్చాడు. అర్జునుడు సుభద్రను తీసుకుపోతుండగా యాదవవీరులు ఆగ్రహించారు. అర్జునుడి చర్యకు ప్రతీకారంగా ద్వారక అప్రమత్తం చెయ్యబడింది. సుభద్రను అర్జునుడు తీసుకువెళ్ళగానే సుభద్ర అంగరక్షకులు ఏడుస్తూ పరిగెత్తుకునిపోయి యాదవ ప్రముఖునికి తెలియజేసారు. యాదవ ప్రముఖుడు స్వర్ణ ధమారం మ్రోగించి సైన్యాలను పిలిచాడు. సైన్యం నాలుగువైపుల నుండి వచ్చి చేరారు. యాదవ ప్రముఖులు తింటున్నవారు తింటున్నట్లు, పానీయములు త్రాగుతున్నవారు త్రాగుతున్నట్లు అలా వారు చేస్తున్న పనులను ఆపివేసి అక్కడకు చేరారు. వృష్ణి, భోజ, యాదవవీరులందరూ సమావేశమై వారి స్థానాలలో కూర్చున్నారు. యాదవ ప్రముఖుడు ఎర్రబడిన నేత్రములతో సుభద్రను తీసుకుపోతున్న అర్జునుడిని అడ్డుకొనమని చెప్పాడు. యాదవవీరులు రోషాకులిత

నేత్రాలతో పైకి లేచి అర్జునుడి దుష్కృత్యాన్ని నిందిస్తూ కొందరు వారి స్వర్ణ ఖచిత రథములను సిద్ధం చేసుకున్నారు, కొందరు సారథులను పిలిచారు, కొందరు ఆయుధములను తీసుకురమ్మని ఆజ్ఞాపిస్తున్నారు, కొందరు తమ బంగారు అంబులను మరియు బలమైన కవచాలను తీసుకురమ్మని చెప్తున్నారు, కొందరు అసహనంగా గుఱ్ఱాలను లేపి, స్వర్ణాభరణ భూషితములైన ఆ అశ్వాలను రథములకు కట్టి వేస్తున్నారు, కొందరు వారి వారి రథకులను పిలుస్తున్నారు. (1,222) తరువాత అర్జునుడు ద్వారకకు తీసుకురాబడి సుభద్రతో వివాహం జరిపించారు. వారిరువురు బయలుదేరి పుష్కర్లో కొన్నిరోజులు ఉండి చివరకు హస్తినకు చేరుకున్నారు.

## ద్వారక మరియు రైవతకము మీద శిశుపాలుడి దండయాత్ర

శ్రుతశ్రవుడి పుత్రుడు వసుదేవుడి మేనల్లుడు శిశుపాలుడు. శిశుపాలుడు పాండవులవలె శ్రీకృష్ణుడికి మేనత్త కుమారుడైనా, పాండవులకు శ్రీకృష్ణుడిమీద భక్తి పూర్వక ప్రేమాభిమానాలు ఉన్నాయి. కాని శిశుపాలుడికి కృష్ణుడి మీద శత్రుత్వం ఉండేది. శ్రీకృష్ణుడు తన సైన్యాలతో ప్రాగ్జ్యోతిషపురంలో ఉన్న సమయంలో శిశుపాలుడు ద్వారకను తగుల బెట్టాడు. ఆ సమయంలో భోజకరాజు రైవత పర్వతంమీద ఉత్సాహంగా కాలం గడుపుతున్నాడు. శిశుపాలుడు ఆ రాజుమీద దండయాత్ర చేసి, అతడి అంగరక్షకులను చంపి, మిగిలినవారిని గొలుసులతో బంధించి తన నగరానికి తీసుకుపోయాడు.

## ద్వారకమీద సాళ్వుడి దండయాత్ర

ద్వారకమీద సాళ్వుడి దండయాత్ర పెద్ద వివాదాంశం అయింది. సాళ్వుడి దాడి సంశయం లేకుండా వాయు మార్గంలో జరిగిన దాడి. చరిత్రకారులు ఈ దాడిని నౌకాదళం శైలిలో జరిగిన వాయు మార్గదాడిగా భావిస్తున్నారు. ఉదాహరణగా సాళ్వుడి ఎగిరే రథం అనే వాయు వాహనం సౌవావాస్తవానికి ఒక యుద్ధనౌక. వివరణలు: ద్వారకా నగరం సముద్ర పరివేష్టితమైన ఒక ద్వీపమని భావించబడుతుంది. ఇంద్రప్రస్థంలో ధర్మరాజు చేసిన పవిత్ర రాజసూయ యాగం సందర్భంలో శిశుపాలుడు శ్రీకృష్ణుడి చేతిలో వధించబడిన కారణంగా శిశుపాలుని సోదరుడిగా భావిస్తున్న సాళ్వుడు ఆగ్రహంతో కాలిపోతూ ద్వారక మీద దండెత్తాడు. సాళ్వుడు విలువైన లోహంతో నిర్మించిన సౌవా (ఈ రథాన్ని సౌభ అని కూడా అంటారు. సౌభ పేరుతో ఒక నగరం కూడా ఉంది) రథంలో ద్వారకను చేరి వృష్ణివీరులను వధించి ద్వారకా నగరంలోని పూలతోటలను ధ్వంసం చేసాడు. అతడు అనర్త దేశీయులను (అనర్త ఒక గొప్ప దేశం అని దానికి రాజధాని అని తెలుస్తుంది) కృష్ణుడి గురించి అడిగాడు. సాళ్వుడు

తన విలువైన లోహరథంతో ఆకాశంలోకి ఎగిరాడు అని వర్ణించబడింది. ఆ వాహనం పేరు మతికగా పేర్కొనబడింది. ఆ వాహనం మనసుతో తలచిన రీతిగా నడుస్తుందని వర్ణించబడింది. (3,14)

## ద్వారక రక్షణ

సాళ్వుడు తన సైన్యాలను సిద్ధ పరచి, ద్వారకానగర పైభాగాన నిలిచి ద్వారక సైన్యాలతో పోరాడ సాగాడు. ఆయుద్ధంలో వారు ద్వారక మీద నలువైపుల నుండి బాణవర్షం కురిపించారు. ఆ సమయంలో చక్కని రక్షణ వలయంలో ఉంది. చక్కని ఆర్చీలు, బురుజులు, యుద్ధోత్సాహులైన వృష్టివీరులు, భేరీలు, మృదంగాలు, శంఖాలు, యుద్ధానికి సిద్ధంగా రెండువైపులా చెక్కతో చేసిన గోడలను నిలిపిన వీధులు, అక్కడక్కడా ఏర్పాటుచేసిన ద్వారాలు, పుష్కలంగా సమకూర్చబడిన ఆహారపదార్థాలు, ఆయుధములను విసరడానికి ఉపయోగించబడే యంత్రాలు, పాత్రలు, తోలుతిత్తులు, కత్తులు, కటారులు, బల్లెములు, వేడిద్రవాలు, మందుగుళ్ళు, వదునైన గొడ్డళ్ళు. పటిష్ఠమైనచక్కటిరథాలుసిద్ధంగాఉన్నాయి. యాదవవీరులు (గద, సమ్వ, ఉద్ధవ) వారికి వారు అధికార స్థానాలలో నిలిచారు. సైన్య సమేతంగా యాదవవీరులు యుద్ధసన్నద్ధులై నగర రక్షణ కొరకు నిలిచారు.

## నగరవాసులను అప్రమత్తులను చేయుట

నిర్లక్ష్యాన్ని అడ్డగించడానికి ఉగ్రసేనుడు, ఉద్ధవుడు నగరవాసులను మత్తుపానీయాలను సేవించరాదని నియమం విధించాడు. వృష్టి, అంధక వీరులకు తాము మత్తులో ఉంటే వధించ బడతామని తెలుసు. రాజసేవకులు గాయకులను, నృత్యకారులను, మిగిలిన కళాకారులను నగరం నుండి పంపి వేసారు. నదులమీద ఉన్న వంతెనలను పడగొట్టారు. పడవలను నడపడం ఆపివేసారు. వాటిని కట్టివేసారు. గుంటలను త్రవ్వి అక్కడక్కడా రంధ్రములను ఏర్పాటుచేసి సైనికులు అక్కడ రహస్యముగా నిలిచి నగర రక్షణ కర్తవ్యములో మునిగిపోయారు. సహజంగా పటిష్ఠమై చక్కని రక్షణ వలయములో ఉండే ద్వారకా నగరం, ఇప్పుడు ఆయుధములతో సమృద్ధమై ఉంది. చక్కని వ్యూహముతో నగరం శత్రువును ఎదుర్కొనడానికి సిద్ధం అయింది.

## పటిష్టమైన భద్రతా ఏర్పాట్లు

సాళ్వుడు ద్వారకలో ప్రవేశించగానే ద్వారకలో ప్రవేశించేవారుగాని ద్వారక నుండి వెలుపలికి వెళ్ళేవారుగాని లేకపోవడం గ్రహించాడు. వీధులన్నీ ఏనుగులతో, అశ్వములతో నిండి ఉన్నాయి. యుద్ధవీరులకు కావలసిన సదుపాయములు

జీతభత్యములు ఇవ్వబడ్డాయి. వారికి అహారపదార్థాలు, ఆయుధములు, దుస్తులు ఇవ్వబడ్డాయి. సైన్యంలో స్వర్ణమును జీతంగా ఇవ్వబడనివారు లేరు, సైన్యంలో అలసినవారుకాని, పిరికివారు కాని ఎవరూ లేరు. ఆహుకుని చక్కని నిర్వహణలో సైన్యము యుద్ధసన్నద్ధం అయి ఉంది.

## సాళ్వుడి సైన్యము విడిది చేయుట

సౌభరాజుసాళ్వుడు తన కాల్బలములను, అశ్వదళాలను, గజదళములను స్వయంగా నాయకత్వం వహిస్తూ తన చతురంగబలములతో భూమార్గంలో పయనించి పుష్కలమైన నీరు ఉన్న మార్గాలలో పయనిస్తూ శ్మశానాలను, ఆలయములను, పవిత్రమైన వృక్షరాజాలను మరియు చీమల పుట్టలు కలిగిన భూములను దాటుకుంటూ ద్వారకవైపు దండయాత్రకు వచ్చి విడిది చేసాడు. సాళ్వుడు అన్ని విధములైన ఆయుధములను, విస్తారమైన రథాలతో, కాల్బలములకు చక్కగా జీతభత్యములు సమకూర్చి చక్కగా ఆహారాలను అందించి, చక్కగా పోషించబడిన యుద్ధోత్సాహంతో అలంకరించిన రథములలో సిద్ధంగా ఉన్నారు.

## ద్వారక వెలుపలి యుద్ధం

చారుధేష్ణుడు, సాంభప్రద్యుమ్నుడు మొదలైన రాజకుమారులు యుద్ధోత్సాహంతో సాళ్వుడిని ఎదుర్కొన్నారు. ధ్వజములతో ఎగురుతున్న రథములతో ఆయుధములను నింపుకుని సాళ్వుడిని ఎదుర్కొనడానికి నిశ్చయించుకుని రాజకుమారులు బయలుదేరి సాళ్వుడి సైన్యశిబిరాలను చేరుకున్నారు. సాంభుడు సాళ్వుడి సైన్యాధ్యక్షుడైన క్షేమవర్ధిని తరిమికొట్టి వేఘవంతుడి నివధించాడు. చారుధేష్ణుడు వివిధాన్యుడిని వధించాడు. సాళ్వుడు ప్రద్యుమ్నుడిని ముందు ఓడించాడు. సారధి; ప్రద్యుమ్నుడిని అక్కడనుండి తీసుకుపోయి ప్రద్యుమ్నుడు కోలుకున్న తరువాత తిరిగి సాళ్వుడిని ఎదుర్కొనడానికి తీసుకువచ్చాడు. ప్రద్యుమ్నుడు సాళ్వుడిని ఓడించి తరిమికొట్టాడు. శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థము నుండి ద్వారకలో ప్రవేశించగానే ఎక్కడా వేదధ్వనులు, యజ్ఞయాగములు లేకపోవడం చూసి ధ్వంసం చేయబడిన పూలతోటలు చూసాడు. ద్వారకానగరం శోభావిహీనంగా కనిపించింది. నగరమంతా విరిగిన ఆయుధములు అక్కడ యుద్ధం జరిగిన విషయం సూచిస్తుంది. (3-16,17, 181, 191, 20).

## సాళ్వుడితో శ్రీకృష్ణుడి యుద్ధం

శ్రీకృష్ణుడు రథ, గజ, తురంగ, కాల్బలసహితమైన సైన్యములను తీసుకువెళ్ళి అనేక దేశములను దాటి, వృక్ష సముదాయముల సహితమైన పర్వతములను దాటి,

నీటి మడుగులను, సెలయేళ్ళను దాటి చివరకు మృతి కావర్తమును (మృత్తిక) చేరాడు. శ్రీకృష్ణుడికి సాళ్వుడు తన విలువైన లోహములతో చేయబడిన రథముతో సముద్రపు ఒడ్డున నిలిచి ఉన్నాడని తెలుసుకున్నాడు. శ్రీకృష్ణుడు సైన్యములతో అక్కడకు చేరుకున్నాడు. సాళ్వుడు అపారంగా బాణవర్షాన్ని కురిపించాడు. శ్రీకృష్ణుడు వాటిని లెక్కచేయకుండా సాళ్వుడిని ఎదుర్కొన్నాడు. కృష్ణుడు వేసే బాణాలు సాళ్వుడిని చేరలేదు. రెండు యోజనముల దూరంలో సాళ్వుడి జాడ కూడా కనిపించకపోవడంతో శ్రీకృష్ణుడి సైన్యాలు కేవలం ప్రేక్షకపాత్ర వహించాయి. కృష్ణుడు వేసిన బాణాలు సాళ్వుడి రథాన్ని రక్షిస్తున్న దానవుల శరీరాలను చీల్చిన కారణంగా వారు శరాఘాతాలకు గాయపడి సముద్రంలో మునిగిపోయారు. దానవులు వారి ఆయుధాలను కోల్పోయి కవచములు చీలి పెద్దగా రోదిస్తూ సముద్రంలో పడగానే సముద్రంలోని మృగాలు వారిని మింగసాగాయి. అది చూసిన సాళ్వుడు మాయాయుద్ధం మొదలుపెట్టాడు. సాళ్వుడు కృష్ణుడి మీద అనేక క్రూర ఆయుధములను వేశాడు. శ్రీకృష్ణుడు వాటిని లక్ష్యపెట్టక యుద్ధాన్ని కొనసాగించాడు. యుద్ధం ఘోర రూపుతాల్చింది. చివరకు సాళ్వుడు కొండ శిఖరాన నిలిచి శ్రీకృష్ణుడితో ద్వంద్వయుద్ధానికి తలపడ్డాడు. అప్పుడు అక్కడ హఠాత్తుగా చీకట్లు, వెలుగులు నిరంతరం మారి మారి కమ్ముకున్నాయి. పగలు కొంతసేపు ప్రకాశవంతంగాను, కొంతసేపు మబ్బు కమ్ముకున్నట్లుగాను, కొంత సమయం వేడిగాను, కొంత సమయం అత్యంత చలిగాను మారి మారి ఉండసాగింది. తరువాత నిప్పులు వర్షంగా రాలసాగాయి, తరువాత బూడిద వర్షంగా రాలసాగింది, తరువాత అయుధ వర్షము సాగింది. ఆకాశము కప్పు చీల్చుకుని నూరుసూర్యులు వచ్చినట్లు నూరుచంద్రులు వచ్చినట్లు పదివేల తారకలు వెలిగినట్లు ప్రకాశించసాగింది. పగలేదో రాత్రి ఏదో గుర్తించ శక్యము కాలేదు. ఆ ప్రదేశం అంతా వింత పరిస్థితిలో మునిగిపోయింది. అప్పుడు శ్రీకృష్ణుడు ప్రజ్ఞాస్త్రంసంధించి ప్రయోగించాడు.

## సాళ్వుడు చేసిన మాయ

శ్రీకృష్ణుడి సేవకుని రూపంలో ఒక సేవకుడు కృష్ణుడిని సమీపించి తాను ద్వారకనుండి వచ్చానని ఆహుకుడు సందేశం పంపాడని చెప్పాడు. దిగులుగా దుఃఖిస్తూ "దేవా! అహుకుడు ఇలా చెప్పాడు "కృష్ణా ! నీవులేని సమయం చూసి సాళ్వుడు కొంతసైన్యంతో ద్వారకకు వచ్చి మీ తండ్రిగారైన వసుదేవుడిని సంహరించాడు. ఇక యుద్ధంతో పనిలేదు కనుక నువ్వు యుద్ధం ఆపి ద్వారకను రక్షించే బాధ్యతను స్వీకరించు" అని చెప్పాడు. ఈ అబద్ధపు సమాచారమునకు కొంతసేపు విస్మయం చెందినా, కొంతసేపటికి కోలుకొని, అది రాక్షస మాయ అని గ్రహించి, యుద్ధాన్ని కొనసాగించాడు.

## శ్రీకృష్ణుడు సాళ్వుడిని సంహరించుట

ఈ అఖరియుద్ధం సముద్ర మధ్యమందు ఉన్న ద్వీపాలలో జరిగినట్లు ఉంది. సౌభానగరం ద్వీపంలో ఉన్నట్లు ఉంది. సాళ్వుడి సైన్యాలు శ్రీకృష్ణుడి మీద బండరాళ్ళను దొర్లించినట్లు వర్ణించబడింది. శ్రీకృష్ణుడు వాటిని శక్తివంతమైన అస్త్రశస్త్రములతో ఎదుర్కొన్నాడు. సాళ్వుడి రథము చూపులనుండి తొలగిపోయింది. శ్రీకృష్ణుడు సుదర్శన చక్రాన్ని ప్రయోగించాడు. చివరగా సాళ్వుడు గధా యుధాన్ని ప్రయోగించాడు. సుదర్శన చక్రం సాళ్వుడిని చీల్చింది. తుట్టతుదకు మహావీరుడైన సాళ్వుడు వధించబడ్డాడు. దానవ స్త్రీలు భయముతో హాహాకారాలు చేస్తూ నలుదిశలా పారిపోయారు. శ్రీకృష్ణుడు తన రథమును సౌభానగరం ముందు ఉంచి పాంచజన్యమును పూరించి విజయధ్వానం చేసాడు. మిగిలిన సైన్యాలను సమూలంగా నాశనం చేసి సౌభానగరంలో ప్రవేశించి మేరు పర్వతం వంటి ఆ నగరాన్ని ధ్వంసం చేసి తగులబెట్టాడు. దానవులు భయంతో నగరం విడిచి పారిపోయారు. సాళ్వుని వధించి సౌభానగరాన్ని ధ్వంసం చేసి శ్రీకృష్ణుడు సైన్యాలతో విజయోత్సాహంతో అనర్తకు చేరాడు. (3,22) చాలామంది చరిత్రకారులు శ్రీకృష్ణుడితో సముద్రం మీదలేక ఆకాశంలో నుండి యుద్ధం చేసిన వీరుడు మృత్తికావర్తం (మట్టి లేక ఇసుకతో పర్యవేష్టితమై ననగరం) నగరానికి చెందిన సాళ్వుడు కాదు అని అభిప్రాయపడుతున్నారు. మటిక, మర్తిక, మృత్రికావతి మొదలైన పేర్లతో పిలువబడిన సాళ్వుడి రాజధాని అయిన మృత్తికావర్త నగరం రాజస్థాన్లో ఉందని అది మద్ర దేశానికి నైరృతిలోనూ విరాటుడు పాలించే మత్సదేశానికి పశ్చిమంగానూ ఉందని భావించబడుతుంది. శిశుపాలుడి మరణానికి ప్రతీకారం సాధించడానికి సాళ్వుడు ద్వారకమీద దండెత్తి ప్రద్యుమ్నాదులను ఎదుర్కొన్నాడు. సముద్రంమీద యుద్ధం చేసిన శత్రువు సాళ్వుడి చేత ప్రేరేపించబడిన మరియొ కడై ఉండవచ్చని అభిప్రాయపడుతున్నారు. శ్రీకృష్ణుడు మృత్తికావర్త నగరానికి చేరుకున్నప్పుడు అక్కడ తెలుసుకున్న సమాచారాన్ని అనుసరించి తిరిగి సముద్రాన్ని చేరుకుని అక్కడ యుద్ధము చేసి శత్రుసంహారం చేసాడని ఆ శత్రువు సముద్రము మీద నివసించే దానవుడని మరియు అసురులు వేరొక సంస్కృతికి చెందినవారై ఉంటారని భావించబడుతుంది. వారు ద్వారకను అరేబియా ఖండం సమీపంలోని ద్వీపం నుండి వచ్చి ఉంటారని సాళ్వుడు అన్న పేరుకు వైతుకు సంబంధించి ఉండవచ్చని అభిప్రాయపడుతున్నారు.

## ద్వారక మీద పాండ్యుల పగ

పాండ్యులరాజు సారంగధ్వజుడు. వాసుదేవ కృష్ణుడు వారి దేశం మీద దండెత్తినప్పుడు అతడి బంధువులందరూ పారిపోయారు. ఆయన తండ్రి ఒక యుద్ధములో కృష్ణుడిచేత చంపబడ్డాడు. భీష్ముడు, ద్రోణుడు, భార్గవరాముడు మరియు

కృపాచార్యుడు మొదలైన వారి వద్ద నుండి పొందిన ఆయుధాల కారణంగా అతడు అయుధ సంపత్తిలో రుక్మి, కర్ణుడు, అర్జునుడు మరియు కృష్ణుడు మొదలైనవారికి సమానుడయ్యాడు. ఆ కారణంగా అతడు ద్వారకను జయించి మిగిలిన ప్రపంచాన్ని జయించాలని అనుకున్నాడు. ఆయన హితైషులు అతడి హితము కోరి అతడిని అలాంటి ఆలోచనలు వినాశకరమైనవని చెప్పి అతడి మనసు మార్చారు. ఆయన మనసు మార్చుకుని తన రాజ్యాన్ని పాలించాడు. (7,23) తరువాతి కాలంలో ఆయన కురుక్షేత్ర యుద్ధంలో పాండవ సేనలకు సహకరించి యుద్ధం చేసాడు.

## ద్వారక సముద్రంలో మునుగుట

ద్వారకా నగరం మునిగిపోవడం గురించిన వర్ణన మహాభారతంలోని 16వ పర్వమైన మౌసల పర్వములో వర్ణించబడింది. (మౌసలపర్వము)

రోజురోజుకు బలవత్తరమైన గాలులు వీచసాగాయి. కుండలు మృణ్మయ పాత్రలు అకారణంగా పగల సాగాయి. చంద్రుని చుట్టూ ఒక వలయంవంటి ప్రకాశం ఏర్పడింది. చతుర్ద శిలోగ్రహణం ఏర్పడింది. మహాభారత యుద్ధ సమయంలో కూడా గ్రహణం ఏర్పడినట్లు ఊహించబడుతుంది. కురుక్షేత్ర యుద్ధం జరిగి 36వ సంవత్సరం ఆరంభమయింది. ఈ సూచనలను గ్రహించిన శ్రీకృష్ణుడు యాదవులను సమావేశపరచి అందరిని పవిత్ర సముద్రస్నానం చేయడానికి వెళ్ళమని ఆదేశించాడు. యాదవులందరూ సకుంటుంబంగా ప్రభాసతీర్థానికి వెళ్ళి అక్కడ తాత్కాలిక నివాసాలను ఏర్పరచుకున్నారు. విస్తారమైన ఆహారపదార్థాలు మత్తుపానీయాలను తీసుకువెళ్ళారు. బ్రాహ్మణ సంతర్పణ కొరకు తయారుచేసిన అహారాన్ని కోతులకు పెట్టారు. యాదవవీరులు మత్తుపానీయాలను త్రాగి మత్తెక్కి ఉన్నారు. అప్పుడు సాత్యకి మరియు కృతవర్మ మధ్య కురుక్షేత్ర యుద్ధంలో జరిగిన పొరపాట్ల గురించిన ఒక వివాదం తలెత్తి అది తీవ్రమై పగ చెలరేగింది. ఆ వివాదంలో ఒకరిని ఒకరు చంపుకుని చివరకు యాదవులు నిశ్శేషమైనారు. కృష్ణుడి ఆదేశానుసారం ద్వారకకు వచ్చిన అర్జునుడు అక్కడి ప్రముఖులకు "ద్వారక ఇక ఏడురోజులలో మునిగిపోతుంది" అని చెప్పాడు. తరువాత శ్రీకృష్ణుడి మనుమడైన వజ్రుడు ఇంద్రప్రస్థానికి రాజయ్యాడు. అర్జునుడు ద్వారకకు వెళ్ళి యాదవులకు శ్రీకృష్ణ బలరాములతో సహా అంత్యక్రియలు నిర్వహింపజేసి, ద్వారకా వాసులను నగరాన్ని ఖాళీ చేయించి వారి సంపదలను వాహనములకు ఎక్కించి ద్వారకను దాటి వెనుదిరిగి చూసే సమయానికి మెల్ల మెల్లగా ద్వారక నీటమునగడం స్వయంగా ద్వారకా వాసులతో సహా దర్శించాడు. ద్వారకావాసులు హాహాకారాలు చేసి తరువాత హస్తినకు బయలుదేరారు. పాండవులు మహాప్రస్థాన సమయంలో మునిగిపోయిన ద్వారక ఉన్న ప్రదేశాన్ని దర్శించారు.

## సమీప కాల పురావస్తు పరిశీలన

ద్వారకా నగర పరిశోధనలు నిర్మాణపరమైన విషయాలను వెలికి తీయడమే కాక, సంస్కృతి గురించిన విషయాలను తెలుసుకోవడానికి ప్రాముఖ్యత ఇచ్చింది. అక్కడ లభించిన మృణ్మయపాత్రల వయసును అనుసరించి మిగిలిన విషయాల కాలనిర్ణయం చేయడానికి ఉపకరిస్తుంది. బెట్ద్వారకలోని మృణ్మయపాత్రలు క్రీ.పూ 3,500 సంవత్సరాల నాటివని నిర్ణయించ బడింది. భవిష్యత్తులో జరగబోయే పరిశోధనలు పురాతన భారతదేశంలోని ఇతర నగరాల గురించిన విషయాలను వెలుగులోకి తీసుకురావచ్చు. వరదలలో మునిగిపోయిన ఇంద్రప్రస్థము మరియు పాటలీపుత్రము వంటి నగరాల గురించిన విశేషాలు కూడా వాటిలో కొన్ని.




అర్కియాలాజి కల్సర్వే ఆఫ్ ఇండియా (ఇది ప్రస్తుతం నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఓషనోగ్రఫీ పేరుతో గోవాలో ఉంది) పేరుతో ఎస్ అ ర్రావు ఆధ్వర్యంలో చేపట్టిన అనేక పరిశోధనలు ఈ విషయాలను వెలుగులోకి తీసుకు వచ్చాయి. కథల్లోను, కావ్యాల్లోను నిజమైన ప్రదేశాల పేర్లను పేర్కొనడం ఎక్కువమంది రచయితల్లో కనిపించే లక్షణం. రచయిత చనిపోయిన లక్షల సంవత్సరాల తర్వాత త్రవ్వకాల్లో బయల్పడిన ఆ రచయిత వ్రాతల ప్రకారం పరిశొధిస్తే ఆ ప్రదేశాలు అలాగే ఉంటాయని, తరువాత ఎవరైనా ఆ వ్రాతలు చదివినప్పుడు అందులోని కథ నిజంగా జరిగినట్లు అనిపిస్తుందని అభిరాయమున్నది.

## ఉల్లేఖన అవసరం

క్రీస్తు పూర్వం 2000 సంవత్సరాల వరకూ ఆర్యుల భాష అయిన సంస్కృత భాష భారతదేశంలో లేదని, మహాభారత కావ్యం వేదకాలం తర్వాత, అనగా సుమారు క్రీస్తు పూర్వం 800–క్రీస్తు పూర్వం 500 సంవత్సరాల మధ్య ఆర్యుల తెగకు చెందిన వేదవ్యాసుడు అనుకవి రచించిన కావ్యము అని, మహాభారతములోని సన్నివేశాలు కల్పితాలు అని, హిందువులకు తమ మతముపై యున్న గట్టి విశ్వాసాలే కల్పిత కావ్యాన్ని చరిత్రగా చేశాయని పరిశోధకుల భావన. గుజరాత: రాష్ట్రంలో ఇటీవల ద్వారకా నగరం వద్ద అరేబియా సముద్రతీర గర్భంలో బయల్పడిన ఓడరేవు క్రీస్తు పూర్వం 3000 సంవత్సారాల నాటిదని, అది సింధూ (హరప్పా) నాగరికతకు చెందినది అని, ఆ కాలంలో భాషకు లిపిలేదని పరిశోధనలు తెలుపుతున్నాయి.

[1] శ్రీకృష్ణభగవానుడి ద్వారకా నగరం తెలియనివారుండరు కదా? మహాభారతము,

భాగవతము, స్కంద, హరివంశ పురణాము, వాయుపురాణములలో ద్వారకా క్షేత్రానికి సంబంధించిన ఎన్నో పురాణగాథలు వున్నాయి. శ్రీకృష్ణ భగవానుడు తన అవతారం చాలించేముందు ఎక్కువ సమాయాన్ని ద్వారక క్షేత్రంలో గడిపాడట. జరాసంధుడు కాలయవనునితో కలసి మధురపై దాడికి దిగడంతో, యాదవుల రక్షణకోసం ఆయన గుజరాత్‌లోని సౌరాష్ట్రంలోని తీరప్రాంతానికి వెళ్ళాడు. ఈ సముద్రతీరంలో ఒక కోటను నిర్మించాడు. కృష్ణపరమాత్మ అవతారాం చాలించినప్పుడే ద్వారకా కూడా సముద్రం గర్భంలో మునిగిపోయిందట. ద్వాపర యుగ అవశేషాలు ఇంకా త్రవ్వకాలలో బయటపడుతూనే ఉన్నాయి. మునిగిపోయిన ద్వారకానగరం గురించి ఇంకా అనేక పరిశోధనలు జరుగుతూనే ఉన్నాయి. ద్వారకలోని ముఖ్య మందిరాలలో "రణచోడ్రాయ్" (ద్వారకాధీశ మందిరమని) ప్రముఖమైనదిగా చెప్పబడుచున్నది. ద్వారకాధీశ మందిరానికి దక్షిణాన "త్రివిక్రమ" మందిరం, ఉత్తరాన "ప్రద్యుమ్న" మందిరం ఉన్నాయి. బేట్ద్వారక, సుదామాపురి, దీనిని ఇప్పుడు పోరుబందర్ అని పేరుతో పిలుస్తున్నారు. మహాప్రభు వల్లభాచార్యులు, శ్రీరామానుజులు ద్వారకా నగర సందర్శనం చేశారు.

## స్వర్ణద్వారకలో శ్రీకృష్ణుడు

ఇతిహాస కాలంనాటి భారతదేశ ప్రదేశాలు వేదవ్యాసుడు సంస్కృత భాషలో వ్రాసిన మహాభారతం అను కావ్యంలో ద్వారకా నగరం ద్వారావతిగా పిలువబడింది. ఈ నగరానికి అనేక ద్వారాలు ఉండడమే ఇందుకు కారణం. సంస్కృత భాషలో ద్వారం అంటే తెలుగులో వాకిలి లేక ద్వారం అని అర్ధం. కనుక రెండు కారణ నామాలు ఈ నగరానికి చక్కగా వర్తిస్తాయి. అనార్తా సామ్రాజ్యాధీశులైన యాదవులకు ద్వారక రాజధాని. గుజరాత్ రాష్ట్ర పశ్చిమ తీరాన ఉన్న ఈ నగరం సముద్ర జలాలవలన ముంచి వేయబడింది. సంస్కృత మహాభారత కావ్యం ప్రకారం ఈ నగరం కురుక్షేత్ర యుద్ధం జరిగిన 16 సంవత్సరాల అనంతరం సముద్రగర్భంలో కలిసిపోయింది. మగధ రాజైన జరాసంధుడి దండయాత్రల నుండి ప్రజలను సురక్షితంగా కాపాడడానికి శూర సామ్రాజ్యానికి చెందిన యదు ప్రముఖులు సముద్రగర్భంలో ఉన్న ద్వీపాల సమూహాలను ఎంచుకుని, ఈ నగర నిర్మాణ కార్యక్రమాన్ని చేపట్టి, పూర్తి చేసి, ప్రజలను శూరసేన సామ్రాజ్యపు రాజధాని మధుర నుండి ద్వారకకు తరలించారు. ఈ ప్రదేశం అనర్త సామ్రాజ్యంలో ఒక భాగం. ద్వారకా నగరాన్ని సామ్రాజ్యము అనేకంటే సంయుక్త రాజ్య సమాహారం అనటం సమంజసం. అంధకులు, వృష్టులు, భోజులు ఈ రాజ్య సమాహారంలోని అంతర్భాగాలు. ద్వారకను పాలించిన యాదవులు దశరా స్మరియు మధవులు అని కూడా పిలువబడ్డారు. ద్వారకలో నివసించిన యాదవ ప్రముఖులలో ముఖ్యులు వాసుదేవకృష్ణుడు మరియు బలరాముడు, సాత్యకి, కృతవర్మ, ఉద్దవుడు,

అక్రూరుడు మరియు ఉగ్రసేనుడు. వేరావాల్లో బ్రహ్మకుండం,హాటకేశ్వరం జలేశ్వరుడు చూడచ్చు. అంది గ్రామానికి ఇరవై కిలోమీటర్లలో గుప్త గంగ, దీనికి దగ్గరలో గౌతమ ఆశ్రమం, ముప్పై కిలోమీటర్లలో ధన్వంతరి ఆలయం, నలభై అయిదులో కామనాదా లయంలను దర్శిస్తే ప్రభాసతీర్ధ యాత్ర సంపూర్ణం అయినట్లు.

మేము 2001లో మహర్నవమి నాడు సోమనాథ్ దర్శనం పొద్దున్న ఐదు గంటలకు ఆలయం చేరుకొని స్వామి దర్శించాము. నేను కూర్చొని అక్కడే ఆలయంలో నమ్మకంచమకం చదివాను. అప్పుడే ఉదయం హారతి చూసాము. దాదాపు గంట ఆలయం చూసి బయటకు వచ్చాము. మేము వచ్చిన తరువాత ప్రజలు బారులు తీరి ఉన్నారు. ప్రక్కనే ఉన్న పాత ఆలయం. నాట్య మంటపం చూసాము.

సాయంత్రం బీచ్‌కి వెళ్లి, విద్యుత్కాంతిలో ధగ ధగ మనే దేవాలయం చూసి రాత్రికి ద్వారకా బయలుదేరాము. తర్వాతి రోజు ఎనిమిది గంటలకు ద్వారక చేరి హోటల్లో స్నానంచేసి ఆలయం చేరుకొన్నాము. ఆలయం కింద మెట్లు దిగితే గోమతి నది. ఇక్కడి పూజారులు (పంత్)లో రంగు రంగుల వస్త్రధారణతో కృష్ణుని వేషధారణ చేసి మనలను అలరిస్తారు. ఆంధ్రా, తమిళనాడు నుంచి వచ్చిన భక్తులతో ఆలయం నిండింది. క్యులైన్లో నుంచొని 2 సార్లు దర్శనం చేసుకొని మండపంలో కూర్చొని 11 గంటలకు బెట్ద్వారకకు వాన్లో నాగనాధ్జివుని దర్శించి అక్కడి నుండి బోట్ద్వారా సముద్రంలో ఉన్న బెట్ద్వారక చేరిరాత్రి 6 గంటలకు ద్వారక మళ్ళీ విజయదశమి రోజు విశేష అలంకారంతో ఉన్న స్వామిని దర్శించాము. దాదాపు వెయ్యి రకాల స్వీట్స్ ఆలయ గర్భాలయంలో చేసిన అలంకారం కన్నుల పండుగా ఉన్నది. ఇప్పటికి దసరా రోజున అదే మనసులో తలంపుకు వస్తుంది.

శీఘ్రమే శ్రీ సోమనాధ ప్రభాస తీర్ధ సందర్శన ప్రాప్తి రస్తు.



## అక్షరధాం అనే స్వామి నారాయణ దేవాలయం

### అక్షరధాం

స్వామి నారాయణ సంప్రదాయంలో గుజరాత్‌లోని అహ్మదాబాద్ దగ్గర కాలూపూర్‌లో ఉన్న అక్షరధాం అనే

స్వామి నారాయణ దేవాలయం మొదటిది. ఈ సంప్రదాయ స్థాపకులు స్వామి నారాయణ భగవాన్ ఆదేశంపై నిర్మింపబడింది. ఈ ప్రదేశాన్ని బ్రిటిష్ ప్రభుత్వం అందజేస్తే స్వామినారాయణ గారు ఆనద స్వామికి అప్పగించారు. బర్మా టేకుతో కట్టిన ఆలయం బ్రిటిష్ ఆఫీసర్ సర్ డన్లప్ ఈ సంస్థ కార్యక్రమాలకు సేవానిరతికి సంతసించి 5వేల ఎకరాల భూమిని అందజేశాడు. ఆలయ నిర్మాణం పూర్తికాగానే సంతోషంతో ఆయన వచ్చి 101తుపాకులతో ఆలయానికి 'గన్ సెల్యూట్' చేయించి అపూర్వ గౌరవం కలిపించాడు. ప్రభుత్వం ఇక్కడ రైల్వేస్టేషన్ కట్టాలని భావిస్తే దేవాలయ భూమిలో కొంతభాగం ట్రస్ట్ బోర్డ్ ఇచ్చింది. ఇక్కడి దేవాలయం రంగులు నగిషీలు చూస్తే 'ఫైరీటేల్'లా అనిపిస్తుందని విశ్లేషకులు అన్నారు. దీపావళి వేళ్ళిన మర్నాడు పది లక్షలమంది భక్తజనం సందర్శిస్తారు.

ఆలయంలో స్వామి నారాయణ భగవాన్ విగ్రహంతోపాటు రాధాకృష్ణ, నరనారాయణ, ధర్మభక్తిమాత, హరికృష్ణ మహారాజ్, శ్రీ భాయి స్వరూప్ ఘన శ్యాం మహారాజ్, శ్రీ రంగామోహన్ ఘనశ్యాం మహారాజ్ విగ్రహాలున్నాయి. మరాఠా రాజస్థాన్ గుజరాత్ శిల్ప శైలి అబ్బుర పరుస్తుంది. గ్రౌండ్‌ఫ్లోర్‌లో స్వామినారాయణ వాడిన వస్తువులు ఉంటాయి. దీనినే అక్షరా భవన్ అంటారు. స్వామి నారాయణ ఇక్కడికి వచ్చినప్పుడు బసచేసే దాన్ని రంగ్ మహల్ అంటారు. ఆలయానికి పడమర హవేలీ ఉంటుంది. ఇందులో సాంఖ్య యోగినులు ధ్యానం చేసుకొంటారు. ఉత్తరానున్న హవేలీ అష్టభుజాకారంగా దూలాలతో నిర్మింపబడి ఉంటుంది. ఇదే సభామండపం. ఇందులో సంజీవ పర్వటం తెస్తున్న హనుమాన్, ఝాన్సి లక్ష్మీబాయ్ విగ్రహాలు సజీవంగా దర్శనమిస్తాయి. ఏనుగులు, గుర్రాలు, సింహాలు, నెమల్ల బొమ్మలు జీవకళతో ఆశ్చర్య పరుస్తాయి. తూర్పు హవేలీలో పక్షులు జంతువులూ పుష్పాల బొమ్మలు స్తంభాలపై చెక్కబడి మనోహరంగా ఉంటాయి. మొదటి రెండు అంతస్తులలో సంస్కృతం, సంగీతం స్కూళ్ళు, ఉపాధ్యాయుల నివాస భాగాలు ఉన్నాయి.

ముస్లింలు అత్యధికంగా ఉన్న అహ్మదాబాద్‌లో ఉన్న ఈ ఆలయం సర్వమత సమానత్వానికి ప్రతీకగా నిలిచింది. మత సామరస్యం వెల్లి విరిసింది..1997న వంబర్ 19న ఇక్కడి నుంచి 'హెరిటేజ్ వాక్'ను జామామసీద్ వరకు మధ్యలో ఉన్న 18 ముఖ్య పవిత్ర స్థలాలమీదుగా మూడు గంటల కార్యక్రమంగా నిర్వహించి ప్రేరణ కలిగించారు. 1999లో సంస్కృతీ, శిల్పకళపై ఫోటోగ్రాఫ్ ప్రదర్శన, 2003లో 'హెరిటేజ్ వీక్' ఉత్సవాలు నిర్వహించారు. శాంతి సౌభాగ్యాల అవసరాన్ని చాటి చెప్పారు. అందమైన ప్రకృతిలో అపర స్వర్గధామం అనిపించే అక్షరధాంను చూసి తరించాల్సిందే కాని మాటలతో వర్ణించి చెప్పటం అసాధ్యం. అదో లోకంలో విహరించిన దివ్యానుభూతి మానసిక ప్రశాంతత లభిస్తుంది.

## 2) మా ఉత్తర కర్ణాటక యాత్ర

2010 జనవరి 8వ తేదీనుంచి 13వ తేదీ వరకు మా దంపతులము, మా మనవడు చరణ్, మా అమ్మాయి విజయలక్ష్మి, పిల్లలు శ్రీకేత్, ఆశుతోష్, పీయూష్ మా పెద్దబ్బాయి శాస్త్రి కోడలు సమత, మనవడు భువన్, సమత తల్లీ తండ్రి ఆదిలక్ష్మి దీక్షితులుగార్లు హైదరాబాద్ నల్లగుంట శంకర మఠం నుంచి ఒక బ్రాహ్మలాయన ఏర్పాటు చేసిన టూరిస్ట్ బస్‌లో ఒక్కొక్క టికెట్ 2,500 రూపాయలకు బుక్ చేసుకొని ఉత్తర కర్నాటక యాత్ర చేసివచ్చాము. మొదటగా గోకర్ణం తర్వాత మురుడేశ్వర్, హొరనాడు అన్నపూర్ణాదేవి కల్లూరు మూకాంబిక, ధర్మస్థల, ఉడిపి, శృంగేరి దర్శించి వచ్చాం. చాలా ఆహ్లాదమైన ట్రిప్. కారు చవకగా వెళ్ళినట్లే. గోకర్ణ క్షేత్రం చూసి భూకైలాస్ సినిమా గుర్తుకు తెచ్చుకొన్నాం.

సముద్ర స్నానం హాయిగా ఉంది. దేవాలయ సందర్శన బాగా జరిగింది. ఇక్కడి బ్రాహ్మణ సత్రంలో భోజనం చేశాము. మురుడేశ్వర్ వెళ్లేసరికి చీకటిపడింది కాని అరేబియా సముద్రం ఒడ్డున ఎత్తైన ప్రదేశంలో ఆలయం పెద్ద శివ విగ్రహం బాగా ఆకర్షించింది. అప్పటికే ఆలయ తలుపులు మూసేశారు. అక్కడి అధికారిని బతిమిలాడి ఆంధ్రా నుంచి వచ్చామని చెబితే మా కోసం మళ్ళీ తలుపులు తెరిపించి దర్శన భాగ్యం కలిపించి పూజారితో తీర్ధ ప్రసాదాలు ఇప్పించాడు. హోరనాడులో రాత్రి బస డార్మేటరిలో. చలికి వణికి పోయాం. తెల్లవారుజామునే బంగారు తల్లి అన్నపూర్ణాదేవి దర్శనం. మొకాంబికా దర్శనం కూడా బాగా జరిగింది. ధర్మస్థల చేరే సరికి మధ్యాహ్నం రెండు అయింది. గేట్లు మూసే సమయం హడావిడిగా లోపలి వెళ్లి దర్శించివచ్చాం. ఉడిపి ఉదయానే వెళ్లాం. అన్నీ వివరంగా చూశాం. అక్కడి ఏనుగులు గొప్ప ఆకర్షణ. శ్రీ కృష్ణ విగ్రహాలు, ఫోటోలు కొన్నాం. శృంగేరి వెళ్లే సరికి 12 అయింది. శ్రీ శారదాంబ పూజలో పాల్గొని తరించాం. అక్కడి దేవాలయ దర్శనం గొప్ప అనుభూతి. పీఠంలో భోజనం చేశాం. సింపుల్‌గా బాగుంది. శుచి శుభ్రత బాగా ఉంది. తుంగానదిలో చేపలు ఆకర్షణీయం. గంగాస్నానం తుంగాపానం గొప్పవి అని అంటారు. జగద్గురువులు ఉదయం కార్యక్రమం పూర్తి చేసుకొని విశ్రాంతి తీసుకొంటున్నారని, సాయంత్రం 6 గంటలకు మళ్ళీ దర్శనం ఉంటుందని చెప్పారు. మేము బజార్లు , ఆలయాలు తిరుగుతూ ఫోటోలు కొంటూ అప్పటిదాకా కాలక్షేపం చేసి 6 గంటలకు పెద్ద హాలులో శ్రీ శ్రీ భారతీ తీర్ధ స్వామి వారిని దర్శించాము. వారు మాతో చక్కగా తెలుగులో మాట్లాడారు. మా గోత్రం అడిగి తెలుసుకొని గౌతమస గోత్రం అని చెప్పగానే 'అదృష్టవంతులు సీతమ్మవారి గోత్రం మీది' అని నవ్వుతూ అన్నారు. తీర్ధ ప్రసాదాలు ఇచ్చారు. ఇక్కడి నుంచే సరాసరి హైదరాబాద్ వెళ్లాం. నేను 2008కే లాప్ టాప్ కొన్నా, ఇమైల్స్ రాయటానికి మాత్రమే. 2011 వరకు పరిమితమయ్యాను.

2011 నుంచి సరసభారతి బ్లాగ్‌లో తెలుగులో 'దంచటం' ప్రారంభించాను. కనుక ఈ యాత్రా విశేషాలేవీ బ్లాగ్‌లో లేవు. తరువాత దర్శనీయ దేవాలయాలు వగైరాలలో వీటిలో కొన్నిటి గురించి రాశాను. ఇప్పుడు ఒక్కొక్క క్షేత్రం గురించి తెలియజేస్తాను. ఇవి వీకీపీడియా ఆధారంగా రాసినవి..

## భూకైలాస్ అనే గోకర్ణ క్షేత్రం



గోకర్ణ గ్రామం కర్ణాటక రాష్ట్రం ఉత్తర కన్నడ జిల్లాలో ఉంది. బెంగళూరుకి 545 కి.మి, ఉత్తర కన్నడ జిల్లా రాజధాని కార్వార్కి 55 కి.మి దూరంలోఉంది. గోకర్ణ శైవక్షేత్రంగా చాలా ప్రసిద్ధి చెందినది. ఈ గ్రామములో అత్యంత సుందరమైన బీచ్‌లు కూడా ఉన్నాయి. ఈ గ్రామం గోవా దగ్గరగా ఉండడం బీచ్‌లు సుందరంగా ఉండడంతో అంతర్జాతీయ పర్యాటకులను సహితం ఆకర్షిస్తోంది.

## మహాబలేశ్వర దేవాలయం స్థల పురాణ

ఇతిహాసం త్రేతాయుగం వరకు ఉంది. రావణాసురుడు, శివుని గురించి అకుంఠిత తపస్సుచేసి మెప్పించి ఆత్మలింగాన్ని భూలోకానికి తెస్తాడు. కాని శివుడిచ్చిన ఆత్మలింగం స్వభావం ప్రకారం భూమిమీద ఆలింగం ఎక్కడపెడితే అక్కడ స్థాపితం అయి, అక్కడనుండి తిరిగి ఎత్తశక్యంకాదని శివుడు చెబుతాడు. రావణాసురుడు ఆత్మలింగాన్ని లంకలో ప్రతిష్ఠిస్తే ప్రతికూలచర్యలు జరుగుతాయని భావించి దేవతలు విష్ణువును వేడుకొనగా విష్ణువు తన మాయతో సూర్యాస్తమయం అయ్యేటట్లు చేస్తాడు. అప్పుడు రావణుడు సూర్యాస్తమయం అయిందని భావించి సంధ్య వార్చుకోవడానికి సంసిద్ధుడు అవుతాడు. ఈ విషయం తెలుపుకొన్న నారదుడు వినాయకుని వద్దకు వెళ్ళి రావణాసురుడి వద్ద నుండి ఆత్మలింగం తీసుకొని భూమిమీద పెట్టాలని చెబుతాడు. అప్పుడు వినాయకుడు నారదుడు కోరినట్లు రావణాసురుడు సంధ్యవార్చుకొనే సమయానికి బ్రాహ్మణ వేషంలో వెడతాడు. ఆ బ్రాహ్మణ బాలకుడిని చూసిన వెంటనే రావణాసురుడు తాను సంధ్యవార్చుకొనవలసిన కారణమున ఆ బాలకుడిని లింగాన్ని పట్టుకొనవలసిందిగా కోరుతాడు. అప్పుడు వినాయకుడు లింగం చాలా బరువు ఉంటే తాను ఎక్కువసేపు

మోయలేనని, మోయలేకపోయే సమయం వచ్చినప్పుడు మూడుసార్లు పిలుస్తానని రావణాసురుడు రాకపోతే ఆ లింగాన్ని భూమిపైన పెడతానని చెబుతాడు. రావణాసురుడు అందుకు అంగీకరించగా, వినాయకుడు లింగాన్ని తన చేతులలోకి తీసుకొంటాడు. రావణాసురుడు సంధ్యవార్చుకోవడానికి వెళ్ళగానే గణపతి లింగాన్ని మోయలేకపోతున్నట్లు మూడుసార్లు పిలుస్తాడు. సంధ్య మధ్యలో ఉండడంతో రావణాసురుడు అక్కడకు వచ్చేటప్పటికే వినాయకుడు లింగాన్ని భూమిమీద నిలుపుతాడు. రావణాసురుడు వచ్చి లింగాన్ని భూమిమీద నిలిపినందుకు గణపతి నెత్తిమీద మొట్టుతాడు, గణపతి నెత్తికి గుంట పడుతుంది. వినాయకుడు భూమిమీద నిలిపిన స్థలం గోకర్ణ, మురుదేశ్వర లింగం పడిన భాగాలలో ఒక ప్రదేశం.

విష్ణువు తన మాయని తొలగించగా వెంటనే సూర్యుడు ఆకాశంలో మళ్ళీ కనిపిస్తాడు. ఈ విషయాన్ని గ్రహించి రావణుడు ఎంతో కోపోద్రిక్తుడై ఆత్మలింగాన్ని తన చేతులతో పెకలించ ప్రయత్నం చేస్తాడు. ఆత్మలింగంపై నున్న కవచాన్ని విచ్ఛిన్నం చేసి విసిరివేస్తే గోకర్ణకు 23 కి.మి. దూరంలో సజ్జేశ్వర అనే ప్రదేశంలో పడుతుంది. లింగం పైనున్న మూత తొలగించి విసిరివేస్తే అది గోకర్ణకు 27 కి.మి. దూరంలో ఉన్న గుణేశ్వరలో పడుతుంది. లింగం పైనున్న వస్త్రాన్ని విసిరివేస్తే అది కందుక పర్వతం పైనున్న మృదేశ్వరలో పడుతుంది. ఆ పేరు కాలక్రమంలో మురుదేశ్వరగా మారింది.

## గణపతి దేవాలయం



మహాబలేశ్వరుడు ఆలయానికి ప్రక్కగా గణపతి ఆలయం ఉంటుంది. రావణాసురుడు తల మొట్టాడు అనడానికి గుర్తుగా గణపతి మాడుమీద ఒక గుంట ఉంటుది. గణపతిని అందరు స్పృశించవచ్చు, గణపతి అభిషేకం చేయవచ్చు.

## భద్రకాళి దేవాలయం

మహాబలేశ్వరుడి దేవాలయానికి దగ్గరలొనే భద్రకాళి దేవాలయం ఉంది. భద్రకాళిని అన్నపూర్ణమ్మ తల్లితో సమానంగా భావిస్తారు. ఆవిడ చేతిలో తక్కెడ సరిసమానంగా ఉండకుండా ఒకవైపు ఒరిగి ఉంటుంది, దానికి కారణంగా కాశిలో గంగ మాత్రమే ఉన్నది, కాని గోకర్ణలో కోటి తీర్థం మరియు సముద్రం (ఇక్కడి అరేబియా సముద్రం పుణ్యతీర్థంగా భావిస్తారు) ప్రాంతీయులు చెబుతారు.

## కోటితీర్థం

గ్రామములోని తటాకం లేదా కోనేరు. ఈ కోటీ తీర్థాన్ని గంగతో సమానంగా ప్రాంతీయులు భావిస్తారు. పితృతర్పణాలు ఇక్కడ సమర్పిస్తారు.

## మురుడేశ్వర

మురుడేశ్వర (ఆంగ్లం: Murudeshwara, కన్నడ: మురుడేశ్వర) కర్ణాటక రాష్ట్రంలోని ఉత్తర కన్నడ జిల్లాలోని భట్కల్ తాలుకాలోని ఒక పట్టణం. ఈ పట్టణం శివుని పుణ్యక్షేత్రం. ఈ పట్టణం అరేబియా సముద్రం ఒడ్డున ఉంది. ఈ పట్టణంలో ప్రపంచంలోనే అతిపొడవైన శివుని విగ్రహం ఉంది. ఈ పట్టణంలో ఉన్న శివాలయంలో ఉన్న ప్రధాన దైవం శివుడు మురుడేశ్వరుడుగా అర్చింపబడుతున్నాడు.

## పట్టణ ఇతి హాసం

మురుడేశ్వర పట్టణ ఇతిహాసం త్రేతాయుగం వరకు ఉంది. రావణాసురుడు, శివుని గురించి అకుంఠిత తపస్సుచేసి మెప్పించి ఆత్మలింగాన్ని భూలోకానికి తెస్తాడు. కాని శివుడిచ్చిన ఆత్మలింగం స్వభావం ప్రకారం భూమిమీద ఆలింగం ఎక్కడపెడితే అక్కడ స్థాపితం అయి, అక్కడనుండి తిరిగి ఎత్తశక్యం కాదని శివుడు చెబుతాడు. రావణాసురుడు ఆత్మలింగాన్ని లంకలో ప్రతిష్ఠిస్తే ప్రతికూల చర్యలు జరుగుతాయని భావించి దేవతలు విష్ణువును వేడుకొనగా విష్ణువు తన మాయతో సూర్యాస్తమయం అయ్యేటట్లు చేస్తాడు. అప్పుడు రావణుడు సూర్యాస్తమయం అయిందని భావించి సంధ్యవార్చుకోవడానికి సంసిద్ధుడు అవుతాడు. ఈ విషయం తెలుసుకొన్న నారదుడు వినాయకుని వద్దకువెళ్ళి రావణాసురుడి వద్దనుండి ఆత్మలింగం తీసుకొని భూమిమీద పెట్టాలని చెబుతాడు. అప్పుడు వినాయకుడు నారదుడు కోరినట్లు రావణా సురుడు సంధ్యవార్చుకొనే సమయానికి బ్రాహ్మణవేషంలో వెడతాడు. ఆ బ్రాహ్మణ బాలకుడిని చూసిన వెంటనే రావణాసురుడు తాను సంధ్యవార్చుకొనవలసిన కారణమున ఆ బాలకుడిని లింగాన్ని పట్టుకొనవలసిందిగా కోరుతాడు. అప్పుడు వినాయకుడు లింగం చాలా బరువు ఉంటే తాను ఎక్కువసేపు మోయలేనని, మోయలేకపోయే సమయం వచ్చినప్పుడు మూడుసార్లు పిలుస్తానని రావణాసురుడు రాకపోతే ఆ లింగాన్ని భూమిపైన పెడతానని చెబుతాడు. రావణాసురుడు అందుకు అంగీకరించగా, వినాయకుడు లింగాన్ని తన చేతులలోకి తీసుకొంటాడు. రావణాసురుడు సంధ్యవార్చుకోవడానికి వెళ్ళగానే గణపతి లింగాన్ని మోయలేకపోతున్నట్లు మూడుసార్లు పిలుస్తాడు. సంధ్య మధ్యలో ఉండడంతో రావణాసురుడు అక్కడకు వచ్చేటప్పటికే వినాయకుడు లింగాన్ని భూమిమీద నిలుపుతాడు. రావణాసురుడు వచ్చి లింగాన్ని భూమిమీద నిలిపినందుకు గణపతినెత్తి

మీద మొట్టుతాడు, గణపతినెత్తికి గుంట పడుతుంది. వినాయకుడు భూమిమీద నిలిపిన స్థలం గోకర్ణ, మురుదేశ్వర లింగంపడిన భాగాలలో ఒక ప్రదేశం.

విష్ణువు తన మాయని తొలగించగా వెంటనే సూర్యుడు ఆకాశంలో మళ్ళి కనిపిస్తాడు. ఈ విషయాన్ని గ్రహించి రావణుడు ఎంతో కోపోద్రిక్తుడై ఆత్మలింగాన్ని తనచేతులతో పెకలించ ప్రయత్నం చేస్తాడు. ఆత్మలింగం పైనున్న కవచాన్ని విచ్ఛిన్నం చేసి విసిరివేస్తే గోకర్ణకు 23 కి.మి. దూరంలో సజ్జేశ్వర అనే ప్రదేశంలో పడుతుంది. లింగం పైనున్న మూత తొలగించి విసిరివేస్తే అది గోకర్ణకు 27 కి.మి. దూరంలో ఉన్న గుణేశ్వరలో పడుతుంది. లింగంపైనున్న వస్త్రాన్ని విసిరివేస్తే అది కందుక పర్వతం పైనున్న మృదేశ్వరలో పడుతుంది. ఆ పేరు కాలక్రమంలో మురుదేశ్వరగా మారింది.



## మురుదేశ్వర దేవాలయం

ఈ దేవాలయం కందుక పర్వతం మీద ఉంది. మూడు వైపుల అరేబియా సముద్రం ఆవరించి ఉంది. ఈ దేవాలయ గాలిగోపురం 20 అంతస్తులు ఉంది. దేవాలయానికి వెళ్ళే మార్గంలో రెండు నిజమైన ఏనుగులు ఉన్నాయి.

**మురుదేశ్వరకోట:** ఈ కోటమురుదేశ్వర దేవాలయం వెనుక భాగంలో ఉంది. ఈ కోటని టిప్పుసుల్తాను పునరుద్ధరించాడు.

**శివుని విగ్రహం:** ఆలయ సముదాయంలో నున్న ఈ శివుని విగ్రహం చాలా దూరం నుండి కనిపిస్తుంది. ఆధారాల ప్రకారం ఈ విగ్రహం ప్రపంచంలోనే అతి పెద్ద శివుని విగ్రహం. 123 అడుగుల (37 మీటర్ల) ఎత్తు కలిగిన ఈ విగ్రహాన్ని చెక్కడానికి 2 ఏండ్లు పట్టింది. శివమొగ్గకు చెందిన కాశీనాథ్, ఆయన కుమారుడు శ్రీధర్, ఇతర శిల్పులు కలిసి కోటి రూపాయల ఖర్చుతో ఈ విగ్రహాన్ని చెక్కించారు. ఈ విగ్రహంలో మరో ప్రత్యేకత ఏమనగా సూర్యరశ్మి పడినప్పుడు ఈ విగ్రహం మెరుస్తుంది.

గబ్బిట దుర్గాప్రసాద్



## హొరనాడు అన్నపూర్ణాదేవి ఆలయం

హొరనాడు (Horanadu) కర్ణాటక రాష్ట్రములోని చిక్కమగళూరు జిల్లాలో చికమగళూరుకు నైరృతి దిశగా 100 కి.మీ.ల దూరంలో ఉన్న హిందూ పుణ్యక్షేత్రము. ప్రకృతి రమణీయ సౌందర్యాలు వెల్లిలు విరిసే పశ్చిమ కనుమలలో ఉన్న ఈ గ్రామంలో ప్రసిద్ధమైన అన్నపూర్ణేశ్వరీదేవి ఆలయం ఉన్నది. ప్రధాన దేవతా విగ్రహాన్ని ఆది శంకరాచార్యులు ప్రతిష్ఠించారు. ప్రస్తుతంగల అన్నపూర్ణేశ్వరీదేవి విగ్రహాన్ని 1973లో ప్రతిష్ఠించారు. హొరనాడు అనే ప్రాంతం బెంగళూరు నుండి 330 కి.మీ. దూరంలో గల అందమైన ప్రాంతం. ఇది శృంగేరి క్షేత్రం నుండి 75 కి.మీ. దూరంలో గలదు. బెంగళూరు నుండి ఈ ప్రాంతానికి ప్రతిరోజూ బస్సులు ఉంటాయి. ఈ క్షేత్రానికి వెళ్ళుటకు అవసరమైన బస్సులను కర్ణాటక రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ నడుపుతోంది. కొన్ని ప్రైవేటు బస్సులు కూడా లభిస్తాయి. ఈ ప్రాంతమునకు సమీప విమానాశ్రయం మంగళూరు విమానాశ్రయం. ఈ విమానాశ్రయం యిదివరకు బాజ్పే విమానాశ్రయంగా పిలువబడేది. మంగళూరు హొరనాడుకు 136 కి.మీ. దూరంలో ఉంది. హొరనాడు నుండి మంగళూరుకు రోడ్డుమార్గంలో పోవుటకు మధ్యలో కార్కళ మరియు కళస అనే ప్రాంతాల మీదుగా పోవాలి.

### విశిష్టతలు

హొరనాడు అన్నపూర్ణేశ్వరి దేవాలయం సందర్శనకు విచ్చేసిన భక్తులకు జాతి, మత, ప్రాంత మరియు భాషా విభేదాలేవీ లేకుండా పప్పుతో చేసిన ప్రసాదముతోపాటు ముప్పూటలా శాకాహార భోజనము పెడతారు. ఆలయాన్ని సందర్శించే మగభక్తులు తమభక్తికి, వినమ్రతకు నిదర్శనముగా చొక్కాలు విడిచి పైభాగాన్ని కండువా లేదా శాలువాను కప్పుకొంటారు.

అమ్మవారి మూలవిరాట్టు బంగారంతో చేయబడిన విగ్రహం. ఈ అమ్మవారిని దర్శిస్తే జీవితంలో అన్నపానాలకు లోటుండదని భక్తుల విశ్వాసం. ఒకసారి శివుడు ఒక శాపానికి గురై శాపవిమోచనార్థం ఈ క్షేత్రాన్ని దర్శించి, అన్నపూర్ణాదేవి యొక్క కరుణా కటాక్షవీక్షణాల ఫలితంగా తన శాపవిమోచనం పొందినాడని భక్తుల విశ్వాసం.

ఈ ప్రాంతమునకు వెళ్ళుటకు కొన్ని ఘాట్లు, దట్టమైన అడవులుగుండా వెళ్లాలి. ఈ ప్రాంతం దర్శించుటకు వెళ్ళేవారికి, ఆదిశక్త్యాత్మక అన్నపూర్ణాదేవి ఆలయం యాత్రికులకు, తమ యాత్రకు ఏర్పాట్లు చేసుకోవటంలో ఇది ముఖ్యమైనది. ఈ క్షేత్ర సందర్శనకు పోవు యాత్రికులకు వరుసగా కుక్కెసు బ్రహ్మణ్య, ధర్మస్థళ, శృంగేరి, ఉడుపి కృష్ణ దేవాలయం మరియు కొల్లూరు మూకాంబిక, కళసలో ఉన్న కాళేశ్వరి ఆలయం వరుసగా వస్తాయి. చివరి యాత్రాస్థలంగా హొరనాడు అన్నపూర్ణాదేవి ఆలయం వస్తుంది.



## ధర్మస్థల

### ధర్మస్థల ప్రవేశ ద్వారం

ధర్మస్థల లేదా ధర్మస్థళ హిందువుల పవిత్ర క్షేత్రం. ఈ నగరం కర్ణాటక రాష్ట్రంలో దక్షిణ కన్నడ జిల్లాలో బెళ్తంగడి తాలూకాలో నేత్రావతి నదీతీరంలో ఉంది. గ్రామ పంచాయితీ మండలంలో ఉన్న ఒకే ఒక పంచాయితీ ధర్మస్థల. ఈ గ్రామంలో ప్రసిద్ధి చెందిన ధర్మస్థల ఆలయం ఉంది.

### ఆలయ ప్రత్యేకతలు

**ధర్మస్థలలోని గోమటేశ్వర విగ్రహం:** ఈ ఆలయంలో శివుడు, మంజునాథుడు, అమ్మనవరు, చంద్రనాథ మరియు కళారాలు అనే ధర్మదైవాలు (ధర్మరక్షణ దైవాలు), కుమారస్వామి మరియు కన్యాకుమారి మొదలైన దైవాల సన్నిధులు ఉన్నాయి. అసాధారణంగా ఈ ఆలయ నిర్వహణ జైన మతస్థుల ఆధ్వర్యంలో పూజాదికాలు హిందూపూజారుల చేత నిర్వహించబడుతూ ఉన్నాయి. నవంబరు మరియు డిసెంబరు మాసాలమధ్య నిర్వహించబడే లక్షదీపాల ఉత్సవం ఈ ఆలయ ప్రత్యేకత. ఆలయయం సందర్శించే భక్తుల సంఖ్య ఒక రోజుకు దాదాపు 10,000. ఆలయంలోని యాంత్రికమైన ఆధునిక వంటశాలలో ఆలయ సందర్శనానికి వచ్చే భక్తులందరికీ వంటలు తయారుచేసి భక్తులకు రోజూ ఉచితంగా అన్న ప్రసాదం వడ్డిస్తారు. ఆలయదర్శనానికి వచ్చే భక్తుల సౌకర్యార్థం ఆధునిక సౌకర్యాలున్న అతిథిగృహ సౌకర్యం కూడా లభిస్తుంది. ధర్మస్థల మత సహనానికి ప్రతీక. ఈ ఆలయంలో జైనతీర్థంకరుల సేవలను ధర్మదేవతలతో మంజునాథుడు కూడా అందుకుంటున్నాడు. ఇక్కడ పూజారులు వైష్ణవ బ్రాహ్మణులు. ఆలయ ధర్మకర్త హెగ్డే. ఆలయానికి చెందిన ఆశ్రమాలలో నివసిస్తున్నవారికి ఉచిత

భోజనం, మరియు ఉచిత బస లభిస్తుంది.

## పురాణ ప్రశస్తి

ధర్మస్థలలోని శివలింగం గ్రామదేవత అయిన అణ్ణప్ప దైవంచేత ప్రతిష్ఠించబడిందని విశ్వసిస్తున్నారు. హెగడే కుటుంబాలకు అణ్ణప్ప దైవం అనుగ్రహమున్నదని విశ్వసించబడుతుంది. ఒకప్పుడు హెగడే కుటుంబసభ్యుడు శివలింగ ప్రతిష్ఠ చేయాలని సంకల్పించినప్పుడు అణ్ణప్ప దైవం శివలింగం తీసుకువస్తానని చెప్పి అక్కడి నుండి అంతర్ధానం అయ్యాడు. మరునాడి ఉదయం నిద్రలేచి చూసేవేళకు హెగడే గృహానికి వెలుపల శివలింగం ప్రతిష్ఠించబడి ఉంది. తరువాత ఆ లింగం మంగళూరు ఆలయంలోనిదని తెలిసింది. ఆ తరువాత అణ్ణప్ప దైవం ఎవరికి కనిపించలేదు. ప్రస్తుతం ధర్మస్థల ప్రజలు అణ్ణప్ప దైవాన్ని గ్రామదేవత పంజుర్లిగా ఆరాధిస్తున్నారు. ధర్మస్థల భక్తులకు మాత్రమే కేంద్రం కాదు. ఇది పరిసర ప్రాంతాలలో విస్తారంగా ధర్మసంస్థాపన చేయడానికి కృషి చేస్తున్నది. ఇది సంఘంలో ధర్మాచరణపట్ల విశ్వాసాని పెంపొందించడానికి కృషి చేస్తుంది కనుక ప్రజలు తమకు తాము చేసుకున్నట్లే ఇతరులకు సహాయం చేస్తున్నారు. 800 సంవత్సరాలకు ముందు ధర్మస్థలను మల్లర్మడిలోని కుడుమాగా గుర్తిస్తూ ఉండేవారు. తరువాత ఇది బెళ్తంగడిలో ఒక గ్రామంగా మారింది. ఇక్కడ జైన్సైనికాధికారి బిర్మన్నా అతని భార్య అయిన అమ్ముబల్లాథితో నివసిస్తూ వచ్చాడు. వారు నిరాడంబరత, ఆరాధనీయత మరియు ప్రేమస్పదులుగా గ్రామ ప్రజచే గౌరవించబడ్డారు. వారు గ్రామస్తులపట్ల ఔదార్యం మరియు సేవాభావం చూపిస్తూ వచ్చారు. పురాణ కథనం అనుసరించి ధర్మదేవతలు ధర్మరక్షణ, ధరస్థాపన మరియు ధర్మప్రచారం కొరకు తగినవారిని అన్వేషిస్తూ ఈ దంపతులు నివసిస్తున్న గృహానికి వచ్చారు. ఆ దంపతులు వారిని ఆహ్వానించి పూజించి గౌరవించారు. వారి పూజలకు ప్రసన్నులైన ధర్మదేవతలు ఆ రోజు రాత్రి వారి కలలో కనిపించి వారి గృహాన్ని ధర్మదేవతలకు సమర్పించి వారి జీవితాలను అదైవాల సేవకు సమర్పించాలని ఆదేశించారు. పర్గాడే కుటుంబం వేరు ప్రశ్న వేయకుండా ఆ ఇంటిని ధర్మదేవతలు ఇచ్చి వారు వారి కొరకు వేరు గృహాన్ని నిర్మించుకున్నారు. అది ఇప్పటికీ అలాగే పాటించబడుతుంది. వారు వారి ఆరాధన మరియు ప్రజాసేవను కొనసాగిస్తున్నారు. ధర్మదేవతలు తిరిగి పర్గాడే కుటుంబానికి కలలో కనిపించి ధర్మదేవతలు కళారహు, కళార్కయీ, కుమారస్వామిమరియుకన్యాకుమారి అనే నలుగురు దైవాలకు విడి విడిగా ఆలయాలు నిర్మించమని ఆదేశించారు. ధర్మదేవతలు హెగడే కుటుంబానికి కలలో కనిపించి దైవవాక్కు పలకడానికి ఇద్దరు ఉన్నత వ్యక్తులను తీసుకురమ్మని అలాగే నలుగురు వ్యక్తులను హెగడేకు సహాయకులుగా నియమించమని

ఆదేశించారు. దైవవాక్కు పలికే వారిని డెలాపాదిత్య మరియు మన వౌలిత్యాయ అంటారు. ప్రత్యుపకారంగా పర్గాడే కుటుంబానికి రక్షణ, విస్తారమైన ధర్మం మరియు క్షేత్రానికి గుర్తింపు ఇస్తామని మాటిచ్చారు. పర్గాడే ఆలయాల నిర్మాణానికి నిశ్చయించారు. బ్రాహ్మణులను పిలిపించి అవసరమైన కార్యక్రమాలు జరపమని కోరారు. ఆలయం పక్కన ఒక శివలింగాన్ని ప్రతిష్ఠించమని పూజారులు పర్గాడే కుటుంబాన్ని కోరారు. దైవవాక్కు పలికేవారు అణ్ణప్పస్వామిని పంపి శివలింగ ప్రతిష్ఠ జరిపించారు. అణ్ణప్పస్వామి మంగళూరు సమీపంలోని కద్రినుండి మంజునాథేశ్వరుని ప్రతిష్ఠించాడు. ఫలితంగా శివలింగం చుట్టూమంజునాథుని ఆలయనిర్మాణం జరిగింది.

16వ శతాబ్దంలో దేవరాజ హెగడే ఉడుపిలోని శ్రీ వాదిరాజస్వామిని ఈ ప్రదేశానికి పిలిపించాడు. అక్కడికి సంతోషంగా వచ్చిన శ్రీవాదిరాజస్వామి భిక్షస్వీకరించడానికి నిరాకరించాడు. మంజునాథుని విగ్రహం వేదవిధితో ప్రతిష్ఠించకపోవడమే అందుకు కారణం. స్వయంగా శివలింగాన్ని పునః ప్రతిష్ఠ చేయమని హెగడే శ్రీవాదిరాజస్వామిని కోరాడు. తరువాత శ్రీవాదిరాజస్వామి మధ్వాచారవిధితో పునః ప్రతిష్ఠ చేయాడానికి అవసరమైన పూజాకార్యక్రమాలను ప్రారంభించారు. తరువాత శ్రీవాదిరాజస్వామి ఈ ప్రదేశానికి ధర్మస్థల అని నామకరణం చేసాడు. ధర్మస్థల అంటే మతం మరియు ధర్మము ఉండే ప్రదేశమని అర్థం. 600 సంవత్సరాలకు ముందు ధర్మానికి మరియు మతానికి పడిన పునాది హెగడే కుటుంబం చేత పోషించబడి బలపరచబడింది. పర్గాడే నుండి హెగడే పదం ఆవిర్భవించింది. ప్రస్తుతం ధర్మస్థలని స్వార్థసేవకు చిహ్నంగా నిలిచింది.

## అన్నదానం

ధర్మస్థలకు ఒకరోజుకు సుమారుగా 10,000 భక్తులువస్తుంటారు. అలయదర్శనానికి వచ్చే ప్రతి వెయ్యిమందిలో ఒకరిని ఆలయ ప్రధాన అతిథిగా భావించి గౌరవిస్తారు. ఈ అతిథి మర్యాదలో కులము, మతము, సంస్కృతి మరియు అంతస్తులను వ్యత్యాసం ఎంచక గౌరవిస్తారు. పవిత్రమైన ఆలయంలో చేసే అన్నదానం భక్తులమీద విశేష ప్రభావం చూపిస్తుంది. ఆలయ దర్శనానికి వచ్చే వేలకొలది భక్తులకు ప్రతిరోజూ అన్నదానం చేయబడుతుంది. ఆలయంలో ఉన్న ఆధునిక పరికరాలతో కూడిన వంటశాలలో రుచుకరమైన భోజనం పరిశుద్ధంగా తయారు చేయబడుతుంది. అన్నదానం చేసే సమయంలలో ఆలయ నిర్వాహకులు పేద ధనిక భేదాలు చూడరు. భోజనశాల పేరు 'అన్నపూర్ణ'.

## విద్యాదానం

ధర్మస్థల క్షేత్రం ఎస్.డి.ఎం.సి.ఇ.టి సొసైటీ ద్వారా ప్రాథమిక పాఠశాల,

యోగాను బోధించే గురుకులం, సంస్కృతం బోధించడం మరియు ఇంజనీరింగ్, వైద్యం, దంతవైద్యం వంటి వృత్తి విద్యలు మొదలైన 25 విద్యాసంస్థలను నిర్వహిస్తున్నది. మంగళూరు, ఉడుపి, ధారవాడ, హాసన, మైసూరు మరియు కర్ణాటక రాష్ట్రంలోని ఇతర ప్రదేశాలలో విద్యాసంస్థలు ఉన్నాయి. సిద్ధవన గురుకుల స్వర్గస్థులైన మంజయ్య హెగడే చేత స్థాపించబడింది. ఇది మార్గదర్శక విద్యాసంస్థగా మారింది. ఈ పాఠశాలలో 250 మంది విద్యార్థులు ఉచిత భోజన మరియు విద్యావసతులను సమకూర్చి యోగాను కూడా నేర్పుతున్నారు. పాఠశాల విద్యావిధానంలో సంస్కృతం బోధన అదనంగా చేర్చబడింది. ఈ పాఠశాల పాఠాలతో విద్యార్థులకు భారతీయ సంస్కృతి మరియు సంప్రదాయాల విలువలు బోధించబడుతుంది.

## పురాతన వస్తు సందర్శనశాల

ధర్మస్థలకు వచ్చే యాత్రీకులు ఇక్కడ ఉన్న రెండు పురాతన వస్తు సందర్శనశాలలను తప్పక చూస్తారు. సాంస్కృతిక వారసత్వ వస్తువులను మరియు కళాఖండాలు ఉన్నాయి. ఈ పురాతన వస్తు సందర్శనశాల రాత్రి 9 గంటల వరకు తెరిచే ఉంటుంది. రెండవది కార్ల సందర్శనశాల. ఈ ప్రదర్శనశాల ఉదయం 8.30 నుండి మద్యాహ్నం 1 గంట వరకు మరియు మద్యాహ్నం 2 గంటల నుండి రాత్రి 7 గంటల వరకు తెరచి ఉంటుంది.

## ఆయుషదాన

ఆరోగ్య సంరక్షణ రంగంలో వైద్య సేవాసంస్థ సేవలు అందిస్తున్నది. పరిసర గ్రామాలలో వ్యాధి నివారణకు అవసరమైన వ్యాధి నిర్మూలనకు అవసరమైన సేవలను కొనసాగిస్తున్నది. మలెనాడు ప్రాంతంలోని గ్రామాలకు మరియు దూరప్రాంతాలకు అత్యవసరమైన వైద్యసేవలు అందించడానికి ఆధునిక సౌకర్యాలున్న మొబైల్హాస్పిటలును పూజ్యశ్రీ హెగాడే చేత స్థాపించబడింది. ధర్మశాల మంజునాథేశ్వర మెడికల్ ట్రస్ట్ ఆధ్వర్యంలో క్షయవ్యాధ బాధితులకు సేవలందించడానికి ఒక క్షయ వ్యాధి శానిటోరియం స్థాపించబడింది. ఈ ఆసుపత్రి ఇప్పుడు జనరల్ హాస్పిటల్గా మారింది. ఉడుపి మరియు హాసనలలో ఉన్న ఆయుర్వేద ఆసుపత్రులు ప్రజలకు పురాతన శైలిలో ఆయుర్వేద వైద్యసేవలు అందిస్తున్నది. మంగళూరు నేత్రావతి తీరంలో పంచభూతాల ఆధారంగా వైద్యం చేసే నేచుర్యూరాస్పిటల్ స్థాపించబడింది. మంగళూరులో ఉన్న ఎస్.సి.ఎం ఆసుపత్రి ఆత్యాధునిక నేత్రచికిత్సాలయం. ఎస్.డి.ఎం పంటి ఆసుపత్రి పంటి సమస్యలకు అవసరమైన చికిత్స అందిస్తున్నారు. ఈ ఆసుపత్రిలో పెదవి చీలిక వంటి సమస్యలకు మరియు ఎముకల సమస్యలకు ప్రత్యేక చికిత్స అందిస్తున్నారు. శ్రీ హెగాడే యోగా భ్యాసం ప్రాధాన్యతను ప్రజలవద్దకు తీసుకు వెళ్ళడానికి చురుకుగా

కృషి చేస్తున్నాడు. యోగా తరగతులు నిర్వహిస్తున్న ప్రదేశాలలో సూర్యనమస్కారాలు కుడా అభ్యసించబడుతున్నాయి. యోగాకేంద్రాలలో ఒక సంవత్సరానికి దాదాపు 250 మంది ఉపాధ్యాయులు శిక్షణ పొందుతున్నారు. ఒక్కో ఉపాధ్యాయుని వద్ద సుమారు 100 విద్యార్థులు శిక్షణ పొదుతున్నారు.

## అభయ దాన

1972 నుండి ఉచిత సాముహిక వివాహాలు ప్రారంభించబడి ప్రజాదరణ పొందాయి. ప్రతిసంవత్సరంవందలకొద్దీజంటలుసాముహిక వివాహ మహోత్సవంలో పాల్గొని వివాహం చేసుకుంటారు. అన్ని మతాలు మరియు కులాలవారు తమ ఆచారాలు, సాంప్రదాయల ననుసరించి ఇచ్చట వివాహం చేసుకుంటరు. వివాహంనకు విచ్చేసిన దంపతులకు దుస్తులు, మంగళసూత్రం మరియు విందుభోజనం పరిమిత బంధువులకు కూడా ఈక్షేత్రంలో యిచ్చుటకు యేర్పాట్లు ఉన్నాయి.

## హెగ్గడే కుటుంబం

ప్రస్తుతం ధర్మస్థల క్షేత్రపాలకులుగా 21వ ధర్మాధికారి పీఠాన్ని పద్మభూషణ్.డి వేరేంద్ర హెగ్గడె అధిష్టించారు. ఈయన 1973 నుండి ప్రారంభించబడిన సామాజిక ఆర్థిక కార్యక్రమాలైన ఉచిత సాముహిక వివాహ విధానమును వంటి వాటిని ప్రారంభించిన వ్యక్తి.

1973లో బాహుబలి విగ్రహాన్ని ఏకశిలపై చెక్కి శిల్పాన్ని తయారుచేశారు. దీనిని ధర్మస్థల దేవాలయానికి దగ్గరగానున్న మంజునాథ ఆలయం వద్ద గల తక్కువ ఎత్తుగల కొండపై నెలకొల్పారు. దీని ఎత్తు 39 అడుగులు అనగా 12 మీటర్లు మరియు దీని బరువు సుమారు 175 టన్నులు ఉంటుంది. ధర్మస్థల చుట్టుప్రక్కల 25 ప్రాథమిక పాఠశాలల స్థాయి నుండి ప్రొఫెషనల్కాలేజీల వరకు వివిధ విద్యాసంస్థలు ఉన్నాయి. పాత మరియు బలహీనత దేవాలయాలు సంప్రదాయ నిర్మాణం సంరక్షించేందుకు, పునర్మించిన చేశారు. పురాతన లిఖితప్రతులు మరియు చిత్రాలు శ్రమించి పునరుద్ధరించారు, మరియు భావితరములకు కోసం భద్రపరిచారు. పురాతన వస్తువుల కొరకు ఒక మ్యూజియం ఉంది. దీనిని "మంజూషమ్యూజియం" అని పిలుస్తారు. ఒకకారుమ్యూజియంఅరుదైనవింటేజ్కార్లనుసేకరించినదిఉంది. ప్రతి సంవత్సరం సర్వధర్మ సమ్మేళనమును ధర్మస్థళ వద్ద జరుపుతారు. దీనికి అనేకమంది అధ్యాత్మిక గురువులు వివిధ పీఠాలనుండి వస్తారు. కళల, సాహిత్య పోషకులు కూడా ఈ కార్యక్రమానికి హాజరవుతారు. ధర్మస్థల భారతదేశంలో కొన్ని పుణ్యక్షేత్రాలలో సందర్శించే భక్తులకు ఉచిత భోజన మరియు వసతి అందించే పుణ్యక్షేత్రము.

## సినిమా

ఈ క్షేత్రంపై శ్రీమంజునాథ పేరుతో 2001లో రాఘవేంద్రరావు దర్శకత్వంలో అర్జున్, చిరంజీవి, సౌందర్య నటించిన సినిమా వచ్చింది. పాటలన్నీ సూపర్హిట్ .సంగీతం శ్రీలేఖ.



## కొల్లూరు మూకాంబికాదేవి ఆలయం

కర్ణాటకలో పడమటి కొండలలో అందమైన కొండలు లోయలు ఫలవృక్షాల మధ్య కొల్లూరులో మూకాంబికాక్షేత్రం ఉంది. కామాసురుడు అనే రాక్షసుడు ఈ ప్రాంతప్రజలను విపరీతంగా బాధిస్తుంటే అందరు పార్వతీదేవిని శరణు కోరారు. వాడు ఒక మహిళ చేతులలోనే చస్తాడని గ్రహించిన దేవి వాడిని అవలీలగా సంహరించింది. ఆమె ధైర్యానికి మెచ్చి శివుడు ఇక్కడ తన కాలిమడమతో శ్రీచక్రాన్ని సృష్టించి ప్రతిష్టించాడని ప్రతీతి. ఆలయానికి కనీసం 1200 ఏళ్ళ చరిత్ర ఉంది. హలుగల్లు వీరసంగయ్య అనే రాజు అమ్మవారి విగ్రహం చెక్కించాడని చెప్పుకొంటారు. మంగుళూరు నుండి నూటముప్పై కిలో మీటర్ల దూరంలో ఉడిపి క్షేత్రానికి ఎనభై కిలోమీటర్ల దూరం. కొండల మధ్య ప్రకృతి అందాలు విందు చేస్తుండగా కూడకాద్రి శిఖరంపై ఈ ఆలయం కనువిందు చేస్తుంది. తమిళనాడుకు అతి సమీపంలో ఉంటుంది.. బంగారుశిఖరంతో భక్తజనాల దృష్టిని ఆకర్షిస్తుంది.

ఇక్కడి విశేషం ఏమిటంటే "అమ్మవారు జ్యోతిర్లింగంగా శివునితో కలిసి ఉండటం". ఆదిశంకరాచార్యులవారు ఆలయంలో శ్రీచక్రాన్ని ప్రతిష్టించటంతో మూకాంబికాదేవి ఆలయానికి విశేష ప్రాచుర్యం లభించింది. పంచముఖ గణేశ ప్రతిమ అద్భుత శిల్పనైపుణ్యంతో విరాజిల్లుతుంది. కర్నాటకలోని ఏడు ముక్తిక్షేత్రాలలో కొల్లూరు

ఒకటి. మిగిలినవి ఉడిపి, సుబ్రహ్మణ్య, కోడేశ్వర, శంకరనారాయణ, గొకర్ణ క్షేత్రాలు. ఆదిశంకరాచార్యులవారు ఈ క్షేత్రాన్ని దర్శించినప్పుడు అమ్మవారు ప్రత్యక్షమైనది. ఆమె విగ్రహాన్ని ఆయనే ఇక్కడ స్థాపన చేశారు. గర్భాలయంలో 'శంకరసింహాసనం' ఉంది. ఆచోటులోనే శంకర భగవత్పాదులు అమ్మవారి కోసం జపిస్తే సాక్షాత్కరించింది. మూకాంబిక సరస్వతి మహాకాళి, శక్తిళ సంయుక్త స్వరూపంగా భావిస్తారు. అమ్మవారు కొలువైన 'కూడకాద్రిపర్వతం' మీదనే ఆదిశంకరులు తపస్సు చేసిన అంబవనం, చిత్రమూలం ప్రదేశాలున్నాయి. భక్తులు వీటిని దర్శించి అనుభూతికి లోనౌతారు.. కర్నాటకను పాలించిన రాజులందరూ అమ్మవారికి విశేషమైన కానుకలు సమర్పించి భక్తిశ్రద్ధలతో అర్చించారు. నగర, బెద్నూరాజులకు ఈ దేవాలయమే 'రాజదేవాలయం' వారి ఇలవేల్పు మూకాంబికయే. మహారాష్ట్ర, విజయనగర ప్రభువుల పాలనలో కూడా వైభవం పొందింది. ఆ తర్వాతా ముష్కర తురుష్క పాలనలో దోపిడీకి గురైంది. ఇక్కడి కోట్లాది రూపాయలు విలువ చేసే అమూల్య సంపద అంతా దోచుకోబడింది.

## పురాణ కథనం

శివుని వరం పొందిన కామాసురుడు కూడకాద్రి పర్వతం మీద చేరి, దేవతలను మునులను హింసించేవాడు. సప్తర్షులు వీడి పీడ ఎలా విరగడ అవుతుందా అని ప్రయత్నాలు ముమ్మరం చేశారు. ఈ విషయాన్ని రాక్షస గురువు శుక్రాచార్యుడు చెవిన వేసి, వాడి చావు ఒక స్త్రీ వల్ల జరుగుతుంది అని చెప్పాడు... వెంటనే వాడు శివుని అనుగ్రహం కోసం తీవ్ర తపస్సు చేస్తే ఆయన ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. కామాసురుడికి శివుడు వరం ఇస్తే లోకకంటకుడు అవుతాడని భావించి వాగ్దేవి సరస్వతీదేవి వాడి నాలుకపై చేరి మాట రాకుండా మూగవాడిని చేసిందింది. మూగవాడైపోయినందువల్ల ఆకామాసురుడు శివుడిని నోటి మాటతో ఏ వరమూ కోరలేకపోయాడు. అప్పటి నుంచి వాడిని 'మూకాసురుడు' అన్నారు. అప్పుడు 'కోలరుషి' ఉపాయం మేరకు పార్వతీదేవి సకల దేవతల శక్తులన్నిటిని కలిపి ఒక తీవ్ర శక్తిగా సృష్టించి, మూకాసురునితో యుద్ధం చేసి సంహరించింది.. వాడి ప్రార్ధన మన్నించి వాడికి కైవల్యం ప్రసాదించింది. మూకాసురుడిని దేవి సంహరించిన ప్రదేశాన్ని 'మారణకట్టే' అంటారు (మరణగద్దె). మూకాసురుడు అమ్మవారిని మూకాంబికగా తన పేర వెలసిల్లమని కోరుకున్నాడు. వాడి కోరిక తీర్చి కొల్లూరులో మూకాంబిక నామంతో విరాజిల్లుతూ భక్తులకు కొంగు బంగారంగా ఉంది. ఆలయంలో మూకాంబికాదేవి పద్మాసనంలో ప్రశాంతంగా మూడు నేత్రాలతో దర్శనమిస్తుంది. శంఖం చక్రం గద ఆయుధాలను ధరించి ఉంటుంది.

గబ్బిట దుర్గాప్రసాద్

## ఉడు(డి)పి



ఉడుపి కర్ణాటక రాష్ట్రము లోని ఒక జిల్లా. ప్రపంచ ప్రసిద్ధ కృష్ణ మందిరము ఉడుపిలో ఉంది. తుళు మాతృ భాషగా కలిగిన ప్రజలు గణనీయంగా ఉండటంవలన ఉడుపి మరియు దక్షిణ కన్నడ జిల్లాలను కలిపి కొన్నిసార్లు తుళునాడుగా వ్యవహరిస్తారు. ఉడుపి శ్రీకృష్ణుడు ఉడుపి పూర్వపు పేరు శివళ్ళీ. ఇది పరశురామక్షేత్రాలలో మెదటిస్థానం కలిగి ఉంది. ప్రతి సంవత్సరం, లక్షలాది భక్తులు కృష్ణుని దర్శనం చేసుకోవటానికి ఉడుపిని సందర్శిస్తారు. స్వామి దర్శనం నవరంధ్రాలున్న కిటికీ ద్వారా చేసుకోవలసి ఉండటం ఈ దేవాలయము యొక్క ప్రత్యేకత. ఉడుపి రథ వీధిలో శ్రీకృష్ణమందిరం కలదు. ఉత్తర ద్వారం ద్వారా గుడిలోకి ప్రవేశించినప్పుడు కుడివైపు దేవాలయ కార్యాలయం, ఇంకొద్దిగా ముందుకువెళ్ళితే మధ్వ సరోవరం కనిపిస్తుంది. ప్రధాన ఆలయానికి ద్వారం ఎడమవైపు ఉంటుంది. కొద్దిగా ముందుకు వెళితే చెన్నకేశవ ద్వారం వస్తుంది. దీని ద్వారా గర్భగుడిలో ప్రవేశం పితాధిఫతులకు తప్పితే అన్యులకు ఉండదు. చెన్నకేశవస్వామి ద్వారం నుండి ముందువెళ్ళితే ప్రదక్షిణంచేసిన తరువాత శ్రీకృష్ణ దర్శనం వెండి చేతాపడం పెట్టపడిన నవరంధ్రాల కిటికీ నుండి చేసుకోవచ్చు. గర్భగుడికి కుడివైపు ముఖ్య ప్రాణదేవత (హనుమంతుడు), వామ భాగా నగరుడ దేవరు ఉన్నరు. స్వామిదర్శనం చేసుకొని ముందుకు వెళ్ళి దక్షిణమార్గం వైపు ప్రదక్షణం చేసినట్లైతే ఎడమ భాగాన మధ్వాచ్యారులు మంటపం కనిపిస్తుంది. ఇప్పటికి పర్యాయంలో ఉన్న పీఠాధిపతి ఆశీర్వచనాలు ఇక్కడే ఇస్తారు. అష్టమఠాలు మార్చు ఉడుపి శ్రీకృష్ణమఠానికి అనుసంధానంగా అష్టమఠాలు కృష్ణమఠాలు ఉన్నాయి. ఈ ఎనిమిది మఠాలు ఉడుపి రథ వీధిలో, శ్రీకృష్ణ దేవాలయానికి చుట్టూ ఉంటాయి.

ఉడుపి అనగానే ఠక్కున గుర్తుకొచ్చేది కృష్ణమందిరం. ఇది ప్రపంచంలోనే ప్రముఖ కృష్ణమందిరంగా ప్రసిద్ధికెక్కింది. ఈ క్షేత్రంలో శ్రీకృష్ణుడు బాలకృష్ణుడి రూపంలో వెలిశాడు. ఉడుపి పూర్వపు పేరు శివళ్ళీ. ఈ దేవాలయం ఉడుపి రథవీధిలో కలదు. ఉడిపి కృష్ణమందిరాన్ని ప్రతి సంవత్సరం, లక్షలాది భక్తులు సందర్శిస్తారు. నవరంధ్రాలున్న కిటికీ ద్వారా స్వామి దర్శనం చేసుకోవడం ఈ దేవాలయానికి ఉన్న ప్రత్యేకత. ఇది మంగళూరుకు 60 కిలో మీటర్ల దూరంలో ఉంది.

ఉత్తర ద్వారం ద్వారా గుడిలోకి ప్రవేశించినప్పుడు కుడిపక్క దేవాలయ కార్యాలయం, ఇంకొద్దిగా ముందుకు వెళితే సరోవరం (కోనేరు) కనిపిస్తుంది. ప్రధాన ఆలయానికి ద్వారం ఎడమ పక్క ఉంటుంది. కొద్దిగా ముందుకువెళితే చెన్నకేశవ ద్వారం వస్తుంది. దీని ద్వారా గర్భగుడిలో ప్రవేశం ఉంటుంది. పీఠాధిపతులకు తప్ప లోనికి మరెవరినీ అనుమతించరు. చెన్నకేశవస్వామి ద్వారం నుండి ముందువెళ్ళితే ప్రదక్షిణం చేసిన తరువాత శ్రీకృష్ణదర్శనం వెండిచే తాపడం పెట్టపడిన నవరంధ్రాల కిటికీ నుండి చేసుకోవచ్చు. గర్భగుడికి కుడివైపు హనుమంతుడు, ఎడమవైపు గరుడ దేవుడు కనిపిస్తారు. స్వామిదర్శనం చేసుకొని ముందుకువెళ్ళి దక్షిణ మార్గంవైపు ప్రదక్షిణం చేసినట్లైతే ఎడమవైపు మధ్వాచ్యారులు మంటపం కనిపిస్తుంది. పీఠాధిపతి ఇక్కడే ఆశీర్వచనాలు ఇస్తారు.

## శృంగేరి

శృంగేరి కర్ణాటక రాష్ట్రం చిక్మగళూర్జిల్లాలో తుంగభద్రా నది ఒడ్డున ఉంది. శృంగేరి అనే పేరు ఋష్య శృంగగిరి నుండి వచ్చిందని చెబుతారు. విభాణ్డక మహర్షి కుమారుడైన ఋష్యశృంగ మహర్షి ఆశ్రమము, శృంగేరి దగ్గరగా ఉన్న శృంగపర్వతం వల్ల ఈ పేరు వచ్చిందని చెబుతారు. ఋష్యశృంగుడు రోమపాదుడి పాలిస్తున్న అంగరాజ్యంలో అడుగుపెట్టి ఆ రాజ్యాన్ని క్షామం నుండి విముక్తి కలిగించి వర్షాలు పడేటట్లు చేస్తాడు. ఈ వృత్తాంతము రామాయణము బాలకాండములో వస్తుంది. ఈ గ్రామములోనే శంకరాచార్యులు అద్వైతమును వ్యాప్తి చేయుటకై స్థాపించిన శంకరమఠమును దక్షిణామ్నాయ మఠం అని అంటారు.

శంకరాచార్యులు ధర్మప్రచారం కోసం దేశాటన జరుపుతున్న సమయములో, ఆయన తన పరివార శిష్యులతో ఇక్కడకు పర్యటించుచున్నప్పుడు ఒక సర్పము ప్రసవించుచున్న ఒక మండూకానికి నీడ కల్పించే సంఘటన ఆయనకు కనిపిస్తుంది. ప్రాకృతిక వైరులైన సర్పమండూకముల మధ్య పరస్పర మైత్రీభావము మరియు సర్పానికి మణ్డూకంపై అత్యంత దయార్థ్రభావము చూచి భగవత్పాద శంకరాచార్యుల మనస్సులో ప్రాకృతికవైరులలో మైత్రీభావము మూర్తీభవించి ఉన్నది కాబట్టీ ఈ క్షేత్రము అత్యంత పవిత్రమైనది అని స్ఫురించి అంతేకాకుండా ఇక్కడవరకు వచ్చేటప్పడికి మండన మిశ్రుడి భార్య అయిన ఉదయభారతి సరస్వతిమూర్తిగా మారిపోతుంది. ఈ రెండు సంఘటనలు చేశాక ఇక్కడే మెదటి మఠం నిర్మించాలని తలచి మెదటి మఠాన్ని ఇక్కడే స్థాపిస్తారు. ఆదిశంకరుడు ఇక్కడ 12 సంవత్సరాలు గడిపాడు అని చెబుతారు. ఆ తరువాత దేశాటన జరుపుతూ పూరిలో, కంచిలో, బదరిలో, ద్వారకలో మఠాలను స్థాపించారు. 1782 నుంచి 1799 వరకూ శ్రీరంగపట్నాన్ని రాజధానిగా చేసుకుని మైసూరు

సామ్రాజ్యాన్ని పరిపాలించిన ముస్లింపాలకులు హైదర్ అలీ, అతని కుమారుడు టిప్పుసుల్తాన్లకు శృంగేరీ శంకరాచార్యులపై చాలా గౌరవం ఉండేది. మరాఠీ సైన్యంవచ్చి రాజ్యంపై పడినప్పుడు శృంగేరీ మీద కూడా దాడిచేసి ఊరినీ, పీఠాన్ని కూడా దోచుకున్నారు. స్వామివారికి, వారి శిష్యులకు అన్న వస్త్రాలకే లోటు వచ్చింది. టిప్పుసుల్తాన్ ఈ సంగతి తెలుసుకుని వారికి ఆహారపదార్థాలు, బట్టలు, ధనం, మరెవ్వరైనా దోచుకోబోతే అడ్డుకుందుకు సైన్యాన్ని ఇచ్చి పంపారు.

## శారదాంబ దేవాలయం

శారదాదేవి జ్ఞానానికి విజ్ఞాన సర్వసానికి తల్లి. ఈ దేవాలయంలో ఉన్న అమ్మవారు శంకరాచార్యుల సమయము నుండి ఉన్నదని చెబుతారు. మండన మిశ్రుని భార్య అయిన ఉభయభారతి ఇక్కడ విగ్రహంగా మారిపోయిందని కూడా చెబుతారు. మొదట ఇక్కడ చందనంతో చేసిన విగ్రహం ఉండేది. ఆ చందన విగ్రహాన్ని 14వ శతాబ్దములో విద్యారణ్యస్వామి పీఠాధిపతిగా ఉన్న సమయంలో రాతి మరియు బంగార విగ్రహ ప్రతిష్ఠ చేసారని చరిత్ర బట్టి తెలుస్తోంది. ఆలయ పరిసరాలు 20వ శతాబ్దం వరకు చెక్కతో నిర్మించబడింది. అగ్నిప్రమాదము జరగడంతో పాతదేవాలయపు స్థానములో కొత్త దేవాలయము నిర్మించారు. జీర్ణోద్ధారణ జరిగిన ఆ ఆలయ ప్రాంగణం అంతా ద్రవిడ దేవాలయ నిర్మాణ శైలిలో జరిగింది.



## విద్యాశంకర దేవాలయం

శారదా శృంగేరి మఠానికి పదవ పీఠాధిపతైన విద్యాశంకర తీర్థుల స్మారకంగా ఈ దేవాలయాన్ని నిర్మించారు. ఆ తరువాత పీఠాధిపతి భారతికృష్ణతీర్థుల ఆధ్వర్యంలో 1357-58 మిగిలిన నిర్మాణం జరిగింది. విద్యారణ్యస్వామి విజయనగర సామ్రాజ్యం స్థాపించిన హరిహరరాయలు, బుక్కరాయలకు గురువు. ఈ ఆలయం నిర్మాణం హొయసల శైలలో జరిగింది. ఈ దేవాలయంలో విద్యాశంకరస్వామి లింగాకారంగా ఉంటారు. స్వామికి ఇరుప్రక్కల వినాయకుడు, అమ్మవారు ఉంటారు. ఈ దేవాలయం లోపలి

మండపంలోని స్థంబాలపై 12 రాశులు చెక్కి ఉంటాయి. ఆలయ నిర్మాణం, గవాక్షాల ఏర్పాటు (కిటికీ ఏర్పాటు) సూర్యకిరణాలు నెలల ప్రకారం ఆయా రాశులమీద పడేటట్లు చేయబడింది. ఇంకో విశేషం ఏమంటే మండపంలోని స్తంభాలపై ఉన్న గుండ్రపు రాళ్ళు గోళాకారంగా సింహపు నోటి నుండి బయటకు జారునట్లుగా చెక్కారు. ఇవి సింహం నోటిలో ఉన్నట్లు ఉంటాయి కాని గోళం అంచులు సింహం నోటికి తగిలి తగలనట్లు ఉండి జారిపడతాయి అనిపించేటట్లుగా అత్యద్భుతంగా చెక్కారు.

## శృంగేరి శారదాపీఠం

శృంగేరీ పీఠాధిపతియైన విద్యారణ్యస్వామి భారతదేశ చరిత్రలో ముఖ్యమైన విజయనగర సామ్రాజ్యము స్థాపింపజేసి హరిహరరాయలు, బుక్కరాయలకు మార్గదర్శనం చేశారు. విద్యారణ్యుని గౌరవార్థం ప్రపంచ ప్రఖ్యాతి పొందిన రాజధాని నగరానికి విద్యానగరం అని పేరు పెట్టారు. క్రమంగా ఈ నగరానికి విజయనగరమనే పేరు కూడా వచ్చింది. సామ్రాట్టులకు కూడా విజయనగర సామ్రాజ్య చక్రవర్తులనే పేరుతో పాటుగా విద్యానగర చక్రవర్తులనే పేరు కూడా వ్యాప్తిలో ఉంది. క్రీ.శ.1336 రాగిఫలకం ఆధారంగా "విద్యారణ్యుడి ఆధ్వర్యములో హరిహరరాయలు సింహాసనం అధిష్టించాడు" అని తెలుస్తోంది. విద్యారణ్యుడు హరిహరునికి ఆత్మవిద్య బోధించి "శ్రీమద్రాజాధిరాజ పరమేశ్వర అపరిమిత ప్రతాప వీరనరపతి" అనే బిరుదాన్ని ఇచ్చాడు. అప్పటినుండి ఇప్పటివరకు శృంగేరీ శారదాపీఠం పీఠాధిపతి బిరుదులలో "కర్ణాటక సింహాసన ప్రతిష్ఠాపనాచార్య" కూడా చేర్చి చెబుతారు.

ఆదిశంకరులు అద్వైతం ప్రచారం చేయడానికి నెలకొల్పిన నాలుగు మఠాలలో శృంగేరి శారద మఠం మెదటిది. దీనినే దక్షిణామ్నాయ మఠంగా చెబుతారు. దక్షిణ భారతదేశంలో ప్రాచుర్యములో ఉన్న కృష్ణయజుర్వేదము ఈ మఠానికి ప్రధాన వేదం. ఈ మఠానికి పీఠాధిపతిని స్వయంగా శంకరాచార్యులతో సమానంగా భావిస్తారు. ఆయన సన్యాస్యాశ్రమనామానికి ముందు శంకరాచార్య అని చేర్చబడుతుంది. ఇప్పటి శృంగేరి శారదమఠం పీఠాధిపతి భారతితీర్థులు.

## తుంగనది

### శృంగేరి వద్ద తుంగనది

శృంగేరి తుంగభద్ర నది ఒడ్డున ఉంది. తుంగ నది ఇటుప్రక్కన విద్యాశంకర దేవాలయం, దాని ప్రక్కన ఆ ఆలయానికి అనుసంధానం ఉన్న చిన్న చిన్న దేవాలయాలు ఉన్నాయి. ఇక్కడి పూజామూర్తులకు అవసరమైన జలాలన్ని ఇక్కడ నుండే తెస్తారు.



తుంగ భద్రనది అవతల ఒడ్డున నరసింహ వనం ఉంది. అభినవ విద్యాతీర్థ స్వామి ఆధ్వర్యంలో తుంగభద్రనదిపై విద్యాశంకర సేతువును నిర్మించారు. తుంగా నదిలో అసంఖ్యాకంగా చేపలు నది ఒడ్డుకు వస్తుంటాయి, భక్తులు చేపలకు అటుకులు మున్నగునవి ఆహారంగా వేస్తారు. తుంగానది ఇక్కడ చాలా లోతుగా ఉంటుంది, అందువలన ఇక్కడ ఈత కొట్టవద్దని హెచ్చరికలు ఉంటాయి.

## నరసింహవనం

నరసింహవనంలో శృంగేరి శారదామఠానికి చెందిన పీఠం ఉంటుంది. పీఠాధిపతి ప్రతిరోజు ఆ పీఠాన్ని అర్చిస్తారు. నరసింహవనంలోనే విదేహముక్తి పొందిన పూర్వపీఠాధిపతుల స్మారక స్థూపాలు కూడా ఉన్నాయి. అభినవ విద్యాతీర్థస్వామి, చంద్రశేఖర భారతిస్వామి స్థూపాలతో పాటు వారి విగ్రహాలు ఉంటాయి.

## ప్రయాణ సౌకర్యాలు

మంగళూరునుండి తరచు బస్సు సౌకర్యం ఉంది. షిమోగా నుండి కూడా తరచు బస్సు సౌకర్యం ఉంది. శృంగేరి నుండి ఉడిపికి బస్సు ఆగుంబె అనే ఊరి మీదుగా మలనాడు పర్వతశ్రేణుల మధ్యనుండి వెళ్తుంది. 24 సన్నటి హైర్పిన్హ్యాట్రోడ్డులో ఉడిపి చేరుకోవచ్చు.

# 3) మా బెంగుళూరు యాత్ర

మా అబ్బాయి శర్మ బెంగళూరు ఐబిఎంలో ఉద్యోగంలో చేరాడు. మమ్మల్ని రమ్మంటే 2011 జూన్‌లో వెళ్లి ఒక నెల రోజులున్నాం. ఆ సమయంలో మేము హిందూపూర్, బెంగుళూరు ట్రిప్, మైసూర్, శ్రావణ బెల్గోళా, బేలూరు, హలీబీడు, నా హోసూర్ ట్రిప్ యాత్ర చేశాం. ఆ విశేషాలు వరుసగా తెలియజేస్తున్నాను.

### నాఆటోగ్రాఫ్ – హిందూపురం – మరొకసారి – ప్రయాణం– 'గుర్తుకొస్తున్నాయి'

నేను నా శ్రీమతి, ఇందిర, శర్మ, హర్ష, హర్షిత బెంగలూరు నుంచి ఆదివారం అందరం కార్లో ఇక్కడికి యాభై కిలోమీటర్ల దూరంలో వున్న ఘాటీసు బ్రహ్మణ్య ఆలయం



వెళ్లాం. బాగుంది. ఎద్యురప్ప తరుచు వచ్చి దర్శనం చేసుకొనే క్షేత్రం ఇది. అక్కడి నుంచి అరవై కిలోమీటర్ల దూరంలో వున్న హిందూపురం వెళ్లాం. మేమున్న పాత ఇంటికి చేరాము. ఇంటివాళ్ళు తాళం వేసుకొని బయటికి వెళ్ళారు. అక్కడి ఇంటి ఫోటో తీశాం. అక్కడే వుండే నా స్నేహితుడు గుండురావు ఇంటికి వెళ్లాం. అతను బదరి వెళ్ళాడట. కొడుకు బానే మాట్లాడాడు.

అదే దగ్గరగావున్న మా చినప్పుడు మేము కూర్చొనే రామమందిరం చూసాం. అక్కడే కచేరి సావిడి వుండేది. అది పోలీసుస్టేషన్‌గా మారింది. మా నాన్న స్నేహితుడు రాఘవేంద్రరావు గారింటికి వెళ్తే ఎవ్వరు కనిపించలేదు. వీళ్ళ అబ్బాయి గోపాల్ గొప్ప డాక్టర్. అక్కడినుంచి దక్షిణామూర్తి దేవాలయానికి వెళ్ళాం. దక్షిణామూర్తి అనే స్నేహితుండుడేవాడు. ఆ దేవాలయం అర్చకుని కొడుకు. వాడు చనిపోయాడట. వాళ్ల తమ్ముడు కోడలువాళ్ళు చక్కగా మాట్లాడారు. అక్కడే దగ్గర గడ్డమీద స్కూల్లోనే నేను అయిదవ తరగతి వరకు చదివాను. దానికి దగ్గరలో కన్యకా పరమేశ్వరి గుడి, అయిదు లాంతర్ల స్థంభం, మా అక్కయ చదివిన హైస్కూల్ చూసి హోటల్లో టిఫిన్చేసి దారిలోవేణు గోపాల ఆలయము సూగూరు ఆంజనేయస్వామి గుడి చూసి బెంగళూరుకు రాత్రి ఏడున్నరకు చేరాం.

దారిలో విపరీతంగా పనసకాయలు కనిపించాయి గుట్టలు గుట్టలు. ఫోటోలు తీశాం. ఒక పండు చాలా పెద్దది డెబ్బైకి కొన్నాం. అన్నీ తోనలే. బాగుంది. దాదాపు పన్నెండు గంటల ప్రయాణం రాను పోను రెండువందల కిలోమీటర్లు. శర్మ బాగానే డ్రైవ్ చేశాడు. పిల్లలు హర్ష, హర్షిత బాగా ఎంజాయ్చేశారు. కోడలు ఇందిరా, మీ అమ్మ కూడా సంతోషించారు.



హిందూపురలో మా నాన్న ఇరవై రెండుఏళ్ళు హైస్కూల్లో తెలుగు పండిట్గా చేశారు. నేను



అయిదవక్లాస్ వరకు ఇక్కడే చదివాను. ఇది సుమారు అరవై రెండేళ్ళనాటి ముచ్చట (1948-52). ఎందుకో ఆ వూరు అంటే మాకు చాలా అభిమానం. బెంగళూర్నుంచి హిందూపురం నూట ఇరవై కిలో మీటర్లు. ఇదివరకు బెంగుళూర్లో నేనొక్కడినే హిందూపూర్వెళ్లి నేను తిరిగిన ప్రదేశాలన్నీ చూసి వచ్చాను. అదో గొప్ప అనుబంధం. ఆ ఊరు ఆ దారులు సందులు గొందులు అన్నీ కళ్ళకు కట్టినట్లు కనిపిస్తాయి. ఎప్పుడు ఆ వూరు కలలో కన్పిస్తూనే వుంటుంది. అదీ విశేషం. నా చిన్ననాటి స్నేహితులు అబ్బాయి, సోమసుందర్, చలపతి కల్లురావు, దక్షిణామూర్తి, నాగరత్నమ్మ అంతా పైకి వెళ్లిపోయారు. గోదావరిదేవి అని మా ఇంటి దగ్గర మునిసిపల్ కార్పొరేటర్గా ఉండేది. దర్జా మనిషి. వాళ్ళ ఆయనే రాఘవేంద్రరావుగారు. హైస్కూల్లో నాన్నతోపాటు వాళ్ళ అమ్మాయిలూ వెంకుబై, తారాబై, సునందలు. ఎప్పుడు మా ఇంటికి వాళ్ళు, వాళ్లిల్లకు మేము వెళుతూ వుండేవాళ్ళం. శ్రీనివాసరావుగారు అనే టీచర్మాకు హైస్కూల్నుంచి నాకు చాక్పీసులు తెచ్చిచ్చేవారు. ఆయన కోసం రోజు ఎదురు చూసేవాడిని. మాకు తెలుగు చెప్పిన సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, మా క్లాస్ టీచర్ ఆశీర్వాదంగారు, ఇరావతమ్మ టీచర్లు ఇంకా గుర్తే. ఫ్లూటు అద్భుతంగా వాయించే రాయప్ప మేస్టారికి నేనంటే చాలా ఇష్టం. గోదావరమ్మగారింటి పక్కనే ఈమని సుబ్రహ్మణ్యం అనే పురోహితుడు వుండేవాడు. ఆయన భార్య అన్నపూర్ణమ్మ. అమ్మకు గోదావరమ్మ, అన్నపూర్ణమ్మలు మంచి స్నేహితులు. పురోహితుని కొడుకే అబ్బాయి నాకు దోస్తు. మన్యంగారు ముడ్డి మీద గోచీ ఎగలాగి వంగి వడ్డన చేసేవాడు. ఆయన్ని నేను బాగా అనుకరించేవాడిని. అంత తరచుగా నాతో ఆ అనుకరణ చేయించి నవ్వుకొనేవారు. వీళ్ళ బంధువు రంగనాయకస్వామి గుడి దగ్గర వుండేవారు పురోహితుడే. సుబ్బరామయ్య అని ఒక పురోహితుడు బెంగళూర్రోడ్లో వుండేవాడు. హైస్కూల్ చాలా దూరం. అక్కడ డ్రాయింగ్ మాష్టారుతో నాన్నకు దోస్తీ. ఆదివారం వాళ్ళింటికి వెళ్ళేవాళ్ళం. హిందూపురంలో వుండగా భారతమాత పూజ చేసేవాళ్ళం ప్రతి శుక్రవారం రాత్రికి. ప్రసాదాలు నైవేద్యం పెట్టేవాళ్ళం. నాకు ఒక బృందం వుండేది. నేనే గాంగ్లీడర్. ఇల్లన్నీ మిద్దేలే. మేము పైఅంతస్తున్న మిద్దె ఇంట్లో వున్నాం.

మా మామ్మ కూడా మాతో వుండేది. ఆవిడే వంట. రేషన్రోజులవి. వుయ్యూరు



నుంచి బియ్యం రైల్లో మామయ్యా గంగయ్యగారు పంపేవాడు. ఎర్ర కిరసనాయిలే. బియ్యం దొరక్క పోతే రాగి సంకటే తినేవాళ్ళం. మా అమ్మ బాగా చేసేది. అందులోకి సాంబార్చాగా చేసేది. రెండు కలిపి తింటే ఆనందో బ్రహ్మ.. రాగిపొడిలో బెల్లం కలుపుకు తినేవాళ్ళం. అదిరేది. రేషన్లోవున్నా మా ఇంటికి వారానికి కనీసం ముగ్గురు పేద విద్యార్థులు వారానికి చెప్పుకొని మాతోపాటే రాగి సంకటి తినేవాళ్ళు. బాగా ధనవంతుల పిల్లలు నాన్న దగ్గరకు తెలుగు నేర్చుకోవటానికి వచ్చేవారు. ఆయనంటే అందరికి భయమే. ఆయనకు పైన విడిగా గది వుండేది. ఇంకోటి మాకు. పైన పెద్ద హాలుంది. అక్కడే అందరం పాడుకొనేవాళ్ళం. కింద వంట ఇల్లు, నెలమాలిగా చిన్నగదులు రెండు బాత్రూం ఉండేవి. నీళ్ళబావి వుంది. చాలా లోతుకు ఉండేవి. నీళ్ళు తోడాలంటే ప్రాణం గండంగా వుండేది. వేడినీళ్ళకు అందా ఒక పొయ్యిలో పాటిపెట్టి వుండేది. దానికి ఇంధనం చింత పిక్కలపొట్టు, లేక వేరుసెనగ పొట్టు బస్తలకు బస్తాలు వచ్చేవి. మాంచి పాలు, పెరుగు, వెన్న, నెయ్యి దొరికేది. నెయ్యిపోసే అమ్మాయి ఇప్పటికి కళ్ళకు కట్టి నలుస్తుంది. నెయ్యి పూసలు పేరుకొని ఘుమ ఘుమ వాసనలతో వుండేది. ఇంటికి లెట్రిన్లు ఉండేవి కావు.. బైటికు చెరువుగట్టుకో వెళ్ళేవాళ్ళు మగవాళ్ళు. ఆడవాళ్ళు సందుల్లోకి వెళ్ళేవారు పాపం. కాశీనాథ్ అనే డాక్టర్ మాకు ఫ్యామిలీ డాక్టర్. ఎర్రమందే దేనికైనా. సీసాలలో ఇచ్చేవాడు.

గోదావరమ్మ చివరి కూతురు సునంద, మూర్తి అనే నాన్న శిష్యుడిని వివాహం చేసుకొంది. మేము హిందూపూర్ 1952లో వదిలేశాము. మా నాన్నకు ఇక్కడ సేవిసుతో పరిగణించి కాకాని వెంకటరత్నంగారు కృష్ణాజిల్లా బోర్డు ప్రెసిడెంట్గా వుండగా జగ్గయ్యపేట జిల్లా హైస్కూల్కు బదిలీ చేశారు. తర్వాత వుయ్యూరు వచ్చి మూడేళ్ళ తరువాత వుయ్యూర్లోనే రిటైర్ అయారు.

హిందూపురలో నేను రాజేంద్రప్రసాద్గారిని సంజీవరెడ్డిగారినీ సభల్లో చూశా. ఇక్కడి చాలమంది కవులు, రచయితలతో నాన్నకు పరిచయాలు బాగా ఉండేవి. వారి రచనలు పంపి అభిప్రాయం కోరేవారు. కల్లూరు సుబ్బారావుగారితో గురుమూర్తిగారితో పరిచయాలు ఉండేవి. ఆంధ్రదేశం నుంచి విశ్వనాధ, జొన్నలగడ్డ సత్యనారాయణ, జమ్మలమడక, జటా వల్లభ వంటి ఉద్దండులు ఇక్కడ ఉపన్యాసాలకు వచ్చి మా ఇంట్లోనే

వుండేవారని అమ్మ చెప్పింది. ఇక్కడ పెట్టిన భగవద్గీత పోటీల్లో నాకు, మా అక్కదుర్గాకు ప్రథమ బహుమతులు వచ్చాయి. శ్లోకాలను వెనకా నుంచి ముందుకు కూడా చెప్పించారు. మా నాన్నగారు మృత్యుంజయశాస్త్రి గారే మాకు భగవద్గీత నేర్పారు. అప్పుడు బహుమతిగా ఇచ్చిన భగవద్గీత పుస్తకమే ఇప్పటికీ నేను రోజు పారాయణ చేసేది.



నాకు భక్తియోగంలో మా అక్కయ్యకు పురుషోత్తమ ప్రాప్తియోగంలో పరీక్ష చేసారు. ఇక్కడ టూరింగ్ ఉండేవి. సినిమాకు వెళ్తే తినుబండారాలు మంచినీళ్ళ మరచెంబు ఉండాల్సిందే. సంసారం, సత్యమేవ జయతే చూసినట్లు జ్ఞాపకం. దసరా ఇక్కడ బాగా చేస్తారు. దశమినాడు బస్సులు బందీలు అన్నిట్లో అందరిని ఫ్రీగ ఎక్కించుకొని ఊరంతా తిప్పేవారు. మేము సూగూరు ఆంజనేయస్వామి గుడిదాక వెళ్లి దర్శనం చేసుకొని తిరిగి వచ్చేవాళ్ళం. ఎక్కడికైనా వెళ్ళాలంటే జట్కాబండ్లే. నాన్న శిష్యుడు ఒక కుంటి సాయిబుగారు మాకు జట్కా కట్టేవాడు. మేమేప్పుడైనా సెంటర్కు వెళ్తే అక్కడి నుంచి జట్కా కావాలని అబద్ధం చెప్పి ఇంటికి వచ్చి దాక్కునేవాళ్ళం. కాసేపు చూసి వెళ్లిపోయేవాడు.

హిందూపురం దగ్గర విదురాశ్వత్థం అనే క్షేత్రం వుంది. వీలైనప్పుడు వెళ్ళేవాళ్ళం. లేపాక్షి చాలాసార్లు చూశాం. అందులో పూజారి నాన్న శిష్యుడు. మాకు భోజనం కూడా పెట్టేవారని జ్ఞాపకం. మా మేనమామ ఒకసారి వాళ్ళ అమ్మాయితో వచ్చి మమ్మల్నందర్నీ బెంగుళూరుకి తీసుకొనివెళ్లి అన్నీ చూపించాడు. ఇక్కడ బెల్లం, వేరుసెనగ, చింత పండు మండీలు ఎక్కువ. వీటి



వ్యాపారం బాగా జరుగుతుంది. బెల్లపు చెరుకు పండుతుంది. బెల్లం చిన్న అచ్చులు ముద్దల్లగా ఉండేవి. భూమిలో అందాలో దాచేవాళ్ళు.. తేళ్ళు, మండ్రగబ్బలు ఎక్కువ. ఎవరింట్లో వచ్చినా నన్నే కేకవేసేవారు, నేను ధైర్యంగా వెళ్లి చంపేవాడిని. అప్పుడు ప్లేగువ్యాధి బాగా వుండేది. ఇల్లంతా ఖాళీచేసి తలుపుకు కింద చిన్న రంధ్రం చేసి మందు పిచికారే చేసేవాళ్ళు. నాలుగురోజులైతే కాని తలుపు తీయరు. వందలాది ఎలుకలు చచ్చి పడి ఉండేవి. వాటిని తీసి వూరు బయట తగల బెట్టెవారు. ఇదంతా మునిసిపాలి టియే చేసేది.

ఇక్కడి జనానికి భక్తి ఎక్కువ. ప్రతి దేవాలయంలో పూజలు బాగా జరిగేవి. ధనుర్మాసం శివాలయంలోను జరిగేది. ప్రసాదాలకు వెళ్ళేవాళ్ళం. హరికథలు బాగా చెప్పించేవారు. తెనాలికి చెందిన పిల్లలమర్రి రామదాసుగారు నెలల తరబడి హరికథలు చెప్పేవారు. ఆఖరిరోజున వారికి ఘన సత్కారంచేసి దానం బాగా ఇచ్చి సమారాధన చేసి సాగానంపేవారు. ఇక్కడి వైశ్యులు మహా వితరణ శీలులు. కన్యకామ్మవారి గుడిలో ఎప్పుడు కార్యక్రమాలు జరిగేవి. ఇక్కడి జనం తాంబూలం బాగా వేసేవారు. బొడ్డు దగ్గర చిన్న సంచీ వుంటుంది. అందులో అరలుంటాయి. వాటిలో సున్నం వక్క, తంబాకు వుంటాయి. అవి చుట్టు కోతం నోట్లో వేసుకోటం వుమ్మేస్తుండటం అందరికి ఇదే అలవాటు. ఇప్పుడు చుస్తే నాకు పెద్దగా అలనవిలేవాళ్ళు కన్పించలేదు.

మా ఇంటిదగ్గర ఒక ముస్లిం కుటుంబం వుండేది. వాళ్ళు సాయంత్రం ఏడుగంటలకు అందరు వరుసగా కూర్చొని స్వీట్లు ఫలహారంగా తినేవారు. ఒకసారి ఎందుకో వాళ్ళింటికి వెళ్తే మాకు పెట్టారు. అప్పటి నుంచి రోజు మా కోసం ఎదురు చూసేవారు. మేము వెళ్ళకపోతే కబురు చేసేవారు. తల్లి, తండ్రి కొడుకులు. మా ఇంటి దగ్గరే 'రాయల కళాభవనం' అనే ఇల్లుండేది. యజమాని పేరుకల్లూరి సుబ్బారావు అని జ్ఞాపకం. భార్య చాలా మంచిది. నెలకోసారి సాహిత్య సభలు జరిపేవాడు. అంతకా కలిపి అయిదారుగురు కూడా వుండేవారు కాదు. మేము ఉత్కంటతో వాకిట్లో నుంచి చూసేవాళ్ళం. ఆయన బాగా కోపిష్టి. కేకలేసెవాడు. మర్నాడు పేపర్లో సభ బ్రహ్మాండంగా జరిగినట్లు జనం బాగా వచ్చినట్లు రాసేవారు. ప్రత్యక్షసాక్షులం మేము కనక మాకు నవ్వు వచ్చేది. అందుకే ఎక్కడైనా సభ జరిగి జనం లేకపోతే రాయలవారి సభా భవనం అని ఎక్కిరించేవాళ్ళం. ఇదీ హిందూపురంతో మా అనుబంధం. ఒక్కసారి వెనక్కి తిరిగి చుస్తే జ్ఞాపకం వచ్చిన.

## మా మైసూర్ దర్శనం

నిన్న అంటే జూలై ఏడవ తేది మైసూర్ యాత్రకు బయల్దేరాం. బెంగళూర్నుంచి india tourism development corporation వాళ్ల బస్సులో మార్తహాళ్లి నుంచి



మైసూరుకు 160 కిలో మీటర్లు. రాను పోను ఒక్కొక్కరికి 390 రూపాయలు. ఉదయం ఆరు గంటలకు ఇక్కడ బయల్దేరిన బస్ ఏడుంబావుకు మెజెస్టిక్ చేరింది. అక్కడి నుంచి ఒక గంట ప్రయాణం తర్వాత ఒక హోటల్‌లో టిఫిన్‌కు ఆపారు. ఇక్కడ ఇడ్లి చిన్న ఉతప్పంలాగ వుంది. గారే బావుంది. కాఫీ పర్లేదు. దారి అంతా పచ్చదనం పరచుకొన్నట్లు కన్నుల పండువగా ఉంది. ఎత్తైన చాలా లావుగా వున్న వృక్షాలను చూశాం. చెరుకు పంట ముఖ్యంగా బెల్లం చెరుకు సాగు కనపడింది. బెల్లం తయారుచేసే బట్టీలు కన్పించాయి. కావేరి పరీవాహక ప్రాంతం కనుక వరి బాగా పండుతుంది. నూర్చిన వెంటనే మళ్ళీ పంట వేయటం కన్పించింది. కోనసీమ అందాలను పోలి వుంది. కొబ్బరిచెట్లు విస్తారంగా వున్నాయి. కొబ్బరికాయలు కూడా చాలా పెద్దవి.. పూలతోటలు ముచ్చటగా వున్నాయి. సుమారు పదకొండు గంటలకు శ్రీరంగపట్నం చేరాం. నాలుగు లైనుల దారి. స్పీడ్‌బ్రేకర్లు స్పీడును తగ్గించాయనిపించింది. ఎన్నో ఏళ్ళ కోరిక మైసూర్ దర్శనం ఇవాళ తీరుతోందని ఆనందం. రెండుసార్లు అంతకు ముందు బెంగుళూరు వచ్చినా మైసూర్ రావటం కుదరలేదు.

## శ్రీరంగపట్నం

వైకుంఠంలో విరజా నదితో సమానమైనది కావేరి నది. "విరజా నది ఏ శ్రీకావేరి –శ్రీరంగనాధుడే అల "శ్రీనాధుడు" అని అందరికి నమ్మకం. శ్రీరంగానాధుడిని మన్నారు దేవుడనీ అంటారు. రంగనాధుడు ఇక్ష్వాకురాజుల ఇలవేలుపు అని విశ్వనాథ తమ కల్పవృక్ష రామాయణంలో తెలియజేశారు. ఇక్కడి ఆలయం కలియుగ వైకుంఠమే. మూడు రంగనాథ క్షేత్రాలు వున్నాయి. తూర్పున శ్రీరంగంలో, దక్షిణాన అనంత శయనమ్‌లో, పశ్చిమాన శ్రీరంగపట్నంలో. అన్నిచోట్ల విగ్రహాలు స్వయం వ్యక్తమూర్తులే. శ్రీరంగపట్నంలో దక్షిణ, ఉత్తర పశ్చిమ కావేరి నదులు కలిసిపోతాయి. ఒకప్పుడు కావేరి నది శ్రీరంగానాధుని గురించి తపస్సు చేసింది. ఆమెకు మూడు వరాలిచ్చాడు స్వామి. గంగకంటే కావేరి పవిత్రమవుతుందని, శ్రీరంగం గొప్ప యాత్రాస్థలం అవుతుందని శ్రీరంగడు ఇక్కడే శేషతల్పం మీద శ్రీమహావిష్ణువు లాగా ఇక్కడే కావేరి నదీ సేవలో స్థిరంగా వుండిపోతాడని వరం ఇచ్చాడు.. ఇక్కడి స్వామిని బ్రహ్మ

రుద్రాది దేవతలు అర్చించారు. శ్రీరంగనాద వైభవాన్ని గౌతమ మహర్షి వర్ణించి చెప్పాడు. మేషమాసంలో, శుక్ల పక్ష సప్తమినాడు శనివారం వశిష్ట వామదేవాది ఋషులు స్వామిని దర్శించారు. ఇక్కడ మూర్తి శేషసాయిగా కుడిచేతిలో తలపెట్టుకొని, ఎడమచేతిని చాపుకొని, వక్షమునందు శ్రీలక్ష్మీదేవితో కనిపిస్తాడు. అందుకే ఈ క్షేత్రానికి గౌతమ క్షేత్రమని, బ్రహ్మానంద విమానమని పేరు వచ్చింది.

నారదుని వలన గౌతముడు పంచరాత్ర విధానంతో స్వామిని అర్చించాడు. తులా మాసంలో గంగానది కావేరిలో చేరి భక్తులకు ముక్తినిస్తుంది. తులామాసంలో కృష్ణపక్ష దశమినాడు అష్టతీర్ధస్నానం చేసి కోరికలను నెరవేర్చుకుంటారు. కావేరిలో ఒకసారి స్నానం చేస్తే గంగలో మూడురోజులు, యమునలో అయిదు రోజులు స్నానం చేసినంత ఫలితం లభిస్తుందని విశ్వాసం. ఒకప్పుడు ఇంద్రుని భార్య శచీదేవిపై మోహపడిన చిత్రసేన, చిత్రరదులనే గంధర్వులు ఇంద్రశాపం చేత రాక్షసులై, చివరికి తులామాసంలో పౌర్ణమిరోజు ఇక్కడి కావేరిలో స్నానం చేసి శాప విముక్తులైనారు. ఈ క్షేత్రాని కిలక్కోద్యానవనం అని పేరుంది. లక్ష్మీనరసింహ, గంగాధరేశ్వర, జ్యోతిర్మని ఆళ్వారులు కొలువై ఉన్నారిక్కడ.. ఈ ఆలయ అంతర్భాగాన్ని 817లో హంబి అనే నర్తకి నిర్మించింది. 894లో గంగావంశరాజు తిరుమలయ్య నవరంగమంటపాన్ని, తిరుమల శ్రీనివాస ఆలయాన్ని కట్టించాడు. 1117లో శ్రీమద్రామానుజులు ఈ క్షేత్రదర్శనం చేశారు. అప్పుడు హోయసలబిట్ట దేవుడు పాలిస్తున్నా అతన్ని జైనమతం నుంచి వైష్ణవానికి మార్చి, విష్ణువర్ధనరాయలు అనే పేరు పెట్టాడు. రాజు ఇచ్చిన అధిక ద్రవ్యాని, ఎనిమిది గ్రామాల భూమిని స్వామి సేవకు వినియోగించారు. హేబ్బరులు, లేక ప్రభువులను రక్షకులుగా నియమించారు. 4454లో రాజా తిమ్మనిహెబ్బార్ విజయనగరం చేరి రాజాస్థానంలో దశనాయకుడయ్యాడు. తరువాత ఇక్కడికి వచ్చి కోటను, ఆలయద్వారాన్ని పెద్ద గోడను చుట్టూ నిర్మించాడు.

తర్వాత శ్రీరంగపట్నం విజయనగర ప్రభువుల పాలనలోకి వచ్చింది. రాజా ప్రతినిధి శ్రీరంగరాయలు పట్టణాన్ని బాగా విస్తరింపజేశాడు. ఆలయంలో లోపలి ప్రాకారాన్ని అయిదు మెట్లను, రెండుప్రక్కల రెండు రాతి ఏనుగుల్ని నిర్మించాడు. ఇతని భార్య అలుమేలమ్మ అనేక ఆభరణాలను సమర్పించింది. వాటిని మంగళ, శుక్రవారాల్లో అలంకరిస్తారు. శ్రీరంగరాయలకు సంతానంలేదు. అప్పటి మైసూరు మహారాజు శ్రీరాజావడియార్కు రాజ్యం అప్పగించి తల్కాడు సమయంలో విశ్రాంతి తీసుకొన్నాడు.

శ్రీరాజావడియార్ ఒకసారి ఇక్కడికి దర్శనానికి వచ్చాడు. మంగళ, శుక్రవారాల్లో అలంకరించిన ఆభరణాలను అలువేలు మంగమ్మకు తిరిగి ఇచ్చి వేస్తుండేవారు. ఇది గమనించి ఒడియార్ ఆ నగలు ఆమె దగ్గర ఉండకూడదని వెంటనే ఇచ్చేయమని ఆజ్ఞాపించాడు. ఆమె ఇవ్వలేదు. గుర్రం ఎక్కి తలకాడుకు పారిపోయి, మలంగి దగ్గర

వాటిని కావేరిలో పారేసి, తాను ఆ అగాధ జలాల్లో దూకి మునిగింది. వెంట తరిమే సైనికులతో తలకాడు ఎడారి అవుతుందని మైసూర్రాజులు సంతాన హీనులవుతారని శపించింది. వెంటనే మలంగి అగాధంగా మారి దాని చుట్టూ ఎడారి ఏర్పడింది. అదే తలకాడు ఎడారి ఇప్పటికి కనిపిస్తుంది.

ఒడియార్‌కు ఈ విషయం తెలిసి బాధపడి, ఆమె విగ్రహం చేయించి రాజమందిరంలో పెట్టించాడు .. నిత్యం పూజ చేసేవాడు. అప్పటినుంచి ఇప్పటిదాకా ఆ పూజ జరుగుతూనే వుంది. దసరాల్లో చాల వైభవంగా ఈ పూజ జరుగుతుంది. ఆలి ద్వారం దగ్గర అలవేలు మంగమ్మ, శ్రీరంగరాయల శిలావిగ్రహాలు కనిపిస్తాయి. ఆమె బహుకరించిన నాసికాభరణం ఇప్పటికి కనిపిస్తుంది. అది మొదట్లో నిమ్మపండు అంతా వుండేది. క్రమంగా తగ్గుతూ చిన్నది అయిపోతుండటం గమనించదగింది.

1610 నుంచి 1699 వరకు శ్రీరంగపట్టణమే మైసూరు రాష్ట్ర రాజధాని. 1760లో ఇమ్మడి కృష్ణదేవ ఒడియార్హై దేరాలీనిసేనాపతిని చేశాడు. హైదర్ రంగని భక్తుడు. రాత్రిపూట అతనికి స్వామి కలలో కన్పించి మాట్లాడేవాడట. తరచూ స్వామి దర్శనం చేసేవాడు. ఒకసారి శత్రుశైన్యం మైసూర్ రాష్ట్ర సరిహద్దు దాటి వచ్చారు. హైదర్వారితో యుద్ధం చేశాడు. శత్రువుదే పైచేయిగా వుండి గోదావరిఒడ్డున యుద్ధం జరిగింది. హైదర్రంగానాధుని ధ్యానించి గోదావరి లోతు తగ్గాలని ప్రార్ధిన్చాదట. వెంటనే నది బలహీనమైందట. హైదర్సేన తేలిగ్గా అవతలి ఒడ్డుకు చేరి శత్రుసంహారం చేసి మైసూర్ రాజ్యాన్ని కాపాడాడు. వెంటనే గోదావరి మళ్ళీ ఉధృతం అయిందట. శత్రువులు దాటలేకపోయారు. హైదర్ తేలిగ్గా శ్రీరంగపట్నం చేరాడు సైన్యంతో. దీన్నిబట్టి హైదర్‌కు రంగానాధునిపై ఎంత భక్తీవిశ్వాసాలున్నాయో తెలుస్తోంది.

ప్రతి ఏడుధనుర్మాసంలో ఇరవై ఒక్కటి రోజూ నుండి ఇక్కడ కొటారి ఉత్సవాలు వైభవంగా జరుగుతాయి. దీనికోసం పెద్ద కోతరం నిర్మించారు. ఈ సమయంలో మైసూర్మహారాజు స్వయంగా పాల్గొనటం ఆనవాయితీ. తొమ్మిదో రోజున స్వామికి మోహిని అలంకారాన్ని వేసి రాజుతో పూజ చేయిస్తారు. సంగీత కచ్చేరీలు జరుగుతాయి. వీటిలో రాజు, రాజా కుటుంబీకులు, హైదరాలి, జనానా అంతా భక్తి శ్రద్ధలతో పాల్గొనేవారు. 1774లో ఎనిమిదవ రోజూ అగ్ని ప్రమాదం జరిగినది. రాజు బాధ పడ్డాడు. వెంటనే నిమిషాల మీద హైదరాలి ఉత్సవం నిర్విఘ్నంగా జరిగే ఏర్పాట్లు చేశాడు. మర్నాడు ఉత్సవం ప్రారంభించే సమయానికే కొత్త మండపం కట్టించాడు హైదర్. దీనికే పాతాల మండపం అని పేరు.

1782లో హైదర్మరణం తర్వాత టిప్పుసుల్తానే సేనాధిపతి అయాడు. అతను రాజును తొలగించి తానే మైసూర్ రాజు అయాడు. అప్పుడు ఇమ్మడి కృష్ణరాజా ఒడియార్ అయిదేళ్ళవాడు. మహమ్మదీయుల దాడిలో అతన్ని రంగనాధ గోపురం



అయిదవ అంతస్తులో దాచి కాపాడారు. టిప్పు పరిపాలనలో మీర్సాదికు ప్రముఖ స్థానం పొందాడు. ఇతడు ఇక్కడి కొన్ని దేవాలయాలు ధ్వంసం చేశాడు. దీని బారినుండి కాపాడుకోవటానికి ఆలయ అధికారులు ఆలయాలకు ఇంటికప్పులు వేయించారట. పూర్ణయ్యవీధిలో వున్న జనార్దనస్వామి అలాంటిదే. చిన్న దేవాలయాలలోని దేవుళ్ళను అర్చకులు రంగనాథ ఆలయానికి తీసుకొని వచ్చి కాపాడుకొన్నారు. గోడల లోపలి వైపున ప్రతిష్టించారు. అలాంటివాటిలో శ్రీకృష్ణ, పట్టాభిరాం, మురళీకృష్ణ విగ్రహాలున్నాయి. హైదర్కురంగనిపై భక్తి ఎక్కువగా వుండటంతో దీని జోలికి పోలేదు.

ఆంగ్లేయుల పాలనలో, వారితోటి యుద్ధంలో టిప్పుకు చాల డబ్బు కావలసివచ్చింది. అప్పుడు రంగనాథాలయంలోని విలువైన ఆభరణాలను తీసుకొనిపోయి వారికిచ్చి సంతృప్తి చెందిన్నాడని కథనం. కొన్ని ఫ్రెంచ్‌వారికి, కొన్ని రష్యావారికి చేరాయట. క్రెమిన్ రాజప్రసాదంలో ఇప్పటికి అవి కన్పిస్తాయట. ఇప్పుడున్న స్వామి ఆభరణాలన్నీ టిప్పుసుల్తాన్ స్వామికి బహుకరించినవేనట. 1799లో శ్రీరంగపట్నం బ్రిటిష్వారివశం అయింది. ముమ్మడి కృష్ణరాజా ఒడియార్మైసూర్ను రాజధానిగా చేసి, పూర్ణయ్యను దివాన్‌గా నియమించారు. కోతరోత్సవం మామూలుగా జరిపాడు. తొమ్మిదవ రోజూ స్వయంగా పాల్గొనేవాడు. నాల్గవ కృష్ణరాజా ఒడియార్శ్రీ చామ రాజేంద్ర స్మారక సత్రాన్ని నిర్మించాడు. కావేరి నదికి మెట్లు కట్టించాడు. దీన్నే రాజాఘట్టం అంటారు. తులసివనం స్వామి పూజకోసం ఏర్పాటయింది. ఆయన జన్మదినమైన ఆషాఢ బహుళ విదియనాడు స్వామి మెరవాలి ఈ మండపానికి చేరుతుందట. ఆ కార్యక్రమాన్ని 'చక్కరపొంగలి ఉత్సవం' అంటారట. జయ చామరాజావడయార్పాలనలో కూడా అంటే 1954 వరకు ఈ ఉత్సవాలు జరిగేవి.

మొదట్లో శ్రీరంగనాధుడు తూర్పుముఖంగా చేతికి, శిరస్సుకు మధ్య ఎడముగా తలపైకెత్తి వుండేవాడట. కాలక్రమంలో మార్పు చెంది ఇప్పుడున్న ముద్రాస్థితిలో ఉన్నాడని బాగా వృద్ధులైన పూజారులు, యాత్రికులు చెప్పుతారు. ఇది ఇక్కడి విశేషం. స్వామి దర్శం కన్నుల పండుగ చేసుకొని, ఆనందంతో బస్సు ఎక్కి నెమ్మదిగా మైసూర్వైపుకు ప్రయాణం సాగించాం. ఇక్కడికి పదహారు కిలోమీటర్ల ఇక్కడే శిధిలమైన శ్రీరంగపట్టణమ్కోట, కోటలోకి నీటిమార్గం ద్వారా ఆంగ్లేయులు ప్రవేశించినచోటు,

టిప్పు సమాధి అన్నీ బస్సులో నుంచే చూసాం. మహావైభవంగా వెలిగి, బ్రిటిష్ వారితో పోరాడి భారతదేశ స్వాతంత్ర, స్వేచ్ఛకోసం అసువులర్పించిన మహావీరుడు టిప్పుసుల్తాన్ వీరమరణం పొందాడు. జనహృదయంలో స్థిరస్థానం సంపాదించాడు. జోహార్ టిప్పుసుల్తాన్.

.



## మా మైసూర్ దర్శనం-2

శ్రీరంగపట్నం నుంచి మైసూరుకు వెళ్ళేదారిలో కావేరి ఆనకట్ట నుంచి మైసూరుకు మంచినీళ్ళు సరఫరా చేసే వ్యవస్థ కన్పించింది. చాలా ఎత్తైన పిల్లర్లమీద నీటిని తోట్టేల్లాంటి సిమెంట్ కాలువ ద్వారా సరఫరా చేస్తున్నారు. గొప్ప టెక్నికల్ vision. అది మహానుభావుడు మోక్షగుండం విశ్వేశ్వరయ్య గారి ప్రణాళిక. మైసూర్ జన దాహార్తి తీర్చిన అపర భగీరథుడాయన. బృందావన్ గార్డెన్ల నుంచి ఈ సరఫరా. దాదాపు నలభై కిలోమీటర్ల దూరం. అద్భుతమైన ఆలోచన, ఆచరణ. దీనికి ఆమోదం చెప్పి ఆవిష్కరింపజేసిన మైసూర్ మహారాజు ధన్యుడు, స్మరనీయులు ఆయన, మోక్షగుండం కూడా. ఆయనది జ్ఞాన, విజ్ఞానగుండం. జనం హితమే మోక్షమని నమ్మి ఆచరించిన, అపర విశ్వేశ్వరుడు. గంగను తలపై ఆయన ధరిస్తే ఈయన నిరంతర కావేరి ప్రవాహం సాధించాడు.

కావేరినదిలో ముఖ్యంగా తల కావేరిలో అంటే జన్మస్థానంలో అంటే మైసూరుకు 164 కిలోమీటర్ల దూరంలోవున్న చోట తులా సంక్రమణం నాడు స్నానం చేస్తే మోక్షమే. ఇది అక్టోబర్లో వస్తుంది. ఇక్కడ కావేరి చిన్న గుంటగా కన్పించటం విశేషం. అక్కడి నుంచి ఒక సిల్క్ పాలెస్ దగ్గర బస్సు ఆగింది. అక్కడ షాపింగ్ చేసాము. 40 గ్రాముల సిల్కీ చీరలు ఇక్కడ ప్రత్యేకం. ఉంగరం రింగ్లో నుంచి మొత్తం చీర దూరి రావటం దీని ప్రత్యేకత, నలభై గ్రాములే వుంటుంది చీర బరువు. అందుకే ఆ పేరు. పైన మంచి గంధం స్టోర్సువుంది. చూడటం తప్ప కొనే స్థాయిలో వుండవు. తర్వాత ఒక హోటల్ దగ్గర భోజనానికి ఆపాడు. మేము ఇంటి నుంచి తెచ్చుకున్న చపాతీలు, పెరుగు అన్నం రోడ్ పక్క చెట్ల కింద తిన్నాం. తెలుగువాళ్ళు చాలామంది మాతో వచ్చారు.

అక్కడి నుంచి మైసూర్ పాలెసు కువెళ్ళాం. టికెట్లు డబ్బిస్తే కొని ఇచ్చారు.



రాజ భవనం చూశాం. చాల అద్భుతంగా వుంది. రెండు కళ్ళు చాలవు. వైభవం అంతా మూర్తీభవించి కన్పించింది. చాలా అందంగా ప్రతిదీ కళాత్మకంగా వుంది. వెలుగు, వెలుతురూ బాగా ప్రవేశించేట్లుంది. రాజాగారు దసరానాడు ఎక్కి ఊరేగే బంగారు అంబారి వుంది. రాజవంశం అంతా కళ్ళకు కట్టినట్లు వుంది. వెండి ద్వారాలున్నాయి. దర్బారు హాలు బాగుంది ముచ్చటగా. అమ్మవారి అన్నిరకాల మూర్తులున్నాయి. గొప్ప పేయింటింగ్స్ కట్టి పడేస్తాయి. ఆరంగుల సమ్మేళనం గొప్ప ఆకృతులను సృష్టించింది. పెద్ద పెద్ద డోముల్లో లైట్స్ ఆశ్చర్యంగా వుంటాయి. మహారాజ వైభవం అంతా అడుగు అడుగునా దర్శనమిస్తుంది. ఒకరకంగా సకల కళావేదిక ఆ రాజా ప్రాసాదం. ఇదొక్కటే చూశాం. ప్రక్కనే museum వుంది. చూడలేదు. దీని దగ్గర నవీన కృష్ణాలయం వుంది. దర్శించాము. తలుపులు మూసేసినా తలుపులకున్న రంధ్రాలలో నుంచి స్వామిని దర్శించవచ్చు.

తర్వాత ఆదిలక్ష్మీ రమణ స్వాములను దర్శించాము. లోపలి camera అనుమతించరు. బయటే డిపాజిట్చేయించుకొని lockerలో పెట్టి తాళం చెవి నెంబర్ ఇస్తారు. అంతా పూర్తిగా చూసింతర్వాత తాళం చెవి, నెంబర్వున్న కాగితం ఇస్తే మనకామెర ఇచ్చేస్తారు. ఇది ఉచితసేవ. అలాగే చెప్పులు కూడా గంటన్నర సమయం ఇస్తారు ఇవన్నీ చూడటానికి. త్వర త్వరగా చూశాము.. పాపం ప్రభావతి నడవలేక నడిచి అంతా చూసింది.



సుమారుగా నాలుగు గంటలకు బయల్దేరి సుమారు నలభై నిమిషాల ప్రయాణంతో చాముండి హిల్స్కి చేరాం. తిరుపతి కొండ ఎక్కినట్లే వుంటుంది ఘాట్రోడ్ అయిదు కిలోమీటర్లు. పై నుంచి చూస్తే మైసూర్ అంతా చిన్న అట్ట పెట్టెలు లాగా కన్పిస్తుంది. చాముండీ రేస్కోర్సు మైదానం, వగైరాలన్నీ కనిపిస్తాయి. పచ్చని ప్రకృతి మధ్య అందమైన ఎత్తైన ప్రదేశం

సముద్రమట్టానికి 2525 అడుగుల ఎత్తువున్న కొండ ఇక్కడే చాముండేశ్వరిదేవి ఆలయం వుంది. పరమ అద్భుతమైన మూర్తి. ఆమె మహిషాసురమర్దిని. ఇక్కడే మహిషాసురుణ్ణి మట్టుపెట్టి చంపింది.

మహిషుడు పాలించిన ప్రదేశం కనుక ఈ ప్రాంతాన్ని మహిషమండలం అనీ, మహిషపురం అనీ మైసూరుకు పేరు వచ్చింది. సంపెంగపూలు విరివిగా దొరుకుతాయి. అమ్మవారికి వాటిని భక్తితో సమర్పించాము. పనసచెట్లు, చెట్లనిండా కాయలతో కనువిందు చేస్తాయి. మామిడిచెట్లు, అశోకచెట్లు, వేప, నేరేడు, యుకలిప్టాస్చెట్లు ఎక్కువ. ఇక్కడే మహిషాసురుని విగ్రహం మొదట్లోనే కన్పిస్తుంది.



ఇక్కడి నుంచి ఒక గంట ప్రయాణంలో బృందావన్ గార్డెన్స్‌కు చేరాము. రెండు గంటల సమయం ఇచ్చారు చూడటానికి. ఇక్కడే కావేరి నదికి చాలా ఎత్తైన ఆనకట్ట కట్టారు. ఇదీ విశ్వేశ్వరయ్యగారి అద్భుతమైన ఆలోచనే. ఆనకట్ట నీటిని ఉపయోగించి గొప్ప ఉద్యానవనం నీటి ఫౌంటైన్స్, జల జలా జారి పారీ ప్రవాహాలు పచ్చని పసరికచెట్లు పుష్పవనాలు ముచ్చటగా వుంటుంది. బ్యూటిఫుల్ ప్లేస్. అందుకే మైసూరుకు సిటీ అఫ్గార్డెన్స్ అని పేరు చక్కగా సరిపోతుంది. తప్పక చూడాల్సిన ప్రదేశం. సర్వం మరిచి ఆనందానుభూతికి లోను అవుతాం. డామ్కు ఆనుకొని కావేరి మాత విగ్రహం పెట్టారు. ఆ మాతకు కావేరి జలం బొట్లుగా పడుతూ అభిషేకం చేసినట్లుంటుంది. ఆ జలాన్ని పవిత్ర జలంగా భావించి నెత్తిన చల్లుకుంటారు. ఆ పక్కనుంచి డాంపైకి ఎక్కి చూడటానికి రెండువైపులా మెట్లున్నాయి. ఎక్కి చూశాను. అందమైన కావేరి నదీ మాత దర్శనం పులకరింపజేస్తుంది.

ఈ డామ్ ఒక లక్ష యాభై వేల ఎకరాలకు పంటనీరు అందించి సస్యశ్యామలం చేస్తోంది. జలవిద్యుత్తే ఇక్కడ. irrigation కోసమే కట్టిన ప్రాజెక్ట్ ఇది. దీన్ని నిర్మింపజేసిన రాజు కృష్ణరాయ ఒడయార్. అందుకే దీనికి కృష్ణరాయసాగర్ అని పేరు వచ్చింది. ఆయన విగ్రహం కూడా ఉందిక్కడ. ఆ జంట సాధించిన అద్భుతాలే నేడు మైసూర్ ప్రజలు అనుభవిస్తున్నారు. ప్రజాసేవలో సర్వోక్షగుందం. కే.ఆర్.లు తమ జీవితాలను ధాన్యం చేసుకున్నారు. ఇక్కడ ఫోటోలు మన కెమేరాతో తీసుకోవాలంటే



యాభై రూపాయలు కట్టి రసీదు తీసుకోవాలి. పైన museum దగ్గర మ్యూజిక్ ఫౌంటెన్ ఉంది. సంగీత ధ్వనికి ఫౌంటైలోని జలం అనుగుణంగా నాట్యం చేస్తుంది. ఇది సరిగ్గా రాత్రి ఏడు గంటలకు ఒక పావుగంట వుంటుంది. దీనికోసం lakeలో మర boatలో జనం వస్తారు. జనంతో నిండిపోతుందా ప్రదేశం. ఆహ్మదాబాద్ దగ్గర స్వామినారాయణ గుడిలో చూసాము. అమెరికాలో చాలచోట్ల చూశాము. శాంతి నివాసం సినిమాలో నాగేశ్వరరావు, రాజసులోచన జంటగా duets ఇక్కడే పాడారు. "రావేరాధ రావేరాధ రాధనీవే కృష్ణుడు నేనే రమ్యమైన షాదరాత్రి" అని పాడుతారు. ఘంటసాల మ్యూజిక్. junor సముద్రాల పాటలు రాశాడు. ఎన్నోసార్లు చూశాను ఆ సినిమా. అందులో నాగయ్యగారికి శ్రీనివాస్‌గారు పాడిన "జయ జయ రాం జానకి రామ" పాట గొప్పగా వుంటుంది.

ఇలాంటి డామే రమణాశ్రమం దగ్గర మేట్టుర్డాం తమిళనాడులో వుంది. అదీ చాల బాగుంటుంది. ఇప్పుడు అక్కడ డాంలో నీరు లేకపోవటం వల్ల ఫౌంటేన్లు అవీ పని చేయవు. సినిమాలన్నీ ఇక్కడే తీసేవారు. రాత్రి ఎనిమిది గంటలకు బస్ మళ్ళీ బయల్దేరింది బెంగళూరుకు. ఇక్కడి నుంచి ఊటీ వెళ్ళేవారు రాత్రికి హోటల్లో వుండి మర్నాడు ఉదయం బయల్దేరి ఊటీ వెళ్తారు. రాత్రి ఒంటిగంటకు బెంగళూర్మార్తహళ్లి చేరాం.. శర్మ కార్లో వచ్చి మమ్మల్ని ఇంటికి తీసుకొని వెళ్ళాడు.

దీనితో ఒక్కరోజూ మైసూర్సందర్శనం పూర్తి అయింది. చాల దూరమే అయినా సమయపాలన బాగా చేశారు అందరు. హాయిగా సాగింది ప్రయాణం. గొప్ప అనుభవం. చిరకాల కోర్కె ఇలా తీరింది. సంతోషంగా ఉంది.

## బెంగుళూరు యాత్ర

### బెంగళూర్ రౌండ్స్

జూలై పన్నెండవ తేది మంగళవారం బెంగళూర్ సైట్ సీయింగ్‌కు మా అబ్బాయి శర్మ కర్ణాటక tourism వాళ్ల బస్సులో నేను వెళ్ళటానికి టికెట్ బుక్ చేశాడు. ఖరీదు 270 రూపాయలు. ఏ.సి.బస్. ఇది మెజెస్టిక్‌లో కెనరబ్యాంకు ఏ.టి.ఏం. దగ్గరనుంచి బయల్దేరుతుంది. నేను శర్మ కార్లో మున్నెకొలాల్నుంచి మార్తహళ్లి వెళ్ళా. అక్కడ సిటీబస్లో majesticలో వున్న కెంపేగౌడ బస్సుస్టేషన్కు వెళ్ళా. రిజర్వేషన్టికెట్వుంటే

సిటిబస్లో ఫ్రీగా ప్రయాణం. ఉదయం ఏడున్నరకు మెజెస్టిక్ చేరా. బస్సుస్టాండ్ చాలా పరిశుభ్రంగా నిర్వహిస్తున్నారు. నెంబర్నుబట్టి బస్ ఆగే స్థలాలు వున్నాయి. మనం ప్రయాణం చేసే బస్సు నెంబర్తెలిస్తే బస్ ఎక్కడ ఆగుతుందో తేలిగ్గా తెలుసుకోవచ్చు. ఇక్కడ పోలీసులు కూడా చక్కగా అడిగినదానికి సమాధానం చెప్పటం బాగుంది. సహాయం కావాలా అనే స్థితిలో ఇక్కడి జనం వుండటం ఆశ్చర్యమేస్తుంది. అక్కడే రాఘవేందర్కాంటీన్లో కాఫీ తాగాను. పది రూపాయలు. ఇంటిదగ్గరే ఇడ్లీ టిఫిన్చేసి రెండుసార్లు కాఫీ తాగే బయల్దేరా. కోడలు ఇందిరా మధ్యాహ్నం లంచ్ బాక్స్ కూడా ఇచ్చింది, మంచినీళ్ళ బాటిల్తో సహా. sight సీఇంగ్ను వీళ్ళు బెంగళూర్రౌండ్స్ అంటారు. దీనికి దగ్గరే సిటీ రైల్వేస్టేషన్వుంది. ఈ మొత్తాన్నికేమ్పగౌడ సర్కిల్ అంటారు. ఇక్కడి నుంచి ఎయిర్పోర్ట్కు వెళ్ళే బస్సులు కూడా వున్నాయి.

బెంగళూర్రౌండ్స్బస్ ఎనిమిదిన్నరకు వచ్చింది. బస్ చాలా బాగా వుంది. ఇందులో రెండు రకాల క్లాస్సేస్ వున్నాయి. ముందుగా సీట్స్వుంటే సిల్వర్ క్లాస్స్. వెనక సీట్లు ఇంకొంచెం సదుపాయంగా వుంటాయి. ఇది గోల్డెన్క్లాసు. చార్జీలో తేడా కూడా వుంటుంది. గోల్డెన్చార్జి ఎక్కువ. బస్లో సగం మందే నిండారు. ఇందులో మార్తహళ్లి నుంచి వచ్చిన తెలుగు ఫ్యామిలీ వుండటం కాలక్షేపానికి కలిసి వచ్చింది. తొమ్మిది గంటల పది నిముషాలకు బస్ బయల్దేరింది. guide కూడా వున్నాడు. డ్రైవర్కు guideకు తెలుగు బాగానే వచ్చు.



ముందుగా ఇస్కాన్వాళ్ల రాధకృష్ణ గుడికి వెళ్లాం. ఇది మూడు అంతస్తులుగా కొండమీద వుంది. ఎక్కడికక్కడ చక్కని సూచనలు మనల్ని గమ్యస్థానానికి తేలిగ్గా చేరుస్తాయి. ఇది యాభై కోట్ల ప్రాజెక్ట్. ముందుగా శ్రీవెంకటేశ్వరస్వామి దేవాలయం కనిపిస్తుంది. చాలా వైభవంతో ఉంటాడు స్వామి. ఆపైన శ్రీఆంజనేయస్వామి ఆలయం వుంది. ఆయనా వెండి వెలుగులతో మెరిసిపోతున్నాడు. ఆపైన అసలు దేవాలయం వుంది. అదే శ్రీరాధాకృష్ణ దేవాలయం. మూర్తులు మనోహరంగా వున్నాయి. గొప్ప అలంకరణ. పూలాహారాలు నిండుగా, మెండుగా వుంది చూడటానికి రెండు

కళ్ళు చాలవు. రాదాకృష్ణ, కృష్ణబలరామ దేవతామూర్తులు దివ్యంగా వున్నాయి. అనుక్షణం దివ్యనామ హరేకృష్ణ సంకీర్తనం మానశిక ప్రశాంతినీ, ఆనందాన్ని ఇస్తుంది. భక్తితో కనులు అనుకోకుండా మూసుకుపోతాయి. అదొక దివ్యధామం, దివ్యానుభూతి. తీర్థం ఇస్తారు. దిగి వస్తూంటే ఇంకోచోట ప్రసాదం పెడతారు. చాలా రుచిగా వుంటుంది. అదే దారిలో కిందకు దిగి మళ్ళీ బస్ ఎక్కాం.



అక్కడి నుంచి గవిగంగాధర దేవాలయంకు ప్రయాణం మొదలుపెట్టాం. దారిలో గైడు బెంగళూరు విశేషాలు వివరించాడు. ఆ విషయాలు మీకు అందిస్తున్నాను. బెంగళూరుకు అసలు పేరు బెంతకాలూర్ . అంటే ఉడకపెట్టిన పప్పు పల్లె దీనికి ఒక కథ వుంది. వీరభల్ల మహారాజు ఒకసారి ఈ ప్రాంతానికి అడవికి వేటకు వచ్చి దారి తప్పి ఒక ప్రాంతం చేరాడు. ఆకలిగా వుంది. తినటానికి ఎవరైనా ఏదైనా పెడతారేమోనని ఎదురు చూశాడు. అప్పుడు ఒక అవ్వ కనబడింది. ఆమెను అడిగాడు తినటానికి ఏదైనా పెట్టమని. ఆమె దగ్గర పచ్చిశెనగలున్నాయి. వాటిని ఉడికించి పెట్టింది. రాజు పరమానందంగా తిన్నాడు. మైసూర్ చేరి కథంతా మిగతా వారికి చెప్పాడు. ఆ వూరి పేరేమిటి అని వాళ్ళు అడిగితే బెంతకాలూర్ అన్నాడట పప్పులు తిన్నది జ్ఞాపకం చేసుకొని.

ఒకానొక కాలంలో మైసూర్ మహారాజు తన సామంతరాజు, సైన్యాధిపతి అయిన కెంపేగౌడను ఇప్పుడున్న బెంగళూర్ ప్రాంతంలో ఒక గ్రామాన్ని నిర్మించమని ఆదేశించాడట. ఆయన ఇక్కడికి వచ్చి ఇప్పుడున్న కెంపేగౌడ సర్కిల్దగ్గర నుంచి నాలుగువైపులకు నాలుగు ఎద్దులను వదిలాడట. అవియెంతవరకు వెళ్లి ఆగిపోతాయో అంతవరకూ గ్రామాన్ని విస్తరింపజేయాలని నిర్ణయించుకొన్నాడు. ఆ ఎద్దులు ఒక్కొక్కటి బయలుదేరిన చోటు నుంచి నలభై కిలోమీటర్లు వెళ్లి ఆగిపోయాయి.. అంతవరకూ నాలుగువైపులా హద్దులు ఏర్పరచి గ్రామాన్ని విస్తరించాడు. ఇప్పుడు ఈ నగరం పరిధి 180 kilometers. కెంపెగౌడ కుమారుడు ఇమ్మిడికేమ్పరాయలు నాలుగువైపులా సరిహద్దుల దగ్గర ఎత్తైన గుట్టలపై గోపురాలు కట్టించాడు. నగరం అంతవరకూ విస్తరించింది. ఈ నగర నిర్మాణం కేమ్పెరాయలు మొదటగా 1535 లో మొదలుపెట్టాడు. గంగాధర దేవాలయంలో శిలాశాశనం వుంది. దీనిలో ఈ నగరానికి బెంగళూర్ అనే పేరు వున్నట్లు తెలిసింది. అందుకే బంగాలూర్, bengloor అనే ఆంగ్లేయ పేర్లను

తొలగించి శాసనంలో వున్న పేరునే ఇప్పుడు పెట్టారు. అదే బెంగళూర్.

దారిలో గవి గంగాధరస్వామి గుడీ వుంది. ఇది త్రేతాయుగం నాటి దేవాలయం. గౌతమమహర్షి స్వామి ప్రతిష్ట చేసారని స్థలపురాణంలో వుంది. ఒక గుహలో ఉంటాడు శివుడు. గవి అంటే గుహ అని పేరు. నంది ముందు శివలింగం వుంటుంది. దక్షిణ దిశగా ఉంటాడు దేవుడు. మకర సంక్రాంతినాడు సాయంత్రం అయిదు గంటల పది నిముషాలకు సూర్యుని వెలుగు కిరణాలు నందికొమ్ముల మీదపడి అక్కడి నుంచి శివలింగం మీద పడతాయి. ఆ సమయంలో జనం విపరీతం వస్తారు చూడటానికి. టి.వి.లు ప్రత్యక్ష ప్రసారం చేస్తాయి. ఇక్కడ ఒక సొరంగ మార్గం వుంది. గౌతమమహర్షి ఇక్కడి ఈ గుహనుంచి కాశీ దాకా వెళ్లి విశ్వేశ్వర దర్శనం చేసి వచ్చేవారట. ఇప్పుడు సొరంగమార్గ ప్రవేశానికి అనుమతి లేదు. స్వామి దర్శనం చేసుకొని జన్మ చరితార్థం చేసుకోన్నాము. ఇక్కడే వున్న శాసనం మీద బెంగళూరు పేరు వుంది.

దీనికి దగ్గరలో దొడ్డ గణపతి దేవాలయం వుంది. దొడ్డ అంటే పెద్ద. విరాట్స్వరూపుడుగా గణపతి దర్శనమిస్తాడు. ఈయన్నే గంగణపతి అంటారు. గణపతి దర్శనం సర్వ శుభప్రదం. దొడ్డగణపతి ఆలయం దగ్గరే దొడ్డనంది గుడి వుంది. దీనిని ఇక్కడివాళ్ళు నంది బుల్టెంపుల్ అంటారు.. దీనికీ ఒక కథ వుంది. ఈ ప్రాంతంలో ఒక శివాలయం ఉండేదట. అందులో నంది రాత్రిపూట ఇక్కడి వేరుశనగ పంటను రాత్రిపూట గుడిలోంచి బయటకువచ్చి తినేసేదట. ఆశ్చర్యంగా వుండేది రైతులకు. ఒకరోజూ అందరు కళ్ళల్లో ఒత్తులు వేసుకొని కాపలా కాశారు. దేవాలయం నుంచి ఒక ఎద్దు వచ్చి పంటను తినేయటం గమనించారు రైతులు. చేతిలోని బల్లెంతో దాన్ని కొట్టారు. కాలికి గాయమై, నెత్తురు ధారపాతంగా కారింది. ఎద్దు అదృశ్యమైంది. అంతే, అప్పటినుంచి పంటలు అన్నీ నాశనం అయాయి. కరువు కాటకాలతో జనం అలమటించారు. నీటికి తిండికి నోచుకోలేదు. అప్పుడు ఒక మహర్షి ఈప్రాంతానికి వచ్చారు. ఆయన కాళ్ళపై పడి ఈ సంక్షోభం నుంచి బయట పడేయమని వేడుకొన్నారు రైతులు. ఆయన దివ్యదృష్టితో అన్నీ తెలుసుకొని, వారు గాయం చేసింది సామాన్యమైన ఎద్దుకు కాదని, శివుని వాహనమైన నందీశ్వరునికీ నని, ఆయన శాపం వల్లనే ఈ ఇబ్బందులని చెప్పాడు. తరుణోపాయం కోరారు వారు. అప్పుడు ముంఖలి అనే ఈ





ప్రాంతం కొండమీద నందీశ్వర విగ్రహం ప్రతిష్టించి నిత్యపూజలు చేస్తే మళ్ళీ నంది అనుగ్రహం కలుగుతుందని హితవు చెప్పాడు. వాళ్ళు చాలా పెద్ద నందీశ్వర విగ్రహం చెక్కించి, ప్రతిష్టించి, నిత్య ధూప దీప నైవేద్యాలు సమర్పిస్తూ నందీశ్వరుని అనుగ్రహానికి పాత్రులయారు. అప్పటి నుంచి పంటలు బాగా పండుతున్నాయి. కృతజ్ఞతా పూర్వకంగా కార్తీకమాసం చివరి శనివారం నాడు రైతులందరూ తమకు పండిన వేరుశనగ పంటను తెచ్చి నందీశ్వరునికి నైవేద్యం పెట్టటం విశేషం. ఇదీ ఈ క్షేత్ర మహిమ. నంది చాలా పెద్దది. నల్లరాతితో సర్వాంగ సుందరంగా నిర్మింకాబడింది. శిల్పవైభావం అపూర్వంగా వుంది. లేపాక్షి నంది, యాగంటి నంది జ్ఞాపకం వస్తాయి. గంగాధర గుడీ పక్కనే సూపర్‌స్టార్ రజనికాంత్ చదివిన elemntary స్కూలు ఉంది. దీన్ని ఫోటో తీశాను.




శివ దర్శనానికి ముందు నంది దర్శనం చేయాలి. అసలు శివుని ముందు నంది ఎందుకు? శివుడు అగ్నిహోత్రుని వంటివాడు. ఆయన తీక్షణాన్ని నంది తన ఉచ్ఛ్వాస నిస్వాశాలతో తగ్గిస్తుందట.

తరువాత టిప్పుసుల్తాన్ వేసవి విడిది చూశాం. అంతా చెక్కతో నిర్మించబడింది. నాణ్యత కోసం వీటిని కావేరి నదిలో మూడు సంవత్సారాలు నానబెట్టిన తర్వాతే ఉపయోగించారట. ఈ భవన నిర్మాణం హైదరాలి ప్రారంభించాడు. అతని కొడుకు టిప్పు సుల్తాన్ పూర్తిచేశాడు. రంగులు చెక్కు చెదరలేదు. టిప్పు బ్రిటిష్ వారిని ఎదిరించి స్వాతంత్ర్యం కోసం పోరాడిన మైసూర్ మహారాజు. బ్రిటిష్‌వాళ్ళ కుయుక్తుల వల్ల ఓడిపోయాడు. టిప్పు అంటే ఒక ధైర్యం, ఒక విశ్వాసం, ఒక సాహసం.. ఇందులో అతని చిత్రపటం వుంది. దానిముందు నుంచుని మనం ఎటుకదిలినా అతను, మనవైపే చూస్తున్నట్లుండటం విశేషం. అలాగే బ్రిటిష్షైనికుడి పైకి ఉరికే పులిలాగా వుండే చిత్రం భయంకరంగా టిప్పు అంటే ఏమిటో చూపిస్తుంది. అందులో పులి టిప్పునే. అతని జండాపై పులి బొమ్మ వుంటుంది. మిస్సైల్స్కు, ప్లాస్టిక్సర్జరీకి



టిప్పు రాజ్యంలో మంచి పేరుంది. ఇక్కడి నుంచే అవి ఇతర దేశాలకు చేరాయట.. వేసవిలో టిప్పు ఇక్కడే మకాం..

తర్వాత లాల్ baagh చేరాం. లంచ్ break . నేను లోపలి వెళ్లి తెచ్చుకొన్న భోజనం చేశాను. మిగిలినవాళ్ళు కామత్ హోటెల్‌కు వెళ్ళారు. ఒకటవ నెంబర్ gate నుంచి లోపలికి వెళ్లాం. పది రూపాయలు టికెట్. నేను టికెట్లేకుండానే లోపలి వెళ్లాను. నన్నెవరు అడగలేదు కూడా. నడిచి అంతా చూశా. పావురాయిలు బాగా వున్నాయి. వాటికీ ఆహారం వేస్తున్నారు యాత్రీకులు.. నెమ్మదిగా చూసుకొంటూ గుట్టమీద వున్న గోపురం చూశా. ఇట్లాంటివి ఇంకా మూడు, మూడువైపులా వున్నాయి. గ్లాస్సుసే వుంది. ఫ్లవర్షోక్నేల మీద వుంది. నేను చూడలేదు. రెండవ నెంబర్ gateకు చేరాలి. అక్కడికి బస్ వస్తుంది రెండు గంటలకు.. baagh విస్తీర్ణం 240 ఎకరాలు. ఒకరోజూలో చూడటం కుదరదు. నాలుగు వైపులా దారులున్నాయి. ఇది కేంగెలనుమంతయ్య రోడ్లో వుంది. ఆయన కర్నాటకకు రెండవ ముఖ్యమంత్రి..




రెండు గంటలకు వచ్చిన బస్లో కూర్చున్నాం. సిల్క్ పాలెస్‌కు తీసుకువెళ్ళాడు. నేను సిల్క్బుజమా, లాల్చి 350 rsకు కొన్నా. అక్కడి నుంచి విధాన సౌధ, చిన్న స్వామి క్రికెట్ స్టేడియం, highcourt, ఫీల్డ్మార్షల్మానెక్షా పోలీసు పరదేగ్రౌండ్స్, కన్నడ రాజకుమార్ ఇళ్ళు, రామకృష్ణహెగ్డే, ఎద్యురప్ప ఇళ్ళు వగైరాలన్నీ బస్సుంచే చూశాం.. ఇక్కడ అనిల్కుంబ్లే సర్కిల్ద్రావిడ్రోడ్ అమితాబ్సర్కిల్, ప్రముఖ violin, విద్వాంసుడు చౌడప్ప స్ట్రీట్ చూశాం. ఇక్కడి ప్రభుత్వాలు తమ రాష్ట్ర ప్రముఖుల పేర వీధులు, సెంటర్లు భవనాలు stadiumlu నిర్మించి వారికి ఘన నివాళులర్పించటం ఆనందంగా వుంది. మన రాష్ట్రంలో రాజీవ్, ఇందిరా పేర్లు తప్ప ఇంకోటి పెట్టకపోవటం చరిత్ర క్షమించదు. సిగ్గుతో తల వంచుకోవాలి మనం. ఒక కవి పేర ఒక కళాకారుని పేర మనం ఏమీ స్మారకాలు పెట్టటంలేదు. వున్నా చాలా తక్కువే.. వీళ్ళను చూసి మనం నేర్చుకోవాలి.. రాహుల్ ద్రావిడ్ చదివిన సెయింట్జోసెఫ్ కాలేజి చూశాం. నూటయాభై ఏళ్ళ చరిత్ర గల కాట్టనై స్కూల్, బ్రిగాదియర్రోడ్, ఇమ్పెరియాల్రోడ్చూసాము. తర్వాత విశ్వేశ్వరయ్య



సైన్సు, టెక్నాలజీ మ్యూజియం దీనిపక్కనే పురావస్తు మ్యూజియంలను చూసాం. రెండు చూడతగినవి. పక్కనే కబ్బన్పార్క్. చూడలేదు. ఇక్కడనుంచి మార్తహల్లికి సిటీబస్లో వెళ్లాను. అక్కడి నుంచి ఇంటికి ఆరు గంటలకు చేరా. రోజంతా సరదాగా, గడిచింది. ఇదే బెంగళూ ట్రౌండ్స్.

## శ్రావణ బెలగోల, బేలూర్, హలేబేడు యాత్ర-1

ఈ నెల ఇరవై మూడు శనివారం పై మూడు ప్రదేశ సందర్శనకు కే.ఎస్.టి.డి. అంటే కర్ణాటక స్టేట్ టూరిజం డెవలప్మెంట్ వాళ్ల బస్లో వెళ్లాన్ను. రాను, పోను 500 ki.మీ.దూరం. 935 rs. ఉదయం నాలుగింటికే లేచి, స్నానం, సంధ్య, పూజచేసుకొని, పొద్దున్నే అయిదాన్బావు కుమార్త హళ్లి బస్టాండ్లో corporation సర్కిల్కు అక్కడి బాదామి హుసే దగ్గర బస్ ఎక్కాను. పావు తక్కువ ఏడుకు బయల్దేరింది. వోల్వ బస్, ఏ.సి. మంచి రోడ్, లాంకోవాళ్ళు నిర్మించిన యెన్.హెచ్.48. హసన్ మీదుగా వెళుతుంది, ఇది దాటితే మాంగాలుర్, మలబారుతీరం. అవి కాఫీ, తేయాకు, రబ్బర్తోటలకు ప్రసిద్ధి. ఉదయం ఎనిమిదిన్నరకు 'ఎద్యుర్' అనే కి.మీ. చోట కాఫీ, తిఫ్ఫిన్లకు ఆపాడు. గారే తిని, కాఫీ తాగాను. బానే వున్నాయి. తొమ్మిదిన్నరకు శ్రావణ బెలగోలా చేరింది బస్. బెంగళూర్నుంచి 160, కి.మీ. కొబ్బరితోటలు, పనసచెట్లు, చెరుకు తోటల మధ్య ప్రయాణం. మెయిన్రోడ్నుంచి single రూట్లో ప్రయాణం. మన కోనసీమ అందాలన్నీ ఇక్కడ కనిపిస్తాయి. అయితే అక్కడిలాగా కాలువలుండవు.. పరవశించే ప్రకృతి. ఉదయం కదా చాలా ఆహ్లాదంగా వుంది. గంట సమయం ఇచ్చారు. పైకి వెళ్లి 'జైనముని బాహుబలి'ని దర్శించి తిరిగి రావాటానికి. రానుపోను 1282 రాతి మెట్లు. పట్టుకొని నడవటానికి ఇనుప





రాడులున్నాయి.. మొదట్లో మెట్లు చిన్నిగా వున్నా పోను పోను వెూకాళ్ళు ఎత్తి అడుగులు వేయాలి. మొత్తం మీద రొప్పుకొంటు, రోజూ కొంటు పైకి వెళ్ళి గోమాతే స్వరదర్శనం చేశాను. 58 అడుగుల ఎనిమిది అంగుళాల ఏకశిలా విగ్రహం. తెల్ల graanite రాయితో చేయబడింది. ఇదంతా కొండపై చెక్కారు. చూడముచ్చటగా వుంది విగ్రహం. కళ్ళు చాలా పైకెత్తి చూడాలి. మహా నగిషీగా చెక్కాడు శిల్పి. బాహుబలి కాళ్ళకు చుట్టూ కొన్నలతలు, నుంచొని తపస్సు చేస్తుంటే పేరిగినా పొదలు చెట్లను సూచిస్తుంది. పక్కనే పాము. తపస్సును భంగంచేయటానికి వచ్చిందట. ఇవేమీ గమనించక తీవ్ర తపస్సును నుంచునే ఆయన చేశారట. జ్ఞానోదయాన్ని పొందారు. మా బాచ్ పదిఎడుమంది. అందర్లో ముందు దర్శించి కిందికి దిగింది నేనే. ఒక అమ్మాయి ఇరవై ఏళ్ళుంటాయేమో, నా నడక. స్పీడు చూసి తన వాళ్ళతో "this gentle man seems much younger to me" అంటుండటం విన్నాను. జైనులు, నడవ లేనివాళ్ళు phrame పడక కుర్చీలో పడుకుంటే కూలీలు మోసుకుపోతున్నారు పైకి. డోలీ అంటారు. అంతా భక్తీభావంతో



వస్తారు. ఇన్ని మెట్లు ఎక్కి దిగటం చాలా కష్టమే. కాని ఇష్టమై వస్తున్నాము కనుక ఏమీ అనిపించదు. ఈ మధ్యే జైన, బౌద్ధమతాలను గురించి రాశాను కనుక ఇప్పుడిక్కడ చూడటం ఆనందం, జీవిత సాఫల్యం.. ఇన్నాళ్ళకు కోరిక తీర్చాడు జైనముని. మనసార నమస్కరించాను. ప్రపంచంలో శాంతి విస్తరిమ్పజేయమని ఆ మహాబలిని కోరాను.

ఇప్పుడు ఈ క్షేత్రంలోని విశేషాలను వివరిస్తాను. బెల్ అంటే తెల్లని కోలా అంటే సరస్సు. కొలను అన్నమాట. స్వచ్ఛమైన తెల్లని నీటితో నిండిన సరస్సు అని పూర్తి అర్థం శ్వేత సరోవరం.. అలాంటి సరస్సు, దానికి మెట్లు, నిండా నీరుతో కనపడి దాని అర్థాన్ని తెలియజేస్తుంది. గ్రామ మధ్యమంలో ఉందీ కొలను. ఈ మూడు క్షేత్రాలు హసన్జిల్లాలో వుండటం విశేషం. తలకాడుకు చెందిన విశ్వకర్మ స్థపతులు, ఈ



మహా విగ్రహాన్ని చెక్కిన శిల్పులు. ప్రపంచంలో దీనికి మించిన ఏకశిలా విగ్రహం ఇంకెక్కడా లేదు. ఇక్కడ రెండు కొండలున్నాయి ఇంద్రగిరి, చంద్రగిరి. మౌర్యచంద్రగుప్తుడు ఇక్కడికి వచ్చి తపస్సు చేయటం వల్ల చంద్రగిరి అనే పేరు వచ్చింది. దానికి జ్ఞాపకంగా అశోకుడు ఇక్కడ ఒక బాసాదిని క్రీస్తుపూర్వం, మూడవ శతాబ్దంలో నిర్మించాడు. దీనితోపాటు ఇక్కడ తపస్సు చేసిన వివిధ మత గురువుల, అంటే శ్రమణ కుల ఆలయాలు క్రీస్తు తర్వాత అయిదు, ఆరు శతాబ్దులలో నిర్మించారు. నేమిచంద్ర సిద్ధాంత చక్రవర్తికి శిష్యుడైన చాముండరాయలు అనే రాష్ట్రకూట రాజు చంద్రగిరి మీద దేవాలయం కట్టించాడు. ఇక్కడ 800కు పైగా శిలా శాశనాలు కనిపించాయట. ఇవి పూర్వ కనడ అంటే హల కనడ భాషలో వుంటాయి. ఇది భట్టారక మతానికి పీఠం. వీరు దేశీయ గంగ మూల సంఘానికి చెందినవారు.

జైనతీర్థన్కరులు ఇరవై నలుగురు. మొదటి ఆయన పురుదేవుడు. ఈయననే వృషభదేవ అనీ ఆదినాథుడు అని అంటారు. ఈయనకు ఇద్దరు భార్యలు. పెద్దరాణి యశస్వతి. ఈమెకు భరతుడు అనే కుమారుడు, ఇంకా వందమంది కొడుకులు, బ్రహ్మ అనే కుమార్తె కలిగారట. చిన్నరాణి సునందకు బాహుబలి అనే కొడుకు పుట్టాడు. ఒకప్పుడు ఇంద్రుడు నీలాంజన అనే దేవదాసీ చేత వృశాభుడి కొలువులో నాట్యం చేయిన్చాదట. భరతునికి పట్టాభిషేకం చేసి రాజ్యం ఇచ్చాడు. బాహుబాల్ని యువరాజుగా అభిషేకించాడు రాజు వృషభదేవుడు. భరతుడు అయోధ్యను, బాహుబలి పౌదానా పురాన్ని రాజధానులుగా చేసుకొని పాలించారు. ఒకరోజు భరతుని ఆయుధాగారంలో చక్రరత్న అనే విసిరే గుండ్రటి వస్తువు కనిపించింది. దీన్ని చూసిన జ్యోతిష్యులు హరతుడు చక్రవర్తి అవుతాడని చెప్పారు. దీనితో ఆశ పెరిగి తాను జగజ్జేత కావాలని నిర్ణయించుకొని, తన కిందవున్న సామంతుల్నందర్నీ లొంగిపోమన్నాడు. యుద్ధం ప్రకటించాడు. కాని తమ్ముడు బాహుబలి లొంగలేదు. పెద్ద యుద్ధమే జరిగి వేలాదిమంది చనిపోయే ప్రమాదం వుందని ఇరువైపులా మంత్రులు సమాలోచనలు జరిపి ఇద్దరు ద్వంద్వయుద్ధం చేసేట్లు నిర్ణయించారు. యుద్ధం తీవ్రంగా జరిగింది. బాహుబలిదే పైచేయి అయింది.. అన్న తలవంచాడు. విజయం తమ్ముడిదేనని ఒప్పుకొన్నాడు. కాని వెంటనే బాహుబలికి జ్ఞానోదయం అయింది. ఈ ప్రపంచం శాశ్వతం కాదు, ఈ భోగాలు, రాజ్యం శాశ్వతం కాదు అనిపించింది. తన రాజ్యాన్ని కూడా అన్న భారతునికే



ఇచ్చి, అతడే చక్రవర్తి అని ప్రకటించి తపస్సు కోసం అడవులకు వెంటనే బయల్దేరి వెళ్ళాడు.

భగవాన్ బాహుబలి నుంచునే ఘోర తపస్సు ధ్యానం చేశాడు. ఆయన చుట్టూ చీమలు పుట్టలు పెట్టాయి. ఆయన ఏమీ చలించలేదు. పాములు కాళ్ళకు చుట్టుకున్నాయి. లతలు ఒళ్ళంతా అల్లుకు పోయాయి. కేవలం జ్ఞానాన్ని సాధించటం కోసం వేటినీ లెక్కపెట్ట లేదు. కాని మనసు ఇంకా స్థిరపడలేదు. రాజ్యం మీద ఏ మూలనో కాంక్ష వున్నట్లు అనిపించింది. అన్నకు ఇది తెలిసి వచ్చాడు. తన కిరీటాన్ని తీసి తమ్ముడి పాదాలచెంత పెట్టాడు. "ఇది నీ రాజ్యం. నువ్వు నాకు ఇచ్చావు. దీని గురించి చింతవద్దు" అన్నాడు. అప్పుడు ఒక్కసారిగా బాహుబలి మనోకవాటాలు విచ్చుకొన్నాయి. సంకుచితత్వం పోయింది. కేవలం జ్ఞానం సాధించి చివరికి నిర్వాణంప్నొడు. వేలాదిమందికి జ్ఞానం కలిగించాడు. గాంగవంశానికి చెందిన రెండవ రాచమల్లు. మహారాజుగారి మంత్రి చావుండారాయాలె ఇక్కడి బాహుబలి విగ్రహాన్ని చెక్కించింది. ఆచార్య నేమిచంద్ర సిద్ధాంత చక్రవర్తిగారి ఆధ్వర్యంలో క్రీస్తు శకం 981లో ఈ మహానిర్మాణం జరిగింది. అంటే 1030. సంవత్సరాలనాటి విగ్రహం చావుండరాయలను గోమఠ gomatha అని కూడా అంటారు. అందుకే బహుబలిని gomathesvarudu అంటారు. ఆచార్య నేమి రెండు సిద్ధాంతాలని ప్రతిపాదించాడు. ఆయన ప్రియశిష్యుడైన గోమాథుడు వాటిని గోమఠ సార జీవకాండ అని, గోమఠ సార కర్మకాండ అని ప్రచారంలో వున్నాయి..

గోమఠేశ్వరుడు అనే బాహుబలి విగ్రహం పీఠం మీద కన్నడ, తమిళ పూర్వ మరాఠా అక్షరాలూ కనిపిస్తాయి. ఇవి 981 కాలానికి చెందినవి. ఇంత మహావిగ్రహం చెక్కించటానికి కారణం ఏమిటి? అని ఆలోచిస్తే కర్మపై మానవుడు సాధించిన విజయమే అది అని తెలుస్తుంది. ఒక మహా జ్ఞాని, మహా తపస్సంపంనుడు అత్యంత ప్రశాంతితో ఎలా ఉంటాడో తెలియజేస్తుంది కూడా. విగ్రహం వెడల్పు 26 అడుగులు. పూర్తి దిగంబర విగ్రహం. అక్కడికి వెళ్లి దర్శిస్తుంటే ఏ మనోవికారాలు కలగకపోవటం నాకే ఆశ్చర్యంగా వుంది. అంతటి ప్రభావం వుంది అక్కడ. అద్భుత శిల్పచాతుర్యం, సునిశిత చెక్కడం మనకు ఆశ్చర్యం కల్గిస్తాయి. ఒక్కొక్క కాలు పది అడుగుల పొడవు. పూర్తి సౌష్టవంతో శిల్పకళా మర్మజ్ఞంతో చెక్కిన విగ్రగ్రహం. బాహుబలి జుట్టు వంకీలు

తిరిగి పొదుగ్గా వుంటుంది. ఆయన వున్న తపో భంగిమకు "కాయతోత్సర్గ" అంటారు. కళ్ళు తెరుచుకొని వుంటాయి. చెవులు విశాలమైనవి. పెదిమల చివర చిరునవ్వు, ప్రపంచాన్ని చూస్తున్న దృష్టి, ప్రశాంతత, మూర్తీభవించినట్లుండె మంగళకర విగ్రహం. విశాల బాహువులు చేతులను కిందికి వదిలేసినట్లుంటాయి. ఏ రకమైన ఆధారం లేకుండా ఇంత భారీ విగ్రహం అన్ని ఆటుపోట్లు తట్టుకొని శతాబ్దాలపాటు నిలిచి, ఇప్పటికి దేశ విదేశాల నుంచి జైన మతారాధకులను ఆకర్షిస్తోంది. పన్నెండు సంవత్సరాలుకు ఒకసారి బాహుబలికి మహా కుంభాభిషేకం జరుగుతుంది. ఆవుపాలు, నెయ్యి, పెరుగు, గంధం.. పూలు మస్తాకానికి అభిషేకం నిర్వహిస్తారు. లక్షలాది జనం పాల్గొని భక్తి ప్రపత్తులతో దర్శించి, పూజించి తరిస్తారు. ఇందిరా గాంధి ప్రధాన మంత్రిగా అక్కడికి వెళ్లి కుంభాభిషేకంలో ఒకసారి పాల్గొన్నారు. పైనుంచి పడిన అభిషేక పదార్థాలు పాదాలమీద పడాలి. అప్పుడే అది పూర్తి అయినట్లు. ఒకసారి అలా జరగలేదట. ఒక భక్తురాలు "గుల్లికయాజ్జి" అనే ఆమె పోసింతర్వాత అభిషేక జలం పాదాలను తాకిందట. అందుకని ఆమె జ్ఞాపకార్థం ఒక చిన్న గుడీ కట్టారు అక్కడే. ఈ వూరు హసన్కు పదిహేను కిలోమీటర్లు. ఆచార్య నిమికి దేవాలయం వుంది.

మహా బాహుబలి దివ్యదర్శనంతో మనసంతా ఆనందాన్ని నింపుకొని, పురాతన చరిత్రను మననం చేసుకొంటూ బస్ ఎక్కాను. పదకొండు గంటలకు బస్సు బయల్దేరి బెలూరుకు పన్నెన్నుడుంబావుకు తొంభై కిలోమీటర్లు ప్రయాణించి చేరింది.



## శ్రావణ బెల్గోల, బేలూర్ లేబేడు యాత్ర-2

## బేలూర్చెన్న కేశవస్వామి దేవాలయం

శ్రావణబెల్గోలా నుంచి బేలూర్ వచ్చాం. బెల్గోలాలో మెట్ల లెక్క తప్పుగా రాశాను. చంద్రాగిరి కొనందయక్కతానికీ దిగటానికీ పక్క పక్కనే వేరు వేరుగా మెట్లుంటాయి. తొక్కిసలాటలకు అవకాశం లేదు. ఈ రెండుదారుల్లోని మొత్తం మెట్లు 641 మాత్రమే 1282 అని పొరపాటుగా చెప్పాను. బేలూర్ అనగానే శ్రీరామకృష్ణ పరమహంస కొలువై వున్న పశ్చిమ బెంగాల్లో కలకత్తాకు దగ్గరవున్న బేలూర్ అనుకొంటారు చాలామంది.



కాదు. అది ఆధ్యాత్మిక సౌందర్య కేంద్రం. ఇది నేత్రానందాన్ని ఇచ్చే కళాసౌందర్య కేంద్రం. అక్కడ ముక్తి, ఇక్కడ మనోల్లాసం లభిస్తాయి. బేలూర్‌సన్కు కి బెంగళూర్కు 222 కి.దూరం. తెల్లాని పూలతో వున్న బంగాళా దుంప వండే పొలాలతో, బంతిపూల వనాలతో, చెట్లు కళ కళలాడుతూ దారి అంతా హరిత వనంలా కనిపిస్తుంది.

ఇక్కడి దైవం చెన్నకేశవస్వామి. వీళ్ళు విష్ణు టెంపుల్ అంటారు. చెన్న అంటే సుందరమైన అని అర్థం. విష్ణునామాలలో మొదటిదే కేశవ అనే నామం. స్వామికి ముక్కుకు ముక్కెర వుండటం విశేషం. స్త్రీత్వం కన్నులుతో కనిపిస్తూ బహుసుందరునిగా ఉంటాడు. మోహినీ ఆవతారంగా భావిస్తారు. ఇక్కడి శిల్పసంపద వర్ణనాతీతం. కన్నుల పండువ. ప్రతి సూక్ష్మ విషయాన్ని శిల్పి మనోనేత్రంతో దర్శించి శిల్పించాడు. బేలూర్ అనగానే అమరశిల్పి జక్కన్న జ్ఞాపకం వస్తాడు. "ఈ నల్లని రాలలో ఏ కన్నులు దాగెనో, ఈ బండల మాటునా యే గుండెలు మొగెనో– పైన కఠిన మనిపించును, లోనవెన్నా అనిపించును, ఉలి అలికిడి తాకగానే గల గలామని పొంగి పొరలును" అనే నారాయణరెడ్డిగారి పాట చెవుల్లో రింగు మంటుంది. నాగేశ్వరరావు నటన అద్భుతం అనిపిసుంది. ఇక్కడే కళాతపస్వి విశ్వనాథ్ 'శంకరాభరణం' సినిమాలో మంజుభార్గవి నాట్యాన్ని చిత్రీకరించారు. ఎన్నో సినిమాలకు వేదికయింది. ఇవన్నీ ఒకసారి మనసులో మెదిలాయి. ఇప్పుడు దీని చారిత్రిక వైభవాన్ని తెలుసుకొందాం. గైడు ఇంగ్లీష్లో చాలా బాగా వివరించాడు. ప్రతిశిల్పాన్ని దగ్గరుండి చూపించి అందులోని కళాసారాన్ని తేలిగ్గా చెప్పాడు. ప్రతి సూక్ష్మ విషయం వివరించాడు.



బేలూరును వేలా అనే పురీ అనేవారు. క్రమంగా వేలూరుగా చివరికి బీలుర్గా మారింది. హోయసల రాజులు దాదాపు



మూడు వందల సంవత్సారాలు పాలించిన దేశం. 'హోయ-సాల' అనే రెండుమాటలు కలిసి హోయసల అయింది. అంటే అర్థం 'సాల! కొట్టు'.. ఈ రాజ్య మూలపురుషుడు సాలుడు ఇక్కడ సింహాన్ని సంహరించాదట. అప్పటినుంచి వారి వంశం నామం హోయసల అనగా సింహాన్ని ఒంటి చేతితో చంపినవాడు అని మార్చుకొన్నారు.. వీరు దేవగిరికి చెందిన సేన యాదవులకు చెందినవారు. అవక్రపరాక్రమంతో చాళుక్య, చోళపాన్డ్యులను ఓడించి హోయసల సామ్రాజ్యాన్ని విస్తరించారు. వీరిలో విష్ణువర్ధన మహారాజు చాళుక్యులను ఓడించి సామ్రాజ్య సుస్థిరతకు బాట వేశాడు. ఆయన కాలమ్లోనే కర్ణాటక రాజ్యంలో కనీ, వినీ ఎరుగని రీతిలో దేవాలయాలను నిర్మించాడు. అందులో ఈ ముఖ్యమైన విబేలూర్లోని కేశవాలయం, హలేబేడులోని శివాలయం.. అప్పటివరకు జైనమతాన్ని అవలంభించిన విష్ణువర్ధనుడు, వైష్ణవ మతాన్ని స్వీకరించి, తన ధర్మాన్ని విశ్వాసాన్ని తెలియజేయటానికి వీటిని నిర్మించాదని శాసనాలు తెలియజేస్తున్నాయి. ఇంకో కథనం ప్రకారం చాళుక్యులను ఓడించిన విజయగాథకు చిహ్నంగా నిర్మించాడని. తలకాడులో చాలక్యులపై విజయమే ఈ నిర్మాణానికి కారణం. ఆ కాలంలో దేవాలయాలు మతానికి, న్యాయానికి, ధనాగారానికి, ఆధ్యాత్మిక జ్ఞానబోధకు, సంగీత నాట్య కళలకు నిలయాలు.. హోయసల రాజులు కళా, శిల్పకళ, మతాలకు అధిక ప్రాముఖ్యతనిచ్చారు. బేలూరు దేవాలయం ఏక కూట, హలేబేడులో ద్వికూట సోమనాథపురంలో త్రికూట ఆలయాలు నిర్మింపజేశారు. హోయసలరాజులు 950లో రాజ్యపాలకులయ్యారు. పదమూడవ శతాబ్దంలో కర్ణాటక అంతా వారి స్వాధీనంలోకి వచ్చింది. హర్షవర్ధనుడు స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించటానికి ప్రయత్నిస్తే కుమారుడు రెండవ వీరభల్లాలుడు ఆ కోర్కెను నెరవేర్చాడు. చోళులను రాజ్యానికి తెచ్చి 'చోళ ప్రతిస్తాపనాచార్య' అనీ, 'దక్షిణచక్రవర్తి' అనీ 'హోయసల చక్రవర్తి' అనీ బిరుదు పొందాడు. చివరికి హోయసల రాజ్యం విజయనగర సామ్రాజ్యం అధీనంలోకి, చివరికి ఢిల్లీ సుల్తానుల చేతిలోకి జారిపోయింది.

రాజా విష్ణువర్ధనుడు భగవద్రామానుజుల శిష్యుడు. ఈ ఆలయాల నిర్మాణం విష్ణువర్ధనుని కాలంలో మొదలై, మూడవ నరసింహుని కాలంలో పూర్తి అయ్యాయి. మొత్తం 103 సంవత్సరాలు పట్టింది నిర్మాణానికి. కర్ణాటక, ద్రావిడ శిల్ప సంప్రదాయం ఇక్కడ కనిపిస్తుంది. 118 శిలా శాసనాలు కన్పించాయి. ఈ ఆలయ నిర్మాణానికి వాడిన శిలను 'chloritic schist' అంటారు. తెలుగులో సబ్బుశిల అనచ్చు. అంటే



అంత మెత్తగా ఉంటుందట. శిల్పం పూర్తి అవగానే చాలా గట్టిపడిపోతుందట. అదీ దీని గొప్పతనం. అంతా మెత్తగా ఉండబట్టే ఇంత సూక్ష్మకళను ప్రదర్శించ గలిగారు. అంటే చెక్కేటప్పుడు మైనంలాగా ఒదిగిపోంది. ఏ రూపం కావాలంటే ఆ రూపం పొందుతుంది శిల్పి చేతిలో. నగిషీ చెక్కటానికి బంగారంలాగా ప్రవర్తిస్తుంది. ఒకరకంగా ఇది శిలా బంగారం అన్నమాట.. ఈ ఆలయాలు ఎత్తైన పీఠంమీద ఉండేట్లు నిర్మించారు. అదో విశేషం. మన ఆలయాలు నేలమట్టంగా వుంటాయి. అడుగు భాగాన ఏనుగులు, వాటిపై సింహాలు, వాటిపై అశ్వంమీద సైనికులు ఆలయం చుట్టూ చెక్కారు. ఏనుగు బలానికి, సింహం ధైర్యానికి, అశ్వం వేగానికి ప్రతీకలు. ఒక శిల్పానికి, ఇంకో దానికి సంబంధం వుండదు. దేనికదే ముచ్చటగా వేరు వేరు భంగిమలలో కన్పించటం శిల్పుల ప్రతిభకు అద్దం పడుతుంది. అనేకలతలు, పురాణగాధలు ఆలయం అంతా బయటివైపు కనిపిస్తాయి. ఆలయాన్ని 'జగతి' వేదిక మీద నిర్మించారు. దీనివల్ల భక్తులు ప్రదక్షిణ చేయటానికి ఏ మాత్రం ఇబ్బంది వుండదు.

లోపల కళాసంపదతో విలసిల్లె స్తంభాలున్నాయి. గోడలలో గాలి వెలుతురూ, లోపలికి రావాటానికి వీలుగా నక్షత్రం ఆకారపు ఖాళీలను చెక్కారు. విష్ణువర్ధన మహారాజు, అతని రాణి శాంతలాదేవి విగ్రహాలను కమనీయంగా చెక్కారు. లోపల గర్భాలయం వుంది. రంగమంటపంలో ఆలయ నాట్యకత్తెలు నృత్యం చేసేవారు. మొత్తం మీద 28 ventilator నారశింహ, ఆంజనేయ విగ్రహాలు రమణీయంగా వున్నాయి. వీరి ఇలవేలుపు నృశింహస్వామి. అందుకని అన్నివైపులా ప్రహ్లాద వరదుడిని, హిరణ్యకశిప సంహారాన్ని కళాత్మకంగా చెక్కారు. ఆలయంలోని విమానం కాలక్రమంలో ధ్వంశం అయింది. శ్రీకృష్ణదేవరాయలు గోపర నిర్మాణం చేశాడు. రాతి రథం ఉత్సవాలలో ఉపయోగిస్తారు..

ఆలయం వెలుపల గోడలపై 644 ఏనుగులు చెక్కారు. చిన్నగా ముచ్చటగా వుంటాయి. తూర్పున వున్న ద్వారం వద్ద రతీమన్మధుల విగ్రహాలు అతిసుందరంగా వున్నాయి. లోపల నారశింహస్స్తంభం వుంది. ఇది బాల్ bearingueల మీద చక్కగా తిరుగుతుంది.. ఆనాడే baall bearing విధానం అమల్లో ఉందన్నమాట. లోపలవున్న నలభై ఎనిమిది శిల్పకళా వైభవంతో ఉన్న రాతి స్తంభాలున్నాయి. వాటి సౌందర్యం వర్ణనాతీతమే. మండపం పైకప్పు మీద కూడా గొప్ప కళావైభవం దర్శనమిస్తుంది. ఒక దేవేంద్ర సభలో వున్న అనుభూతి కలుగుతుంది. ఈ శిల్పాలు ఉలితో కొన్ని



lathe యంత్రాలమీద కొన్ని నగిషీలు చెక్కారు. ఈ స్తంభాల మీద 42 సాల భంజికలు అంటే మదనికలు వివిధ భంగిమలతో మనసును దోచేస్తాయి. వీరినే శిలా బాలికలు అంటారు. బయట చెక్కిన దర్పణ సుందరి శిల్పం, భస్మమోహిని, లోపలి స్థంభ భట్టాలికా శిల్పాలు శిల్పి ఊహలకు ప్రతిబింబాలు. గజాసురున్ని శివుడు సంహారించే దృశ్యం, గరుడుని రెక్కలు, రూపం, వామనావతారం, కైలాసాన్ని పెకలించే రావణుడు, దుర్గాదేవి, మహిసాసురమర్ధనం, వరాహఅవతారం, భైరవ రూపంలోని శివుడు, సూర్యదేవుడు, రథం, కళాచాతుర్యానికి పరాకాష్ట. ఇంత సుందరంగా, ఇంత సున్నితమైన చెక్కడం ప్రపంచంలో లేనేలేదు. హాట్స్ ఆఫ్ టు జక్కనాచార్యా, ఆయన కుమారుడు, వారికి సహకరించిన ఇతర స్థాపతులకు. ఆలయప్రవేశ ద్వారం వద్ద సాల మహారాజు సింహాన్ని చంపే శిల్పం మనోహరం. ఇదే హోయసల రాజ్య చిహ్నం.

చెన్నకేశవస్వామినే విజయనారాయణుడు అంటారు. 1117లో దీన్ని ప్రతిష్టించారు. నాలుగు హస్తాలాతో శంకు, చక్ర, గద, పద్మాలతో పరమ మనోహరంగా దర్శనం ఇస్తాడు. ముందే చెప్పినట్లు ముక్కుకు ముక్కెర్తోబాటు తలలో పువ్వులు కూడా వుండటం ప్రత్యేకత. ఇదే మోహినీ అవతారం. విగ్రహం పైభాగాన చుట్టూ దశావతారాలు అతి సూక్ష్మంగా చెక్కబడి విష్ణువు అనంతత్వాన్ని సూచిస్తుంది. దీనినే 'ప్రభావలి' అంటారు.

ప్రధాన ఆలయం అయిన చెన్నకేశవస్వామి ఆలయానికి దక్షిణాన 'కప్పే చెన్నగరాయా' విగ్రహాన్ని రాణి శాంతలాదేవి ప్రతిష్టించింది. దీన్నే కప్పుచెన్న కేశవ ఆలయం అంటారు. దీనిలో గణపతి, సరస్వతి, లక్ష్మినారాయణ, చాముండేశ్వరి, వేణుగోపాల విగ్రహాలు వున్నాయి.. ప్రసిద్ధ శిల్పి జక్కనాచార్యుడు తన స్వగ్రామం కైదల నుంచి ఇక్కడికి వచ్చాడు. అతని కుమారుడు దంకనాచార్యుడు తండ్రిని వెతుక్కొంటూ ఇక్కడికి వచ్చాడు. ఒకరికొకరు తెలియదు. జక్కన చెన్నకేశవ విగ్రహం చెక్కాడు. కొడుకు ఆ శిల్పంలో లోపం ఉందన్నాడు. లేదని



వాదించాడు తండ్రి. లోపం చూపిస్తే కుడిచేయి నరుక్కుంటానని శపథం చేశాడు. విగ్రహానికి నీళ్ళతో కలిసిన గంధం పట్టించారు. గంధం అంతా యిట్టె ఆరిపోయి బొడ్డు దగ్గర మాత్రం ఆరలేదు. అక్కడ ఒక ఖాళీ కనిపించింది. అందులో ప్రాణంతో వున్న కప్ప బయటపడింది. ఇచ్చిన మాటకు నిలబడి జక్కనాచార్యుడు చేయి నరుక్కున్నాడు. అందుకనే ఈ విగ్రహాన్ని కప్ప చెన్నగరాయ అంటారు. దేవుడు కలలో కన్పించి స్వగ్రామం రమ్మన్నాడట. తండ్రి కొడుకులు అక్కడికి చేరి భగవంతుని ఆజ్ఞాగా చెన్నకేశవ ఆలయాన్ని కట్టారు. జక్కన చేయి మళ్ళీ తిరిగివచ్చిందట..

చెన్నకేశవ ఆలయంకు పడమర వీరనారాయణ, దక్షిణాన సౌమ్యనాయకి దేవాలయం, ఆండాళ్ దేవాలయం వున్నాయి. ఆలయం బయట నలభై రెండడుగుల గ్రావిటీ పిల్లర్వుంది. అన్నిటినీ తట్టుకొని చరిత్రకు సాక్షిగా నిలబడి వుంది. ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

అతి సున్నితమైన శిల్పచాతుర్యానికి బేలూర్ దేవాలయం సజీవ సాక్షి. జీవితంలో తప్పక అందరు చూదాల్సినదే. ఒక్కరోజు చాలదు. శిల్ప రహస్యం, శిల్పిచాతుర్యం, శిల్పి ఉహాత్మక్త అర్ధం చేసుకోవాలంటే రోజులు పడుతుంది. పరమ కళా వైభవంతో విలసిల్లె ఈ శిల్ప సంపదను గురించి ఎంతో కాలంగా వినటమేకాని ఇప్పుడే ప్రత్యక్షంగా చూసి అనుభవించాను. నేను చూసింది, తెలుసుకొన్న దానిలో వెయ్యోవంతు కూడా మీకు విడమర్చి చెప్పి ఉండనని నా నమ్మకం. నాతొపాటు ఆ కళాజగత్తులో విహరించిన మీకు ధన్యవాదాలు. ఇక్కడి కళాసౌందర్యాన్ని అనుభవించి మయూర హోటల్లో భోజనం చేసి ఇక్కడికి 22 కి.మే. దూరంలో వున్న హలేబెదుకు ఒక అరగంటలో చేరాము. శ్రావణ బెలగోల, బేలూర్, హలేబేదు కలిసి త్రిభుజంలాగా వుంటుంది. అందుకే దీన్ని triangular trip అంటారు.



## శ్రావణ బెలగోల బేలూర హలేబేదు యాత్ర-3

## హలేబేదు శ్రీ హొయసలేశ్వర స్వామి దేవాలయం

బేలూరుకు 16 కి.మీ. దూరంలోను, హసన్కు 31 కి.మీ.లోను, మైసూర్కు 149 కి.మీ.దూరంలోను హలేబేదు వుంది. బంతిపూల వనాలు రోజా, పూలచెట్లు, బంగాళాదుంప పొలాలు చూడముచ్చటగా వుంటాయి. pine aapple పంట ఎక్కువ.



ఇది 12వ శతాబ్దిలో హోయసల రాజుల రాజధాని. ఇక్కడి శివుని పేరు హొయుశలే శ్వరుడు నిర్మించిన శిల్పికేతన మల్లవర్మ విష్ణువర్ధన మహారాజు కాలవెల్లా నిర్మాణం జరిగింది.. దీనికి అనుకొనే, ఆయన భార్య శాంతలాదేవిరాణి నిర్మించిన దేవాలయుమూ వుంది. ఈ దేవాలయాలకు ముందు చాలా విశాలమైన సరస్సు వుంది. సముద్రంలాగా పొంగి ప్రవహించే సరస్సు నుంచి, ఆలయానికి ప్రవేశించాలి కనుక ద్వారసముద్రం అనే పేరు వచ్చింది ఈ వూరికి. ఇంతకీ 'హలేబేడు' అంటే 'నాశన మయిన నగరం' అని అర్థం. 14వ శతాబ్దంలో మాలికాఫార్ దీనిపైకి దండెత్తాడు. అయితే ఇక్కడి ప్రజలు ఇసుకతో ఆలయం అంతా కప్పేసి కాపాడుకొన్నారట. హలేబేడు దేవాలయ శిల్పసౌందర్యం నభూతో నభవిష్యతిగా వుంటుంది. భారతీయ ఆలయశిల్ప నిర్మాణ కళలో దీని ప్రత్యేకత ఇంక దేనికీలేదు.. బేలూర్ దేవాలయంలో లోపలి శిల్పసౌందర్యం అద్భుతం అనిపిస్తే హలేబేడు దేవాలయం బాహ్యశిల్ప సౌందర్యానికి దర్పణం. విధానం అంతా బేలూర్ ఆలయంగానే వుంటుంది. అయితే ఎత్తైన ప్లాట్ఫారం మీద అక్కడిలానే నిర్మించబడింది. ఇది ద్వికూట విమాన పద్ధతిలో వుంది. అంటే ఇద్దరు మూలదేవతలుంటారు. అంటే రెండు శివలింగాలుంటాయి. ఈ దేవాలయ సముదాయం కూడా 'chloritic chist'. శిలతో నిర్మించారు. అంటే మెత్తగా సబ్బులాగ వుంటుంది శిలా. విగ్రహం పూర్తి అవగానే ఇనుములాగా గట్టి పడటం దీని ప్రత్యేకత. దీన్నే pot stone అని కూడా అంటారు.



హోయసల శిల్పకళా చాతుర్యం అంతా ఇక్కడ కనిపిస్తుంది. ఇక్కడి రెండు శివలింగాలు తూర్పుముఖంగా వుండి, ప్రతిదానికి ప్రత్యేక మండపం కలిగి వుంటాయి. ఈ రెండు కలిసి బృహత్ ఆలయంగా, విశాలమైన వండవంగా కనిపిస్తుంది. లోపల రాజులు, రాణీలు, అంతఃపుర జనం



కూర్చొనే గ్యాలరీలున్నాయి. లోపల జరిగే కార్యక్రమాలను వారు హాయిగా వీక్షించవచ్చు. రంగ మంటపాలు న్నాయి. నాత్యం చేసేందుకు వీక్షించ చిన్నశివలింగాలు వున్నాయి రెండు ఆలయాలలోను. నిత్యపూజ జరుగు తుంది. అయితే గాలి గోపురం లేదు. గర్భాలయాన్ని మంటపాన్ని కలిపే ప్రదేశాన్ని శుకనాసి అంటారు. దీని స్తంభాలన్నీ శిల్పకళా శోభితం. పైన వివిధ శిల్పశోభితమైన పైకప్పు వుంది. చూడటానికి కళ్ళు చాలవు అనిపిస్తాయి. అతిపెద్ద, అతిచిన్న శిల్పాలను ఉంచటానికి తగిన ప్రదేశం వుంది. గోతిక్ ఆర్చు మించిన కళా వైభవం వుందని విశ్లేషకుల భావన. ఇంగ్లీష్‌లో చాలా వివరంగా, వేగంగా, ద్వారపాలకులైన నందిదుంతి విగ్రహాలు సకల కళాశోభితాలు. ముక్కు దగ్గర అతి సూక్ష్మరంధ్రాలున్నాయి. అందులో నుంచి సన్నని పుడక దూరిస్తే దూరిపోతుంది. అంతటి సూక్ష్మ విషయాలపైన కూడా శ్రద్ధపెట్టి చెక్కిన శిల్పాలవి. అనితరసాధ్యం అనిపిస్తుంది. చూసి ఆనందించాలే కాని చెప్పితే తెలిసేది కాదు. ఆ అనుభూతే వేరు. మాగయుడు ఇంగ్లీష్‌లో చాలా వివరంగా విశ్లేశానాత్మకంగా, సూదిగుచ్చినట్లు మంచి శైలిలో వివరించి అనుభూతి చెందేట్లు చేశాడు. రెండు ఆలయాలకు వున్న భేదాలు స్పష్టంగా వివరించాడు. వీటికి మించిన శిల్పకళ ప్రపంచంలోనే లేదు లేదు లేదు అని ఘంటాపథంగా చెప్పటం అందరికి గొప్ప ఆనందం కల్గించింది. ఇప్పటికి సగటున రోజూకు కనీసం రెండువేల మంది వీక్షకులు వస్తారట. ఇది un season. సీజన్లోలో కనీసం పదివేల మందికి తక్కువ కాకుండా దర్శిస్తారట . కొద్దిరోజుల్లో ప్రపంచంలోనే గొప్ప యాత్రాస్థలంగా బేలూర్‌లే బేడులు అవుతాయని విశ్వాశంగా చెప్పాడు. అలా కావాలని అందరం భావించాం. మంచి ప్రయాణ సౌకర్యం వుంది, రోడ్లు బాగున్నాయి, వసతి భోజన సౌకర్యాలు సంతృప్తికరం.

ఉత్తరద్వారం నుంచి ఆలయంలోకి ప్రవేశించాలి. ఇంకా దక్షిణ, తూర్పు, పడమర ద్వారాలున్నాయి. స్థంభాలన్నీ latheతో చిత్రికపట్టి వుంటాయి. సూర్య విగ్రహం చాలా పెద్దది. జగతి ప్లాట్ఫారం మీదే ఇదీ నిర్మించబడి, ప్రదక్షిణకు అనువుగా



వుంటుంది. వెనుక భాగాన నల్లరాతితో చేసిన చాలా పెద్ద నంది విగ్రహం మనోహరంగా వుంది. ఇది దేశంలోని పెద్ద నంది విగ్రహాలలో మూడవది. లేపాక్షి నంది అన్నిటికన్నా పెద్దది. అయితే ఈ నందీశ్వరుని ఉచ్ఛ్వాస, నిస్వాసాలను చిత్రించిన తీరు పరమ ఆశ్చర్యం. దేనికి తోడూ నంది శరీరంపై మూపురంపై, మెడపై చెక్కిన అందమైన ఆభరణాలు మువ్వలు, గంటలు చూస్తే ఇంత పరమ కళావైభవంతో ఇంకెక్కడా నంది విగ్రహం లేదనిపించటం ఖాయం. అందుకనే శిల్పకళరీత్యా ఇదే ప్రపంచంలో అతి సుందర నంది విగ్రహంగా భావిస్తారు. అంటే ఇదే నెంబర్ one bull structure. చుట్టూవున్న శిల్పకళా శోభ బేలూర్లానే వుంటుంది. శివుని వివిధ భంగిమలు అంటే కామ దహనం, పార్వతీ కల్యాణం, గజాసుర సంహారం, రావణుడు కైలాసాన్ని పైకెత్తడం, వినాయక నృత్యం, కుమారస్వామి సూర్యుడు, చుట్టూ చెక్కిన మదనికలు, ఏనుగులు, సింహాలు, గుర్రాలు అన్నీ బేలూర్‌లానే వున్నై. హోయసల దేవాలయాలన్నీ బయటి గోడలపై వుండే శిల్పాలకు ప్రసిద్ధి. రెక్కలసొగసుతో వుండే గరుత్మంతుడున్న గరుడ స్థంభం ఇక్కడ ప్రసిద్ధమైనది. ఇక్కడి గరుడులు రాజు రాణిలకు రక్షణ బంట్లు. రెండవ వీరభాల్లాలరాజు అంగరక్షకుడు కురువ లక్ష్మణ విగ్రహం వుంది. భాల్లాలుని మరణం విని ఇతడు భార్య, పిల్లలు, మిగిలిన అంగరక్షకులతో ఆత్మబలిదానం చేసుకొని స్వామిభక్తిని ప్రకటించుకున్నాడట. ఈ కథ ప్రాచీన కన్నడ లిపిలో ఒక స్థంభం మీద చెక్కబడివుంది. ఈ ఆలయానికి నైరుతి దిశలో నక్షత్రాకృతిలోని అందమైన కేదారేశ్వర దేవాలయం వుంది.

హలీబేడులో పార్శ్వనాథ మందిరం వుంది. శిల్పకళకు పరాకాష్టగా దీని నిర్మాణం ఉంటుందట. 14 అడుగుల పార్శ్వనాథ విగ్రహం చూడముచ్చటగా ఉంటుందట. ఆయన శిరస్సుపై ఏడు తలల పాము చెక్కబడి వుంటుంది. అలాగే శాంతినాథస్వామి, ఆదినాథస్వామి అనే జైన తీర్థంకరుల దేవాలయాలు ఇక్కడ వున్నాయట. మేము ఇవేవీ చూడలేదు.

అలాగే శేషశయనుడైన రంగనాథస్వామి దేవాలయం కళాశోభితంగా ఉంటుందట. ఆయన బొడ్డులో నుంచి ఉద్భవించిన బ్రహ్మ, ఆదిదేవి అయిన లక్ష్మి విగ్రహాలతో శోభస్కరమైన ఆలయం. మేము చూడలేదు.

ఇంతటి శిల్పకళాశోభితమైన, అరుదైన హోయసల రాజుల కళా వైదగ్ధ్యాన్ని ,

అమరశిల్పి జక్కనాచార్య, ఆయన కుమారుడు అపర మయ బ్రహ్మ అయిన దంకనాచార్యుదుల మనోహర కళా సృష్టికి జేజేలు. ఈ శిల్పాలను దర్శించటానికి మామూలు నేత్రం కాదు మనోనేత్రం వుండాలి, చూసింది మననం చేసుకొనే ఓపిక వుండాలి. మెచ్చే సంస్కారం కావాలి. శిల్పి ఏ భావంతో చేక్కాడో తెలుసుకొనే నేర్పుండాలి. వీటిని అన్నిటిని అనుభవించి అనుభూతి చెందే హృదయం కావాలి. వీటికి మించి, తీరికగా చూసే సమయమూ కావాలి. అప్పుడు ఒక కళాక్షేత్రాన్ని దర్శించిన చిరంతనానుభావంతో మనసు పరవళ్ళు తొక్కుతుంది. కొద్ది సమయంలోనే ఇంతటి అనుభూతిని పొందాం 'ఏ పూర్వజన్మలసుక్రుతమో? జన్మ ధన్యమైంది. ఇంకోవిషయం వింటే మరీ ముక్కు మీద వేలు వేసుకోకుండా ఉండలేము. హౌరా! అనుకోకుండా ఉండలేము. అదేమిటి అంటే ఈ ఆలయాలలోని శిల్పాలను చక్కగా వెతికవి విడదీసి పక్కనపెట్టి మళ్ళీ ఇలాగే ఈ బృహత్ ఆలయాలను పునర్నిర్మించవచ్చునట. అంటే ఫ్రేము ఫ్రేమేల మీద శిల్పాలు చెక్కి అమర్చారన్నమాట. ఫ్రమే కనుక తీసేసి మళ్ళీ ఇంకోచోట బిగించుకోవచ్చు. ఎక్కడా అతికిన్చినట్లుండదు. కాని దేనికదిగా విడి విడిగా వున్నట్లు అనిపించదు. ఇదీ ఆ మహాశిల్పుల నిర్మాణచాతుర్యం. అపరబ్రాహ్మలు సృష్టికే ప్రతిసృష్టి చేశారు మరో మయులు వారందరూ.

దాదాపు అయిదున్నర గంటలకు మళ్ళీ బస్ ఎక్కి రాత్రి ఎనిమిదిన్నరకు బెంగళూరు చేరాను. మెజెస్టిక్ బస్ స్టాండ్‌లో బస్ ఎక్కి మార్తహళ్లికి తొమ్మిదిమ్బావుకు చేరాను. మా అబ్బాయి శర్మ కార్లో వచ్చి, ఇంటికి మునేకోలాలకు తీసుకొని వెళ్ళాడు.

కే.ఎస్.టి.డి ఆఫీసులో కర్ణాటక రాష్ట్రం గురించి రాసిన మాట నాకు నిజమనిపించింది 'one state but many words'.



## హోరెత్తిస్తున్న హోసూర్ తెలుగు ప్రజావాణి-1

హోసూరు గురించి చాలాకాలంగా వింటున్నాను. అక్కడి తెలుగు ప్రజలు ఎదుర్కొంటున్న కష్టాలు నడుస్తున్న చరిత్ర మాన పత్రికలో చదువుతున్నాను. అడపా దడాపా దాని సంపాదకులు, ఆప్తులు డాక్టర్ సామల రమేష్‌బాబుగారు కృష్ణాజిల్లా రచయితల సంఘంలో చేసే ప్రసంగాల ద్వారా కూడా తెలుస్తున్నాయి. సా.వెం.రమేష్ గారి రచనల ద్వారా చాలా విషయాలు తెలిశాయి.

అక్కడ తెలుగుభాషను రక్షించుకోవటానికి వారు చేస్తున్న పోరాటాలు, తెలుగు సంస్కృతిని కాపాడుకోవటానికి అవలంబిస్తున్న విధానాలు, తమిళనాడు ప్రభుత్వం హోసూరు తెలుగువారికి చేస్తున్న అన్యాయం, ఆ అన్యాయాన్ని సరిదిద్దటానికి వారు చేస్తున్న పోరాటం విని, చదివి హోసూరు చూడాలనే అభిప్రాయం మనసులో బలంగా నాటుకొంది. ప్రత్యక్షంగా అక్కడి విషయాలు తెలుసుకోవాలనిపించింది. ఎట్లాగు బెంగళూర్లో వున్నాను కనుకా, ఇక్కడికి హోసూరు బాగా దగ్గర కనుక వెళ్ళటానికి నిర్ణయించుకొని ఉయ్యూరులోని మా అబ్బాయి రమణకు ఫోన్ చేసి రమేష్బాబుగారికి ఫోన్చేసి హోసూర్లో ఆయనకు తెలిసినవారి ఫోన్నెంబర్ అడిగి తెలుసుకోమని చెప్పాను. వాడు వెంటనే ఆయన నుంచి అక్కడి డాక్టర్ వసంత్‌గారి ఫోన్ నెంబర్ ఇచ్చాడు.

ఈ నెల పద్దెనిమిదవ తేది సోమవారం ఉదయం బెంగళూర్లో పదిగంటలకల్లా భోజనంచేసి మా అబ్బాయి శర్మ వాళ్ల ఇంటి నుంచి బయల్దేరాను. సిటీబస్ ఎక్కి సిల్క్ బోర్డు దగ్గర దిగాను. ఇక్కడ సేనియర్సిటి జెన్స్కు కన్సెషన్వుంది బస్సుల్లో. సిల్క్ బోర్డు దగ్గర తమిళనాడు బస్సు ఎక్కి హోసూరుకు మధ్యాహ్నం పన్నెండున్నరకు చేరాను. బస్టాండ్నుంచి వసంత్గారికి ఫోన్చేసి హోసూర్కు వచ్చిన విషయం చెప్పాను. ఆయనకు ముందుగా నేను ఫోన్చెయ్యలేదు. ఇప్పుడే చేశాను. పాపం ఆయన ఎంతో బాధగా తాను హోసూర్కు ముప్పై కిలోమీటర్ల దూరంలో చిన్న తిరుపతి అనే ఒక పల్లెటూరిలో క్లినిక్లో వున్నానని, సాయంత్రం దాకా రాలేనని, తన మిత్రుడు రఘునాధరెడ్డి గారిని పంపిస్తున్నానని, ఆయన అన్ని విషయాలు ఏర్పాటుచేస్తారని చెప్పారు. రెడ్డిగారు నా కోసం వచ్చి నన్ను తన బండిమీద నంద్యాల నారాయణరెడ్డి గారింటికి తీసుకొని వెళ్లి, నా గురించి చెప్పి, హోసూర్లో జరిగే కార్యక్రమాలన్ని నాకు తెలియజేయమని చెప్పారు. తాను మళ్లి వచ్చి కలుస్తానని చెప్పి వెళ్ళారు వీరు అగ్రిగోల్డ్లో పనిచేస్తూ, మంచి సేవాకార్యకర్తగా పేరు తెచ్చుకొన్నారు. నారాయణరెడ్డిగారు వ్యవసాయదారులు యాభై అయిదేళ్ళపైవారు. మంచి రచయిత. తమిళ కన్నడాలలో మంచి పట్టున్నవారు. ఏ రకమైన మెమొరాండం అయిన ఏ భాషలోనైనా రాయగలరు. మంచిశైలి, ఆవేశం,



తెలుగును రక్షించుకొనే తపన వున్నవారు. ఆయన రాసినదంతా నాకు చదివి వినిపించారు. అదంతా నేను వాయిస్రికార్డర్లో రికార్డు చేశాను. దాదాపు రెండు గంటలు ఇలా గడిపాము. భోజనం చెయ్యమన్నారు. చేసి వచ్చానని చెప్పాను. రెండుసార్లు కాఫీ ఇచ్చారు. ఇంతలో క్రిష్ణప్పగారు వచ్చారు. ఆయన స్వతహాగా కన్నడిగులు. అయినా తెలుగు భాషోద్యమానికి తీవ్రంగా కృషి చేస్తున్నారు. కాసేపటికి మునిరాజు వచ్చారు. యువకుడు, కవి, కథారచయిత. పత్రికలలో ఆయన రాసినవి పడుతుంటాయి. చివరగా డాక్టర్ వసంత్ చేరారు. అందరం సరదాగా కబుర్లు చెప్పుకొన్నాం. వసంత్గారు మంచి కార్యదీక్షాపరులు. యువకుడు. సాయంత్రం ఆయన ఇంటిదగ్గర క్లినిక్లో వుంటారు. 'తెల్లకొక్కెర తెప్పం' అనే కథాసంపుటి వెలువరించారు.. దీనికి ఆగస్ట్ ఏడవ తేదిన వారికి హైదరాబాద్లో తెలుగు విశ్వవిద్యాలయంలో సన్మానం, పురస్కారం వున్నట్లు చెప్పారు. ఆ సమయంలో సా.వెం.రమేష్గారు వీరితో ఫోన్చేసి మాట్లాడారు. నాతో కూడా ఫోన్లో రమేష్గారు మాట్లాడారు. ఆయన రచనలు చదవటమే కాని ప్రత్యక్షంగా చూడలేదు. ఆయన నిరంతర సంచారి. ఎప్పుడు ఏదో ప్రదేశానికి వెళ్లి అక్కడి తెలుగు వారి భాషా విషయాలు పరిశోధించి వ్యాసాలు రాస్తుంటారు. ప్రళయ కావేరి అనే వారి కథాసంపుటికి అవార్డు వచ్చింది. నాతో చాల ఆత్మీయంగా మాట్లాడారు. ఉయ్యూరు, ఆ పరిసర ప్రాంతాలు తెలుసునని చెప్పారు. ఇక్కడి ఈ మిత్రబృందానికి ఆయన గొప్ప ప్రేరణ. అలాగే రమేష్బాబుగారు. వాళ్లిద్దరే స్ఫూర్తిప్రదాతలుగా నిండు మనసుతో అందరు చెప్పారు. ఇలాంటి మిత్రులకు ఇంకో యాభైమంది సుశిక్షుతులైన కార్యకర్తలు తోడ్పడుతూ, చాలా కార్యక్రమాల్ని దిగ్విజంగా జరపటం విశేషం. మంచి అనుభూతి పొందాను. ఇక్కడికి రావటం నాకు చాలా ఉపయోగపడింది.. అందరి దగ్గర వీడ్కోలు తీసుకొని, ఫోటోలు దిగి, వసంతగారి కారులో మునిరాజుగారితో కలిసి హోటల్కు వెళ్ళి టిఫిన్చేసి, రాత్రి ఏడు గంటలకు బస్ ఎక్కి తొమ్మిదింటికి బెంగళూర్చేరాను. అక్కడి విషయాలన్నీ నారాయణరెడ్డిగారు చెప్పిన వివరాలు మీకు వివరంగా తెలియజేస్తాను. మంచి మిత్రబృందాన్ని, సేవానిరతుల్ని, భాషాభిమానుల్ని, భాషోద్యమ కార్యకర్తల్ని, అకుంటిత దీక్షాదక్షుల్ని, అంకితభావంతో, ప్రతిఫలాపేక్ష లేకుండా, తమ అమూల్య సమయాన్ని, ధనాన్ని తెలుగును నిలబెట్టటానికి కృషి చేస్తున్న నిత్యకృషీవాళుల్ని చూసిన ఆనందం మనసునిండా నింపుకొని ఇంటికి సంతృప్తిగా చేరాను. వారి మర్యాద, మన్నన, పెద్దరికం, కలుపుగోలుతనం నన్ను బాగా ఆకర్షించాయి. మేమున్న మార్తహళ్లికి హోసూర్సుమారు నలభై కిలోమీటర్లు. వెళ్లి తిరిగి రావాటానికి సుమారు వంద రూపాయలవుతుంది. హోసూరు కృష్ణాగిరి జిల్లాలో వుంది– తమిళనాడులో. అయిదు కిలో మీటర్లలో కర్నాటక సరిహద్దు. దీపావళికి బెంగళూర్వాళ్ళంతా హోసూర్వెళ్లి టపాకాయలు కొనుక్కుంటారు.

చవక. అవి తమిళనాడులోని శివకాశి నుంచి వస్తాయి. పెద్ద ఊరే. లక్ష జనాభా. అందులో అరవై వేలమంది తెలుగువారే. ఇక్కడి శాసనసభ్యుడు తెలుగువారే.. అయినా భాషా వివక్షతకు ఇక్కడి తెలుగువారు, కన్నడిగులు, మలయాళీలు ఇబ్బంది పడుతున్నారు.

## హోరెత్తిస్తున్న హోసూరు తెలుగు ప్రజావాణి -2

హోసూరు తమిళనాడు రాష్ట్రంలో కృష్ణగిరి జిల్లాలో వుంది. దీనికి అయిదు కిలోమీటర్ల దూరంలోనే కర్నాటక సరిహద్దు వుంది. హోసూరు జనాభా లక్షమంది. అందులో తెలుగువారు అరవైశాతం. అంతే షుమారు అరవై వేలమంది అన్నమాట. ఇక్కడ కన్నడ, ఉర్దూ, మళయాళ, తమిళాలులో మాట్లాడేవారు కూడా వున్నారు. రాజ్యం తమిలులది. సంపర్కం కన్నడం. తెలుగువారు అంతా ఇళ్ళల్లో తెలుగే మాట్లాడుతారు. కొందరు తెలుగు, కన్నడం కలిపి మాట్లాడుతారు. హిందూపురంలో లాగా అనిపిస్తుంది. తమిళం చాలా కాలం వీళ్ళకు తెలియదు. తమిళం మాట్లాడేవారిని అంటరానివారిగా భావించేవారు. దిగువ సీమకు చెందినవాళ్ళు అని తమిలుల్ని ఈసడించేవారట. కానీ ఇవాళ సీన్ రివర్స్ అయింది. సుమారు పదిహేను కిలోమీటర్ల పరిధిలో హోసూరు ఉంది. హోసూరు తాలుకా కూడా. తాలూకాలోని మొత్తం జనాభా రెండు లక్షలు. ఒక్క హోసూరు పట్టణంలోనే లక్ష జనాభా.. వర్షాధార పంటలే ఇక్కడ. రాగి బాగా పండుతుంది. బోరుబావులు తవ్వి సేద్యం చేస్తున్నారు. బావుల కింద వరి కొద్దిగా పండిస్తారు. కూరగాయాలు బాగా పండించి బెంగళూర్ తదితర ప్రదేశాలకు పంపుతారు.. ఇక్కడ గులాబిపూలు విపరీతంగా పూస్తాయి. ఇక్కడి నుంచే ఎక్కడికైనా ఎగుమతి జరుగుతుంది. వాతావరణం ఆహ్లాదంగా వుంటుంది. తమిళ తెలుగు, కన్నడ రాష్ట్ర బస్లు ఇక్కడ కన్పిస్తాయి. సేలం, చెన్నైకి ఇక్కడి నుంచి వెళ్ళవచ్చు. కుప్పం దగ్గరే. అలాగే రాయవేలుర్కూడా. ఎయిర్ conditioned సిటీగా హోసూర్ను భావిస్తారు. ఏప్రిల్, మే నెలల్లో మాత్రం కొంచెం వుక్క పోస్తుందట..

1970 వరకు హోసూర్లో పూర్తిగా తెలుగే వుండేది. సేలం వరకు తెలుగు తప్ప ఇంకోటి మాట్లాడేవారు కాదట. 1970లో డి.ఏం.కే. అధికారంలోకి వచ్చింది. అప్పటి నుంచి హోసూర్ తెలుగువారి కష్టాలు ప్రారంభం అయ్యాయి. తమిళాన్ని ఇక్కడ నిర్బంధం చేసింది. ఆ పార్టి భాషోన్మాదంతో తెలుగు ప్రజ అల్లాడి పోయింది. వీరి వల్ల భయం ఏమిటంటే తెలుగువాళ్ళు ఎక్కడ పెరిగిపోయి, తమిళ అస్తిత్వాన్ని దెబ్బ తీస్తారోనని. అందుకని చట్టాలన్నీ కఠినతరం చేసింది. ఉక్కుపాదంతో తెలుగును అణగ దొక్కటానికి అన్ని ప్రయత్నాలు చేసింది. దానికి రంగు పూయటానికి హిందీ వ్యతిరేక ఉద్యమం చేపట్టింది. అలాగే తెలుగు 'ఒళిగా' అంటే quit తెలుగు ఉద్యమం అన్నమాట. అప్పటిదాకా వెయ్యి తెలుగు స్కూల్స్ ఉండేవి .. రిజిస్ట్రేషన్తో సహా వ్యవహారం

అంతా తెలుగులోనే జరిగేది. ఇది కరుణానిధికి కన్ను కుట్టింది. కరుణ పోయి అకారణంగా ఆ కరుణ ఆవేశించింది. పూర్తి అధికారం వుంది. పైన ఎదిరించే సాహసం ఎవరికి లేదు. కేంద్రంలో ఏ ప్రభుత్వంవున్నా, బెదిరించి, పోట్లాడి, అలిగి నీలిగి, బెదిరించి, అన్నీ సాధించుకొనే నేర్పు అతనిది. కక్కాలేక మింగాలేక పోతున్నాడు. 1990 వరకు ఏమీ చెయ్యలేకపోయాడు కరుణ. అప్పటిదాకా అన్ని ప్రభుత్వ కార్యక్రమాలు తెలుగులోనే జరిగేవి. హోయసల రాజుల కాలం నుంచి హోసూర్వుంది. హసవూరు హోసూరుగా మారిందని అంటారు.

అప్పటిదాకా మద్రాస్ రాష్ట్రంగా వున్న దీని పేరును తమిళనాడుగా 69లో మార్చారు......మైసూర్ స్టేట్‌ను 73 కర్ణాటకగా మార్చారు. భాషా ప్రయుక్త రాష్ట్రాలను ఏర్పరచే సమయంలో 1956లో పటాస్కర కమిటీ సర్వే చేసి హోసూరు ప్రజలు ఏ రాష్ట్రంలో కావాలంటే ఆ రాష్ట్రంలో ఉండవచ్చునని రిపోర్ట్ ఇచ్చింది. అయితే ఆంధ్ర రాష్ట్రంలో చేరిపోవాలని హోసూర్ ప్రజలకు పూర్తిగావున్నా ఎవరు ఉద్యమించలేదు. ఎవరికీ గట్టిగా విన్నపాలు చేయకపోవటం పాపం ఇప్పుడు వారు అనుభవించే కష్టాలకు కారణం అయింది. దీనిపక్కనే వున్నదే న్కనికోట తాలూక కన్యా కుమారి జిల్లా అంత పెద్దది దాన్ని రెండుగా విభజించి హోసూర్, దేన్కని తాలూకాలను ఏర్పాటుచేశారు. దేన్కని అంటే తెన్కని అనేనేమో తెన్కని ప్రభువనన్నే చోడుడు కుమారసంభవం కావ్యం తెలుగులో రాశాడు. తెన్కనాదిత్య బిరుదు వుంది ఆయనకు. ప్రబంధాలకు మార్గదర్శి అయ్యాడు.

తమిళ భాషా సమస్య చాపకింద నీరులాగా ప్రవేశించింది. ఇది తెలుసుకొనే సరికే అంతా మించిపోయింది. అప్పటిదాకా తెలుగే అధికార భాషగా వుంది. ఇప్పుడు తమిళాన్ని ఇక్కడ అధికార బాషగా చేయటం పుండు మీద కారం చల్లినట్లయింది. ఈ మార్పును ఒప్పుకోలేదు. జీర్ణించుకోలేకపోయారు. ఇక్కడ తెలుగు సంఘాలు యాభై ఏళ్ళ నుంచే వున్నాయి. అయినా చురుగ్గా పని చేయలేకపోయాయని ఇప్పటివారి భావన.. అప్పటి శాసనసభ్యులు కోదండరామయ్య శక్తివంచన లేకుండా తెలుగును రక్షించటానికి ప్రయత్నించారు. అప్పుడే తమిళనాడులో తెలుగు భాషోద్యమ సంఘం ఏర్పడి పని చేస్తోంది.

హోసూరు ప్రజలు జై తెలుగుతల్లి అని ఉద్యమం ప్రారంభించారు. ఇక్కడి బోసుబజార్లోని మిత్రబృందం మొదటిసారిగా ఉద్యమించింది. వీరికి ఘంటసాల మిత్రబృందం తోడైంది. నంద్యాల నారాయణరెడ్డిగారి ప్రోద్బలంతో తెలుగు ప్రజలు అంతా సంఘటితమయారు. తెలుగు భాషోద్యమ నాయకులు సామల రమేష్‌బాబుగారు, సా.వెం. రమేష్‌గారు వీరికి అండగా నిలిచారు. వారిద్దరూ ఇక్కడికి వచ్చి మార్గనిర్దేశం చేశారు. వీరికి ఆత్మస్థైర్యాన్ని, ధైర్యాని కల్గించి వెన్నుతట్టి, అండగా నిలిచారు. దీనికి

ఇక్కడి ఆధ్యాత్మిక కేంద్రం నిర్వాహకులు, కైవారం తాతయ్యగారు, ప్రేరణనిచ్చారు. స్ఫూర్తిప్రదాతగా నిలిచారు. "దూషించువారి –నయభాషిన్ని – ప్రేమతో భూషించావే మనసా" అన్న తాతయ్యగారి గీతం వీరికి భగవద్గీతే అయింది. కర్తవ్యమ్బోధపడి ముందడుగు వేశారు. ఇక మడమ తిప్పలేదు. ఇలా అయిదు వైపులా నుంచి ప్రోత్సాహం లభించి కదంతొక్కారు ఇక్కడి తెలుగు ప్రజ.. తర్వాత 2001లో కృష్ణగిరి జిల్లా తెలుగు రచయితల సంఘం ఏర్పడింది. ఇది మరీ వూతాన్ని ఇచ్చింది. దీన్ని వీళ్ళు ముద్దుగా కృష్ణరసం అన్నారు. సంక్షిప్త పరచి ప్రతినెల మొదటి ఆదివారం అందరు సమావేశం అవుతారు.. తర్వాత కోదండరామయ్య ఆంధ్ర సంస్కృతి సమితి భవనంలో సమావేశాలు జరుగుతాయి. రచయితల సంఘం వారంలో మూడురోజులు పర్యటించి, సమస్యలను తెలుసుకొంటారు. ఆదివారం సమావేశంలో చర్చించి పరిష్కారాలను కనుగొంటారు. సామల రమేష్‌బాబు, స.వెం.రమేష్‌గార్లు వీరికి పరమ ఆత్మీయులైనారు. వారిద్దరిని సంప్రదించకుండా ఏ కార్యక్రమం జరపరు.

తమిళ ప్రభుత్వ తెలుగు వ్యతిరేకత వల్ల విద్యార్థులు తెలుగు స్కూల్లలో చేరటం తగ్గింది.. దీన్ని ఎదుర్కోవాలని నిర్ణయించారు. అందుకే ప్రతి సంవత్సరం మే, జూన్ నెలల్లో ఇంటింటికి తిరిగి తెలుగు స్కూళ్ళలో విద్యార్థులను చేర్పించటానికి శాయశక్తులా కృషి చేస్తున్నారు. వీరి ప్రయత్నాలు ఫలించి, తలిదండ్రులు తెలుగు స్కూల్స్లో చేర్పిస్తున్నారు. క్రమంగా తమిళ బడులన్ని తెలుగు బడులుగా మారాయి. చీకటిని తిట్టుకుంటూ కూర్చోటం కంటే చిరుదీపం వెలిగిస్తే అంతా కాంతి ఏ కదా. ఫెబ్రవరి ఇరవై ఒకటవ తేదీన 'తెలుగు మాతృభాషా దినోత్చవం' వైభవంగా జరుపుతారు. అంతా కలిసి బాన్నేర్లు పట్టుకొని గ్రామాల్లో ప్రచార యాత్ర చేసి ఉత్సాహం కల్గిస్తారు. ప్రతి ఉగాది పండుగనాడు బోస్బజారు నుంచి వూరు ఊరంతా ఉగాది శుభాకాంక్షల బాన్నేర్లు, flexeelu ఏర్పాటుచేసి పండగ వాతావరణాన్ని తెస్తారు. అచ్చమైన తెలుగు పండుగ కదా ఉగాది. అందుకే అంతటి సంబరాలు నిర్వహించటం. ఆగస్ట్‌లో గిడుగు రామమూర్తి జయంతిని వ్యావహారిక భాష దినోత్చవంగా నిర్వహిస్తారు. నవంబెర్లో తెలుగుభాషకు ఎనలేని సేవ చేసి, అనేక గ్రంధాలను ప్రచురించిన ప్రాతస్మరనీయుడు సి.పీ. బ్రౌన్ జయంతి జరిపి ఆయన భాషా సేవను గుర్తుకు తెచ్చుకుంటారు. స్ఫూర్తిని పొందుతారు. విద్యార్థులకు వేమన పద్యాలపై పోటీలను నిర్వహిస్తారు. ఇక్కడి బస్తియువక సంఘం ఆధ్వర్యంలో ఉగాది కవిసమ్మేళనం నిర్వహించి కవితా సంకలనం తెస్తారు.

2004లో 'తెలుగువాణి' పత్రిక నెలకొల్పి ఉత్సాహవంతులైన యువ రచయితలతో కవితలు, హోసూర్మాండలికంలో కథలు, వ్యాసాలు రాయిస్తున్నారు. ఇది ఎందరికో మంచి వేదిక అయింది. వారి సృజనకు గొప్ప అవకాశం లభించింది. బోధనా, పరిశోధనాధ్యేయంగా వాణి తన బాణీని చాటుతోంది.. దీనికితోడు 'తల్లిభాష'

మాస పత్రిక ఇక్కడి తెలుగులా మనోభావాలను కవిత, కథ, పాట, పద్యం, మాండలికం ద్వారా ప్రతిబింబించేట్లు చేస్తోంది.

హోసూర్లో జరుగుతున్న ఈ వైవిధ్యభరిత కార్యక్రమాలను చూసిన రాయవెల్లూరు తెలుగు ప్రజానీకంతాము, తమ పిల్లలు తెలుగు నేర్చుకుంటామని, నేర్పే ఏర్పాటు చేయమని వీరిని కోరారు. వీరికి మంచి ఉత్సాహం లభించింది. తమ ప్రయత్నాలు ప్రక్క ప్రదేశాలకు విస్తరిస్తున్నందునకు సంబరపడ్డారు.. అయితే వారికి నేర్పాలంటే సుస్శిక్షుతులు అయిన కార్యకర్తలు కావాలి. వారికి తెలుగు ఎలా నేర్పాలో తెలియాలి.. అందుకని దగ్గరలో వున్న కుప్పం ద్రావిడ విశ్వవిద్యాలయాన్ని ఆశ్రయించారు. వారు రేసోర్స్‌పెర్సొన్స్కు శిక్షణనిచ్చారు కస్తూరి విశ్వనాథం, పరిమి రామనరసింహం వంటి వుద్దండులు కదిలి వచ్చి యువకులకు మంచి శిక్షణనిచ్చి తీర్చిదిద్దారు. వెల్లూర్జిల్లాలోని 120 గ్రామాల నుండి గ్రామానికి కనీసం ముప్పై మంది వరకు వచ్చి నేర్చుకొన్నారు. తెలుగులో ప్రావీణ్యం పొందారు. నల్లూరు గ్రామంలో ఏడురోజుల పాటు శిబిరం నిర్వహించారు. స్త్రీలు విశేషంగా పాల్గొని, తాము ఏమీ వెనుకబడలేదని నిరూపించారు. దీని ప్రభావం బాగా వుంది. తమిళ విద్యార్థులు తెలుగు కవితలు రాసి తెలుగువారినే ఆశ్చర్యపడేట్లు చేశారు. కృషివుంటే మనుషులు రుషులవుతారు, మహా పురుషులవుతారు అన్నదానికి ఇది నిదర్శనం. ఈ ఖర్చును అజంతా వాచ్ కంపెని వారు, ఇతర వదాన్యులైన దాతలు భరించి ఒక గొప్ప సామాజిక మార్పుకు దోహదపడ్డారు. వారందరూ అభినందనీయులు. ఈ విజయం అంతా హోసూరులోని తెలుగు సంస్థకు, దాని నిర్వాహకులకు దక్కుతుంది.

## హోరెత్తిస్తున్న హోసూరు ప్రజావాణి-3

ఇలా అప్రతిహతంగా తెలుగు ప్రజలు హోసూరులో అన్ని రంగాల్లో దూసుకుపోతున్నారు.. ప్రక్కనున్న రాయవెల్లూర్ను ప్రభావితం చేసి, అక్కడా తెలుగు పునరుజ్జీవనానికి సాయపడ్డారు. ఈ ప్రాంతంలో దాదాపు యాభై దాకా జానపద కళలు వున్నాయి. అవి జీవచ్ఛవాలైపోయే పరిస్థితి వస్తోందని ఆరాటం చెందారు. వాటిని మళ్ళీ వెలుగులోకి తెచ్చి ఆ కళాకారులకు జీవన భ్రుతికి లోటులేకుండా చేయాలనే ఆలోచన వచ్చింది. స.వెం. రమేష్‌గారు ఇక్కడికి వచ్చి జానపద కళలను ఒక జాతరగా నిర్వహించాలని సూచించి, వెంట నిలిచి, కార్యక్రమానికి శ్రీకారం చుట్టారు. దానిని 'పల్లెకళల పరస' అనే పేరుతో 2007 మార్చ్ 24, 25 తేదీలలో హోసూర్‌లో చాలా పెద్ద ఎత్తున నిర్వహించారు. నాయని కృష్ణకుమారి, చిలుకూరి దేవపుత్ర రమేష్బాబు, రమేష్ వంటి ప్రముఖులు హాజరై దాన్ని దగ్గరుండి నడిపించారు. ఇది రెండురోజుల పండుగగా జరిగింది. పరస అంటే జాతర. మనం కళా జాతర అంటాం. ముప్పై

పల్లెకళలను కళాకారులు ప్రదర్శించ్చారు. దీనిపై సావనీరు కూడా తీసుకొని వచ్చారు. తెలుగు విశ్వ విద్యాలయం, దాతల సహకారంతో రంగ రంగ వైభవంగా పరస జరిగి తెలుగువారినే కాక అందర్నీ పరవశింప జేసింది.

ఇక్కడి యువ రచయితలను ప్రోత్సాహించే తలంపుతో తెలుగు కథలను రచించే విధానంపై వర్క్‌షాప్ నిర్వహించారు. ఆర్వీఎస్. సుందరం వంటి రచయితలూ వచ్చి అర్ధవంతమైనరీతిలో నిర్వహించారు. హోసూర్మాండలికంలో కథలు రాయించారు.. వాటిని ప్రచురించి రచయితలకు గొప్పప్రోత్సాహం కలిగించారు. హోసూర్ సామెతలు, నానుడులు, పదబంధాలు శిధిలం కాకుండా వాటిని జాగ్రత్తగా సేకరించి భద్రపరిచే కార్యక్రమం చేబడుతున్నారు.. ఇదే మన తరగని ఆస్తి. విజ్ఞాన సంపద. తరతరాల నుండి వస్తున్న నిధి. దాని విలువ అపూర్వం, అనంతం. దాన్ని కాపాడుకోవాలి. మన తరంలో చేయకపోతే భవిష్యత్తరాలు అసలు చెయ్యలేవు. వారికి అందుబాటులో కూడా వుండవు. దీన్ని బాధ్యతగా డాక్టర్ వసంత్‌లాంటి యువకులు సేకరిస్తున్నారు. అనుక్షణ ఆలోచనాపరుడైన స.వెం.రమేష్‌గారికి ఒక కొత్త ఆలోచన వచ్చింది. దక్షిణ రాష్ట్రాలయిన తెలుగు, కన్నడ, తమిళ మళయాళ మొదలైన అయిదు రాష్ట్రాల జానపద కళాజాతర చేసి అందర్నీ తెలుగు జనజీవన స్రవంతిలో కలపాలి. అంతే అది వెంటనే కార్యరూపం దాల్చింది. తమిళనాడులోని తిరుచునాపల్లి అనే తిరుచిలో ఏర్పాటుచేశారు.. ఇదీ పల్లెకళల పరస పేరుతో జరిగింది. అప్పటిదాకా విడి విడిగా వున్న పదిహేడు తెలుగు జాతులను సమావేశపరిచి రమేష్‌గారు వారందర్నీ ఒకే వేదికమీదకు తెచ్చారు. వారిలో ఐక్యత సాధించి ముందడుగు వేశారు తిరుచిలో అంతా రెడ్లు. బాగా సంపన్నులు. ఇదివరకు అంతా తెలుగే. ఇప్పుడు మారింది. వాసవి మహల్లో తిరుచ్చికోట ఆకారంలో వేదిక ఏర్పాటు చేశారు. కేంద్రమంత్రి పనబాక లక్ష్మి, ఇతర రాష్ట్రాల మంత్రులు అందరు హాజరైనారు. 'దక్షిణభారత పల్లె కళల పండుగ' అని తెలుగు అక్షరాలతో వేదిక మీద అతి పెద్ద బానెర్ కట్టారు.. "మా తెలుగుతల్లికి మల్లెపూ దండ" పాటతో కార్యక్రమం ప్రారంభమయింది. కూచిపూడి నాట్యంతో కళా సంరంభం ప్రారంభమైంది. మహా సంబరంగా జరిగాయి కళా వేడుకలు. జనం మెచ్చి వేలాది రూపాయలు కళాకారులకు ఇష్ట పూర్తిగా చదివించారు. ఆ ఉత్సాహం వర్ణనాతీతం. అంతా కన్నుల పండగే. ఒక్క క్షణం వృధా పోలేదు. వచ్చినవారందరికీ పెళ్లిభోజనాలను మించిన భోజనాలు వసతి కల్పించారు. స్థానిక రెడ్డి సంఘం మొత్తం ఖర్చు భరించి రెండురోజుల కార్యక్రమాన్ని దిగ్విజయం చేసింది. మొత్తం 400 మంది కళాకారులు పాల్గొన్నారు. తమిళులు నోరు వెళ్ళబెట్టి చూశారట. తెలుగు ఇంత ప్రమాదమా? అని ముక్కున వేలు వేసుకొన్నారట. ప్రమాదం అంటే వాళ్ల భాషలో అద్భుతం అని అర్ధం.. ఇలా చేయటం వల్ల తెలుగువారికి ఏమి ఒరిగింది అనే సందేహం రావచ్చు. తెలుగు భాష,

సంస్కృతి ఎంత ప్రాచీనమైనవో, యెంత కళాసంపద తెలుగువారికి ఉన్నదో, ఎన్నెన్ని కళారూపాలు తెలుగులో వున్నాయో ఒకే వేదిక మీద తెలుగువారితో సహా అందరు చూసి తెలుసుకున్నారు. తల్లిభాష తెలుగు పట్ల పూజ్య భావం, gouravam, ఆరాధన కలిగాయి. తెలుగు మాతృభాషీయుల ఉత్సాహం చాలా గొప్పది అనే అభిప్రాయం సర్వత్రా గోచరించింది. దీనిని చూసిన వారంతా తమ జిల్లాలో ఇలాంటి జాతర చేయమని మరీ మరీ కోరారట. అంత స్పందన లభించింది. హోసూర్ ఏం ఎల్.ఏ. గోపీనాథ్‌గారు దీనికోసం చాలా శ్రమించారట. ఆయన తెలుగువాడే. తమిళ అసెంబ్లీలో తెలుగులోనే మాట్లాడుతారట. ఇదంతా రమేష్‌గారి ప్రోత్సాహం, హోసూరు తెలుగు సంఘాల నిర్వహణ సామర్థ్యం.. ప్రజల సహకారం..

## హోరెత్తిస్తున్న హోసూరు తెలుగు ప్రజావాణి-4 (చివరిభాగం)

ఇంతవరకు హోసూరు తెలుగు ప్రజలు నిర్వహించిన వివిధ సాహిత్య కార్యక్రమాలను గురించి తెలుసుకొన్నాం. ఇంతచేస్తున్నా తమిళ తంబి కరుణ తెలుగువారికి నిధి ఇవ్వలేదు, విధి ఇవ్వలేదు. తన తమిళ ఆధిపత్యం నెత్తికెక్కింది. "ఎంగుం తమిళం-ఎదలుంతమిళం" అనే నినాదంతో శివాలెత్తి పోతున్నాడు కరుణ. ఈ మాటలకు అర్ధం ఎక్కడైనా, ఎందులోనైనా తమిళం మాత్రమే ఉండాలట. మిగతా భాషలన్నీ తీసికట్టు అట. ఇప్పుడు ఒక్క ఓటర్‌లిస్టులో మాత్రమే తెలుగు పేర్లు కనిపిస్తాయి. మిగత ఎక్కడా తెలుగు వాసన కూడా లేదు. అయితే ఓటర్పేరు పక్క వూరి పేరు మాత్రం తమిళంలోనే ఉంటుందట. ఇంకా పిచ్చి ముదిరి అసలు మీ పేర్లు తెలుగులో రాయలేక చస్తున్నాం. పేర్లు తమిళ పేర్లు పెట్టుకొండి అని ఉచిత సలహా పారేశాడు కళ్ళజోడు కరుణ. లోకం అంతా పచ్చగా కనిపిస్తుందట కామెర్ల వాడికి.. ఇది మరీ చిచ్చు పెట్టింది. తెలుగుల ఆత్మగౌరవం దెబ్బతింది. తెలుగువారికే కాదు, కన్నడ, మలయాళీ, ఉర్దూ మైనారిటీలకు కూడా ఇదే దుస్థితి.. ఇక సహించలేకపోయారు. ఎదురు తిరగటం ప్రారంభించారు. మైనారిటీలంతా కలిసి పోరాడాల్సిన అవసరం ఏర్పడిందని గ్రహించారు. ఇంకా వూరుకొంటే అసమర్ధత అవుతుందని, తొండ ముదిరితే ఊసరవెల్లి అవుతుందని అర్ధమయింది అందరికి..

కర్నాటకలో ముప్పై మూడు శాతం తెలుగువారున్నారు. ఏడు జిల్లాలలో మెజారిటీ తెలుగువారిదే. అయితే తెలుగుస్కూల్సుమాత్రం 170 మాత్రమేనట. వీటినీ పెంచుకోవాలనే స్థిర సంకల్పంతో వున్నారు. కన్నడ ప్రభుత్వంతో పేచీ లేదు. అన్ని సమస్యలు ఒక్కటొక్కటే పరిష్కరించుకుంటు వస్తున్నారు హోసూరు తెలుగువారు. అయితే ఇప్పుడు ఇంకో కొత్త ప్రమాదం వచ్చిపడింది వారికి. హోసూర్లో రెండు పారిశ్రామిక వాడలను తమిళనాడు ప్రభుత్వం ఏర్పాటు చేసింది తూర్పు, పడమరలుగా. ఇండియాలోనే

ఇంత పెద్ద పరిశ్రమలు ఇంక ఎక్కడాలేవట. ఇవన్నీ sipcot అనే పేర వెలిశాయి. అంటే "smaall scale industries promotion corporation of tamil naadu" మొత్తం ఏడు వేల కోట్ల పెట్టుబడి. ఇక్కడ గుండుసూది మొదలు చిన్న విమానాలు వరకు తయారుచేస్తారు. టి.వి.ఎస్., titan, అశోక్లేలాండ్, ఇండియన్నిప్పాన్మోదలైన 5000లకు పైగా భారీ, మధ్యతరగతి పరిష్మలున్నాయి. లారీలు, బైకులు, ఆటోలు, చిన్న విమానాలు ఇక్కడ తయారుచేస్తారు. ఇ.టి.పార్క్, 500 కోట్లతో సెజ్జున్నాయి అటో mobiles leather, ప్లాస్టిక్ పరిశ్రమలు వుండి ఎగుమతులకు బాగా తోడ్పడుతున్నాయి. ఉపాధి అవకాశాలు బాగానే వున్నా, పంట భూములన్నీ హారతి కర్పూరం అయిపోయాయని ఇక్కడి రైతులు నిర్వేదంగా వున్నారు. 60,000 మందికి ఇవి ఉద్యోగాలు కల్పిస్తున్నాయి. కానీ తమిళులు వచ్చి ఇక్కడ ఉద్యోగాలలో స్థిరపడటంతో మళ్ళీ తెలుగుభాషా వ్యాప్తికి చాలా అడ్డంకి కలుగుతోందని భాషాభిమానుల మనోవేదన. రెడ్డొచ్చె మొదలాడు అన్న తీరుగా వుంది ఈ పారిశ్రామీకరణ. 2005 నుంచే ప్రారంభం అయింది. రెండు దశల్లో. ఇది కూడా కరుణానిధి ఇక్కడి తెలుగును, తెలుగువారినీ దెబ్బ తీయటానికి పన్నిన పన్నుగడ అని అంటున్నారు మిత్రులు. నోటితో పలకరించి నొసలుతో వెక్కిరించినట్టుంది.

ఇవీ హోసూరులోని తెలుగువాళ్ల మనోవేదన, బాధ .. ఒకపక్క ఆధునికత వచ్చిందని ఆనందం, ఇంకోపక్క తెలుగు అస్తిత్వానికి మళ్ళీ ప్రమాదం ఏర్పడుతోందని బాధ. ఏమైనా ఎన్ని ఒడిదుడుకులు ఎదురైనా పోరాట పటిమగల ఇక్కడి తెలుగు ప్రజలు సమస్యలను వ్యూహాత్మకంగా పరిష్కరించుకోగలరనే గొప్ప విశ్వాసం వాళ్ళను, వారి అకుంటిత దీక్షను, పట్టువదలని విక్రమాదిత్యాన్ని ఓర్పు నేర్పులను చూసిన తరువాత నాకు అనిపించింది.. భవిష్యత్తు వారందరికీ భద్రంగా వుండాలని, తెలుగుకు పట్టాభిషేకం జరుపుతూ తెలుగుతేజాన్ని దశ దిశలా వెదజల్లుతారని భావిస్తున్నాను. వారందరికీ భగవంతుడు ఆయురారోగ్యాలు ధైర్యస్థైర్యాలు ప్రసాదించవలసినదిగా భగవంతుడిని ప్రార్థిస్తున్నాను. సరస్వతీదేవి వారికి ఎప్పుడు అండగా నిలుస్తుందని భావిస్తాను. హోసూరు తెలుగువాణి హోరెత్తి దశ దిశలా మారుమోగాలి. అందరికీ హోసూరు ఆదర్శం కావాలి. హోసూరు మిత్రులందరికి మరొక్కసారి నమస్సులు, అభినందనలు తెలియజేస్తున్నాను.

## 4) మా కాశీమజిలీ కథ- కృష్ణ నుంచి గంగ దాకా

సాహితీబంధువులకు శుభకామనలు. మేమిద్దరం, మా బావమరిది కుటుంబంతో 2011 జూన్ 21 నుంచి కాశి ప్రయాగ యాత్రలు చేసి 25కు హైదరాబాద్‌కు తిరిగివచ్చాము. ఆ వివరాలనే 'మా కాశీమజిలీ కథ' కృష్ణ నుంచి గంగ దాకా' శీర్షికతో అందిస్తున్నాను.

కృష్ణానది ఒడ్డునే వున్న విజయవాడకు 25 కిలో మీటర్ల దూరంలో ఉయ్యూరు వుంది. అక్కడి నుంచి నేను నా భార్య ప్రభావతి ఈ నెల 18వ తేది రాత్రి బయల్దేరి బస్సులో హైదరాబాద్ చేరాం. ముందు మా పెద్దబ్బాయింటికి వెళ్లి అక్కడి నుంచి మా బావమరిది ఆనంద్ ఇంటికి మధ్యాహ్నం చేరాం. అక్కడ ప్రయాణానికి కావలసినవన్నీ తయారుచేసుకొని సిద్ధమైనాం. 21 ఉదయం పాట్నా ఎక్స్ప్రెస్లో మా ప్రయాణం. మేమిద్దరం, ఆనంద్, అతని భార్య ఇద్దరు పిల్లలు అతని అత్తగారు. ఇదీ మా బృందం. ఏడుగురు సభ్యులం. టికెట్స్ అన్నీ నెలరోజుల ముందే బుక్చేశాడు మా బావమరిది. కాబ్లో అందరం ఉదయం తొమ్మిదిన్నర గంటలకు సికందరాబాద్ స్టేషన్ చేరాం. మారెసెర్వెద్కం పార్ట్మెంట్లో మా సీట్లలో కూచున్నాం. ట్రైన్ సరిగ్గా పదిగంటలకు బయల్దేరింది. పొద్దున్నే ఇంటిదగ్గర ఏడు గంటలకు అందరం వేడి అన్నం, కూర, పచ్చడి, పెరుగుతో భోజనంచేసే బయల్దేరాం. రైల్ అయిదు గంటలు ఆంధ్రదేశంలోనే ప్రయాణం చేసింది. ఆంధ్రలో చివరి హాల్టిర్పూర్. అక్కడి నుంచి మహారాష్ట్ర ప్రారంభం. మా బృందంలో మూడుతరాల వాళ్ళం వున్నాం. మేమిద్దరం ఆనంద్ అత్త అంటే మా ఆవిడా అక్కగారు అరవై అయిదుపై వాళ్ళం. ఆనంద్, భార్య యాభై లోపు. వాళ్ల పిల్లలు స్పందన, వంశీలు ఇరవై మూడు లోపు. అమ్మాయి బి.teck పాస్స్ అయి ఉద్యోగంలో వుంటే తమ్ముడు బి.teck మూడవ ఏడు..

నేను దీనితో నాల్గోవసారి, మా ఆవిడ మూడోసారి ఆనంద్ ఏడోసారి రుక్మిణి పిల్లలు మొదటిసారి కాశీయాత్ర. ఆ రోజూ టైమ్స్ అఫ్ ఇండియా పేపర్ కొని చదివాను. అందులో రెండు ముఖ్య విషయాలు చెప్తాను. ఒకటి అన్నా హజారే గారి గురించి. పూనాకు దగ్గరలో ఆయన గ్రామానికి చుట్టూ 2200 ఎకరాల భూమి వుంటే అందులో ఆయన కాలుపెట్టే సమయానికి 330 ఎకరాలు మాత్రమే సాగుభూమి. ఆయన మిలిటరీలో రిటైర్ అయిం తర్వాత వచ్చిన penshion డబ్బుతో వాటిని తీర్చిదిద్దాలను కొన్నాడు. అందర్నీ సమీకరించి సాంద్ర వ్యవసాయం చేసి, చెక్డాములు నిర్మించి కొద్దికాలంలో 1750 ఎకరాలలో వంటలు పండించే ఏర్పాటు చేశాడు. ఇది విప్లవాత్మక మార్పు. దిగుబడి బాగా వచ్చి అప్పటిదాకా తలనరి



ఆదాయం 250 రూపాయల నుంచి, 29000 రూపాయలకు పెరిగిందట. అందుకే ఆయనను అంతా ఆదర్శంగా తీసుకున్నారు. మనసులోనే ఆయనకు నమస్కరించాను. రెండో విషయం నాగపూర్ సమీపంలో త్రవ్వకాలలో 25000 ఏళ్ళనాటి రాతి చిత్రాలు కనిపించాయట. ఇదో అద్భుతం. పిల్లలకు ఆ విషయం చెప్పి హుషారు చేశా. బలార్షా వచ్చింది. అది వేపచెట్లకు ప్రసిద్ధి. చాల ముదురు చెట్లుంటాయి టింబర్ డిపో. వాళ్ళు ఇకడికి వచ్చే కొనుక్కు వెళ్తారు. ఆంధ్రప్రదేశ్‌లో అతిపెద్ద టింబర్ డిపో హైదరాబాద్‌లో వున్న అక్కినేని నాగేశ్వరరావుది. రెండోది ఉయ్యూరులోని సుధీర్ టింబర్ డిపో. దాని యజమాని నూకల లింగమూర్తి ఇక్కడికి వచ్చే కలప కొంటాడు. అ ఆడవులు మనకు దారిలో కనిపించవు. దూరంగా వుంటాయేమో. గాంధిగారు వున్న సేవా గ్రామం స్టేషన్లో బండి ఆగుతుంది రాత్రి ఏడు గంటలకు నాగపూర్ చేరాం. ఇది మహారాష్ట్రకు సాంస్కృతిక రాజధాని అనవచ్చు. ఇక్కడ కాంగ్రెస్సభలు జరిగి స్వాతంత్ర ఉద్యమంకోసం ముఖ్య తీర్మానాలు చేశారు. ఆర్ .ఎస్.ఎస్.కు ఇది కేంద్రబిందువు. దాని అధినేతలిక్కడే వుంటారు. కమలాలకు నాగపూర్ చాలా ప్రసిద్ధి. ఇప్పుడు season కాదు తోటలు నాగపూర్ దాటినా తర్వాత కన్పిస్తాయి. ఈ ప్రాంతంలో మన తెలుగువాళ్ళు చాలా గణనీయ సంఖ్యలో వున్నారు. మనవైపు నుంచి వలస వచ్చి ఇక్కడ వ్యవసాయం కష్టపడి చేసి మంచి పంటలు పండిస్తున్నారు. ఈ ప్రాంతం రూపురేఖలు మార్చినవాళ్ళు మనవాళ్ళే. నాగపూర్ తెలుగు అసోసియేషన్ చాలా కాలం నుంచి బాగా పని చేస్తోంది. ఇవన్నీ పిల్లలకు చెప్తుతుంటే చెవులు రిక్కించి విన్నారు.. దారిలో ఇంటినుంచి తెచ్చుకున్న టిఫిన్ రాత్రికి చపాతి తిన్నాం. మన మంచిర్యాల్కు ముందు గోదావరి నది దర్శనమిచ్చింది. దాని తర్వాత సిర్పూర్ కాగజ్ నగర్ వచ్చింది. అక్కడి తెల్లకాగితాలు బాగుండేవి. వెదురు చేట్లు కాగితంపై కన్పించేవి. ఏనుగు మార్కు పేపరు కూడా మా చిన్నప్పుడు బాగా వాడేవాళ్ళం. అదే నంబర్ one రాజమండ్రిలో ఆంధ్ర పేపర్ తయారయేది. ఇవన్నే ఒక్కసారి జ్ఞాపకం వచ్చాయి. రాత్రి బెర్తపై పడుకొన్నాము. దారిలో ఎక్కడా పచ్చని పోలాలు కనిపించవు చిన్న చెట్లుతుప్పలె. మోదుగ చెట్లు బాగా వున్నాయి. దాని ఆకులతో విస్తర్లు కుడతారు. అదే ఇక్కది ప్రజల జీవనాధారం. గొర్రెలు, మేకల పెంపకం వుంది. బోరుబావులు తక్కువ. కరెంటులేని గ్రామాలు కూడా వున్నాయనిపించింది. బాగా వెనకపడిన ప్రాంతాలే ఇవి. మంచి ఇల్లు కూడా లేవు. నాగపూరు నుంచి వర్షం ప్రారంభం అయి దాదాపు 1000. కిలో మీటర్ల దూరం వరకు వర్షం మాతోనే వచ్చింది. కానుగచెట్లు బాగా కనిపించాయి. అక్కడక్కడ నల్లరేగడి భూమి అరుదుగా కన్పించింది. రాత్రి నిద్రపోయాము. ఉదయం కాఫీలు తాగాము. ఇటార్సి అర్ధరాత్రే వచ్చినట్లుంది మధ్యప్రదేశ్లోకి ప్రవేశిస్తాము. మధ్యాహ్నం పదకొండు గంటలకు అలహాబాద్ చేరాం. ఇక్కడ హిందీలో ఇలాహాబాద్

అని రాస్తారు. ఇది ఉత్తరప్రదేశ్‌లో వుందని మనకు తెలుసు. ఆంధ్ర, మహారాష్ట్ర మధ్యప్రదేశ్ దాటి ఉత్తరప్రదేశ్ చేరాం అన్నమాట. యు.పీ tourism వాళ్లతో మాట్లాడి కాంటెస్సా కార్ మాట్లాడుకొని స్టేషన్ నుంచి state బ్యాంకువాళ్ల హాలిడే హోం చేరాం. ఆనంద్ బ్యాంక్ ఆఫీసర్ కనుక ముందే బుక్ చేశాడు, విశాలమైన రూం. డబల్కాట్బెడ్. సోఫాలువున్న పెద్ద హాలు, టి.వి. వేడినీళ్ళు, ఫ్రిజ్ అన్ని సౌకర్యాలు వున్నాయి. రోజుకు పది రూపాయలే అద్దె. బ్యాంకువాళ్ళకే ఇస్తారు. అక్కడ సామాను దించి ప్రయాగలో స్నానానికి కావలిసినవి విడిగా సద్దుకొని వెంటనే బయల్దేరం స్నానం sight సీఇంగ్ అన్నీ కలిపి ఒక్కొక్కళ్ళకి 400 రూపాయలు. అప్పటికే మధ్యాహ్నం పన్నెండు దాటింది. రాయల్రెస్టారెంట్లో దక్షినాది టిఫిన్లు దొరుకుతాయని తెలిసి అక్కడికి వెళ్ళాం. రేట్లు వింటే గుండె గుభేలే. కాఫీ నలభై రూపాయలు. ఇడ్లి అరవై అయిదు. ప్లేట్ పెరుగు వడ డెబ్బై. ఇదే అందరం తిని, మూడు కాఫీలు అందరం సర్దుకున్నాం. ఆ రోజూ నా పుట్టినరోజూ అని టిఫిన్లు అయిన తర్వాత తెలియజేసి బిల్లు 610 నేనే చెల్లించాను చిన్న పార్టీ ఇచ్చినట్లు. అంతా ఆశ్చర్యపడ్డారు ఒక్కమాట కూడా ముందుగా చెప్పనందుకు. త్రివేణి సంగమం చేరాం. కారులో అక్కడి నుంచి టూరిజం వాళ్ళు ఏర్పాటు చేసిన బోటులో సంగమ స్థలం చేరాం.

అప్పటికి సుమారు ఒకటిన్నర. నేనే అందరికి స్నాన సంకల్పం చెప్పాను. పడవ వాడు దారిలో ఒకచోట 140 అడుగుల లోతున నీళ్ళు వున్నాయని చెప్పాడు. అంతా కంగారు పద్దాం.. కాని సంగమ స్థానంలో కేవలం నాలుగు అడుగుల లోతు నీళ్ళ దగ్గర బోటు ఆపాడు. అందులోంచి దానికి ఆనుకున్న లంగరు వేయబడ్డ ఇంకో బోట్లోకి మారాం. దాన్ని పట్టుకొని స్నానం చెయ్యాలి. గంగనీరు తెల్లగా, యమునా నీరు నల్లగా కనిపిస్తాయి. సరస్వతి అంతర్వాహిని. ఈ మూడు కలిసేచోటే త్రివేణీ సంగమం. చాలా విత్రమైనది. ఎన్నో జన్మల పుణ్యఫలం ఉంటేనే ఇక్కడ స్నానం చేయగలుగుతాం. అందరికి విషయాలన్నీ చెప్పాము నేను ఆనంద్. ఒళ్ళు పులకించిపోయింది. స్నానానికి ఒక్కొక్కరం దిగాం. ముందుగా నాకంటే పెద్దమా ఒదిన గారిని ఆంటే మా ఆవిడ అక్కగారిని ఆంటే ఆనంద్ అత్తగారిని నీళ్ళలోకి దింపాము. ఆవిడ చాలా భయపడింది. భయం ఒదిలించాం. దిగిన తర్వాత కేకే. భలే ఆనందంగా సంతృప్తిగా స్నానం చేసింది. తర్వాత మా దంపతులు మేనల్లుడు మేనకోడలు దిగి స్నానం చేశాం. తర్వాత ఆనంద్ దంపతులు. నేను కాసేపు నీళ్ళలో ఈదాను. ఫోటోలు తీశారు. ప్రవాహం తక్కువ లోతు తక్కువగా వుంది. ఇదివరకు మూడుసార్లు వచ్చినప్పుడు కాళ్ళు నేల మీద ఆనేవి కాదు. విపరీతమైన వేగం. ఇసుక కోసుకు పోతుండేది. ఈసారి నిలకడగా వుండటం అందరి అదృష్టం. గంటపైగా స్నానం చేశాము. అందరం భూతల స్వర్గంలో వున్నట్లు భావించాం. ఆ అనుభవం మాటలతో

చెప్పలేనిది. ఈ క్షేత్రానికి అంతా పవిత్రత వుంది. శంకరాచార్యులు నడయాడిన నేల, మండన మిశ్రుని ఓడించి శిష్యునిగా చేసుకొన్న ప్రదేశం, ఎన్ని యుగాల నుండో ఈ వాహిని ఎన్ని కోట్లమందికి ముక్తినిచ్చిందో అవన్నీ తలుచుకుంటే ఆనందం అర్ణవం అవుతుంది, జన్మ తరించిందనిపిస్తుంది. కంఠం గద్గదిక మవుతోంది. మాటలు రావు. ఎందరు మహర్షులు వ్యాసాది మునులు వాల్మీకాది మహర్షులు కాలు మోపిన పుణ్యభూమి. నీటితో మా పితృదేవతలకు, తెలిసిన బంధుమిత్రాదులకు, మరిచిపోయిన మహానుభావులకు పేరు పేరునా జ్ఞాపకం చేసుకొని తర్పణం జలంతో ఇచ్చినా, విధి నేరవేర్చాను. సాయం సంధ్య వార్చాను. ఆ నదీమ తల్లులకు మనసారా నమస్సులను అందించిము. ఆ నదుల వల్లనే ఇక్కడ అద్భుతమైన నాగరకత వర్ధిల్లింది. సుక్షేత్రాలైనాయి. పోలాలు, పాడి పంట, వేదశాస్త్ర విజ్ఞానం వికశించి ప్రపంచంలో భారతదేశం సాంస్కృతిక విషయాలలో ముందుంది.. గంగా పుష్కరాలు వెళ్లి సరిగ్గ నెల అయింది. ఈ సంవత్సరం అంతా పుష్కరమే. కనుక పుష్కర స్నాన ఫలం దక్కింది, మధ్యాహ్నం 12-01 మధ్య పుష్కరుడు ఉంటాడట. అప్పుడే కొట్లాది దేవతలు వచ్చి పవిత్ర స్నానాలు చేస్తారట. అలాంటి సమయంలో చేసే అరుదైన అదృష్టం కల్గింది కొంత ఆలస్యమయినా. ఆనందంతో కళ్ళు మూసుకుపోతున్నాయి. పిల్లలు మరుపురాని అనుభూతి పొందినట్లు చెప్పారు. ఇదివరకు ఇక్కడికి పెంగ్విన్లు సైబీరియా నుంచి వలస పక్షులు వచ్చాయి. ఇప్పుడవి కనిపించలేదు. season కాదేమో. ఇంతా ఆనందాన్ని మూటకట్టుకొని సంగమ జలాన్ని బాటిళ్ళలో కావలిసినంత పట్టుకొని నెమ్మదిగా మళ్ళీ మా బోటు చేరి బట్టలు మార్చుకొన్నాం. ఉయ్యూరులో మా ఆవిడ నాకిష్టమైన మైసూర్‌పాక్ చేసి తెచ్చింది. నా పుట్టినరోజు అంటే మైసూరుపాక్ ఉండాల్సిందే. మా అమ్మ ఎప్పుడు చేసి పెట్టేది. తర్వాత ప్రభావతి. అందరికి పుట్టినరోజూ స్వీటు తినిపించాం. అంతా శుభాకాంక్షలు చెప్పారు. త్రివేణికి నెమ్మదిగా వీడ్కోలు పలుకుతూ కృతజ్ఞత చాటుతూ, మానసిక ఉల్లాసాన్ని పొందుతూ ఒడ్డుకు చేరాం. నదీస్నానం చాలా యోగ్యమైనది. కరెంటు అంటే ప్రవాహం మరియు విద్యుత్తూ అని అర్థం. ఇలాంటి పవిత్ర నదీజలాలలో స్నానం చేస్తే ఒంటికి శక్తి ప్రవాహం చేరుతుంది. శరీరానికి మనస్సుకు ఉల్లాసం కలుగుతుంది. ఆధ్యాత్మిక భావలహరి మనల్ని కర్తవ్యోన్ముఖులను చేస్తుంది. మోకాళ్ళ నేప్పులతో అడుగు తీసి అడుగు వెయ్యలేని స్థితిలో వున్న నా భార్య త్రివేణీ సంగమ స్నానం చేసిన తర్వాత తనకు కొత్త శక్తి వచ్చిందని హాయిగా నడవ గలుగుతున్నానని చెప్పి, మాతోపాటు నడిచి అందర్నీ ఆశ్చర్యపరిచింది. అదీ దాని ఫలితం. కొత్త శక్తిని నింపుకొని, మనసంతా ఆనందాన్ని నింపుకొని, అంతకుముందు లేని వింత అనుభూతిని పంచుకొని అందరం ఆ త్రివేణీ మాతకు హృదయ పూర్వక నమస్కారాలు కృతజ్ఞతలు చేతులు జోడించి చెప్పి గాలిలో తేలిపోయేట్లు పొంగిన మనసులతో నిండిన సంతృప్తితో

నెమ్మదిగా ఒడ్డుకు చేరాం. ఇక్కడివాళ్ళు ఈ ప్రదేశాన్ని సంగం అంటారు. రాజాకపూర్ ఆ పేరుతో సినిమా కూడా తీశాడు. ఒడ్డున పూర్వపు రాజులకోట వుంది. చాలా పెద్దది. ఇదివరకు అందర్నీ లోపలికి వెళ్ళి చూడనిచ్చేవారు. ఇప్పుడు అవకాశంలేదు. మళ్ళీ కారు ఎక్కి సైట్ సీఇంగుకు బయల్దేరాం. దగ్గరలో బడే హనుమాను గుడిని చూశాం.

నా పుట్టినరోజున మా ఇలవేలుపు దర్శనం శుభదాయకం. ఎక్కడో లోతులో వుంటాడు స్వామి. పైనించి కటకటాల ద్వారా చూడాలి. ఆనంద భవన్ అయిదు దాటితే మూసేస్తారు. అక్కడికి ఇంకో పావుగంట ఉందనగా చేరాం. ముసలివాళ్ళు కార్లోనే వున్నారు. పిల్లలకు అన్నీ వివరిస్తూ, వీలయితే ఫోటోలు తీస్తూ తీరిగ్గా చూపించాం. మోతీలాల్ ఇక్కడే లా ప్రాక్టీసు చేశాడు. రాజకీయాలలో చేరి గొప్ప నాయకుడైనాడు. ఆయన గదులు, పుస్తకాలు వాడిన వస్తువులు చూశాం. తర్వాత నెహ్రూగారి వైభవం. ఆ తర్వాతే ఇందిరాగాంధి వైభవం. నెహ్రూ ఒడుగు చేసుకున్న ఫోటో వుంది. శీర్షాసనం వేస్తున్నాదీ వుంది. చరక, గుర్రపు సార్టు వున్నాయి. గాంధిగారు తరచుగా ఇకడికి వచ్చి మోతీలాల్ జవహర్‌లాల్‌తో సంభాషణ చేసేవారు. ఆయనకు ఒక ప్రత్యేకమైన గది వుంది. ముఖ్యమైన నిర్ణయాలన్నీ ఆనంద భవన్లోనే జరిగేవి. అందుకే దానికంత ప్రాముఖ్యం. మంచిలాన్లు పచ్చగా మనసు హాయినిస్తాయి. కొన్ని కోట్లు ఖరీదైన ఆస్తులివి. దేశానికి రాసి ఇచ్చి మహాత్యాగులనిపించుకున్నారు. అందుకే ప్రజలు ఆ కుటుంబానికి బ్రహ్మరథం పడతారు. దానికి తగ్గట్టే మొతెలాల్, జవహర్లాల్ ఇందిరా, రాజీవ్, సోనియాలు దేశ రాజకీయం కీలకపాత్ర పోషించారు. దీనికి దగ్గరే గంగఒడ్డున భరద్వాజ మహర్షి ఆశ్రమం వుంది. శ్రీరాముడికి ఆ తర్వాత భరతుడికి ఆ ముని అతిధి మర్యాదలు చేసి మార్గదర్శనం చేశాడు. అక్కడి నుంచి పార్కు, మ్యూజియమ్, వేణీ, మాధవ దర్శనం చేశాం .ఇక్కడ పెరుగు అలిపిన మజ్జిగలో పంచదార వేసి ఇస్తారు. చాలా బాగుంటుంది. లస్సి అంటారు. తాగనివాళ్ళు ఇస్సీ అనాల్సిందే. స్వీట్లు ఎక్కువ తింటారు. ఇక్కడ కాశీలో బిల్డింగులకు బయట సిమెంట్ ఫినిషింగ్ చెయ్యరు. టీని మట్టి కప్పులతో తాగటమిక్కడి పద్ధతి. ఎంగిలి వుండదు. తాగగానే పగల కొట్టేస్తారు. అంతా అయింతర్వాత పొద్దున్న టిఫిన్చేసిన హోటల్‌కు వెళ్లి భోజనం చేశాం. ఒక్కొక్కరికి 135 రూపాయలు. చాల బాగావుంది భోజనం. ఇష్టపడి తిన్నాం. అలసట మూడువంతులు సంగమస్నానంతో మిగిలింది భోజనంతో తీరింది. హాలిడే హోం చేరాం. అందరికి పక్కలు ఏర్పాటు చేశారు. పడుకున్నాం కాని, దోమల వల్ల నిద్ర బాగా పట్టలేదు. తెల్లవారురఝామున మూడింటికి కార్లో బయల్దేరి 125 కిలో మీటర్ల దూరంలోవున్న వారణాశి అనే కాశీకి ప్రయాణం పెట్టుకున్నాం. ఆ వివరాలు తరవాత మనవి చేస్తాను.



## కృష్ణ నుంచి గంగ దాక-2

అలహాబాదు చాల ప్రసిద్ధమైంది. ఇక్కడే ఆదిశంకరాచార్యులు మండనమిశ్రుని, ఆయన భార్య ఉభయభారతిని వాదంలో ఓడించి శిష్యునిగా మార్చాడు. ఆయనే పద్మపాదుడు. అలాగే బౌద్ధధర్మం ఏమి చెప్పిందో తెలుసుకోవటానికి కొద్దికాలం ఆధర్మచరణ చేసిన ఆయన హిందూ ధర్మానికి చాలా అపచారం చేశానని వూకలో పడుకొని దేహాన్ని కాల్చుకుని దేహత్యాగం చేసినది ఇక్కడే. త్రివేణి సంగమంలో పుణ్య స్త్రీలు భర్తతో కలిసి వేణిపూజ చేసుకుంటారు. ఇది జీవితంలో ఒక్కసారే చేసుకోవాలట. ఇక్కడ ఆంధ్ర ప్రాంతం నుంచి సుమారు యాభై ఏళ్ళక్రితం ఇక్కడికి వచ్చి, ఇక్కడే పురోహితునిగా స్థిరపడిన పురోహితులు హరిజగన్నాధశాస్త్రిగారు. మంచి పురోహితులు. బాగా చేయిస్తారు. మేము మొదటి మూడుసార్లు ఆయనతోనే చేయించాము. ఆయన దగ్గర వుండటనికి రూములు దొరుకుతాయి. ముందుగా చెప్తే టిఫిన్, భోజనం కూడా ఏర్పాటు చేస్తారు. అచ్చంగా ఆంధ్రా భోజనమే దొరుకుతుంది. అదీ విశేషం. ఈయన గారి మేనల్లుడే కాశీలో పురోహితునిగా వున్న చల్లా లక్ష్మణశాస్త్రి. అక్కడా వుండటానికి అవకాశాలున్నాయి. అలహాబాద్నుంచి వారణాసి 120 కిలో మీటర్లు. ఇంకో విషయం. ఆగ్రా ఢిల్లీల నుంచి యమునా నది ఇక్కడికి అలహాబాద్లో చేరుతుంది. గంగానది హరిద్వారం దగ్గర హృషీకేష్నుంచి భూమార్గం పట్టి ఇక్కడికి చేరుతుంది. ఇక్కడి నుంచి కాశీకీ ప్రయాణం చేస్తుంది. అదీ ఈ రెండు నదుల కథ. తెల్లవారుఝామునే అంటే జూన్ 23న అందరం కారులో నాలుగు గంటలకే బయల్దేరాం. తెల్లవారుఝామున రెండు గంటలకే అందరం లేచి, కాలకృత్యాలు తీర్చుకున్నాము. గంగానది పక్కనుంచే ప్రయాణం. ఇక్కడి నుంచే శ్రీరాముడు, లక్ష్మణుడు, సీతాదేవి గంగను దాటి దండకారణ్యం ప్రవేశించారు. కార్డైవర్కు పిలక జుట్టుంది. బాగా నడిపాడు. మధ్యలో ఒకచోట ఒక బడ్డీకొట్టు దగ్గర ఆగి, కాఫీ తాగాము. మట్టి కప్పులలో కావాలని తాగాము. అందరు సంతోషంగా వాటిలో తాగారు. కొన్ని ఖాళీ కప్పులు అడిగి తీసుకుంది ప్రభావతి వుయ్యూర్లో చూపించటానికి. సుమారు మూడుగంటల ప్రయాణం తర్వాత కాశి చేరాం.

మహారాజా రోడ్డులోవున్న స్టేట్బ్యాంకు హాలిడే హోం చేరి సామాన్లు దించాము. కావలసినవి సర్దుకొని అక్కడి బాయ్ ఇచ్చిన కాఫీలు తాగి ఒక అరగంటలో హరిశ్చంద్ర ఘాట్చేరాం. ఒడ్డున బట్టలన్నీ పెట్టి అందరం గంగానదీమ తల్లిలో స్నానం చేశాం. ప్రవాహం తక్కువే. జన్మ జన్మల పూజాఫలం ఇక్కడ స్నానం. ఈ హరిశ్చంద్ర ఘాటలోనే



పూర్వం సత్యహరిశ్చంద్ర మహారాజు తన కొడుకు లోహితాస్యుని దహనం చేశాడు, ఇక్కడే వీరబాహు అనే కాటికాపరికి అమ్ముడుపోయాడు. వీరబాహువంశం ఇప్పటికి ఘాట్ను పర్యవేక్షణ చేస్తోంది. భార్య చంద్రమతి ఇక్కడే ఒక బ్రాహ్మణ స్త్రీకీ పనిమనిషిగా సేవలు చేసింది. హరిశ్చంద్ర చక్రవర్తి జాతకం అంతా తలక్రిందులైనది ఇక్కడే. అనుక్షణం శవాలు కాలుతూనే వుంటాయి. లాట్లకు లాట్లు కర్రదుంగలు ఘాటు ఒడ్డున నిలవవుంటాయి. సగం కాలిన శవాలను గంగలో తోయటం ఇక్కడ మామూలే. కాశీ అంటే మహా శ్మశానం. ఇక్కడ చనిపోతే ముక్తి తప్పదు. చనిపోయేవారి చెవిలో శివుడు శ్రీరామ తారక మంత్రం ఉపదేశిస్తాడట. అందుకే ఇక్కడికి చేరి అద్దెకు ఇల్లు తీసుకొని అందులో వుంటూ మరణాన్ని ఆహ్వానిస్తారు. నిత్యం శ్రీవిశ్వనాథ దర్శనం, గంగాస్నానం చేస్తూ జన్మ పండించుకొంటారు. అన్నపూర్ణమ్మ వుంది కనుక తిండికి లోటు లేదు. ఏ కులానికి ఆ కులం సత్రాలులున్నాయి. భోజనం పెడతారు.

కాశీలో తొమ్మిదిరోజులు ఉండాలని నియమము. చాలామంది పాటిస్తారు. బ్రాహ్మణులకు కరివెన వారి సత్రం మంచి సేవలు చేస్తోంది. ముందుగా మనం ఎంతమంది భోజనానికి వస్తామో ఉదయమే చెప్పాలి. గాత్రంతో సహా. పదకొండు గంటల కల్ల భోజనం పెడతారు. సాయంకాలం టిఫిన్ మాత్రమే. పులిహోర, పిండి, అటుకుల పులిహోర, దోసె ఇలా వెరైటిలుంటాయి. సాయంత్రం రైల్కు వెళ్ళేవాళ్ళకి ప్యాక్చేసి ఇస్తారు. మజ్జిగ ఇస్తారు. అన్నీ చాలా మర్యాదగా శ్రద్ధగా చేస్తారు. అడిగి అడిగివడ్డిస్తారు. చాల రుచికరంగా వుంటాయి ఏవైనా. అన్నపూర్ణాదేవి ప్రసాదంగా భావించి, కళ్ళకద్దుకొని భక్తీ ముక్తి వస్తుందనే పూర్తి విశ్వాసంతో తింటారు.. వీళ్ళ మొదటి సత్రం శ్రీశైలంలో ఉంది.. ఇక్కడే ఆంధ్ర ఆశ్రమం వుంది. గదులు దొరుకుతాయి వుండటానికి. ఇక్కడ వుండి కరివేన వారి సత్రంలో భోజనం చేస్తుంటారు. దీనికి దగ్గరే నారద ఘాటు, మానస సరోవరం ఘాటు వున్నాయి. సరే, గంగాస్నానం చేశాం కదా. నేను పితృదేవతలకు, బంధువులకు, మిత్రులకు నాకు తెలిసిన వారందరికి జలతర్పణం చేశాను. అందరి స్నానసంకల్ప మంత్రం చెప్పి స్నానం చేయించాను. గట్టుమీదకు చేరి నేను తెచ్చుకున్న స్ఫటిక శివలింగానికి అభిషేకం నమక, చమకాలతో చేసుకున్నాను. ఆడవాళ్ళు దీపాధన చేసుకున్నారు. ఎన్ని జన్మల పుణ్యఫలమో ఇక్కడ



గంగమ్మ ఒడ్డున ఇవన్నీ జరుపుకోవటం పదేళ్ళక్రితం వచ్చినపుడు కూడా వారం రోజులుండి రోజు గంగాస్నానం, ఒడ్డున అభిషేకం మహాన్యాసంతో చేసుకున్నాను. విశ్వేశ్వర దర్శనము చేసేవాళ్ళం. నెమ్మదిగా అందరం మెట్లు ఎక్కి హరిస్చంద్ర ఘాట్ చివరరోడ్డుకు దగ్గర్లోవున్న చల్లా లక్ష్మణశాస్త్రి గారింటికి చేరాం. మా బావమరిది ఆనంద్ ముందే అక్కడ వాళ్ళింట్లోవాళ్ళ అమ్మ అంటే మా అత్తగారి ఏడవమాసికం ఏర్పాటుకు సిద్ధం చేశాడు. పదిగంటలకు ప్రారంభమై పన్నెండు గంటలకు పూర్తి అయింది. మూడు కూరలు, గారెలు, బూరెలు మూడు, పచ్చళ్ళుతో బ్రాహ్మణ వంటతో మంచి ,కైకలూరు పురోహితులు చక్కని మంత్రోచ్చారణతో ఇద్దరు భోక్తలతో జరిగింది భోజనం. బాగానే వుంది. అచ్చంగా మన ఇళ్ళ దగ్గిర జరిగినట్లే ఉంది. లక్ష్మణ శాస్త్రిగారు అమలాపురం నుంచి ఇక్కడికి వచ్చి పౌరోహిత్యం చేస్తూ స్థిరపడిపోయారు.

కాశి అనేబడే వారణాశి 'వరుణ-ఆశి' అనే 2 నదుల మధ్య వుంది. నది ఒడ్డున వ్యాపించిన నగరమిది. ఇక్కడేదివోదాసు అనే రాజు పరిపాలించాడు. శ్రీనాధుడు "దివోదాసుబహావిశ్రాంతబలమ్ముచేత" అని భీమఖండ పురాణంలో వర్ణించాడు. ఆయనే ఆయుర్వేదానికి ఆద్యుడైన ధన్వంతరి మహర్షిగా తరువాత జన్మ ఎత్తాడు. కాశీ పట్టుబట్టలకు పేరు. మగవాళ్ళకు కాశీ పట్టుబట్టలు బాగుంటాయి. ఆడవాళ్లకు బెనారస్పట్టు చీరలు బాగా నచ్చుతాయి. కాశి తువ్వాళ్ళు ఎరుపు రంగులో ముచ్చటగా వుంటాయి. దర్భతో చేసిన చాపలు ఇక్కడి ప్రత్యేకత. అస్త్రోస్త్రాలు, ధావళిలకు ప్రసిద్ధి. కావాలని మడికట్టుకొనే వాళ్ళు కొనుక్కుంటారు. కాశీలోనే బుద్ధుడు సారనాద్దగ్గర మొదటిసారిగా శిష్యులకు బౌద్ధధర్మాన్ని బోధించాడు. సారనాద్దగ్గర స్థూపాలు తప్పక చూడాలి. మేము వెళ్ళలేదు. ఇదివరకే చూశాం. అశోక స్తంభం, అశోకచక్రం ఇక్కడే మ్యూజియంలో వున్నాయి. భారతదేశం జాతి గుర్తుగా జాతీయ చిహ్నం అయ్యింది. ఆయుర్వేదం ఇక్కడి నుంచే వ్యాప్తి చెందింది. వ్యాసమహర్షి ఇక్కడే తన ఉపనిషత్తులు పురాణాలు, బ్రహ్మసూత్రాలు రాశాడు వ్యాసమహర్షి. ఇక్కడే ఏడురోజులు భిక్షటనకు, తన శిష్యులకు దొరక్క కోపంతో కాశీని శపించాడు. చివరికి అన్నపూర్ణదేవి ఇంటికి పిలిచి ఆతిథ్యం ఇచ్చింది. కానీ శివునికి కోపం వచ్చి కాశీలో వుండే అర్హత లేదని, కాశీని వదిలిపొమ్మని హెచ్చరించాడు. అప్పుడు అవతలి ఒడ్డునవున్న కాశీ మహారాజు

పాలిస్తున్న ప్రదేశం చేరి అక్కడే వున్నాడు. దానినే వ్యాసకాశి అంటారు. బోటుమీద అక్కడికి వెళ్లి చూడచ్చు. ఇప్పుడు బ్రిడ్జి పడింది. కోట వుంది. అక్కడే మన రెండవ ప్రధాని లాల్ బహదూర్ శాస్త్రిగారు జన్మించిన స్థలం వుంది. డబ్బులులేక అక్కడి నుంచి చొక్క పుస్తకాలు తలపై గట్టిగా కట్టుకొని, గంగానదిని ఈదుకుంటూ కాశీ చేరి బడికి వెళ్లి చదువుకొని మళ్ళీ సాయంత్రం ఈదుకుంటూ ఇంటికి చేరిన మహోన్నత వ్యక్తి శ్రీ శాస్త్రీజీ. బిస్మిల్లాఖాన్ కాశీలోనే వుండేవారు, తన షహనాయితో విశ్వనాథుని పరవశింపచేసిన భారతరత్న ఖాన్జీ. ఇతరదేశాలవాళ్ళు రమ్మని ఆహ్వానించారు. అయినా గంగను, విశ్వనాథుడుని వదిలి రాలేనని ఇక్కడే స్థిరపడిన మహానుభావుడు అయన. కాని ఆయన్ని అంత్యకాలంలో భారతప్రభుత్వం సరైన గౌరవం ఇవ్వకపోవటం విచారకరం. ఇక్కడ హనుమాన్భక్తులు ఎక్కువ తాలిఖానాలున్నాయి, కుస్తీ పట్టటంలో మంచి శిక్షణనిస్తారు. మల్లయోధులకుప్రసిద్ధివ్యాసుడుఆతర్వాతదక్షిణాదికివచ్చిబాసరలో సరస్వతీదేవిని గోదావరి ఒడ్డున ప్రతిష్టించాడు. అగస్త్య మహర్షి, భార్య లోపాముద్రతో కలిసి విశ్వేశ్వర దర్శనంతో పులకించి, వింధ్యపర్వత గర్వమణచి దక్షిణాదికి ముఖ్యంగా ఆంధ్రరాష్ట్రం చేరాడు. ద్రాక్షారామం, భీమేశ్వరా లను సందర్శించాడు. తమిళులకు అగస్త్యుడంటే వీర అభిమానం. వాళ్ళ రచనలన్నిటిలో అయన ప్రస్తావన వుంటుంది. శ్రీరాముడు, హరిశ్చం ద్రుడు, సగరుడు, దివో దాసు, బింబిసారుడు, అశోకుడు, మౌర్యులు, గుప్తులు, అయోధ్య నవాబులు అందరు కాశీని పాలించారు. రాణి అహల్యాదేవికీ కాశీ అంటే భక్తిప్రపత్తులు ఎక్కువ. పూర్వపు చక్రవర్తులు అశ్వమేధ యాగం చేసిన ప్రదేశాన్ని దశాశ్వమేధ ఘాట్ అంటారు. మణికర్నిక ఘాట్ చాల పవిత్రమైనదిగా భావిస్తారు. కేదార్ఘాట్కు మంచి పేరుంది. ఒడ్డున కేదారేశ్వరుడు ఉంటాడు. కాశీలో ఈ చివరనుంచి ఆ చివరకు 64 ఘాట్లున్నాయి. యాత్రికులు బోటులో అన్నీ తిరిగి చూస్తారు. కాశీకి విదేశీయాత్రికులు చాలా ఎక్కువమంది వస్తారు. ఎక్కడ చూసినా వాళ్ళే కనిపిస్తారు. భక్తీశ్రద్దలతో గంగాస్నానం చేసి దైవదర్శనం చేస్తారు. ముక్తి క్షేత్రమనే నమ్మిక. ఎంతోమంది తెలుగువారు ఇక్కడ స్థిరపడ్డారు. కాశీ మొదటినుంచి గొప్ప ఆర్ష విద్యాకేంద్రం. అన్నీ రాష్ట్రాలవారు, వేదం, శాస్త్రం, వ్యాకరణం, తర్కం నేర్చుకోవటానికి కాశీకే వచ్చేవారు. ఇక్కడి పండితుల దగ్గర చేరి శుష్యరికం చేసి విద్య నేర్చి పట్టా పొంది ఇళ్లకు వెళ్ళేవాళ్ళు. విద్యకు చాల సంవత్సరాలు గడిపేవారు. ఎక్కడ జయించి జయపత్రిక పొందినా కాశీపండితుని మెప్పించి జయపత్రిక పొందితేనే గుర్తింపు. అంతటి మహోన్నత పాండిత్యం ఇక్కడి పండితులది. తరువాత స్థానం బెంగాల్లోని నవద్వీప నిధి. అయితే మన పండితులు కొందరు ఇక్కడి పండితుల్ని జయించి శెహబాష్ అనిపించుకున్నవారు వున్నారు. ఈ విషయాలు నేను రాసిన 'ఆంధ్ర వేదశాస్త్ర విద్యాలన్కారులు' అనే పుస్తకంలో వున్నాయి మిగిలిన విషయాలు.

# కృష్ణ నుంచి గంగ దాకా-3

మధ్యాహ్నం మూడుగంటలకు ఆటోకు మూడువందల యాభైకి రెండు ఆటోలలో లక్ష్మణశాస్త్రి గారింటి నుంచి నగర సందర్శనకు బయల్దేరాం. ముందుగా రెండు కిలోమీటర్ల దూరంలో వున్న కాలభైరవ ఆలయం చేరాం. విశ్వనాధ దర్శనం తర్వాత ఇది చాలా ముఖ్యం. భైరవుడు అంటే శునకం, ఈయన కాశీ క్షేత్ర పాలకుడు. నిరంతరం కాశీని రక్షిస్తుంటాడు. అక్కడ వుండే పూజారి ఈ కలకుంచెతో నెత్తిమీద బాదుతూ కాశీ తోరం కడతాడు. అది నల్లగా ఉంటుందని అందరికి తెలుసు. కొనుక్కొని ఇళ్ళకు తెచ్చి బంధువులందరికీ ఇస్తారు. అది కాలభైరవ రక్ష అన్నమాట. ఇక్కడ ఒక కథ తెలియజేస్తాను. పూర్వం బ్రహ్మదేవుడు అహంకారంతో బలగర్వంతో తానే పరబ్రహ్మ స్వరూపం అని విర్రవీగి పరమేశ్వరుణ్ణి కూడా తూలనాడాడు. శివుడికి కోపం వచ్చి తన తేజం నుంచి కాలభైరవున్ని ఉధ్భవింపజేశాడు. ఆయన వీర ఆవేశంతో బ్రహ్మ వెంటపడి ఆయనకున్న అయిదవ శిరస్సును గోళ్ళతో పీకేశాడు. ఆ తల ఆయన చేతికే అంటుకుపోయింది. దాన్ని వదిలించుకోవటానికి కాలభైరవుడు లోకాలన్నీ తిరిగాడు. చివరికి కాశీక్షేత్రం చేరగానే, ఆయన బ్రహ్మహత్యా పాతకం పోయి, బ్రహ్మకపాలం ఊడి కింద పడిపోయింది. అంతటి బ్రహ్మహత్యను కూడా పోగొట్టే మహిమాన్విత క్షేత్రం కాశీ. ఆదిశంకరాచార్యుల వారు "కాశికాపురాది నాద కాలభైరవం భజే" అనే మకుటంతో అష్టకం రాశారు. అది మనసులో చదువుకున్నాను. దాన్ని పఠిస్తే మంచి ఫలితం లభిస్తుంది.



తర్వాత గవ్వల గౌరి మందిరం చేరాం. అక్కడ అయిదు గవ్వలను చిన్నమట్టి ప్రమిదలో పెట్టి అయిదు రూపాయలకు అమ్ముతారు. మహిళలు కొని అమ్మవారి ముందు నిలిచి పూజారి చెప్పినట్లుగా "కాశీఫలం మాకు, గవ్వల ఫలితం నీకు" అని చెప్పి ఆమెపై విసరాలి. అందరు తప్పక దర్శిస్తారు. ఆమె దర్శనం ఫలప్రదం. దీనికి దగ్గరలో దుర్గాదేవి మందిరం దర్శిస్తారు.

తర్వాత తులసీ మానస మందిరం చూశాం. పూర్తి పాలరాతితో కట్టిన రెండస్తుల భవనం. గోస్వామి తులసీ దాసస్వామి కాశీ నివాసి. ఇక్కడే ఆయన శ్రీరామచరిత మానస్ అనే రామాయణాన్ని హిందీలో రాశారు. మహాభక్తుడు. దీన్నే తులసీ రామాయణం అంటారు. ఉత్తరాది వారికి వాల్మీకం తర్వాత ఇదే అత్యంత



ప్రీతిపాత్రం. ఇందులోనే హనుమాన్చాలీసా వుంది. అందరు దీన్ని పారాయణ చేసి మంచి ఫలితం పొందుతారు. మందిరం గోడల మీద తులసీ రామాయణం అంతా చెక్కారు. ముఖ్య సంఘటనల చిత్రాలు కూడా గోడలపై కనువిందు చేసేంత మనోహరంగా వుంటాయి. దీన్ని 1964లో సేట్ రతన్‌లాల్ నిర్మించాడు. ఇక్కడ పాలరాతి పంచ పట్టాభిరామస్వామి మందిరం, తులసీదాసు మందిరం చూడతగినవి. కుడివైపు కైలాస పర్వతం, ఎడమవైపు రామేశ్వరం నిర్మించారు.

తర్వాత శ్రీమదన మోహనమాలవ్యా గారు నిర్మించిన 'కాశీ విశ్వవిద్యాలయం' సందర్శించాము. వందలాది ఎకరాలలో, దాదాపు అన్ని ఫాకల్టీలతో వున్నది. పూర్వం ఇక్కడ చదవటం ఒక వరం. బెనార్స్ డిగ్రీకి చాలా విలువ వుంది. మాలవ్యాజీ దేశమంతా తిరిగి చందాలు పోగుచేసి ఎంతో శ్రమ, అవమానం భరించి దీన్ని నిర్మించారు. అవసరమైతే రైల్వేకూలీగా పనిచేసి సామాన్లు మోసి డబ్బు కూడబెట్టిన మహానుభావుడాయన. శ్రీ శృంగేరి పీఠాధిపతులను ఆహ్వానించి ఆరంభం వారి చేతుల మీదుగా జరిపించారు. లోపల బ్రహ్మాండమైన విశ్వేశ్వరాలయం రెండతస్తులతో వుంది. పాలరాతి కట్టడం. నిత్యం అభిషేకం చేస్తారు. పీడాశిఖరం చాలా ముచ్చటగా వుంటుంది. మాననీయ మాలవ్యా విగ్రహం లోపల ఆకర్షణీయంగా వుంటుంది. ఆ మహానుభావుని కృషికి, పట్టుదలకు, దీక్షకు, విద్యాభిమానానికి, మనసులో కృతజ్ఞతలు తెలుపుకున్నాను.



ఆయన విద్యాసేవ గురించి కథలు, గాథలుగా చెప్పుకొనేవారు నా చిన్నప్పుడు. పాఠ్యాంశాలుగా కూడా చదువుకున్నాం. ఎందరు తెలుగువారిక్కడ చదువుకొని డిగ్రీలు పొందారు. విశ్వనాథ సత్యనారాయణ గారిని ఆహ్వానించి

రామాయణ కల్పవృక్ష పద్యాల్ని ఆయన నోటితో విని ఘన సన్మానం చేశారిక్కడ.

తిరిగి వస్తు దారిలో 'సంకట మోచన హనుమాన్'ను దర్శించాము. చాల శోభగా, గొప్ప అలంకారంతో, దివ్యసుందరమూర్తిగా కనిపిస్తారు. మంగళ, శనివారాల్లో ఇసకవేస్తే రాలనంత జనం. వివిధ రకాలైన స్వీట్లు ప్రసాదంగా అమ్ముతారు. ఇక్కడ ఏ దేవాలయంలోను, కొబ్బరికాయ కొట్టరు. ప్రసాదం నైవేద్యం పెట్టరు. మనమే నైవేద్యం పెట్టుకొని తీసుకువెళ్ళాలి. సెక్యూరిటీ బాగా వుంటుంది. కెమెరాలు, సెల్ఫోన్లు నిషిద్ధం.

200 ఏళ్ళ క్రితం ఏర్పడిన సంస్కృత కళాశాల వుంది. దేశంలోని అన్ని ప్రాంతాల నుండి విద్యార్థులు వచ్చి చదువుకొంటారు. వారణాశి కంటోన్మెంట్ దగ్గర భారతమాత మందిరం వుంది. దేశాన్ని అంతా సిమెంట్తో చక్కగా నిర్మించారు. పర్వతాలు, నదులు, సముద్రాలు, ముఖ్యప్రదేశాలు చాలా స్వభావ సిద్ధంగా కనిపించి, సంభ్రమాన్ని కల్గిస్తాయి. హంసబ్ఏకాయ్ అనే భావం కలుగుతుంది. సుందర భారతమాత దర్శనంతో మనసంతా దేశభక్తి కలిగి పులకిస్తాం.

ఒక సిల్క్ స్టోర్స్‌లో ఆడవాళ్ళు షాపింగ్ చేసిన తర్వాత అందరం మళ్ళీ శాస్త్రిగారింటికి చేరాం. అక్కడి నుంచి రిక్షాలలో శ్రీ కాశీ విశ్వేశ్వర మందిరం చేరాం. విశ్వేశ్వరలింగాన్ని చేతితో తాకి స్వయంగా గంగాజలంతో అభిషేకం చేసే అరుదైన, అద్భుతమైన అవకాశం ఇక్కడ లభిస్తుంది భక్తులకు. దేనికీ డబ్బులు లేవు. ఉచిత దర్శనమే. పూజార్లు అడుగుతారు. విశ్వేశ్వర దర్శనం ముక్తినిస్తుంది. చూసి, తాకి, పులకించామ్. రాత్రి ఎనిమిది గంటలకు రోజూ రెండుగంటల పాటు అభిషేకం జరుగుతుంది. తప్పక చూడతగినది. అప్పుడు లింగాన్ని ముట్టుకోనివ్వరు. దూరం నుండే దర్శనం. ఉదయం పదకొండు గంటలకు కూడా అభిషేకం చేస్తారు. స్వామిదర్శనంతో ఒళ్ళు పులకిస్తుంది, శివస్తుతి చదువుకుంటు దర్శనం చేస్తారు భక్తులు. ఆనందంతో హర హరమహా దేవ శంభో అని నినాదాలు చేస్తూ దర్శిస్తారు. అభిషేకం బాగుంటుంది. ఘంటా నినాదాలు, ఓంకార ధ్వని, శంఖనాదంతో ఆలయం అభిషేక సమయంలో మార్మోగుతుంది. కైలాసంలో వున్న అనుభూతి కలుగుతుంది. భూకైలాసం అనిపిస్తుంది. ముకుళిత హస్తాలతో జనం ఒళ్ళు మరిచిపోయి అమందానందంతో తనువు, మనసు ఎకమైపోతాయి. ఇక్కడ పార్వతీదేవి ఆలయం వుంది. ఆమెను సందర్శించి మొక్కుకున్నాము. ఇక్కడ శివుడికి జిల్లేడు పూలతో పూజ చేస్తారు. ఆ పూలదండలు శివునికి నివేదిస్తారు. ఆవుపాలు గ్లాసులతో అమ్ముతారు. వాటినీ స్వయంగా అభిషేకం చేసుకోవచ్చు. స్వీట్లే ఇక్కడి నైవేద్యం. రకరకాల స్వీట్లు అమ్ముతారు. పాలను బాగా మరిగించి, పైన తేట అంటే మీగడ విడిగా తీసి పంచదార వేసి అమ్ముతారు.. దీన్ని మలాయి అంటారు. అంతా దీన్ని ఇష్టంగా తింటారు. మేము

తిన్నాము.

ఇక్కాడ విశ్వనాథ మందిరం గురించి కొన్ని వివరాలు. మహమ్మదీయుల దండయాత్రలో ఈ ఆలయం అనేకసార్లు ధ్వంసం అయింది. మళ్ళీ పునర్నిర్మించబడింది. దీని పక్కనే మసీదు కూడా వుంది. కాశీలో హిందూ, ముస్లిం, జైన, బౌద్ధ, క్రైస్తవులు మత సహనంతో నివశించటం విశేషం.

మణికర్ణికా ఘట్టం నుంచి నాలుగు ఫర్లాంగుల దూరంలోనే విశ్వేశ్వర ఆలయం వుంది. దీని గోపురం 22 మణుగుల బంగారం రేకులతో నిర్మించబడింది. ఈ బంగారాన్ని రంజిత్సింగ్మహారాజు సమర్పించారు. ఇప్పుడున్న మందిరం 1785లో రాణి అహల్యాబాయి నిర్మించారు. తెల్లవారుఝామున నాలుగు గంటల నుంచి రాత్రి పదకొండు గంటల వరకు ఆలయం తెరచి వుంటుంది. అంటే nonstop దర్శనం అన్నమాట. అక్కడినుంచి రెండు కిలోమీటర్ల దూరంలో విశాలాక్షి మందిరానికి బయల్దేరాం. దారి ఇరుకు. కరెంటు లేదు. మధ్యలో నల్లటి ఆవులు మనల్ని రాసుకుంటూపోతాయి. వర్షంతో కాళ్ళు జారుతున్నాయి. చాలా భయంకరంగా వుంది. నడక సాగాడు జారిపడి పోతామేమోనని భయం. ఈ దారి ఏమిటీ అని మా ముసలాళ్ళ గోల. మధ్య చాల కష్టపడి విశాలాక్షిని దర్శించాము. ముందున్న విగ్రహం వెనుక అసలైన విగ్రహం వుంది. దాని ప్రభావం కాపాడటానికి ముందు విగ్రహం వుంది. పూజారి చేతిలో ఇరవై పెడితే అమ్మవారి ఫోటో, గాజులు, కుంకుం పొట్లం కట్టి ఇస్తారు. అది తీసుకొని శాస్త్రిగారింటికీ అక్కడ అప్పటి కేకరివేన వారి సత్రం నుంచిన ఫలహారపు పోట్లాలతో హాలిడే హోం చేరాం. రాత్రి పన్నెండు గంటలకు కాని కరెంటు రాలేదు. తెచ్చిన టిఫిన్ అటుకుల పులిహోర బాగా ఇష్టపడి తిన్నాం. నిద్రపోయాం.

రోజూ రాత్రిపూట గంగాదేవికి ఏడు గంటలకు అన్ని ఘాటులలోను హారతి ఇవ్వటం సంప్రదాయం. నయనానందకరం. దొప్పలలో దీపం ఆవునెయ్యితో కలిపింది వెలిగించి మహిళలందరూ గంగలో వదులుతారు. మనోహరమయిన సన్నివేశం. గంగలో ఆ దీపాలు కదిలి అలలకు ఊగుతుంటే అద్భుతంగా వుంటుంది. మేళతాళాలు కూడా వాయించి శోభ కల్గిస్తారు. ఈ గంగాహారతి హరిద్వారంలో చాలా చాలా హృదయాహ్లాదంగా వుంటుంది. అనురాధా పోడ్వాల్చాల గొప్ప పాట పాడారు. ఆ రికార్డు పెట్టి దీపాలు సమర్పించటం రివాజు.

ఇవాళ అన్నపూర్ణ దర్శనం చేయలేకపోయాం. టైం చాలక. మర్నాడు చేద్దామని భావించాము. వర్షం మూలంగా గంగహారతికి వెళ్ళలేక పోయాం.

ఉత్తర భారతదేశంలో పూజారులను 'పండాలు' అంటారు. పండితులు అని అర్ధం. పండితుడే పండాగా మారాడు. వీళ్ళదే హవా. ఇక్కడ జోషీ అనే ఆయనకు చాలా భవనాలు, ఎంతోమంది అనుచరులు వున్నారు. domination ఆయనదే.

తర్వాత మన తెలుగువాళ్ళు వచ్చి బాగా స్థిరపడ్డారు పౌరోహిత్యంలో. ఇక్కడ రాజాకీయాన్ని ప్రభావితం చేసేది పండాలె. అందుకే చెన్నరెడ్డి ఉత్తరప్రదేశ్ గవర్నర్‌గా వున్నప్పుడు ఈ పండా వ్యవస్థ రద్దు చేయటానికి విశ్వ ప్రయత్నం చేశాడు. ఆయన వల్ల కాలేదు. చివరికి ఆయన్ను తమిళనాడుకు మార్చారు తప్ప ఏమీ జరగలేదు.

## కృష్ణ నుంచి గంగ దాకా-4

జూన్ 24న ఉదయం ఆటోలలో బయల్దేరి మణికర్ణిక ఘట్టం చేరాం. అక్కడ మంత్రపూతంగా స్నానం చేశాం. అక్కడే మా రెండో అబ్బాయి శర్మలాగా వున్న ఒక అబ్బాయి స్నానం చేస్తూ కనిపించాడు. ఫోటోలు తీసుసున్నాం. మనిషిని పోలిన మనిషి ఉంటాడనటానికి ఇది మంచి ఉదాహరణగా అనిపించింది. అక్కడి నుంచి, పిల్లల హుషారు తీర్చటానికి 150 రూపాయలు రాను, పోనుకి ఇచ్చే ఏర్పాటులో బోటులో గంగకు అవతలి ఒడ్డుకు చేరాం. ఇక్కడ మంచి ప్రవాహం వుంది. లోతు మరీ ఎక్కువ లేదు. హాయిగా, జోరుగా, హుషారుగా భక్తిగా అందరం గంటకుపైగా స్నానం చేశాము. మళ్ళీ అందరికి మంత్రం చెప్పి స్నానం చేయించాను. దంపతులుగా స్నానం చేశాం. అర్ఘ్య ప్రదానం, సంధ్యావందనం చేసాను. ఈత కొట్టాను. చాల రోజూలైంది ఈత కొట్టి. కొంచెం ఇబ్బందైనా పూర్వపు అలవాటుంది కనుక ఇబ్బంది కలుగలేదు. ఫోటోలు తీసుకున్నాం. ఉయ్యూరు నుంచి మా ఆవిడ ప్రభావతి మా ఇంటిలోని అరటిచెట్ల నుంచి, దొప్పలు తయారుచేసి, మధ్యలో రంధ్రంలాగా ఖాళీ చేసి అందులో ఉయ్యూరు నుంచి తెచ్చిన ఆవునెయ్యి వత్తులతో దీపారాధన చేశారు ఆడవాళ్ళు అంతా చాలాభక్తిశ్రద్ధలతో. పూజలుచేసి నైవేద్యం పెట్టి, ఆ వెలుగు దివ్వేనలను భక్తితో గంగానదిలోకి వదిలి ఆనందం పొందారు. చిరకాల కోర్కె నెరవేరిందని సంబరపడ్డారు. ఇది విశ్వనాధ, విశాలాక్షిల అనుగ్రహంగా భావించారు. పరవశించారు. గంగహారతి కోర్కె ఇలా నేరవేరింది. అక్కడినుంచి మళ్ళీ గంగలో మణికర్ణికా ఘాట్కుచేరి ఆటోలో విశ్వనాధ ఆలయం దగ్గరకు చేరాము. అది ఒక గల్లి అంటే ఇరుకుసందు రెండు ఐపులా అనేక దుకాణాలు. మధ్యలో దారి ముగ్గురు పట్టేకంటే వెడల్పు వుండదు. అలాగే దారి చేసుకుంటు, విశ్వేశ్వరాలయం చేరం.

మేమిద్దరం సామన్లకు కాపలా వుండి, మిగిలిన వారిని దర్శనానికి పంపాము. ఇక్కడ సెక్యూరిటీ బాగావుంది. తణికీ చేసి లోపలకు పంపుతారు. వాళ్ళు తిరిగివచ్చిన తర్వాత మేమిద్దరం దర్శనానికి వెళ్లాం. ముందుగా అన్నపూర్ణాదేవి దర్శనం చేశాం. అక్కడే డుండి గణపతి దర్శనం చేసి శ్రీవిశ్వేశ్వర దర్శనం చేశాం. అప్పటికే అభిషేకం ప్రారంభమయింది. దూరం నుంచే దర్శనం చేశాం. చాలా గొప్ప అనుభూతి. మన జీవితం ఇందుకే అనిపిస్తుంది. నిన్న ఇవాళ స్వామిని రెండు చేతులతో తాకి కళ్ళకద్దుకొనే

గొప్ప అదృష్టం మాకు లభించలేదు. అదొక లోటు అనిపించింది. మావాళ్లకు ఆ అదృష్టం కలిగింది. అయితే ఇదివరకు చాలాసార్లు దర్శించే భాగ్యం మాకు కలిగిందనే ఊరట. అన్నపూర్ణమ్మ ఆలయంలో దానికి అనుబంధంగా వున్న వేద విద్యాలయంలో చదివే విద్యార్థులు బారులుగా అమ్మవారి సన్నిధిలో కూర్చుని, శ్రీ శంకరాచార్యుల వారు రచించిన 'అన్నపూర్ణ అష్టకం' చాలా పరవశంతో పఠించుతారు. చూడముచ్చటగా వుంటుంది. అన్నపూర్ణమ్మ అనుగ్రహంతోనే మనకు అన్నం లభిస్తోందని అందరి భావన. ఒక చేత్తో పరవాన్నం గిన్నె వేడిది, దానిలో ఒక గరిట ఆమె చేతిలో వున్న విగ్రహాలనుకొని ఇంటికి తెచ్చుకొని దేవుని దగ్గర పెట్టుకొని పూజిస్తారు. అందరి ఇళ్ళల్లో అన్నపూర్ణ విగ్రహం వుంటుంది. మా అమ్మ భావానమ్మ "నిత్యానందకరీ, వరాభయకరీ, సౌందర్య రత్నాకరీ– నిర్ధూతాఖిలఘోరి పావనకరీ. మాతాన్న పూర్ణేశ్వరీ" అని పాడుకునేవారు. చివరిగా ప్రతి శ్లోకానికీ "భిక్షాందేహి కృపాకరీ మాతాన్నపూర్ణేశ్వరీ" అని భక్తిగా ప్రతి ఇంటి ఆడవారు పాడుకొనేవారు. అంతేకాదు, ''అక్షయంబుగా కాశిలోపల అన్నపూర్ణభవానివై, మోక్ష మొసఁగెడు కనకదుర్గకు మూలకారణ శక్తివై సాక్షిగణపతి కన్నతల్లివి సద్గుణావతి శాంభవీ" అనీ పాడుకోవటం ఇంకా గుర్తుంది.

ఇంకా కొన్ని విషయాలు మీ దృష్టికి తెస్తున్నాను. మణికర్ణికా ఘట్టం విశ్వేశ్వరాలయానికి దగ్గర ఇక్కడా శవదహనాలు బాగానే జరుగుతాయి. పూర్వం విష్ణుమూర్తి ఇక్కడ ఒక తటాకాన్ని తన చక్రాయుధంతో త్రవ్వి దాని ఒడ్డున కూర్చుని కాశీవిశ్వేశ్వరుని గూర్చి తపస్సు చేశాడట. విశ్వనాథుడు ప్రత్యక్షమై తపస్సుకు మెచ్చి తలను ఆనందంగా వూపాదట. అప్పుడు శివుని కుడి చెవికివున్న మణికర్ణిక జారి కిందపదిందట. అప్పటినుంచి ఈ రేవుకు మణికర్ణికా ఘట్టం అనే పేరు వచ్చిందని కథనం. విష్ణుమూర్తి తవ్విన తటాకమే చక్రతీర్థం. ఇది ఇప్పుడు నదీగర్భంలో కలిసిపోయింది. మణికర్నికకు దగ్గరలోనే రాణీ అహల్యాబాయి ఘాటుంది. దీని గురించిన కథ అందరు తెలుసుకోవాలి. రాణి అహల్యాదేవి గంగఒడ్డున ఒక స్నానఘట్టం కట్టించి, అక్కడొక శివాలయం ప్రతిష్టించాలని కోరికగా ఉండేదట. ఆమె జీవిత కాలం జరగలేదు. కొడుకుని ఆ బాధ్యతా నేరవేర్చమని కోరిందట. ఆయన తల్లికిచ్చిన వాగ్దానాన్ని నెరవేర్చి ఘట్టం నిర్మించి శివాలయం కట్టించి ఆనందంగా "అమ్మ ఋణం తీర్చుకుననాను" అన్నాడట. అంతే! వెంటనే ఆలయం నదిలో ఒకపక్కకు ఒరిగిపోయింది. ఎన్ని ప్రయత్నాలు చేసినా దాన్ని నిటారుగా నిలబెట్టలేక పోయారు. ఇప్పటికీ అది నదిలో సగం మునిగి ఒరిగి కనిపిస్తుంది. ఎందుకు ఇలా జరిగిందీ అని ఆయన వితర్కించుకున్నాడట. అప్పుడు అర్థం అయింది, తల్లి ఋణం ఎవరు తీర్చుకోలేరని, తీర్చరానిదని, తీర్చాననుకోవటం మూర్ఖం, అహంభావమనీ, అసంభవం అనీ. ఇది అందరు తప్పక గుర్తించుకోతగినది. ఇంకో విషయము– కాశి గురించి తెలుసుకోవాలి.

వ్యాసమహర్షి విశ్వేశ్వరుని కోపానికి గురి అయి కాశీ నుంచి బయటకు వెళ్ళగొట్టబడ్డాడు. దానినే 'వ్యాసనిష్కాసనం' అంటారు. ఈ విషయాలన్నీ శ్రీనాథ కవిసార్వభౌముడు తన భీమఖండపురాణంలో అత్యద్భుతంగా వర్ణించాడు. భీమారామంలో వ్యాసుని అగస్త్యమహర్షి కాశీని వదలివచ్చిన కారణమేమిటి అని అడిగితే ఆయన ఈ కథంతా చెప్పాడు. భిక్షదొరక్క తనకు కోపం వచ్చి కాశీని శపించానని చెప్పాడు. ఇక్కడ శ్రీనాథుడు ఆ కోపాన్ని క్ష అనే అక్షర విన్యాసంతో గొప్పగా చెప్పాడు. "కుక్షి ప్రోద్భవ నిష్ఠుర క్షుభిత దృష్టో దాంధ కారంబుతో కన్నుల్మూయగ భిక్షాపాత్రము నేలవైచితిని " పద్యం రాశాడు. మర్నాడు అన్నపూర్ణాదేవి కరుణించి భిక్షకు ఆహ్వానించి శిష్యులతో సహా అందరికి షడ్రసోపేతమైన విందును ఇచ్చింది. ఆ విందు తిని తబ్బిబ్బైన వ్యాసుడు ఆనందాన్ని, సంతృప్తినీ మళ్ళీ అదే క్ష కార విన్యాసంతో వర్ణించాడు కవిసార్వభౌముడు. "ద్రాక్షాపానకాఖండ శర్కరలతో, రంభాఫలశ్రేణితో, అక్షయ్యంబగుయేరు బాలకల మహారంబు నిశ్శంకతన్ కుక్షుల్నిండగ నారగించితిమి ఇక్షుద్రక్షుధాశాంతికిన్"అని వర్ణించటం ఆ మహాకవికే చెల్లింది. పద్యశిల్పం తెలిసిన మహాకవి ఆయన.

పార్వతీపరమేశ్వరులు వ్యాసునికి దర్శనమిచ్చారు. ఆ వైభావాన్నే చాల సుందరంగా వర్ణించాడు కవి. ఒకే పదంతో ఇద్దరికీ అన్వయిస్తూ చెప్పిన పద్య సౌందర్యం.. "చంద్రబింబానన-చంద్రరేఖామౌళి -నీలకుంతలఫాల -నీలగళుడు-దవళాయ తేక్షణ-ధవళాక్షి లాంగుండు-మదనమోహనగాత్ర, మదనహరుడు. గౌరి శ్రీవిశ్వనాధుండు కనకరత్నచట్టియలుపట్టికోనుచు ఎగుదెంచిరి ఒయ్యారమెసగమెస విహరణ క్రీడ మా యున్న వేధికపుడు'' వింటుంటేనే ఆ దివ్యమంగళ స్వరూపం కళ్ళ ఎదుట ప్రత్యక్షమవుతుంది. అదీ కవిసార్వభౌమ సాహితీవైభవం అంతగొప్ప కాశిని ఎలా వదిలిపెట్టావు అని అడుగుతూ కాశీలో రాత్రిపూట తాను అనుభవాన్ని మనకు పంచుతాడు అగస్త్యడు'' ఆకాశంబున అర్ధరాత్రముల చంద్రాలోకముల్కాయుఁగా-నానాసైకతవేదికాస్థలములన్, నల్దిక్కులనన్" శంభు, కాశీనాథు, విశ్వేశు శివుని శ్రీకంఠు నున్, మేనెల్లం బులకాంకురం బెసఁగ నిండారు మిన్నేటిలోన్" అని పరవశంగా చెప్తాడు. ఆయన అనుభవం, పరమమాహేశ్వరుడైన శ్రీనాథుని అనుభవం చివరికి మన అనుభవం అనిపిస్తాడు. ఇందులో భావం "అర్ధం ఏమిటి?, అర్ధరాత్రి పున్నమి వెన్నెల గంగానది నీపై పడి వెండి వెలుగులు చిమ్ముతోంది. గంగమ్మ ఇసుక తిన్నెలమీద అగస్త్యుడు ఆనందంగా, పరవశంగా శంభో శంకర శివా! నీలకంఠా" అని ఉద్విగ్నంగా పాడుతూ పులకించిపోతున్నాదట. యెంత గొప్ప అనుభవం. ఒక్కసారి మనసులో ఆ దృశ్యాన్ని ఊహించుకొంటే ఒళ్ళంతా పులాకాన్కురాలు రావా? అదీ అనుభూతి. దాన్ని కవిత్వంలో అందరికీ పంచాడు కవిసార్వభౌముడు. ఈ పాయాలు మాకు ఇంటర్లో పాఠ్యాంశం. దీని బోధించనవారు ఆచార్య పాటిబండ్ల మాధవశర్మగారు. ప్రతి పద్యం బట్టీపట్టమన్నారు.

అలాగే అందులోని 72 పద్యాలు అంతట పట్టాను. అవి నహృదయంలో జీర్ణించుకుపోయాయి. జ్ఞాపకం ఉన్నంతవరకు మీ ముందుంచాను. మతిముపులో కొన్ని కుపిగంతులుండవచ్చు. ఆ ఆచార్యుల విద్యాభిక్షకు నేను సదా రుణపడి వుంటాను. వారు వివరించే తీరు మహాద్భుతం. అలాగే వారే నన్నయ రచిత 'ఉదంకోపాఖ్యానం' బోధించి నా మనసుపై చెరగని ముద్రవేశారు. అందులోని నాగస్తుతిని కంఠతాపట్టి రోజూ చదువుకోమన్నారు. ఆ పద్యాలు కూడా భట్టీయం వేశాను.

ఒక్కసారి మాధవశర్మగారికి కృతజ్ఞతాపూర్వక వందనాలు తెలియజేస్తున్నామని కర్ణికలో ప్రారంభించి చాలాదూరం వచ్చాము. మధ్యాహ్నం పన్నెండుకు లక్ష్మణశాస్త్రి గారింటికి చేరాము. అక్కడ మా ఆవిడ అక్కగారు జానకిగారు గోదానం చేసుకొన్నది. మాతో సహా ఇరవై మందికి కాశీ సమారాధాన్నేసుకొంది. పూర్ణం బూరెలు, పులిహోర, పప్పు, బంగాళాదుంప కూర, రెండు పచ్చళ్ళు, పప్పుపులుసు, అప్పడాలు, పెరుగు భోజనం. రుచికరంగా వున్నాయి. తర్వాత నేను ఆనందు, వంశీ కలసి కరివేనవారి సత్రానికి వెళ్లాం. ఖమ్మంలోని మా పెద్దతోడల్లుడుగారు మూర్తిగారు ఇచ్చిన 2500ల రూపాయలు, జానకిగారిచ్చిన 1116, లు అన్నదానానికి జమ చేశాము. నేను మూడు వందలు సమర్పించాను. వారు చేసే సేవకు ఎంత ఇచ్చినా చాలదు. అక్కడి నుంచి పాట్నా ఎక్స్‌ప్రెస్ ఎక్కి మర్నాడు రాత్రి తొమ్మిదిన్నరకు హైదరాబాద్ చేరాం. ఎవరిళ్ళకు వారం వెళ్లిపోయాము. ఆనంద్ చాల ఖర్చు చేశాడు. అనే లెక్కవేసి మా ఇద్దరి ఖర్చు వాడి చేతిలో డబ్బు పెట్టాను స్టేషన్లో. మర్యాదగా తిరస్కరించి "ఇది డబ్బుతో కొనే అనుభవం కాదు బావా. మీరు మాతో రావటమే మా ఆనందం. డబ్బుతో ముడిపెట్ట వద్దు" అన్నాడు. సరే, చేసేదేమీలేదు కనుక ఆ డబ్బు మళ్ళీ నా జేబులో పెట్టుకొన్నా తప్పని పరిస్థితుల్లో. అంటే ఒకరకంగా ఇది మాకు sponsored ప్రోగ్రాం అయిందన్నమాట. కాశీ ఉన్ని సిల్కు పట్టుబట్టలకు ప్రసిద్ధి. ఇత్తడి, కంచు, రాగి పాత్రలు ఇక్కడ బాగా వుంటాయి. రాగిపాత్రల్లో గంగాజలం నింపుకొని సీల్వేయించి పవిత్రంగా ఇంటికి తెచ్చుకొని దేవుడి గదిలో పెట్టుకుంటారు. కర్రబొమలు బాగుంటాయి. రాతి, పాలరాతి విగ్రహాలకు పేరు. మృగచర్మాలు, రుద్రాక్షలు, దర్భాసనాలు, పట్టుబట్టలకు ప్రసిద్ధి. జర్దా కిళ్ళీ ఇక్కడి ప్రత్యేకత.

గంగాలహరి, యమునా లహరిలను జగన్నాథ పండితరాయలు రాశాడు. ఆయన ఆంధ్రుడే. శంకరాచార్యులవారు ఇక్కడి అందరి దేవాలపి భక్తీచిప్పిల్లే స్తోత్రాలు రాశారు. గంగాష్టకం, యమునాష్టకం కూడా ప్రసిద్ధి చెందాయి. కాశీ అలహాబాద్లలో ఎక్కడా రాజాకీయ నాయకుల సినిమా స్టార్ల కటౌట్లు కన్పించవు. బ్యానర్లు కన్పించకపోవటం భలే ఆశ్చర్యమేసింది. మనకున్న ఈ దరిద్రపు కల్చారికి లేకపోవటం అభినందించదగింది. భక్తికీ, ముక్తికీ కాశీ చాలా పవిత్రమైంది, ప్రశస్తమైంది. ఆ కాశీ

పట్టణానికి విశ్వేశ్వర, విశాలాక్షి, అన్నపూర్ణ, కాలభైరవ, డుండి గణపతి, గంగా మాతలకు భక్తితో నమస్కరించి, పునర్దర్శనమివ్వమని మనసారా వేడుకొన్నాను. ఇదేంటీ మోస్ట్ హొలియెస్ట్ ప్లేస్ కాశీ మోస్ట్ అగ్లియెస్ట్ ప్లేస్ కాశీగా కనిపిస్తుంది. అయితే తేవర్నిర్తిఎస్త ప్లేస్‌గా కాశీ అవటం విచారకరం. రోడ్లు బాగుండవు. పురాతన రాళ్ళతో, ఇటుకరాళ్ళతో రోడ్లుంటాయి. మేయింటెన్స్ లేదు. ఇరుకురోడ్లు. చెత్తాచెదారే భయంకరం. అడుగు అడుగునా గోమాతలు స్పీడ్ బ్రేకర్లుగా అడ్డుకుంటాయి. అయితే ఏమీ చేయవు. తమదారిలో తాము పోతుంటాయి. ఇదివరకు దోమలు లేవు. ఇప్పుడు పుష్కలం. కరెంటు ఎప్పుడు వస్తుందో ఎప్పుడుపోతుందో తెలీదు. ఆంధ్రా హోటళ్లు తక్కువే. ఇంకా రావలసి వుంది. ఇంకొంచెం శ్రద్ధని ప్రభుత్వం చూపించాలి. కల్మశాల నుండి గంగను విముక్తి చేయాలి. అప్పుడు ఇంకా భక్తీభావం పెల్లుబికి వస్తుంది. అలాగే యాత్రీకులు కూడా తమ వంతు ధర్మాన్ని నిర్వహించి, నది మురికి కూపంగా మారటానికి సాయపడరాదు. ప్లాస్టిక్ వాడకం తగ్గించాలి. ప్రభుత్వం drainage సౌకర్యం పెంచాలి. అప్పుడు కాశీ పవిత్ర పావన స్వచ్ఛ, శుభ్ర ఆరోగ్యకేంద్రమై భక్తికీ ముక్తికీ ఇహపరాలకు స్వర్గధామంగా ఆనంద వనంగా విలసిల్లుతుంది. దీనికి మనం అందరం బాధ్యత వహించాలి. "స్వర్గాతస్సుఖకరీ దివౌకసాం–శైలరా జాతనయాతి వల్లభాఃడుంఠి భైరవవిదారితవిఘ్నా–విశ్వనాథ నగరీ గరీయశేయత్ర దేహపతనేన దేహినాంముక్తి రెవ భవతీతినిశ్చితంఃపూర్వపుణ్యనిచ ఎవలభ్యతే విశ్వనాథ నగరీ గరీయశేయత్రతీర్థమమలా మణియానదాశివసుఖప్రదాయినీ ః–యాశివేనరచితానిజాయుద్రై, విశ్వనాథ నగరీగరీయషీయత్రముక్తిరాఖిలిస్తూజంతుభిర్లభ్యతేమరణమాత్రతస్సదాఃనా అఖిలఅమరగానైస్చవందిత, విశ్వనాథనగరీగరీయసేయత్రశాక్రనగారీగరీయషీ – యత్రదారునగరీ గరీయసీ–యత్రకేశవావురీలక్షీయసీ, విశ్వనాథనగరీ గరీయషీయత్రదేవతటినీప్రదీయసీ, యత్రవిశ్వజననీపటీయసీఃయత్రభైరవక్రుతిర్బలీయసీ, విశ్వనాదనగరీగరీయసీః ఇదివెదవ్యాసమహర్షివిరచితకాశీఅష్టోత్తరంఃలో కొన్ని శ్లోకాలు ఇంతదాకా మాతో కాశీ ప్రయాగ యాత్రల్లో పాలుపంచుకున్న మీ అందరికి కృతజ్ఞతలు 'కృష్ణ నుంచి గంగ దాకా' సంపూర్ణమైనది.

## 5) ఎనిమిది రోజుల్లో చెన్నైతో సహా మా ఎనిమిది క్షేత్రదర్శన యాత్ర

మా దంపతులం 2013 ఫిబ్రవరిలో మా మనవడు సంకల్ప్‌తో కలిసి తమిళనాడులో చేసిన ఎనిమిది క్షేత్ర సందర్శనను 'ఎనిమిది రోజుల్లో చెన్నైతో సహా మా ఎనిమిది క్షేత్ర దర్శన యాత్ర' గా అందిస్తున్నాను.

మేమిద్దరం 2013 ఫిబ్రవరి ఎనిమిది రాత్రి మెయిల్‌లో బయల్దేరి తొమ్మిది ఉదయం చెన్నై చేరాం. మా మేనకోడలి గారింట్లో ఉన్నాం. మా తోడల్లుడు శంకరం

గారి అమ్మాయి ప్రతిభ, భర్త వచ్చి కొడంబాకంలో ఉన్న వాళ్ళింటికి తీసుకొని వెళ్లి భోజనం పెట్టి మా ఇద్దరికీ బట్టలు పెట్టి సాయంత్రం తీసుకొని వచ్చి దింపి వెళ్ళారు. తొమ్మిది రాత్రికి బస్‌లో బయల్దేరి సుమారు మూడు వందల కిలో మీటర్ల దూరంలో ఉన్న తిరుచిరాపల్లి అంటే తిరుచి ఉదయం నాలుగు గంటలకు చేరాం. అక్కడ మా వాళ్ళు అంతకు ముందే బుక్ చేసిన 'రమ్యాస్ హోటల్'లో దిగాం. త్రిచికి నలభై కిలో మీటర్ల దూరంలో శాస్త్ర యూనివర్సిటీలో బి.టెక్.మూడవ సంవత్సరం చదువుతున్న మా మనుమడు సంకల్ప్ వచ్చి కలిశాడు. స్నానం పూజా సంధ్య అయిన తర్వాత ముగ్గురం హోటల్ వాడు ఇచ్చిన 'కాంప్లి మెంటరి బ్రేక్ ఫాస్ట్'ను తిన్నాం. అనేక వెరైటీలు ఉన్నాయి. తిన్నవాడికి తన్నంత. జ్యూసులు కాఫీ, పళ్ళ ముక్కలతో సహా.

త్రిచిలో ఏ.సి.కార్‌ను మా వాళ్ళు బుక్ చేశారు. దానిలో ఎనిమిదింటికి బయల్దేరాం. అక్కడ కుంభ కోణంలోని శ్రీ కుంభదర స్వామిని దర్శించాం. కుంభం అంటే కుండ. కోణం అంటే వంపు. గరుత్మంతుడు అమృత భాండాన్ని తెస్తుంటే ఇక్కడ అందులోంచి ఒక అమృత బిందువు జారి కిందపడితే శివుడు తానే ఇసుకతో ఒక కుండ చేసి దాన్ని జాగ్రత్త చేసి అందులో ఉండిపోయాడట. ఆ కుండ పైన ఎడమ వైపుకు వంగి ఉంటుంది. అందుకని కుంభకోణం అని దేవుడిని కుమ్భోదర శివ లింగం అనీ అంటారు. ఈ ఆలయానికి ఎదురుగా కొద్ది దూరంలో రెండు వేల ఏళ్ళ క్రిందట షాజీ మహారాజు కట్టిన సారంగపాణి దేవాలయంలో స్వామిని దర్శించాం. ఇక్కడ స్వామి వెనకాల శేష తల్పంపై శ్రీ మహా విష్ణువు శయనించి ఉన్నట్లుగా కన్పిస్తాడు. వట వృక్షం కూడా ఉంటుంది.

అక్కడి నుండి దారాశురం అనే దేవాలయంలో 'ఐరావతేంద్ర శివుడిని' దర్శించాం. ఈ దేవుడు సంతాన ప్రదాత అని ప్రసిద్ధి. అక్కడి నుండి 'స్వామి మలై' చేరాం. అక్కడ శ్రీ సుందరేశ్వర మీనాక్షి అమ్మవార్లను సందర్శించి, అక్కడే అరవై అడుగుల ఎత్తు న ఉన్న శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామిని మెట్లెక్కి చూశాం. ఇవి పూర్తయేసరికి మధ్యాహ్నం పన్నెండు. తమిళనాడులో దేవాలయాలన్నీ పన్నెండు గంటలకు మూసి, నాలుగింటికి తెరుస్తారు.

ఇక్కడికి సుమారు తొంభై కిలో మీటర్ల దూరంలో ఉన్న తంజావూర్ చేరాం. అక్కడ హోటల్‌లో భోజనం చేసి, సరస్వతి మహల్ అనే ప్రాచీన అపూర్వ గ్రంథాలయ దేవాలయం అయిన సరస్వతీ మహల్ చూసి, మ్యూజియంలోని శిల్పాలను దర్శించాం. నాలుగింటికి శ్రీ బృహదీశ్వరాలయం సందర్శించి పులకించాం. ఆ శిల్పశోభ, అక్కడి బృహత్ నందిని చూసి ఆనందంతో తన్మయం చెందాం. పెద్ద ప్రాకారం. అమ్మవారు పెరియమ్మాళ్.

ఎన్నో ఏళ్ళుగా చూడాలని కల గన్న తిరువయ్యార్ వెళ్లాం. ఇక్కడే పుష్య

బహుళ పంచమినాడు దేశంలోని గాయనీ గాయకులూ అందరూ చేరి శ్రీ త్యాగరాజస్వామి రచించిన పంచరత్న కీర్తనలు అత్యంత భక్తి యుతంగా గానం చేసే దివ్య క్షేత్రం. ఇక్కడే సంగీత సద్గురు శ్రీ త్యాగరాజ స్వామి సమాధి చెందారు. స్వర్గీయ బెంగళూర్ నాగరత్నమ్మ గారు అనే సంగీత విదుషీమణి ఇక్కడ భవన నిర్మాణం చేసి స్వామి సమాధి చెందినచోట శిల్పాన్ని చెక్కించి బృందావనంను స్మృతి చిహ్నంగా నిర్మించింది. గోడలకు త్యాగరాజ కీర్తనలు చెక్కిన పాలరాతి ఫలకాలను అమర్చింది. ఆమె పూనుకోకపోతే ఇక్కడ త్యాగయ్యను జ్ఞాపకం చేసుకొనేవారే ఉండేవారు కాదు. తెలుగుజాతి, సంగీత జాతి ఆమెకు ఎంతో రుణపడి ఉంది. అక్కడి అర్చక స్వాములు తెలుగువారే. ఇక్కడి నుండి సరాసరి త్రిచికి బయల్దేరాం. దారిలో శాస్త్ర వర్సిటి వద్ద మా మనవడిని దింపి, మేము తిరుచ్చి రాత్రి ఎనిమిదింటికి చేరాం. అంటే పన్నెండు గంటలు నాన్‌స్టాప్ ప్రయాణం. టిఫిన్ చేసి పడుకున్నాం. ఈ రోజు అరుదైన 'మౌని అమావాస్య' అవటం, ఆ పవిత్రమైన రోజున ఇన్ని దేవాలయాలను సందర్శించటం మేము చేసుకొన్న పుణ్యం. పదకొండవ తేది సోమవారం మాఘమాసం ప్రారంభం. ఉదయమే లేచి స్నానం సంధ్యాపూజా చేసి 'అరుణ పారాయణ' చేసి టిఫిన్ తిని ఏడు గంటలకే మేమిద్దరం కార్‌లో బయల్దేరి 160 కి.మీ.లో ఉన్న 'పళని'కి చేరాం. అక్కడ 'వించి కార్'లో యాభై రూపాయల టికెట్‌లతో కిలో మీటర్ ఎత్తున్న కొండపైకి పావుగంటలో చేరాం. అక్కడ శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామిని సందర్శించి, దేవస్థానం ఏర్పాటు చేసిన కమ్మటి ఉచిత భోజనం చేసి 'రోప్ వే' ద్వారా యాభయి రూపాయల టికెట్‌తో కిందికి దిగాం. వెంటనే బయల్దేరి సాయంత్రం నాలుగున్నరకు తిరుచ్చిచేరాం. హోటల్లో టిఫిన్ చేసి రాత్రి పడుకున్నాం. మనుమడు సంకల్ప్ రాత్రి పదింటికి మా దగ్గరకొచ్చి పడుకొన్నాడు.

పన్నెండవ తేది మంగళవారం మామూలు నిత్య పూజాదికాలు, అరుణ పారాయణ చేసి ఉదయం ఎనిమిది గంటలకు పన్నెండు కిలో మీటర్లలో ఉన్న శ్రీ రంగం క్షేత్రం చేరి యాభై రూపాయల టికెట్‌తో శ్రీ రంగ నాథుడిని దర్శించాం. ఎన్నో ఏళ్ళ నుండి ఉన్న కోరిక తీరింది. భగవద్ రామానుజాచార్యుల వారు, విష్ణుచిత్తుల వారు, గోదాదేవి, విప్రనారాయణ అనే తొండరిప్పోడి రాళ్వార్ తిరుగాడిన పవిత్ర క్షేత్రం. 'అపర వైకుంఠం' ఇక్కడి కావేరి నదియే విరజా నది అని అంటారు. ఆ నీరు బావిలో కనిపిస్తుంది. గోదాదేవి ఆలయం, శ్రీ లక్ష్మీదేవి ఆలయం సుదర్శన చక్రాలయాలు చూశాం. పెద్ద ప్రాకారం లోపల కార్‌లో ఉచితంగా తిప్పి అన్నీ చూపిస్తారు. కన్నులారా రంగనాథ దర్శనమయింది. కల్యాణానికి పనికి వచ్చే రంగనాథ, గోదాదేవిల విగ్రహాలను మా ఆంజనేయస్వామి దేవాలయంలో ఉంచటానికి కొన్నాం. ధనుర్మాసంలో వీరి కల్యాణం చేస్తాం కనుక బాగా ఉంటాయని. అక్కడి నుండి జంబుకేశ్వరంలో మారేడు చెట్టు మొదట్లో స్వయంభు లింగం జంబుకేశ్వర శివలింగాన్ని దర్శించాం. ఇక్కడ చిన్న

గుహలో లింగం ఉంటుంది. గంగా జలం అంటే కావేరి అక్కడ ఊరుతూ ఉంటుంది. అమ్మవారు అమ్మాన్ దేవి. అక్కడ నుండి సమయాపురంలో ఉన్న కాళికా అమ్మవారిని చూసి, రాక్ ఫోర్ట్ దగ్గరకు వెళ్లాం. ఇక్కడి కొండపై దేవాలయం, కోటా ఉన్నాయి. దూరం నుంచి చూస్తే అది ఒక శివలింగంలాగా కనిపిస్తుంది. ఈ కొండ 3800 మిలియన్ సంవత్సరాలది అంటే హిమాలయాల కంటే అతి ప్రాచీనమైనది. ఈ కోట వల్లనే దీనికి తిరుచిరాపల్లి అనే పేరు వచ్చింది. రాబర్ట్ క్లైవ్ ఇక్కడి నుంచే పాలించాడు. హోటల్ భోజనం చేసి సాయంత్రం నాలుగింటికి రూం చేరాం. రాత్రి తొమ్మిది బస్‌లో మమ్మల్ని ఎక్కించి సంకల్ప్ యూనివర్సిటికి బస్ ఎక్కి వెళ్ళాడు. రెండు రోజులు సంకల్ప్ మాతో ఉండి మాకు చాలా సహకరించాడు. వాడు మాతో ఉండటం మాకు చాలా ఆనందంగా ఉంది.

ఈరకంగా మాకు ఆ కుటుంబం వారితో మంచి పరిచయమూ కలిగింది. ఉపనయనంలో అందర్నీ చూసే అవకాశం కలిగింది. ఎనిమిది రోజుల మా మినీ యాత్ర సఫలమయింది. చివరగా మేమెంతో కాలం నుండి ఎదురు చూసిన పద్మవిభూషణ్, వాగ్గేయకారులు శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణగారి దర్శనంతో మా యాత్ర మరీ నిండుదనాన్ని సంతరించుకొంది..

నవంబర్ నెలలో మా మేనకోడలు కళ, భర్త చంద్రశేఖర్ ఫోన్ చేసి ఫిబ్రవరి పద్నాలుగున చెన్నైలో తమ కుమారుడు బాలాజీ ఉపనయనం చేస్తున్నామని మమ్మల్ని వచ్చి ఆశీర్వదించమని కోరారు. తప్పకుండా వస్తామని చెప్పాం. అప్పుడు ఒక ఆలోచన వచ్చింది. అక్కడిదాకా వెళ్తున్నాం కదా ఇదివరకు దాకా చూడని తంజావూరు, శ్రీరంగక్షేత్రాలను దర్శించాలనే కోరిక పెరిగింది. కనుక మూడు లేక నాలుగు రోజులు ముందుగా బయల్దేరి చెన్నై చేరి అక్కడి నుండి వీటిని చూసి ఉపనయనం సమయానికి మద్రాస్ వస్తే సరిపోతుందని భావించాం. మా రెండో అబ్బాయి శర్మకు ఫోన్చేసి ఫిబ్రవరి ఎనిమిది రాత్రికి విజయవాడ నుండి మద్రాసుకు పదిహేను రాత్రి చెన్నై నుండి విజయవాడకు రైల్ టిక్కెట్స్ బుక్ చెయ్యమని చెప్పాం. వెంటనే వాడు ఆన్లైన్లో వెళ్ళేటప్పుడు హౌరా మెయిల్కు వచ్చేటప్పుడు భువనేశ్వర్ ఎక్స్ప్రెస్కు బుక్ చేశాడు.

ఈ విషయం మా మేనల్లుడు శ్రీనివాసుకు చెప్పి మద్రాస్ నుండి తంజావూరు వగైరా ట్రిప్పుకు ఏర్పాట్లు చేయమని చెప్పాను . వాడూ చంద్రశేఖర్ మాట్లాడి ఫిబ్రవరి తొమ్మిది రాత్రికి చెన్నైనుండి ట్రిచికి తమిళనాడు ఆర్టి.సి. బస్కు టికెట్లు బుక్ చేసాడు. తిరుగు ప్రయాణం తిరిచి నుంచి పన్నెండు రాత్రి బస్సుకు మద్రాసుకు బుక్ చేశాడుశ్రీనివాస్. అన్నిటికి తిరిచి కేంద్రం అని అక్కడినుండి చేరి ఒకవైపు తంజావూరు వళని ఉన్నాయని కనుక హోటల్ రూము బుక్ చేస్తున్నామని చెప్పి చంద్రశేఖర్రమ్యాస్హోటల్లో రూము బుక్ చేక్ చేశాడు మూడు రోజులకు.. మరి తిరిచి

నుండి వెళ్ళే ఏర్పాట్ల గురించి ఫోన్లో మాట్లాడితే బస్సుల్లో తిరగలేమని కారు బుక్ చేసుకోవటం శ్రేయస్కరమని చెప్పాడు చంద్ర. సరేనన్నాం. హోటల్వాళ్ళతో మాట్లాడి మైలేజి విషయాలు తెలుసుకొని ఆ మూడురోజులకు కారు కూడా బుక్ చేశాడు.

కార్లో ప్రయాణం చేసినా చెయ్యకపోయినా రోజుకు 275 కిలోమీటర్లకు డబ్బు కట్టాల్సివస్తుందని ఏ.సి.కార్ అయితే కిలోమీటర్కు ఏడున్నర రూపాయలని డ్రైవర్ బేటా రోజుకు రెండు వందలని ఫోన్లో తెలుసుకొని చెప్పాడు. సరేనన్నాం. అయిదేళ్ళ క్రితం మేము మద్రాస్ నుంచి కన్యాకుమారి మదురై, రామేశ్వరం కోడైకెనాల్ వగైరాలకు టూరిస్ట్ బస్‌లో అయిదు రోజుల ప్రయాణానికి శ్రీనివాస్ ఏర్పాటు చేశాడు. అప్పుడు మదురైలో రోజూ నైట్హాల్ట్. బాగా చూశాం అన్నీ. అందుకనే వాళ్ళ సాయం తీసుకొన్నాం. ఇప్పుడు నైట్హాల్టిరుచి. శనివారం రాత్రికి చెన్నైలో బస్‌లో బయల్దేరి తిరిచి చేరాం. తరిచి నుంచి తంజావూరు వెళ్లివస్తే నూటయాభై కిలోమీటర్లకంటే మైలేజి రాదనీ తెలిసి చంద్రశేఖర్ తన స్నేహితునికి ఫోన్చేసి మైలేజి కవర్ అయ్యే ప్రదేశాలను తెలుసుకొని చేర్చాడు. దానివల్ల అనుకోకుండా కుంభకోణం, తిరువయ్యార్లు మొదటిరోజు యాత్రలో చేరాయి. మొత్తం మైలేజి కవర్ చేసి ట్రిప్ జరిగింది నష్టం లేకుండా. ఎప్పటికప్పుడు చంద్రశేఖర్, శ్రీనివాస్లు మా ప్రయాణం ఎంతవరకు జరిగింది అని తెలుసుకొంటు డ్రైవరుతో మాట్లాడుతూ మానిటరింగ్ చేశారు..

రెండవరోజు ట్రిప్ పుళని. దీనికి రానుపోను మూడువందల ఇరవైకిలోమీటర్లు వచ్చింది కనుక ఇబ్బందిలేదు. మూడో రోజు తిరిచి లోకల్, శ్రీరంగం ట్రిప్.. దీనికి మక్తాగా కారుకు పదహారువందల యాభై. శ్రీరంగం చూడటానికి ఎక్కువ సమయం పడుతుంది.. రాక ఫోర్ట్ ఎక్కలేము. కనుక సరిపెట్టుకొని ఉదయం నుండి నాన్స్టాప్గా ఎనిమిదిగంటలు ప్రయాణం చేశాం.. ఇలా ఈ ప్రయాణాన్ని విజయవంతం చేయటానికి బావాబావమరదులైన చంద్రశేఖర్, శ్రీనివాస్లు అభినందనీయులు. ఎక్కడా ఏ అసౌకర్యం కలగాకుండా అన్ని ఏర్పాట్లు చేయటం మానిటరింగ్ చేయటం గొప్ప విషయం..

చంద్రశేఖర్ వాళ్ళది తెలుగు కుటుంబమే. తరతరాలుగా వారు తమిళనాడులో ఉన్నారు. కనుక తెలుగు కొంత యాసతో మాట్లాడుతారు. ఇళ్ళల్లో తెలుగు తమిళం మాట్లాడుకొంటారు. మనం మాట్లాడితే అర్ధమవుతుంది. తెలుగు మాత్రం చదవలేరు. వాళ్ళు మాట్లాడినా విషయం తెలుస్తుంది. తెలుగును మర్చిపోకుండా కాపాడుకొంటున్నారు. సంప్రదాయాన్ని జాగ్రత్తగా కాపాడుకొంటున్నారు. చంద్రశేఖర్ తండ్రి గొప్ప నిష్టాపరులు. కళ పెళ్లి అయిన కొత్తలో చూశాం.. ఆయన చనిపోయి చాలా ఏళ్ళయింది. 'శేఖర్' అని ఇతన్ని వాళ్ళ బంధుగణం ఆప్యాయంగా పిలుస్తారు. తల్లికి ఒక అక్క ముగ్గురు చెల్లెళ్ళు, నలుగురు సోదరులు వారి సంతానం అంతా మద్రాసు చుట్టూప్రక్కలే ఉంటున్నారు. వీళ్ల ఇంట్లో ఇదే మొదటి శుభకార్యం. అందుకని



అందరు ఆత్మీయంగా వచ్చి పాల్గొని ఈ దంపతులకు వటువుకు నూత్నవస్త్రాలు తెచ్చి అభిమానం చాటుకొన్నారు.. వీళ్ళు అంతే గౌరవంగా వాళ్ళను చూసుకొన్నారు. చంద్రశేఖర్ అక్కయ్య మద్రాన్‌లోనే ఉంటుంది. ఆమె నడుంకట్టి అందర్నీ కలుపుకొంటు కార్యక్రమాన్ని ఒంటిచేత్తో నిర్వహించింది. ఆవిడ మమ్మల్నిద్దర్నీ "మామా, అత్తా" అని ఆప్యాయంగా పలకరిస్తూ, పెద్దరికం ఇస్తూ చూసింది. మునలి, ముతకా అందరు చేతనయినంత పనిచేసి కళ దంపతులకు సహకరించారు. ఉపనయనం రోజున బాలాజీ మేనమామ శ్రీనివాస్ అనేక రకాలైన స్వీట్లు పెద్దసైజు చక్కిలాలు సెనగపప్పు బెల్లంతో చేసిన గోపురాలు, ఇంకా చాలారకాలు చేయించి అగ్నిహోత్రం ముందుపెట్టటం వాళ్ళ సంప్రదాయం. అలానే చేస్మాడు శీను. వాళ్ళ సంప్రదాయం ప్రకారం వటువుకు వేసే భిక్షపురోహితుడికే చెందుతుందని కనుక భిక్ష తగ్గించి వేయమని, ఇవ్వాలనుకొన్నది కానుకగా బాలాజీకి ఇవ్వమని కళ అత్తాగారు ఆడపడుచు మాబోటి వారికి ముందే తెలిపారు. అలానే చేశాం. కళ చిన్నతాతగారైన శంకరంగారి కుమారుని ఫామిలి కూడా వొడుగుకు వచ్చి మా బావ తరుపు వారు కూడా వచ్చినట్లనిపించారు. నిన్నరాత్రి చెన్నైలో బయల్దేరి ఈ ఉదయం ఉయ్యూరు చేరుకొన్నాం. 'అష్టదిన యాత్ర సర్వం సంపూర్ణం'.

మా వివాహం అయినప్పుడు 'హనీమూన్ అంటే మధుచంద్ర యాత్ర' అనేమాట మా కుటుంబాలలో విన్నది తక్కువ. ఇప్పుడు ఆ లోటు పూర్తి అవటానికి ఈ 'అనుభవ పూర్వక చిన్న దేవాలయ యాత్ర' (దీనినే నేను టెంపుల్ హనీమూన్ అన్నాను సరదాగా) చేసినట్లు అనిపించింది.

## సంగీత పెన్నిధి సన్నిధిలో

"గళమురళి శ్రీ ఈల శివప్రసాద్ గారికి నా లేఖ"

శ్రీ శివప్రసాద్ గారికి నమస్తే – మేమిద్దరం ఈ నెల ఎనిమిది రాత్రి మద్రాస్ వెళ్లి, తొమ్మిది రాత్రికి తిరుచి బయల్దేరి వెళ్లి, పది ఉదయం చేరి, కుంభకోణం తంజావూర్, తిరువయ్యార్లను దర్శించాం. పదకొండున పళని శ్రీసుబ్రహ్మన్యేశ్వరస్వామిని దర్శించాం . పన్నెండున శ్రీరంగంలో శ్రీరంగనాధ స్వామిని సందర్శించాం. ఆ రాత్రికి చెన్నై



బయల్దేరి పదమూడు ఉదయం మా మేనకోడలి గారింటికి చేరాం. పద్నాలుగున మా మేనకోడలి కుమారుని ఉపనయనం చేయించాం.

పద్నాలుగు గురువారం మధ్యాహ్నం మూడు గంటలకు ముందుగానే పొందిన అనుమతితో గురువరేణ్యులు శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ గారిని సందర్శించి పులకించాం. వారు సాదరంగా ఆహ్వానించి, ఆప్యాయతను వర్షించారు. ఎంతో చనువుగా మాట్లాడి మమ్మల్ని పరవశింపజేశారు. ఆత్మీయతాధారాతో మమ్మల్ని తడిపేశారు. ఎంతో ఆనందాన్ని, అనుభూతిని పొందాం. ఏ భేషజమూలేని 'ఆ మనీషిని', సంగీత సరస్వతిని అపర త్యాగరాజస్వామిని చూసి ఆనందం పట్టలేకపోయాం. అవి మా జీవితంలో మధురాతి మధురక్షణాలు. కలకాలం జ్ఞాపకం ఉండే దివ్యస్మృతులు. "సంగీత పెన్నిధి సన్నిధి"లో అరగంట కాలం యిట్టె గడిచిపోయింది. వారు "నేనూ మీలాంటి వాడినే. మీకెంత తెలుసో నాకూ అంతే తెలుసు. అధికుడిని కాను కాని వేదిక ఎక్కి పాడటం ప్రారంభిస్తే నేను నేను కాదు. ఒక అపూర్వశక్తి నన్ను ఆవహించి నాతో పలికిస్తుంది. అప్పుడు నాకేమీ గుర్తుకు రాదు. కార్యక్రమం అయిపోయి వేదిక దిగగానే నేను మళ్ళీ మామూలు మీలాంటివాడిని. డెబ్భై ఏళ్ళుగా పాడుతూనే ఉన్నాను. చిన్ననాటనే సంగీత సరస్వతి కరుణించి నాకు సంగీతభిక్ష పెట్టింది. నాకు విజయవడలో ఉండగా శ్రీఆంజనేయస్వామి సాక్షాత్కరించారు. సంగీతానికి ఆద్యులు హనుమయే. నా కోసం ఎవరైనా, ఎప్పుడైనా రావచ్చు అయితే ముందుగా ఫోన్చేసి వస్తే చాలు" అని చెప్పారు. ఆయన ఇంటిపేరు 'మారుతి' అయితే, మేము మారుతి సేవకులం అని ఉయ్యూరులో మాకు శ్రీఆంజనేయస్వామి దేవాలయం ఉన్నదని, నేను వంశపారంపర్య ధర్మకర్తనని చెప్పి నేను రాసిన 'శ్రీహనుమద్కథానిధి' పుస్తకాన్ని, శ్రీ మంగళగిరి ఆదిత్యప్రసాద్‌గారిపై తెచ్చిన 'ఆదిత్యహృదయం' పుస్తకాన్ని వారికి సభక్తికంగా అందించాను. చూసి





సంతోషించారు.

మీరు అమెరికాలో నార్త్ కరోలీనా రాష్ట్రంలో షార్లెట్ నగరంలో మా అమ్మాయి విజయలక్ష్మి అల్లుడు అవధాని దంపతుల ఇంటికి రావటం మీతో 'టోరి' రేడియోలో ఇంటర్వ్యూ చేయటం మీరు మీ గురువుగారి ప్రేమను, ఆప్యాయతను, వాత్సల్యాన్ని గుర్తుచేసుకొన్న విషయాలను, మీ గురుపత్ని అన్నపూర్ణలాగా వ్యవహరించిన తీరును వారితో మీ మాటలుగా చెప్పాము నేనూ మా శ్రీమతి. అన్నిటికి చిరునవ్వే సమాధానం. అయితే ఆమెను చూడాలని అనుకొన్నా వారితో ఆ మాట అనే సాహసం చేయలేకపోయాం. అడిగితే ఏమయేదో తెలియదు. ఇంతే దక్కింది అనుకొన్నాం.

శ్రీ బాలమురళిగారిని చూడటం మీ సహృదయత వల్లనే సాధ్యం అయింది. మీరు వారి చిరునామా, ఫోన్నంబర్నాకు నెట్లో మెయిల్ పంపించి చూడటానికి దారి చూపించారు. ఈ మేలు మరవలేము. బాలమురళిగారిని చూసి వచ్చామని మేము చెబుతుంటే అందరు నోళ్ళు వెళ్ళబెడుతున్నారు. ఎలా సాధ్యం? అని విస్తుపోతున్నారు. అప్పుడు మీ సంగతి చెప్పి శివప్రసాద్గారి వల్లనే సాధ్యమయిందని తెలియజేస్తున్నాము. జనవరి మొదటి తేదీన మీరు శ్రీబాలమురళిగారు 'యుగళ్బందీ'ని హైదరాబాద్ రవీంద్రభారతిలో నిర్వహించినప్పుడు నాకు ఆహ్వానం పంపిన సంగతి కూడా గురువుగారికి చెప్పాము. అమెరికాలో మీ 'ఈల లీలా యాత్ర'ను జ్ఞాపకం చేసుకొని చెప్పాను. "ఏం చెప్పాడు శివ నా గురించి? మంచే చెప్పాడా?" అన్నారు నవ్వుతూ. "మంచిగా చెప్పబట్టే మీ దర్శనం కోసం వచ్చామండీ. లేకపోతే వచ్చేవాళ్ళం కాదు" అన్నాను. నవ్వేశారు. షార్లెట్లో, గాంధిమందిరంలో జరిగిన మీ 'ఈల కచేరి' తర్వాత అందరి సమక్షంలో నేనిచ్చిన 'ఈల లీలా లోల', 'గళవంశీ' బిరుదులూ ఒకసారి జ్ఞాపకం చేసుకోన్నాము. ఆ రోజు మీరు నాకు చూపిన కృతజ్ఞతాభావం, పెద్దరికం మరచిపోలేము. మా అమ్మాయిగారింట్లో భోజనం, కచేరి, అలవోకగా మీరు పాడే తీరు మాకు మధురాతి మధురమైన జ్ఞాపకాలు. ఎంత ఎదిగినా ఒదిగి ఉండే మీ వ్యక్తిత్వానికి ముగ్ధులమయ్యాం. గురువుపట్ల మీకున్న ఆరాధనాభావానికి మురిసిపోయాం. మాకు బాలమురళిగారి దర్శనం 'యదుమురళిదర్శనం' అనిపించింది. ఆ "సంగీత పెన్నిధి సన్నిధిలో" మేము పొందిన అనుభూతి జన్మజన్మల పుణ్యఫలమే అనిపించింది. గురుదర్శనం మాతో

చేయించిన మీ సహృదయతకు, వారి సౌజన్యానికి మరొక్కమారు కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

## శివుడు రాజ్యమేలిన మదురై

నిజమా ఇది? అవును నిజమే అని స్థల పురాణం చెబుతోంది.. తమిళనాడును పాండ్యరాజులు పాలించేటప్పుడు కులశేఖర పాండ్యన్కుమారుడు మలయధ్వజుడు పరిపాలిస్తున్న సమయంలో జరిగిన విషయమే ఇది. అయన భార్య కాంచనమాల. సంతతి కోసం దంపతులు యజ్ఞం చేశారు.. యజ్ఞకుండం నుంచి వింతశిశువు ఆవిర్భవించింది. ఆ పిల్లకు మూడుకుచాలు ఉన్నాయి. వ్యాకులపడిన దంపతులకు అశరీరవాణి వినిపించింది. "తగిన వరుడు ఈ బాలికకు లభించగానే మూడవ రొమ్ముమాయం అవుతుంది" అని చెప్పింది. ఆమెను రాజకుమారుడిలాగా పెంచారు. యుద్ధవిద్యలన్నీ నేర్పారు. తండ్రి తర్వాతా ఆమె రాజ్యాధికారం పొంది అనేక రాజ్యాలను జయించి, రాజ్యవిస్తరణ చేసి కైలాసానికి చేరింది. శివుడు కంపించగానే ఆమె మూడవ కుచం మాయమైపోయింది. శివుడే తన భర్త అని గ్రహించింది. శివుడు ఆమెతో మదురై పట్టణం వచ్చేశాడు.. వారిద్దరి వివాహం దివ్యంగా జరిగింది. వారిద్దరు కలిసి మదురై నగరాన్ని పాలించారు. వారికి కుమారస్వామి అవతారంగా ఉగ్రపాండ్యన్ జన్మించాడు. అతన్ని రాజ్యానికి పాలకుడిని చేసి శివపార్వతులిద్దరు సుందరేశ, మీనాక్షిదేవిగా రూపాంతరం చెందారు... పాండ్యరాజైన కులశేఖరుడు మదురైను ముఖ్యపట్నంగా చేసుకొని నగరాన్ని దివ్యంగా తీర్చిదిద్ది, మీనాక్షి సుందరేశుల ఆలయాన్ని అత్యద్భుతంగా నిర్మించాడు.

మీనాక్షి అమ్మవారి విగ్రహం సర్వతో భద్రంగా సుందర వదనారవిందంగా కన్నుల పండువుగా కన్పించి భక్తులను తన్మయులను చేస్తుంది.. ఆలయానికి బంగారు ధ్వజస్తంభం ఉంది. ఒక చేతిలో రామచిలుక, రెండో చేతిలో పూల చెండు ధరించి, భక్తులను ఆదరించే చేపకన్నుల వంటి కన్నులతో, ప్రసన్న వదనంతో, దయాదాక్షిణ్యం కలిగించే చల్లని చూపులతో అమ్మవారు దర్శనమిస్తుంది.. చేతిలోని చిలుక భక్తుల కోరికలను విని అమ్మవారికి నివేదించి సాఫల్యం చెందేట్లు చేస్తుందని భక్తులు భావిస్తారు.

సుందరేశునికి పన్నెండు అడుగుల ఎత్తున్న ద్వారపాలకులు ఇరువైపులా కాపలా ఉన్న విగ్రహాలు కనిపిస్తాయి.. లోపల 'చొక్కనాధుడు' అని పిలువబడే సుందరేశ్వర లింగం మనకు సకల పాపహరంగా కనిపిస్తుంది. "హరహరమహాదేవ శంభో శంకర" నినాదాలతో భక్తులు నినదిస్తుంటే, ఒళ్ళు పులకరించి కైలాసంలో ఉన్నామేమోనన్న అనుభూతి కలుగుతుంది.. స్వామిసన్నిధిలో అరవై మూడు మంది నాయనార్లు, ఉత్సవమూర్తి, కాశీవిశ్వేశ్వరుడు, భిక్షాటనర్, సిద్ధార్, దుర్గవిగ్రహాలు అలరిస్తాయి.

కదంబవృక్షం, బంగారుసభ, యాగశాల కూడా ఉన్నాయి. తర్వాతి ప్రాకారంలో 'నటరాజస్వామి ఆలయం' ఉంది.. కుడికాలు పైకెత్తి, తాండవమాడే నాట్యభంగిమలో స్వామి దర్శనమిస్తాడు.. ఆవరణకు కాపలాగా 64 భూతగణాలు, ఎనిమిది ఏనుగులు, 32 సింహ విగ్రహాలు ఉన్నాయి. స్వామిదర్శనం చేసిన తర్వాతా 'వేయిస్తంభాల గుడి'లోకి ప్రవేశిస్తాం.. పైకప్పు మీద 60 తమిళ సంవత్సరాలు ఉన్న చక్రం వర్ణనాతీత సౌందర్యంతో అబ్బురపరుస్తుంది.. ఈ మండపంలో 985 శిలాస్తంభాలు, వాటికి ఉన్న కళాసంపద చూడటానికి రెండుకళ్ళు చాలవు అనిపిస్తుంది. 'కంబత్తడి మండపం'లో అగ్ని, వీరభద్ర, అఘోర వీరభద్ర విగ్రహాలు భయం కల్గిస్తాయి. ఇదంతా ఒక కళా ప్రదర్శనశాల అనిపిస్తుంది.

మీనాక్షి మందిరానికి ఉత్తరం అంచున దక్షిణ ముఖంగా 'ముక్కురుని వినాయక విగ్రహం' చూపరులను ఆకర్షిస్తుంది. 'కిలిక్కిట్టు మండపం'లో మీనాక్షిదేవి వివాహ ఘట్టం, పట్టాభిషేక ఘట్టం వర్ణచిత్రాలు వర్ణనాతీతంగా కన్పిస్తాయి. కప్పుపై దేవతాచిత్రాల పనితనం ముక్కున వేలేసుకోనేట్లు చేస్తుంది.. మీనాక్షి సుందరేశ్వరుల మండపానికి బయట 'స్వర్ణకమల తటాకం' ఉంది. దీని సమీపంలో 'ఊయల మండపం' ఉంది. శుక్రవారం స్వామివారలకు 'ఊంజల్సేవ' జరుగుతుంది. ఉత్తరగోపురంవైపు అయిదు సంగీత స్తంభాలున్నాయి. ఒక్కోదాన్ని ఆనుకొని, ఒకే రాతితో చెక్కబడిన 22 చిన్న స్తంభాలున్నాయి.. ఇవి నయనానందాన్నిస్తాయి. వీటిని తట్టితే 'మధుర' సంగీత స్వరాలు వినిపించి తన్మయులను చేస్తాయి. ఇదో విచిత్రానుభూతి. మదురై కాదు మధుర అనిపిస్తుంది. తూర్పుగోపురానికి దగ్గర్లో పుదు (కొత్త) మండపాన్ని తిరుమల నాయకుడు కట్టించాదట. ఇది మీనాక్షి సుందరేశ్వరుల వేసవి విడిది.. ఆలయానికి నాలుగువైపులా నాలుగు పెద్ద ప్రాకారాలు. నాలుగు చిన్న ప్రాకారాలు ఉండటం విశేషం. తూర్పు ప్రాకారం ద్వారా ఆలయంలోనికి ప్రవేశించి ముందుగా మీనాక్షి అమ్మవారిని దర్శించి, ఆ తర్వాతే సుందరేశ్వరుని దర్శించటం సంప్రదాయం.

మదురై ప్రాచీన తమిళ సంస్కృతికి పుట్టినిల్లు. వైగైనది అమ్మవారి సేవలో తరించినట్లు ఉంటుంది. ఇక్కడే మూకకవి 'మూకపంచశతి' రాశారు. అది మీనాక్షి అమ్మవారి అనుగ్రహమే. మూగవాడికి మాటలు అమ్మ తాంబూలం రసం తినిపిస్తే కవిత పెల్లుబికింది. ఆయనే తర్వాత కంచి పీఠాధీపతి అయ్యారు. అద్భుతమైన సంస్కృత శ్లోకాలవి 'అందులో 'ఆర్యాశతకం' విశేష ప్రాచుర్యం పొందింది. కవి సామ్రాట్ విశ్వనాధ సత్యనారాయణగారి నవల 'ఏకవీర' జరిగిన ప్రదేశం ఇదే. ఆ కథంతా ఈ నది, అమ్మవారి చుట్టూ తిరుగుతుంది.

మదురై చేనేత పరిశ్రమకు నిలయం. ఈ నగరాన్ని 'ఆలయనగరం' అని పిలుస్తారు. చిత్రి, ఆవని, తైమాసాలలో ఉత్సవాలు రంగరంగ వైభవంగా జరుగుతాయి.

అందుకే మదురైకి 'ఉత్సవపట్టణం' అనే పేరు వచ్చింది. చైత్రపౌర్ణమినాడు 'మీనాక్షీ సుందరేశ్వరుల కళ్యాణ మహోత్సవం' అత్యంత సుందరంగా వైభవంగా అట్టహాసంగా నిర్వహిస్తారు. వైగై నదిలో తెప్పోత్సవం దివ్యంగా ఉంటుంది. లక్షలాది ప్రజలు దర్శించి తరిస్తారు.. వాస్తు, శిల్పకళలకు నిలయం మదురై. చూస్తే చాలు మనస్సు ఆనంద మధురమైపోతుంది, జన్మ చరితార్థం అనిపిస్తుంది.

## కుంభకోణం

### శ్రీ ఆది కుమ్భేశ్వర స్వామి దేవాలయం

తమిళనాడులో సుబ్రహ్మణ్య, వినాయక, శివాలయాలు లెక్కకు మించి ఉన్నాయి. ఆ తర్వాతనే వైష్ణవాలయాలు వస్తాయి. కుంభకోణం భారతదేశంలో ప్రసిద్ధిచెందినా ఏడు మహానగరాలలో ఒకటిగా భావిస్తారు. ఇక్కడున్న 'మహామాహం కొలను'లో మహా మాఘి రోజున భక్తులు లక్షలాదిగా పవిత్రస్నానాలు చేసి పాపాలను దూరం చేసుకొంటారు. మాఘమాసంలో పన్నెండేళ్ళకోసారి ఈ పవిత్రమైన మహామాఘి వస్తుంది. ఈ పుష్కరంలో అమృత బిందువు చిందటంవల్ల అంత పవిత్రమైనదని చెబుతారు. భారతదేశంలోని ఏడు పవిత్రనదులు ఈ సరస్సులో ఆ రోజున దర్శనమిస్తాయని నమ్మకం. ఇక్కడ ఉన్న దేవాలయాలలో ముఖ్యమైనది ఆది కుమ్భేశ్వర దేవాలయం. దీని తర్వాత చెప్పాదగినది సారంగపాణి దేవాలయం. ఆ తర్వాత చూడదగినవి రామస్వామి దేవాలయం, నాగేశ్వరస్వామి దేవాలయాలు.

7వ శతాబ్దంలో కుంభకోణం చోళరాజులకు రాజధానిగా ఉండేది. కావేరి నది, అరసలార్నదుల మధ్య ఈ క్షేత్రం ఉంది. శైవులకు అతిముఖ్యమైన దేవాలయాలలో అది కుమ్భేశ్వర దేవాలయం ఒకటి. కుంభకోణం పట్టణానికి మధ్యలో ఈ దేవాలయం ఉన్నది. దీనికి మూడు పెద్ద ప్రాకారాలు. మూడు గోపురాలు ఉన్నాయి. తూర్పు గోపురంకు తొమ్మిది అంతస్తులు ఉన్నాయి. దీని ఎత్తు 128 అడుగులు.. ఇక్కడి శివలింగ పేరు ఆది కుమ్భేశ్వరలింగం. అమ్మవారు మంగలామ్బికాదేవి. 51 శక్తిపీఠాలలో ఇది ఒకటిగా భావిస్తారు. శివలింగం పైభాగాన ఎడమవైపుకు కొంచెం వంగి ఉన్నట్లు కన్పిస్తుంది. అందుకే దీనికి కుంభకోణం అనే పేరు వచ్చింది. కుంభం అంటే కుండ. కోణం అంటే వంపు. మరి కుంభం అనే పేరెందుకొచ్చిందని పూజారిని అడిగితే ఆయన-గరుత్మంతుడు అమృతభాండం (కుండ) తీసుకొని వెడుతుండగా ఇక్కడ ఒక అమృతపు చుక్క జారి పడిపోతుంటే శివుడు స్వయంగా అక్కడి ఇసుకతో ఒక కుండను తయారుచేసి అందులో అమృతబిందువుపడేట్లు చేశాడట. తర్వాత తానే ఆ కుండలో స్వయంభు లింగంగా ఉండిపోయాడట. అది తయారుచేస్తున్నప్పుడు పైన ఎడమవైపు కొంచెం వంగినట్లుగా వచ్చిందట. అందుకే కుంభకోణం అని చెప్పాడు.

ఆది కుమ్భేశ్వరస్వామి మీద ఎంతోమంది శైవభక్తులు భక్తితో కీర్తనలు రాసి సమక్షంలో పాడేవారు. అందులో అప్పార్స్వామి, సంబందార్స్వామి ముఖ్యులుగా పేర్కొంటారు. ఇక్కడి నవరాత్రి మండపంలో 27 నక్షత్రాలు, ద్వాదశ రాశి చిత్రాలు నవగ్రహాలు నల్లరాతి స్థంభంపైన శిల్పీకరించి ఉండి, చూపరులకు సంభ్రమం కల్గిస్తాయి. స్వాముల ఊరేగింపుకు వెండి వాహనాలున్నాయి. ఆలయానికి పెద్ద ఏనుగు ఉంది. స్తంభాలపై శిల్పాలు మనోహరంగా ఉంటాయి.

## సారంగపాణి దేవాలయం

ఆది కుమ్భేశ్వరస్వామి దేవాలయానికి ఎదురుగా శ్రీసారంగ పాణి దేవాలయం ఉంది. దీని ప్రాకారం గోపురాలు కన్నులపండువుగా ఉంటాయి. ముఖ్యమైన మూడు శ్రీమహావిష్ణుదేవాలయాలలో ఇది ఒకటి. శ్రీరంగం, తిరుపతి తర్వాత వైష్ణవ భక్తులు ఎక్కువగా సందర్శించే ఆలయం ఇదే. పదిహేనవ శతాబ్దంలో నాయకరాజులు దీనిని పునరుద్ధరించారు. దేవాలయ విమానం సభామండపం రథం (కారువార్రై) పన్నెండు రాతిస్తంభాలమీద సుందర విలసిత శిల్పాలతో ముచ్చటగా ఉంటాయి. 150 అడుగుల ఎత్తైన గోపురం 5 ప్రాకారాలు ఉంటాయి. ఇక్కడి పుష్కరిణిని 'స్వర్ణ తామర కొలను' అంటారు. లక్ష్మీతీర్ధం అని కూడా పిలుస్తారు. అమ్మవారు శ్రీకమలా లక్ష్మీదేవి. విష్ణుమూర్తి 'అరవముధన్' అనే అవతారంలో ఇక్కడికి వచ్చి లక్ష్మిదేవిని వివాహం చేసుకొన్నట్లు ఐతిహ్యం. ఈ ఆలయాన్ని మహారాష్ట్ర రాజు షాహాజీ అత్యంత వైభవంగా నిర్మించాడని పూజారి వివరించారు. సుమారు రెండువేల ఏళ్ళనాటి దేవాలయం ఇది. గోపురం రథం అన్నీ కనువిందు చేసేవే. ఇక్కడ సారంగాపాణి వెనుక అదిశేషునిపై పవళించిన శ్రీమహావిష్ణువు, వటపత్ర వృక్షం ఉంటాయి.

## శ్రీ నాగేశ్వరస్వామి దేవాలయం

పన్నెండో శతాబ్దంలో ఆదిత్యచోళుడు నిర్మించిన దేవాలయం ఇది చోళ శిల్పకళ ఉట్టి పడుతుందిక్కడ. ఆదిశేషుడు, సూర్యుడు అర్చించిన స్వామి నాగేశ్వరస్వామి. ఒకప్పుడు ఆదిశేషుడు భూభారం మోయలేక ఇక్కడికొచ్చి శ్రీనాగేశ్వరస్వామి సన్నిధిలో ప్రశాంతంగా గడిపాడట. శివపార్వతులు ప్రత్యక్షమై ఆయనకు భూభారాన్ని అలసట లేకుండా మోసే శక్తిసామర్థ్యాలను వరప్రసాదంగా ఇచ్చారట. చైత్రమాసంలో శుద్ధ ఏకాదశి ద్వాదశి త్రయోదశి రోజుల్లో మూడు రోజులు సూర్యభగవానుని కిరణాలు నాగేశ్వరమహాలింగం పైపడి భక్తులకు ఎంతో ఆనందాన్ని కల్గిస్తుంది.

## శ్రీరామస్వామి దేవాలయం

ఒకే ఒక్క గోపురం ఉన్న దేవాలయం. మహామండపం ఉంది. రాతి రాధమూ ఉంది. రామకథ చెక్కబడి ఉంటుంది రథం మీద. వామన కథా, మీనాక్షి సుందరేశుల వివాహ ఘట్టాలు చెక్కబడి ఉంటాయి. సుగ్రీవపట్టాభిషేకం కూడా చెక్కబడి ఉండటం మరీ ప్రత్యేకత. శ్రీరాముడు సీతాదేవి ఒకే పీఠంపై కొలువుదీరి ఉండటం మరో విశేషం. హనుమంతుడు వీణపై స్వామివార్లను స్తుతిస్తూ ఉన్నట్లున్న విగ్రహం ఆకర్షణీయం.

## దారాసురం

కుంభకోణానికి నాలుగు కిలోమీటర్ల దూరంలో తంజా ఊరెళ్ళే మార్గంలో దారాసురం ఉంది. ఇక్కడి శివుని పేరు 'ఐరావతేశ్వరుడు'. ఆలయాన్ని పన్నెండవ శతాబ్దిలో రాజేంద్రచోళ చక్రవర్తి కట్టించాడు. చాలా శిల్పసంపదకు నిలయంగా భాసిస్తుంది. ఇంద్రుని వాహనం అయిన ఐరావతం అనే తెల్లఏనుగు, యముడు ఈ స్వామిని ఆరాధించినట్లు ఐతిహ్యం. ముందున్న స్తంభాలు శిల్పరమణీయంగా ఉంటాయి. దీని ప్రత్యేకత వేరు అంటారు. ఇక్కడి కొలను పేరు 'యమతీర్థం' అంటారు. ముందున్న మండపం గుర్రాలతో లాగుతున్న పెద్దరాతి రథం ఉండటం విశేషం. ఇక్కడ స్వామిని అర్చించి వేడుకొంటే సంతాన ప్రాప్తి కలిగిస్తాడని పూజారి చెప్పారు.

## స్వామిమలై

కుంభకోణం-తంజావూర్ దారిలో దీనికి ఎనిమిది కిలోమీటర్లలో 'స్వామిమలై' దేవాలయం ఉంది. ఇక్కడ మీనాక్షి సుందరేశ్వర శివాలయం కింద భాగంలోను అరవై మెట్లుకొండ పైకి ఎక్కితే శ్రీసుబ్రహ్మణ్యేశ్వర దేవాలయం ఉన్నాయి. అరవై మెట్లు అరవై సంవత్సరాలకు ప్రతీకగా భావిస్తారు. శరవణ భవుడైన ఆరుముగాల స్వామికి ఉన్న ఆరు దివ్యక్షేత్రాలలో స్వామిమలై ఒకటి. కావేరి తీరంలో ఉన్న ప్రసిద్ధ దేవాలయం.. ఇక్కడ కుమారుడైన (మురుగా) తండ్రి శివునికి 'ఓం'కార రహస్యాన్ని బోధించాడట. అందుకే అంత ప్రసిద్ధి. దీనికి పురాణ ప్రసిద్ధ కథ ఒకటి ఉంది. ఒకప్పుడు బాలమురుగన్ బ్రహ్మలోకానికి వెళ్ళి బ్రహ్మను సృష్టి ఎలా చేస్తున్నావని ప్రశ్నిస్తే ఆయన వేదంలోని మంత్రాలను, ప్రణవ మంత్రాన్ని పలికాడట. దాని అర్థం చెప్పమని అడిగితే చెప్పలేకపోయాడు బ్రహ్మ. అప్పుడు కుమారస్వామి తానే బ్రహ్మస్థానంలో ఉండి సృష్టి చేస్తూ బ్రహ్మకంటే చాలా గొప్పగా జీవసృష్టి చేస్తున్నాడట. చాలాకాలం దాకా ఈ రహస్యం తెలీదు. శివుడికి ఈ విషయం తెలిసివచ్చి బ్రహ్మను నిర్బంధం నుండి వదిలెయ్యామని కోరాడు. బ్రహ్మకు ఓంకార రహస్యం తెలియనందువల్లనే తాను అలా చేశానని తండ్రికి తెలిస్తే చెప్పమని అన్నాడు. తెలుసునంటే అందుకే త్రిమూర్తులలో

నీకు అగ్రాసనాదిపత్యం వచ్చింది అన్నాడు కుమారుడు. "నీకు తెలుసా?" అని కుమారుని ప్రశ్నించాడు తండ్రి. తెలుసునని చెప్పి ప్రణవ మంత్రం రహస్యాన్ని విశేషాలను మురుగన్ తెలియజేస్తే తాను కుమారుడికి శిష్యుడైనందుకు గర్వంగా ఉందని శివుడు అన్నాడట. అందుకని స్వామిమలై క్షేత్రానికి విశేష ప్రాధాన్యత కలిగింది.

## కుంభకోణం చుట్టూ ఉన్న నవగ్రహ దేవాలయాలు

తమిళనాడులోని కుంభకోణం క్షేత్రానికి అతిసమీపంలో నవగ్రహ దేవాలయాలున్నాయి. వీటిని దర్శించి గ్రహపీడలను భక్తులు తొలగించుకొంటారు. ఈ ఆలయాలనే నవగ్రహ స్థలాలు అంటారు.

## సూర్యదేవాలయం

15 కి.మీ. దూరంలో సూర్య దేవాలయం ఉంది. ఆరోగ్యం భాస్కరాదిచ్చేత్ అన్న సూక్తి మనకు తెలిసిందే. రవి సంపద ప్రదాత కూడా. 1100 వసంవత్సరంలో కులోత్తుంగచోళ మహారాజు సూర్యదేవాలయాన్ని నిర్మించాడు. ప్రతిఏడాది పంటలు చేతికి వచ్చే జనవరి మాసంలో సూర్యునికి కృతజ్ఞతలు తెలియజేసేందుకు విశేషమైన ఉత్సవాన్ని ఇక్కడ నిర్వహిస్తారు. తమిళంలో సూర్యనార్కోవిల్ అని పిలుస్తారు.

## చంద్ర దేవాలయం

తిన్గాలూర్కోవిల్ అని పిలువబడే చంద్ర దేవాలయ దర్శనం సుఖాన్ని, దీర్ఘాయుస్సును ప్రసాదిస్తుందని నమ్మిక. సెప్టెంబర్-అక్టోబర్ మాసాలలో వచ్చే 'పురుట్టాసి', మార్చి -ఏప్రిల్‌లో వచ్చే ఫల్గుని నక్షత్ర సమయాలలో చంద్రకాంతి ఇక్కడి ఆలయంలోని శివలింగంపై ప్రసరించటం విశేషం. జ్యోతిష్ శాస్త్ర ప్రకారం మానసిక ఒత్తిడి, దుఖాన్ని తగ్గించేవాడు చంద్రుడని చెబుతారు. ఈ ఆలయం తిరువైయార్కు అయిదు కిలోమీటర్ల దూరంలో ఉంది..

## అంగారక స్థలం

తిరువైయార్కు ఆరు కిలోమీటర్ల దూరంలో కుజ దేవాలయం ఉంది. దేనికి 'వైతీశ్వరన్కోవిల్' అని పేరు. అనేక వ్యాధులను అంగారకుడు పోగొడతాడని విశ్వాసం. ధైర్యం విజయం శక్తికి అంగారకుడే కారణం. ఇక్కడే జటాయువు, గరుడుడు, సూర్యుడు అంగారకుని పూజించారని స్థలపురాణం. వివాహం ఆలస్యం అయితే అంగారక క్షేత్రాన్ని దర్శిస్తే వెంటనే పెండ్లి అవుతుంది.

కుజాలయానికి పది కిలోమీటర్ల దూరంలో బుధుని దేవాలయం ఉంది. ఇక్కడి

స్వామి స్వేతారన్యేశ్వరుడు. అమ్మవారు బ్రహ్మ విద్యాంబికాదేవి. వాల్మీకి రామాయణంలో ఈ దేవాలయం గురించి ఉంది అని చెబుతారు. కనుక ఈ ఆలయం సుమారు 3000 ఏళ్ళనాటి పురాతన ఆలయం అని తెలుస్తోంది. మెర్క్యురి అనే బుధునికి సంబంధిన ఆలయంగా దీనిని భావిస్తారు. బుద్ధి, తెలివితేటలను బుధుడు ప్రసాదిస్తాడు.

## బృహస్పతి దేవాలయం

కుంభకోణానికి 18 కి.మీ. దూరంలో ఆలన్గుడిలో ఈ గురు దేవాలయం ఉంది. ఇక్కడి స్వామిని అరన్యేశ్వర లింగం అంటారు. ఇది స్వయంభు లింగం. దీనికే ఆబాత్సగయేశ్వర అని కూడా పేరు. అమ్మవారు ఉమాదేవి. దీన్ని గురుస్థాన ఆలయంగా భావిస్తారు. ఇక్కడ దక్షిణామూర్తి స్వామివారి ఆరాధన చేస్తారు. పార్వతి అమ్మవారు ఇక్కడి ఆలయం లోపలున్న అమృత పుష్కరిణిలో పునర్జనం పొందిందని కధనం. ఇక్కడే శివునిలో ఐక్యమైందని చెబుతారు.

## శుక్ర దేవాలయం

వీనస్ అని పిలువబడే శుక్ర గ్రహానికి ఈ క్షేత్రం ప్రసిద్ధమైనది. కంచానూర్లో సూర్యదేవాలయానికి మూడు కిలోమీటర్లలో ఉంది. దీనికే 'పలాశవనం, బ్రహ్మపరి, అగ్నిస్థలం అని కూడా పేర్లున్నాయి. ఇక్కడే బ్రహ్మదేవుడు పార్వతీ పరమేశ్వరుల వివాహాన్ని దర్శించాడట.. భార్యల ఆరోగ్యం కోసం భర్తలు ఇక్కడికి వచ్చి ప్రార్ధనలు చేస్తారు.

## శనిస్థలం

తిరునల్లార్లో శనిస్థలం ఉంది. కుంభకోణానికి 53 కి.మీ.దూరంలో కరైకాల్కు 5కి.మీ. దూరంలో ఈ ఆలయం ఉంది. శనికి అంకితమైన దేవాలయం ఇదొక్కటే అని ఇక్కడివారంటారు. లక్షాలాది భక్తులు శనిగ్రహానుగ్రహం కోసం ఇక్కడికి వచ్చి పూజలు నిర్వర్తిస్తారు. ఇక్కడే నలమహారాజును శని పట్టుకొని పీడించటం ప్రారంభించాడని కథ.. ఇక్కడి 'నలతీర్ధం' చాలా మహిమ కలిగింది. ఇందులో స్నానం చేస్తే పాపాలన్నీ కొట్టుకుపోతాయి.

## రాహుస్థలం

కుంభకోణానికి అయిదు కిలోమీటర్ల దూరంలో తిరునంగేశ్వరంలో ఈ దేవాలయం ఉంది. ఇక్కడి శివుడు నాగనాదస్వామి. అమ్మవారు 'గిరిగుజాంబికాదేవి'. ఇక్కడ ఆదిశేషుడు, దక్షుడు, కారకోటుడు రాహువు స్థలమైన ఈ శివుడిని అర్చించారు.

## కేతుస్థలం

కీజపేరుంపల్లం అనేచోట 'పూంపుహార్'కు రెండు కిలోమీటర్ల దూరంలో కేతుస్థలము ఉంది. ఇక్కడి శివుడు మహా మహిమాన్వితుడు. రాహు కేతువులు జంటసర్పాకారంలో కలిసి ఉండి, క్షీరసాగర మథనంలో శివునికి సాయం చేశారని ప్రతీతి. ఈ ఆలయం కేతుగ్రహానికి అంకితమైంది.

## తంజావూర్

## శ్రీ బృహదీశ్వరాలయం

తంజావూరు అంటే బృహదీశ్వ రాలయం, సరస్వతిమహల్ అనే ప్రాచ్యలిఖిత భాండాగారం గుర్తుకు వస్తాయి. బృహదీశ్వరాలయానికే 'రాజరాజేశ్వరం' అనే పేరుంది. రాజరాజచోళ చక్రవర్తి నిర్మించిన ఆలయం కనుక ఆ పేరొచ్చింది. తంజావూర్ అనే పేరు కూడా ఒక ఐతిహ్యం వల్ల వచ్చింది. తంజన్ అనే రాక్షసుడు చెలరేగుతుంటే విష్ణు అవతారమైన నీల మేఘ పెరుమాళ్ ఆయన భార్య ఆనందవల్లీ అమ్మాళ్లు సంహరించారు. తంజన్కడసారి కోరికగా తన పేరు మీదుగా ఈ పట్టణం వర్ధిల్లాజేయమని కోరాడట. సరేనని ఆ రోజు నుంచి తంజావూర్ అనే పేరును స్థిరం చేశారట. తన్జం అంటే తమిళంలో శరణు అని అర్ధమట. అందుకనే దీన్ని శరణార్థుల నగరం అంటారని 'తంజాపురీ మహాత్మ్యం'లో ఉందట. కులోత్తుంగ చోళరాజు దీన్ని నిర్మించి తుంగపురం అని పేరు పెట్టాడని స్థలపురాణం చెబుతోంది. దీనికే 'అలగై' అనే పేరూ ఉంది. కుబేరుడు ఇక్కడ ఉండి తపస్సు చేశాడట..



తంజావూర్ముత్తయార్లు అనే రాజవంశం వారికి రాజధానిగా ఉండేది. తర్వాత చోళరాజులకూ రాజధాని అయింది. విజయాల మహారాజు ముత్తురాయలను ఓడించి స్వాధీనం చేసుకొన్నాడు. గంగైకొండ చోళుడు రాజధానిని గంగైకొండ చోళపురానికి మార్చాడు. ఇక్కడ నుండే పాండ్యరాజులు, హోయసల రాజులు పాలించారు. చివరికి అల్లాఉద్దీన్ఖిల్జీ సేనాపతి మాలికాఫర్వి జయ నగరాన్ని స్వాధీనం చేసుకొన్న తర్వాత

సేవ్వప్ప నాయకుడు స్వతంత్రాన్ని పొంది తంజావూర్చేరి తంజావూర్నాయక రాజవంశాన్ని స్థాపించాడు. వీరిలో కడపటి రాజైన వీరరాఘవుడు మధురరాజు చొక్కానాధుని చేతిలో ఓడిపోయాడు. తర్వాత పధ్నాలుగేళ్ళు అలగరి అనే సేనాపతి పాలించాడు. శివాజీ మహారాజుకు దాయాది తమ్ముడైన ఎకోజీ అలఘిరిని ఓడించి మహారాష్ట్రుల పాలనను ఇక్కడ శురూ చేశాడు. ఆ వంశం కొంతకాలం పాలించిన తర్వాత బ్రిటిష్ పాలనలోకి వెళ్ళింది.

## శ్రీ బృహదీశ్వరాలయం

చోళరాజులు పరిపాలనలో విశేషమైన వారసత్వాన్ని ఒదిలిపెట్టారు. వారి గొప్ప నిర్మాణమే బృహదీశ్వరాలయం. భారతదేశంలోనే ఉత్కృష్ట దేవాలయం అని పేరు పొందింది. ద్రావిడ శిల్పకళ విజృంభించిన దేవాలయం. దీనిని లార్డ్కర్జన్, గాంధీ వంటి ప్రముఖులు సందర్శించారు. ఆలయం చిన్నకోటలో అంటే శివగంగ కోటలో ఉంది. ఈ కోట మొదటి రాజు సెల్వప్ప నాయకుని పేర ఉంది. చివరివాడైన విజయ రాఘవుడు ఈ నగరాన్ని, కోటను నిర్మించాడు. దీని నిర్మాణానికి చాలా నాణ్యమైన గ్రానైట్ను ఉపాన లేక స్తూపి అనే సుదూర ప్రాంతం నుండి తెప్పించి వాడారట. ఇది రాజరాజచోళుని ఆలోచనా, అమలుపరచిన తీరు. 985-1014లో పాలించిన రాజరాజచోళుడు పాలన కాలంలోనే దీని నిర్మాణం జరగటం విశేషం. ఆయన రాజ్యానికి వచ్చిన 19వ సంవత్సరంలో నిర్మాణాన్ని ప్రారంభించి ఆరు ఏళ్ళలో పూర్తి చేశాడు. ఆయన పాలించిన ఇరవై అయిదవ ఏడాది 1009న 257వ రోజున రాగి కలశాలను విమానం మీద ఉంచి దిగ్విజయంగా పూర్తి చేశాడు. దీని బరువు 235 పౌండ్లు. 2926 కలజుళ అంటే 35 పౌండ్ల బరువున్న బంగారం పూతతో ఉంది. నిర్మాణం జరిగిన ఆరేళ్ళ కాలంలో యుద్ధాలు లేకపోవటం శాంతి నెలకొని ఉండటం బాగా తోడ్పడింది. రాజు ఇంటి పేరు రాజశేఖర వర్మన్. ఆయనకు 'రాజరాజ' అని, 'శివప్పదేశికార' అని బిరుదులున్నాయి. చిదంబర దేవాలయానికి చాలా ధనం దానంగా ఇచ్చాడు. రాజేశ్వరం అని పిలువబడే ఈ బృహదీశ్వరాలయం కోటకు దక్షిణభాగాన ఉంది. ముఖద్వారం తూర్పున ఉంది. రెండువైపులా సుబ్రహ్మణ్య, గణపతి చిన్న దేవాలయాలున్నాయి. 90 అడుగుల గోపురం లోపలికి రమ్మని ఆహ్వానించి నట్లుంది. ఆలయం లోపలి ప్రాంగణం 500 అడుగుల






పొడవు , 250 అడుగుల వెడల్పు ఉంటుంది. రాయి, ఇటుకలతో భూమి నడవటానికి వీల్లుగా ఉంటుంది. దక్షిణాన యాగశాల ఉంది. పడమర, ఉత్తరభాగాలలో అనేక శివలింగాలున్నాయి. ఈ గది గోడలకు అద్భుతమైన వర్ణచిత్రాలు లిఖింపబడి ఉన్నాయి. శివుని విన్యాసాలన్నీ చిత్రితాలై ఉంటాయి. ఆలయం బయటి కొలతలు 793, 397 ఫుగుల పొడవు వెడల్పు ఉన్నాయి.

## బృహదీశ్వరలింగం

ప్రాంగణంలో పడమటి భాగాన బృహదీశ్వరాలయం ఉంటుంది. దాని లోపల అ భాగాలున్నాయి. బృహదీశ్వరలింగం ఉన్నదాన్ని గర్భగృహం అని తర్వాత దాన్ని అర్ధమండపం అని మూడవదాన్ని మహామండపం అని నాల్గవదాన్ని స్థాపన మండపం అనీ అంటారు. ఇక్కడ శ్రీత్యాగరాజస్వామి కొలువై ఉంటాడు. అయిదవ మండపం నర్తనమండపం. ఆరవది వాద్య మండపం. ఇక్కడే గాయకులూ సంగీత కచేరి చేస్తారు. ప్రతిచోట ద్వారపాలకులుంటారు. వాటి శిల్పకళ అమోఘం. ఇందులో ఏడు విగ్రహాలు పద్దెనిమిది అడుగులఎత్తు, ఎనిమిది అడుగుల వెడల్పు ఉంటాయి. ఇవన్నీ ఏకశిలా నిర్మితాలే.

బృహదీశ్వర మహాలింగం నిజంగానే మహా పెద్దలింగం. 8.7 మీటర్ల ఎత్తు, అయిదుమీటర్ల వెడల్పు ఉన్న పెద్దలింగం. ఈ లింగానికి అసలు పేరు 'అదవల్లన్' అంటారట. దీని అర్థం నాట్యం చేసేవాడు అని. రెండో పేరు 'దక్షిణమేరు విటంకన్'. ఈ రెండు పేర్లు 'తిరువిసాప్పై'లో లభిస్తాయి. ఇవి చిదంబరేశ్వరుని పేర్లు కూడానట. శైవులకు చిదంబరం పెద్ద ఆధార భూమిట. రాజరాజు ఈ లింగాన్ని 'రాజరాజేశ్వర ముదైయార్' అని





ముద్దుగ పిలిచేవాడట. దీనికే 'రాజరాజేశ్వర్రప్రభువు' అని పేరుంది. ఈ లింగాన్ని బృహదీశ్వర లింగం అని, ఆలయాన్ని బృహదీశ్వరాలయం అనీ అంటారు. 'గ్రేట్టెంపుల్' అని పిలుస్తారు. శివలింగం ఉన్నదాని పైభాగాన్ని దక్షిణమేరు అంటారు. కైలాసాన్ని ఉత్తరమేరు అంటారన్నమాట.

## తంజావూరు శ్రీ బృహదీశ్వరాలయం-2

బృహదీశ్వరాలయు స్థవన మండవంలో శ్రీ త్యాగరాజ శివుడుంటాడు. ఈయన్నే 'విదంకార్' అంటారు. ఈ శివుడు చోళులకు ఆరాధ్యదైవం. చోళరాజు ముచుకుందుడు అసుర సంహారంలో దేవేంద్రునికి సహాయపడ్డాడని స్థల చరిత్ర. ఇంద్రుడు ప్రీతి చెంది ఇతనికి ఏడు త్యాగరాజ శివవిగ్రహాలను ఇచ్చాడట. వాటిని తిరువారూర్, తిరునగైక్కోరణం, తిరుక్కరిఎల్, తిరుక్కోలిలి, తిరుమరైక్కాడు, తిరునల్లారు, తిరువమూర్లలో ప్రతిష్ట చేశాడట. వీటినే 'సప్త విటంక క్షేత్రాలు' అంటారు. తిరువారూర్లో మహా పెద్ద త్యాగరాజస్వామి దేవాలయాన్ని కట్టించాడు. దేశంలోనే పెద్ద రథం ఏర్పాటుచేశాడు. బ్రహ్మాండమైన పుష్కరిణి నిర్మించాడు. ఈ త్యాగరాజస్వామి అనుగ్రహం వల్లనే మన కాకర్ల త్యాగస్య గారు జన్మించటం ఆ దేవుని పేరు తండ్రి ఈయనకు పెట్టటం అమ్మవారి పేరు కమల అవటం త్యాగయ్యగారి భార్య పేరు కూడా కమల కావటం తమాషాగా ఉంటుంది.

బృహదీశ్వరాలయంలో అనేక చిన్న మండపాలు దేవుళ్ళ విగ్రహాలు ఉన్నాయి. దేవాలయ విమానం 216 అడుగుల ఎత్తుంటుంది. పద్నాలుగు అంతస్తులున్నాయి. గోడలలో ఉన్న స్తంభాలు గోడలలో గూడులు, అనేక దేవతాగణాలతో శిల్ప రమణీయంగా కన్పిస్తుంది. శిఖరం అష్ట భుజాకారంలో ఉంది. దానిపైన ఉన్న బంగారు కలశం పన్నెండున్నర అడుగుల ఎత్తు ఉంటుంది. ఇరవై అడున్నర అడుగుల ఏకశిలా గ్రానైట్రాయి. పైగోపురం ఉంటుంది శిఖరం, స్తూపం నీడ భూమి మీద పడకపోవటం శిల్ప చాతుర్యం. అత్యాశ్చర్యకరం. పైన రెండు నందులు ఆరున్నర అడుగుల పొడవు, అయిదున్నర అడుగుల వెడల్పుతో ఎనభై టన్నుల బరువుతో ఉన్నాయి. వీటిని విమాన శిఖరంపైకి చేర్చటానికి 'వాలుబల్ల' (ఇంక్లైనేడ్ప్లేన్) ఉపయోగించారని చెబుతారు.




ఉత్తరాన ఉన్న శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి చిన్న దేవాలయం ఆగ్నేయ భాగంలో బృహన్నాయకి అమ్మవారి దేవాలయం ఉన్నాయి. ప్రక్కనే చండీశ్వరాలయం ఉంది. సుబ్రహ్మణ్య దేవాలయ శిఖరం 55 అడుగుల ఎత్తు ఉంది. 45 అడుగుల బేస్మీద ఉంటుంది. బృహన్నాయకి అమ్మవారి ఆలయం తర్వాత కాలంలో కట్టిందే. పదమూడవ శతాబ్దంలో పాండ్యరాజు కోనేరిమనికంతన్రాజు నిర్మించాడు. బృహదీశ్వరాలయం ముందు పెద్ద ధ్వజస్థంభం ఉంది. చండీశ్వరాలయం రాజరాజ నిర్మితమే.

## బృహన్నంది

. శివాలయముఖద్వారానికి ఎదురుగా ఎత్తైన ప్లాట్ఫారం మీద అద్భుత ఏకశిలా నిర్మితమైన నందీశ్వరుడు మన చూపులను లాగేసి అక్కడే నిలిచి చూసేట్లుంటాడు. పన్నెండు అడుగుల ఎత్తు, పందొమ్మిదిన్నర అడుగుల పొడవు, ఎనిమిదిన్నర అడుగుల వెడల్పు ఉన్న బృహత్నంది విగ్రహం ఇది. దేశంలో పెద్ద నందులలో రెండవది మొదటి నంది లేపాక్షిలో ఉన్న సంగతి మనకు తెలిసిందే. ఈ బృహన్నంది ఇరవై అయిదు టన్నుల బరువున్న విగ్రహం. లేపాక్షి నందిలా శిల్పకళ కన్పించదు. తిరుచినాపల్లి దగ్గరున్న పెరంబదూరు సమీపంలోని పచ్చచేమలై అనేచోటు నుండి ఈ నందీశ్వర విగ్రహానికి ఏకశిలను తెచ్చారు. ఈ నందీశ్వరుడు క్రమంగా పెరుగుతుంటే కాలికి మేకు దిగకొట్టారని చెప్పుకొంటారు. ఇంకో కథనం ప్రకారం ఈ నంది ఇంతగా పెరగటానికి దాని కడుపులో ఒక బావురుకప్ప ఉన్నదని అందుకే పెరిగిపోయిందని అంటారు. దాన్ని కనిపెట్టి బయటికి తీసేసి ఆ రంధ్రాన్ని పూడ్చారని చెబుతారు. ఈ కప్పను సభాపతి మండపంలోని నూతిలో వదిలేశారని అంటారు.

ఆలయగోపురం మీద వైష్ణవ, శైవకథలు శిల్పీకరించారు. గౌతమ బుద్ధుని జ్ఞానోదయ చిత్రం కూడా ఉండటం ఆశ్చర్యం. ముఖ్యవిమానానికి ఉత్తరభాగాన నాలుగు మానవ ముఖాలున్న శిల్పాలున్నాయి. వీటికన్నా కింద ఉన్నది పెద్దది క్రమంగా సైజు తగ్గి మిగిలినవి ఉంటాయి. కన్జీవారానికి చెందిన సోమవర్మ అనే శిల్పి చోళ, నాయక, మహారాష్ట్ర ఆంగ్లపాలకులను చిత్రించాడు అంటే వరుసగా వీరి చోళ దేశపాలనకు ఇవి ప్రతిబింబాలు. ఇందులో యూరోపియన్ముఖం ఉన్నవాడు వెనిస్సముద్ర యాత్రికుడైన




మార్కోపోలో అని భావిస్తారు. మార్కోపోలోకాంటన్కు గవర్నరుగా కొంతకాలం పని చేశాడట. అతను చైనాలో విస్తృతంగా పర్యటించాడు. అందుకే కాంటన్లో ఉన్న 'అయిదు వందల బుద్ధ విగ్రహాలున్న దేవాలయం'లో అతని విగ్రహమూ చేర్చి గౌరవిన్చారట.

అర్ధమండపంలో చోళ సంస్కృతీ చిత్రాలున్నాయి. దక్షిణదేశ చిత్రకళా రీతి గోచరిస్తుంది. భూమి నుండి సీలింగ్ వరకు రమణీయమైన చిత్రకళాతో శోభిస్తుంది.



పైభాగాన నాయక రాజుల కాలంలో ఉన్న తెలుగుదేశపు మనుష్యుల చిత్రాలున్నాయి. వీరిలో సేవ్వప్పనాయకుడు అచ్యుతప్పనాయకుడు ప్రసిద్ధంగా ఉన్నారు. చోళుల కాలంలో శైవం బాగా వ్యాప్తి చెందింది. వీరికాలంలో వెలసిన చిత్రాలలో కైలాశ శివుడు, పార్వతి, శివగణాలు, నందీశ్వరుడు, అప్సరగణం ఉంటారు.

రెండవ రకంలో నాలుగు దంతాలున్న తెల్లని ఏనుగైన ఐరావతం, దాన్ని నడిపే యువ మావటి కనిపిస్తారు. ఏనుగు ముందు నడిచే తెల్లగుర్రం ఉంటుంది. సుందర సెరిమనస్వామి ఉంటారు. మూడోరకంలో సుందర మహర్షి శివుడు కనిపిస్తాడు. భక్తగణం పెద్దహాల్లో ఉండి వారిని చూస్తూ ఉంటారు. కింది చిత్రాలలో ఆడవాళ్ళు వంటావార్పు చేస్తున్నట్లు చిత్రించారు.



అయిదవ భాగంలో నటరాజస్వామి, ఆయన భక్తులు కన్పిస్తారు. ఆ తర్వాతి దానిలో అందమైన మహిళాచిత్రాలు కనువిందు చేస్తాయి. ఉత్తరంవైపు గోడమీద త్రిపురాసుర వధ ఘట్టం కనివిన్నుంది. తర్వాత దేవతా ముఖాలున్న నాలుగు పెద్ద సైజు తలకాయలు కానిపిస్తాయి.

## బృహదీశ్వరునికి బృహత్ కానుకలు

రాజరాజచోళుడు తన పాలన ఇరవై తొమ్మిదవ ఏడాదినాడు, రాణీలతో ఆయన సోదరి 'కుందావై'తో వచ్చి స్వామిని దర్శించి అపూర్వమైన కానుకలు సమర్పించారు. నిత్యపూజకు కావలసిన ఏర్పాట్లన్నీ భారీగా చేశాడు. సుమారు 489 పౌండ్ల బంగారు ఆభరణాలు స్వామికి సమర్పించాడు. ఆరువందల పౌండ్ల వెండి వస్తువులు అందజేశాడు. నైవేద్యాలకు ఉత్సవాలకుగాను అనేక ప్రదేశాలలో ఉన్న సేద్యపు భూములను బృహదీశ్వరునికి రాసిచ్చాడు. సిలోన్దేశంలో ఉన్న భూములు కూడా స్వామికి సమర్పించి తన స్వామి భక్తిని ప్రకటించుకొన్నాడు. వీటివల్ల ఏడాదికి ఒక లక్షాపదహారు వేల కాలముల ధాన్యం వచ్చేది. దీని విలువ యాభై ఎనిమిది వేల కాసులు. ఇవికాక పదకొండు వందల కాసుల ధనాన్ని స్వామికి సమర్పించాడు రాజరాజు.

దేవాలయానికి ఉత్తర, దక్షిణభాగాలలో విశాలమైన పెద్ద మహావీధులను నిర్మించాడు. తూర్పు నుండి పడమర వరకు 400 మంది దేవదాసీలకు నివాస గృహాలు ఏర్పరచాడు. ప్రతి ఒక్కరికి ఒక ఇల్లు సంవత్సరానికి వందకాలముల ధాన్యం వచ్చే భూమి ఇచ్చాడు. నృత్యదర్శకులకు సంగీతగాయకులకు వాద్యకారులకు, దుస్తులు కుట్టేవారికి మొత్తం 212 మంది పురుష సేవకులకు కూడా ఇదే ఏర్పాటుచేశాడు. ఇందులో సంస్కృత 'అరియం' అంటే ద్రావిడ వేదంను పఠించేవారు వేదాలను అధ్యయన అధ్యాపనం చేసేవారు ఉన్నారు.. తనజావూర్జిల్లాను 'దక్షిణదేశధాన్యాగారం' (రైస్బౌల్) అంటారని చిన్నప్పుడెప్పుడో సోషల్లో చదువుకొన్నాం. ఇప్పుడు ప్రత్యక్షంగా చూశాం.

## పళని క్షేత్రం

## శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర దేవాలయం

## పళని

శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామికి ఉన్న ఆరు ప్రసిద్ధ క్షేత్రాలలో తమిళనాడులోని పాలని క్షేత్రం చాలా విశిష్టమైనది. ఏడవ శతాబ్దంలో నిర్మించబడిన ప్రాచీన ఆలయమిది. ఆలయ నిర్మాతచే మాల్పేరుమల్ అనే కేరళరాజు, తర్వాత పాలకులైన నాయకరాజులు



ఆలయాన్ని అభివృద్ధి చేశాడు. సముద్రమట్టానికి 1500 అడుగుల ఎత్తైన కొండమీద ఈ ఆలయం ఉంది. నడిచే వెళ్ళాలంటే 659 మెట్లు ఎక్కి చేరాలి. లేకపోతే 'వించికార్' మీద కాని 'రోప్వే' ద్వారా కాని కొండపైకి వెళ్లి స్వామిదర్శనం



చేసుకోవచ్చు. దేశవిదేశాల నుంచి వేలాది భక్తులు స్వామిని దర్శించి తరిస్తారు.

గర్భాలయంలో బాలసుబ్రహ్మణ్యస్వామి దండాయుదాన్ని ధరించి దర్శనమిస్తారు. అందుకని స్వామిని 'బాలదండాయుధపాణి' అని పిలుచుకొంటారు. సిద్ధయోగార్ అనే శిల్పి సర్వాంగసుందరంగా సుబ్రహ్మణ్యస్వామిని మలిచారు తొమ్మిది రకాల పాషాణాలతో అనే నవవిధ విశాలతో తయారుచేయబడిన సుందర విగ్రహం దక్షిణభారతంలో అతి ప్రాముఖ్యమైన క్షేత్రంగా గుర్తింపు పొందింది.

ఈస్వామికి సంబంధించిన ఒక ఐతిహ్యం ఉంది. కుమారస్వామి అన్నగారు వినాయకునితో అపరూపమైన ఒక మామిడిపండు విష యమై తగాదా పడ్డారట. నారదమహర్షి ఒకసారి 'జ్ఞానఫలం' అని పిలువబడే అరుదైన మామిడిపండును తెచ్చి భక్తీతో కైలాసపతికి అందజేశాడు. శివుడు ప్రేమతో దాన్ని పార్వతీ దేవికిచ్చాడు. అమె దాన్ని తన కుమారులకు ప్రేమగా ఇవ్వాలను కోన్నది. దాని కోసం ఎవరు ముందు భూప్రదక్షిణం చేసి వస్తే వారికిస్తానని వినాయక కుమారస్వాములకు చెప్పింది. కుమారుడు నెమలినెక్కి భూప్రదక్షిణ చేస్తే వినాయకుడు తండ్రిచుట్టూ తిరిగి ప్రపంచయాత్ర అయిందని పించాడు. పార్వతి వినాయకునికే ఫలాన్నిచ్చింది. కొపంతో కుమారస్వామి కైలాసం విడిచి ఈ కొండపైకి చేరాడు. పండుదక్కని కుమారస్వామి హడావిడిగా కైలాసం వదిలి ఈ కొండపైకి చేరి ఉండిపోయాడట. మహేశ్వరుడు పార్వతితో కొంతకాలం తర్వాత ఇక్కడికివచ్చి కుమారుడిని శాంతింపజేశాడట. 'పఝాంనీ' అంటే నువ్వే జ్ఞానవంతుడవు అని చెప్పారట. అదే 'పళని'గా మారింది. అందుకని ఈ స్వామిని పలణి మురుగన్లేకపలణి అందవార్ అంటారు.. అన్నిటిని త్యజించి



తనను శరణువేడమని శరవణభవుని ఆజ్ఞగా దర్శనమివ్వటం ప్రత్యేకత. కాషాయ వస్త్రాన్ని ధరించి సర్వసంగ పరిత్యాగిగా మురుగన్ కనిపిస్తాడు. కార్తీకమాసంలో స్వామిని నిత్యం బంగారు రథం మీద ఊరేగిస్తారు. క్రీ.పూ. 3000 ఏళ్ళనాడు జీవించిన సిద్ధభోగార్ అనే యోగిపుంగవుడు తొమ్మిది రకాలైన ధాతువులతో నవదుర్గా, భువనేశ్వరి మరకతలింగాలను చేసి నిత్యం అర్చించేవారట. ఈయన నివశించిన చిన్న ఆలయం ప్రధాన ఆలయానికి ఆగ్నేయభాగంలో ఉంది. భోగార్గారు నిత్యం భూమార్గం ద్వారా స్వామి సన్నిధికి వెళ్లి అర్చించి వచ్చేవారట. పళనిస్వామి అభిషేక ప్రియుడు. అందుకని స్వామి ప్రసాదంగా పంచామృతాలను ఇస్తారు. ఇప్పుడు సీలు చేసిన డబ్బాలలో దొరుకుతాయి. పాలని విభూతి కూడా చాలా ప్రసిద్ధమైంది. భక్తులు తప్పక కొని ఈ రెంటిని తీసుకొని వెళ్తారు. మొక్కులుతీర్చుకొనేవారుపల్లకిలోస్వామినిఊరేగిస్తూనెమలి ఈకలు కట్టి చెప్పులు లేకుండా కాలినడకన కొండ ఎక్కి మొక్కులు తీర్చుకొంటారు.

## తిరుచిరాపల్లి దగ్గర – శ్రీ జంబుకేశ్వర జలలింగ దేవాలయం



తమిళనాడులో ట్రిచి అని పిలువబడే తిరుచిరాపల్లికి అయిదు కిలోమీటర్ల దూరంలో తిరువేనక్కావల్ అనే ఊరిలో శ్రీ జంబుకేశ్వర ఆలయం ఉంది. ప్రాచీనాలయాలలో ఒకటి.. శ్రీరంగంలోని శ్రీరంగనాధాలయం తర్వాత భక్తులు విశేషంగా దర్శించే ఆలయమిది. ఆలయ శిల్ప శోభ రమణీయం. ఆలయం వేలాది ఏళ్ళ వయసున్న జంబు (నేరేడు) వృక్షం కింద ఉండటంతో, ఈ క్షేత్రానికి జంబుకేశ్వరం అని పేరొచ్చింది. ఇక్కడి లింగం పంచభూతాలలో ఒకటైన జలలింగం. ఆ పస్సు అంటే నీరు. నీటికి ఉన్న ప్రవాహశీలతను దృష్టిలో ఉంచుకొని పార్వతిదేవి ఇక్కడ జలలింగాన్ని యేర్పరచిందని స్థలపురాణం తెలియజేస్తోంది. అందుకనే 'అప్పులింగం' అంటారు.

ఒకప్పుడు శివుడు, పార్వతీదేవి సంభాషించుకొంటుండగా వారి మాటలలో యోగ, భోగాలమధ్య వ్యత్యాసంపై చక్కని చర్చ జరిగింది. పార్వతికి ఈ విషయమై

తెలుసుకోవాలనే కోరిక కలిగితే శివుడు ఆమెనే స్వయంగా తెలుసుకోమని చెప్పాడు. ఆమె శివుని ఆజ్ఞతో తపోభూమి అయిన జంబూద్వీపాన్ని చేరి కావేరీ నదీతీరాన తపస్సు చేయటం ప్రారంభించింది. ఆ తపోదీక్షలో ఆమె సందేహం సర్వమూ నివృత్తి అయింది. కావేరి జలాలను చేతుల్లోకి తీసుకోగానే ఆ జలాలు ఒక లింగరూపాన్ని పొందాయి. వెంటనే శివునిలో శక్తి ఐక్యమైంది. అందుకు తార్కాణంగా ఆ జలలింగం కావేరీ తీరంలో నిలిచిపోయింది.



నేరేడు వృక్షాలతో నిండి ఉన్న దేశం కనుక భారతదేశానికి జంబూద్వీపం అని పేరొచ్చింది. జంబు అంటే బంగారం కూడా. బంగారం లభించే ప్రాంతం కనుక ఆ పేరూ సార్ధకమయింది. జంబూ వృక్షాలున్న హిమాలయ ప్రాంతంలో ఒక సిద్ధుడు ఈశ్వరానుగ్రహం కోసం తపస్సు చేస్తుండగా ఒక నేరేడుపండు పైనుండి రాలి ఆయన ఒడిలో పడింది. దాన్ని చేతిలోకి తీసుకొని 'ఈశ్వరార్పణం' అనగానే నేరేడుపండు అదృశ్యమైం. ఈశ్వరుడు నేరేడుపండును గ్రహించాడు అనటానికి సాక్ష్యంగా వెంటనే గింజసిద్ధుని చేతిలో పడింది. మహాప్రసాదంగా ఆ గింజను మింగేశాడు. అప్పుడు ఆ సిద్ధుని ఉదరం నుండి నేరేడుచెట్టు మొలకేత్తటం ప్రారంభించింది. ఈశ్వరాజ్ఞ ప్రకారం సిద్ధుడు దక్షణావధానికి వచ్చి, కావేరితీరంలో జగదాంబ స్వహస్తాలింగమైన అప్పులింగంపై గొడుగులా తన శాఖలను విస్తరించి పెద్ద నేరేడు వృక్షమైనాడు. ఆనాటి నుండి జంబు వృక్షచ్ఛాయలో నెలకొని ఉన్న ఈశ్వరుడు 'జంబుకేశ్వరుడు'గా ప్రసిద్ధమయ్యాడు. కైలాసం నుండి తపస్సుకోసం బయల్దేరిన పార్వతీదేవి వెంట శివగణాలైన పుష్పదంతుడు, మాల్యవంతుడు ఇక్కడికి వచ్చి జంబుకేశ్వరుని అర్చించాలని ఏనుగు, సాలెపురుగు రూపాలలో ఉండిపోయారు. ప్రతిరోజు సాలీడు నేరేడు చెట్టు నుండి ఆకులు, రెమ్మలు రాలి శివలింగం మీద పడకుండా, దట్టమైన గూడు అల్లేది. ఏనుగు వచ్చి సాలీడు







ఎంగిలి దారంతో అల్లిన ఈ పందిరి పనికిరాదనీ దాన్ని తొండంతో రోజూ తీసి పారేసేది. క్రమంగా సాలీడు ఏనుగుల మధ్య వైరం విజృంభించింది. ఒకరోజు కోపంతో సాలీడు ఏనుగు తొండంలో దూరి విపరీతంగా కుట్టటం ప్రారంభించింది. ఆ బాధ భరించలేక తన తొండాన్ని ఏనుగు, నేరేడు చెట్టు కేసి బాదుకోసాగింది. దీంతో సాలీడు, ఏనుగూ రెండూ ఒకసారే మరణించాయి. ఈ కథ మన శ్రీశ్రీకాళహస్తి కథలానే ఉంది. ఇందులో కాలం అంటే పాము లేదు కనుక ఈక్షేత్రాన్ని 'శ్రీహస్తి' అనవచ్చునేమోనని నాకు అనిపించింది. సాలీడు చోళదేశపు రాజకుమారుడిగా జన్మించింది. పూర్వజ్ఞానం జ్ఞాపకాలతో కావేరి తీరాన ఉన్న ఈ జంబుకేశ్వరలింగాన్ని వెతుక్కుంటూ వచ్చాడు. స్వామిని గుర్తించి, జంబుకేశ్వరునికి రాతితో అతి ఎత్తైన ఆలయాన్ని నిర్మించి, ఏనుగులు ప్రవేశించటానికి వీలులేకుండా చిన్న ద్వారం ఏర్పరచాడు.

శివభక్తుడైన ఒక సిద్ధుని ఆధ్వర్యంలో ఈ ఆలయ నిర్మాణం జరిగింది. ఆయన రోజూ సాయంత్రం కూలివారికి దినభత్యంగా విభూతి ఇచ్చేవాడట. వారు ఇంటికి చేరుకోగానే విభూతి ధనంగా మారిపోయేదట. రాజుగారు ఒకసారి కావేరి నదిలో స్నానం చేస్తుండగా మెడలోని రత్నాలహారం జారి నదిలో పడిపోయింది. ఎంత వెదికించినా దొరకలేదు. రాజుకు దిక్కుతోచక స్వామి సన్నిధి చేరి మొరపెట్టుకొన్నాడు. అర్చకులు కావేరి పవిత్రజలాలను స్వామి అభిషేకం కోసం తెచ్చి అభిషేకించగానే రత్నాల హారం స్వామిని అలంకరించిందట. పరమానందభరితుడైన రాజు జంబుకేశ్వరునికి, అమ్మవారైన 'అఖిలాండేశ్వరి'కి అమూల్యాభారణాలు సమర్పించి, ప్రత్యేకంగా ఒక రాజగోపురాన్ని కట్టించాడు.

ఆ కాలంలో ఆలయ దేవతలు రాత్రివేళ ఉగ్రరూపాలు దాల్చి నగర సంచారం చేస్తూ జనాన్ని భయపెట్టేవారట. ఇక్కడి అమ్మవారు అఖిలాండేశ్వరి కూడా అలానే జనాలను భయపెట్టేదట. ఈ విషయం తెలిసి జగద్గురువులు ఆదిశంకరాచార్యులవారు జంబుకేశ్వరాలయానికి వచ్చి అఖిలాండేశ్వరి అమ్మవారి ధనాకర్షణ కోసం శ్రీచక్రాన్ని,



జనాకర్షణ కోసం శివచక్రాన్ని రెండు చెవులకు ఆభరణాలుగా ధరింపజేశారు. అంతేకాక కుమారుని చూస్తే తల్లి శాంతిస్తుందని అమ్మవారి గర్భాలయానికి ఎదురుగా 'పెద్ద ప్రసన్న గణపతి'ని ప్రతిష్టించారట. అప్పటి నుంచి ఉగ్రరూపం వదిలి ప్రశాంతంగా అఖిలాండేశ్వరిదేవి చల్లని తల్లిగా మారిపోయింది. ఏనాడు ఎవరు సమర్పించారో తెలియని నిలువెత్తు కంచు దీపపు సేమ్మేలో జ్యోతి అమ్మవారి జ్ఞానదృష్టి మనపై సదా ప్రసరింపజేస్తోందా అన్నట్లు వెలుగుతుఉంటుంది.

జంబుకేశ్వర ఆలయంలో రోజు అర్చకుడు ఉదయం పదకొండు గంటలకు దేవి ఆభరణాలు, చీర ధరించి స్వామిని అర్చించటం ఆనవాయితీగా వస్తోంది. ఆ సమయంలో స్వామికి ఎదురుగా ఒక గోమాతను నిలబెడతారు. గోవు జీవాత్మకు ప్రతిరూపం. జీవాత్మ, పరమాత్మల ఐక్యతకు అమ్మవారే స్వయంగా పూనుకొంటుందని ఇందులో పరమార్ధం. మనిషి మనుగడకు ముఖ్యాదారమైన నీటి రూపంలో ఈశ్వరుడు అవతరించటం వల్ల ఈ జంబుకేశ్వరలింగం ఎప్పుడూ గంగలో (కావేరి) ఉంటుంది. ఏడాది పొడవునా ఈ లింగం కింద నీరు ఊరుతూ ఈశ్వరుని ఉనికి సాక్షీభూతంగా నిలిచి ఉంది. నగర కాలుష్యానికి దూరంగా ప్రశాంత వాతావరణంలో ఉన్న ఈ ఆలయదర్శనం మానసిక ప్రశాంతతను ప్రసాదించి మొక్షాన్నిస్తుంది. జంబుకేశ్వరలింగాన్ని చూడాలంటే కొన్ని మెట్లు దిగి చిన్న గుహలోకి వెళ్లి దర్శించాలి.

ఆలయానికి అయిదు ప్రాకారాలున్నాయి. ఆలయగోడలు 35 అడుగుల ఎత్తులో ఉన్నాయి. ఎక్కడ చూసినా అరుదైన శిల్పకళ దర్శనమిస్తుంది. ఎన్నో మండపాలతో విరాజిల్లే ఆలయమిది. అందులో ఊంజల్మండపం, నూరు స్తంభాల మండపం, వెయ్యి స్తంభాలమండపం, వసంత మండపం, నవరాత్రి మండపం, సోమస్కంద మండపం ముఖ్యమైనవి. ఈ ఆలయాన్ని కోచెంగట్చోళుడు నిర్మించాడు. రెండవ ప్రాకార గోడలు విజయాలయన్, మూడవ ప్రాకారాన్ని విక్రమచోళుడు కట్టించారు. నాల్గవ ప్రాకారంలోని తూర్పు గోపురంను సుందరపాండ్య మహారాజు నిర్మించాడు.

## శ్రీరంగం శ్రీరంగనాథస్వామి దేవాలయం

108 శ్రీవైష్ణవ దేవాలయాలలో అతి ముఖ్యమైనది శ్రీరంగక్షేత్రం. త్రేతాయుగంలో ఇక్ష్వాకు వంశరాజుల వల్ల బ్రహ్మదేవుని వల్ల లభించిన విమానం

శ్రీరాముడు విభీషణుడికి ప్రసాదించాడని పురాణ కథనం. ఈ విగ్రహాన్ని తీసుకొని విభీషణుడు అయోధ్య నుండి లంకకు వెడుతుండగా కావేరి నది దారిలో వచ్చింది. సమయోచిత కార్యక్రమాలు నిర్వహించటానికి ఆగాడు. తలపైనున్న శ్రీరంగ విమానాన్ని దించి, దగ్గరలోని చంద్రపుష్కరిణిలో స్నానం వగైరా ముగించుకొన్నాడు. శ్రీరంగనాదునికి మధ్యాహ్న పూజ చేశాడు విభీషణుడు. అక్కడ శయనించాలని శ్రీరంగనాధుడు భావించాడు. .ఇంతలో మునులు దేవతాగణం శ్రీరంగనాధుడు అక్కడ శయనించి ఉండటం చూసి నమస్కరించి ఆనందం పొందారు. రాజు ధర్మవర్మ వచ్చి తామందరి కోసం శ్రీరంగ విమానాన్ని ఇక్కడే ఉంచమని విభీషణుడిని ప్రార్ధించాడు. మర్నాడు బ్రహ్మోత్సవం జరిపించాలనే తొందరలో విభీషణుడు వెంటనే బయల్దేరటానికి సిద్ధమైనాడు. కాని రాజు ఆ బ్రహ్మోత్సవాన్ని ఇక్కడే బ్రహ్మాండంగా నిర్వహిస్తామని హామీ ఇచ్చాడు. విభీషణుడు అంగీకరించటంతో వైభవంగా బ్రహ్మోత్సవాన్ని ఇక్కడే నిర్వహించారు.

మర్నాడు విభీషణుడు శ్రీరంగ విమానాన్ని నెత్తికి ఎత్తుకొని ప్రయాణం అవుదామనుకొని ప్రయత్నిస్తే అది కదలలేదు. రంగానాథునితో తన బాధ వెళ్ళబుచ్చుకొన్నాడు. ప్రత్యక్షమైన శ్రీరంగడు తాను ఈ కావేరి తీరాన్నే స్థిరపడాలని అనుకొంటున్నట్లు తెలిపాడు. ఇక్కడ నుండే దక్షిణదిశ వైపు చూస్తూ అతన్ని, లంకను కాపాడతానని అభయమిచ్చాడు. నిశ్చింతగా విభీషణుడు లంక చేరి రాజ్యపాలన చేశాడు. కావేరి, కొల్లడం అనే రెండు నదుల మధ్య శ్రీరంగక్షేత్రం వెలసింది. ఈ రెండు కలలనై వద్ద తూర్పుదిశలో కలిసిపోయాయి. ఈ నదులు రంగనాథునికి పూలదండలాగా అమరాయి.

శ్రీరంగ నగరం మధ్యలో నాలుగు చుట్టల ఆదిశేషునిపాన్పుపై నల్లరాతి శ్రీరంగనాథస్వామి శయనించి కనిపిస్తాడు. కుడిచేతితో కిరీటాన్ని చూపుతూ అన్ని లోకాలకు, సమస్త దేవతలకు తానే నాథునని తెలియజేస్తున్నట్లుంటాడు.. ఎడమచేతితో జీవులందర్నీ తన్నే ఆశ్రయించి ఊరట చెంది స్వర్గాన్ని పొందమన్నట్లు కటాక్ష దృష్టితో కనిపిస్తాడు. కుడిచేత ప్రయోగచక్రం, ఎడమచేతిలో శంఖం, మరో కుడిచేతితో అభయముద్ర, మరో ఎడమచేతిలో గద ధరించి చిరునవ్వు చిలకరిస్తుంటాడు. శ్రీరంగం విమానంపై పరవాసుదేవుని ఆకారం కన్పిస్తుంది. విమానం అంతా బంగారు రేకు తాపడమే. రంగమండపాన్ని గాయత్రి మండపం అని అంటారు. విమాన కళాశాలు గాయత్రి తల పాగాగా, మండపంలోని 24 స్తంభాలు అర్చకులకు ప్రతిబింబాలుగా భావిస్తారు.

## రామానుజాచార్య – నమ్మాళ్వార్ – పెరియాళ్వార్ – గోదాదేవి

పన్నిద్దరు ఆళ్వారులు ఇక్కడ స్వామిని అర్చించి తరించారు. ఇక్కడి గోపురాలు

వేదాలతో కూడిన దేవతలని, అక్కడి వస్తువులన్నీ సకల శాస్త్రాలని అంటారు. ఆలయానికి ఉన్న ఏడు ప్రాకారాలు సప్తలోకాలకు ప్రతిబింబం అనీ అంటారు.. పంచరాధా పద్ధతిలో దక్షిణ సంప్రదాయంలో పూజాదికాలు జరుగుతాయి. శ్రీరంగాన్ని 'భూలోకవైకుంఠం' అంటారు. శ్రీభగవద్రామానుజ సాంప్రదాయంలో ఉత్సవాలు నిర్వహిస్తారు. తమిళ కవిసార్వభౌమడు కంబర్ 'కంబ రామాయణం' ఇక్కడే రాసి స్వామికి వినిపించాడు.. ఢిల్లీపాదుషా కుమార్తె 'తురక నాచ్చియార్' రంగనాథుని ప్రేమించి, సేవించి ఆయనలో ఐక్యమైందిట. అర్జునమండపంలో ఈమెకు ఒక సన్నిధి ఉంది. రంగానాథునికి ఉదయం మొదటిసారిగా రొట్టె, పాలు నైవేద్యం పెట్టటం సాంప్రదాయం. తిరుమంజనం సమయంలో స్వామికి గళ్ళ లుంగీ అలంకారంగా తొడుగుతారు. పెరుమాళ్వారికి తాంబూల సేవనంలో తమలపాకుపై సున్నంతో పాటు ముస్లిం పద్ధతిలో ఉప్పు కూడా రాస్తారట.



చోళరాజు ధర్మవర్మ కుమార్తె 'చోలకులవల్లి' అనే ఉదయూర్నాచ్చియార్, కులశేఖర్రాజు గారి కుమార్తె 'సెరకులవల్లి' శ్రీరంగనిపై మరులుగొని ఐక్యమైన విశేషస్థలం శ్రీరంగం. చోళ, పాండ్య, మహారాజులు స్వామి ఉత్సవాలను ఘనంగా నిర్వహించేవారు. నవగ్రహ క్షేత్రాలలో శ్రీరంగం 'శుక్రగ్రహ క్షేత్రం' అనిపించుకొంటుంది. స్వామికి బంగారు వెండి హంసలు, పల్లకీలు కల్పవృక్షం, శేషవాహనలు, చంద్రప్రభ, గరుడ, అశ్వహనుమంత వాహనాలున్నాయి. బ్రహ్మాండమైన రథం ఉంది.

## శిల్పకళా విలాసం

శ్రీవేణుగోపాలస్వామి సన్నిధి రంగవిలాస మండపంలో గోదాదేవి అయిన అండాళ్ సన్నిధి ఉంది. కళావైభవంతో స్తంభాలు ఎనిమిది వెయ్యి కాళ్ళమండపం, శేషశాయర్మండపంలో ఉన్నాయి. దశావతార చిత్రాలు ఇక్కడ కనువిందు చేస్తాయి. ప్రసిద్ధ తెల్లగోపురం ఇక్కడే దగ్గరలో ఉంది. దేవస్థానం ఎదురుగా గల ప్రదర్శనశాలలో పురాతనశిల్పాలు, నాణాలు, రాగిపాతరాలు, తాళాలు, విచిత్రమైన బొమ్మలు ఉన్నాయి. ఆసియాలోనే అతి ఎత్తైన గోపురం అని చెప్పబడే రాజగోపురం ఎత్తు 236 అడుగులు.



వెడల్పు 192 అడుగులు. శ్రీసింగర్స్వామి కట్టించిన గోపురమిది. దీనిలో 13 ద్వారాలుండటం విశేషం.

## ఉత్సవ విశేషాలు

ప్రతిదినం ఏదో ఒక ఉత్సవం జరుగుతుంది. చైత్రమాసంలో విరుప్పాన్ ఉదయార్జరిపించిన ఉత్సవం పది రోజులు జరుగుతుంది. తొమ్మిది రోజులు రథోత్సవం నిర్వహిస్తారు. పౌర్ణమినాడు కావేరి నదిలో 'గజేంద్రమోక్షం' ఉత్సవాన్ని చేస్తారు. వైశాఖంలో సుదర్శన చక్ర దేవాలయంలో వసంతోత్సవం జరుపుతారు. శ్రావణంలో జేష్టాభిషేకం అనే తిరుమంజనం చేస్తారు. కవచాలు తీసేసి చేస్తారు. ఈ రోజు నుంచి నలభైరోజులు మూలవిరాటు ముఖదర్శనం మాత్రమే ఉంటుంది. తిరుమంజనం జరిగిన మర్నాడు 'తిరుప్పావడై' చేస్తారు. అనేక బస్తాల బియ్యం అన్నం వండి రంగానాధుని సన్నిధి ద్వారం వద్ద రాశి పోసి అన్నభిషేకం చేస్తారు. తర్వాత దీన్ని అందరికి ప్రసాదంగా ఇస్తారు. ఆశాఢంలో 18, 28 రోజుల్లో శ్రీవారితో కావేరికి వెళ్లి అమ్మా మండపంలో రెండుగంటలు తిరుమంజనం చేసి కావేరికి పసుపు, కుంకుమ రవికె సమర్పిస్తారు. దీన్ని 'ఆడి' అంటారు. శ్రావణమాసంలో చేసేదాన్ని 'ఆవణి' అంటారు. తొమ్మిది రోజులు జరుపుతారు. రంగానాదునికి చిన్న చిన్న పవిత్రాలు సమర్పిస్తారు.



చివరిరోజు 'తీర్ధవారి' జరిగి ఆ రాత్రికి భక్తులకు వాటిని అందిస్తారు. భాద్రపదంలో 'పురట్టాషి' చేస్తారు. ఆశ్వయుజ శుక్ల పాడ్యమి నుండి విజయదశమి వరకు గుర్రం వాహనం మీద సింగర్తోపుకు తీసుకొని వచ్చి వాల్మీకి వృక్షానికి పూజచేసి నాలుగు దిక్కులవైపు బాణాలు వదులుతారు. ఇదే నవరాత్రి. ఆశ్వయుజంలో 'ఐప్పషి' ఉత్సవం చేస్తారు. ఇదే ఊయల ఊపటం తొమ్మిది రోజుల వేడుక. ఇది తొమ్మిదో రోజు తిరుకొట్టారంలో జరిగే ధాన్యం కొలతలను శ్రీరంగనాథునికి చూపిస్తారు. ఈ నెలలో



కావేరి పవిత్ర జలాన్ని బంగారు బిందెతో ఏనుగు మీద తీసుకొని వస్తారు. కార్తీక మాసంలో జరిగేదాన్ని 'కార్తికై' అంటారు.. కార్తీక గోపుర ద్వారం స్వామిని కూర్చోపెట్టి పెద్ద ఎత్తైన ప్రదేశంలో టపాకాయలు కాలుస్తారు. తర్వాత విగ్రహాలను ఆలయంలోకి చేరుస్తారు. ఏకాదశినాడు తిరుమంజనం, రాత్రికి అర్జున మండపానికి తెచ్చి పచ్చకర్పూరంతో ఆరాధనా నైవేద్యం చేస్తారు. వెంటనే కార్తీక దీపారాదన శోభాయమానంగా చేస్తారు. నమ్బెరుమాలలు అనే రంగనాదస్వామికి 365 దుప్పట్లు సమర్పిస్తారు. తర్వాత రెండు గంటలకు శ్రీపట్టార్స్వాములతో కౌశిక పురాణ వ్యాఖ్యానం చేస్తారు. ద్వాదశి తెల్లవారుఝామున పడసిఎట్ట సేవ నిర్వహిస్తారు. అనేకరకాల పుష్పాలను, కర్పూరాన్ని స్వామిపై చల్లుతారు. దీన్ని దర్శించే జనం ఆనందపరవశులవుతారు. ఈ పది ఎట్టసేవను దర్శించటానికి కుటుంబంతో వచ్చిన విజయరంగ చొక్కానాదరాజు అనే నాయకరాజు, పై ఏడాది కూడా దర్శించాలన్న కాంక్షతో ఇక్కడే ఉండిపోయాడట.

మార్గశిరమాసంలో ఉదయం రెండుగంటలకే తిరుప్పల్లి, ఎలుచ్చిపడి తిరువారాధన, అమావాస్యనాడు తిరునేడుమ్మాన్దకం, రాత్రి అరయర్వ్యాఖ్యానం అభినయం నిర్వహిస్తారు. మోహినీ అలకారం వేస్తారు. వైకుంఠ ఏకాదశి నాడు మూలవిరాట్కు 'ముత్యాల అంగీ' సమర్పిస్తారు. వజ్రాన్గిని నవరత్న కిరీటాన్ని అలకరిస్తారు. తెల్లవారుఝామున నాలుగింటికే స్వామివారు బయల్దేరి అయిదున్నరకు 'పరమపద వాకిలి' నుండి వేంచేసి, అల్వారులను కటాక్షించి, శ్రీరంగరాజస్తవం విని, వెయ్యి స్తంభాల మండపానికి ఏడు గంటలకు వస్తారు. ఇక్కడ జరిగేది'రావత్తు ఉత్సవం'. అక్కడి నుండి తిరువని మండపంకు పదకొండింటికి చేరతారు. భక్తులు 'శ్రీరంగా శ్రీరంగా' అని భక్తి పులకిత





గాత్రాలతో పరవశంగా పిలుస్తారు. స్వర్గంలో శ్రీమహావిష్ణువే దర్శనం ఇక్కడ ఇస్తున్నాడా అనే అనుభూతి పొందుతారు. వెయ్యికాళ్ళ మండపంలో అరయర్సేవ చేస్తారు. నమ్మాళ్వారుకు స్త్రీ అలంకారం చేసి స్వామి వద్దకు తీసుకొస్తారు. స్వామిని అర్చకస్వాములు చేతులపై ఉంచుకొని భక్తులకు సేవను చూపిస్తారు. ఇదే 'తిరుకైత్తల సేవ'. ఎనిమిదో రోజు అశ్వవాహనం వేంచేసి చందన మండపం నుండి పట్టాభిరామ సన్నిధికి చేరతారు. దీనిలో ఉన్న అర్థం ఏమిటంటే స్వామివారిని ఆళ్వారులు దొంగిలించటానికి ప్రయత్నిస్తున్నట్లు, వారి నుండి తప్పించుకోవటానికి ఇసుకలో అటు ఇటు పరుగెత్తుతున్నట్లు చేయటం. పదవరోజు నమ్మాళ్వార్కు రంగనాధస్వామి మోక్షాన్ని ప్రసాదిస్తారు. పదకొండవరోజు తీర్ధ గోష్టితో వైకుంఠ ఏకాదశి ఉత్సవం పూర్తి.

పుష్యమాసంలో చేసేది 'తై'. మకర సంక్రాంతి మొదటిరోజున వెయ్యికాళ్ళ మండపానికి ఎనభై కళాశాలతో తిరుమంజనం కోసం తిరునాచ్చి అమ్మవారితో స్వామి వేంచేస్తారు. మాఘమాసంలో 'మాశి' తొమ్మిది రోజులు చేస్తారు. ఎనిమిదోరాజున ఇద్దరు దేవేరులతో స్వామి కోనేరు చేరి తెప్పోత్సవం చేయించుకొంటాడు. కోనేరు ఉత్తర దిశలో ఉంది. మర్నాడు 'పండకాక్షి' అనే 108 దివిటీలతో సూర్యప్రభ ఉత్సవం చేస్తారు. నాల్గవరోజు గరుడవాహనంపై ఊరేగిస్తారు. మాఘమాసంలో గరుడసేవలో పాల్గొనటం కాశీకి వెళ్ళినంత పుణ్యం. ఫాల్గుణ మాస ఉత్సవాన్ని 'పంగుని' అంటారు. పదిరోజులు జరుగుతుంది. పల్లకిలో శ్రీరంగనాథుడు 'ఉరయూర్'కు వెళ్లి అక్కడ తురకనాచ్చియార్ అనే చోళకులవల్లిని స్వయంవర వివాహం చేసుకొని ఒకే సన్నిధిలో




ఉభయులు ఉంటారు. తొమ్మిదోరోజు ఉత్తరఫల్గునీ నక్షత్రోత్సవరంగా నాథుని ప్రధానదేవి శ్రీరంగనాయకిని చూడటానికి వచ్చేరోజుకు ముందే తురకనాచ్చియార్తో కులికినందుకు ఈమెకు కోపం వచ్చి తన సన్నిధికి రావద్దని భర్త రంగనాధుని శాసించిందట. నమ్మాళ్వారు

నెమ్మదిగా నచ్చ చెప్పటం ఆమె శాంతించి ఇరువురు కలిసి దర్శనమివ్వటం ఇక్కడి ప్రత్యేకత. దీనినే 'శేర్తిసేవ' అంటారు. సంవత్సరానికి ఈ ఒక రోజే ఈ సేవ జరుగుతుంది.

## 6) అనంతపద్మనాభుడి నుండి అరుణాచలేశ్వరుని దాకా

2014 ఫిబ్రవరిలో మేమిద్దరం, మా అన్నయ్యగారబ్బాయి రామనాథ్ మా కుటుంబ స్నేహితురాలు శ్రీమతి సీతంరాజు మల్లికాంబ గారు కేరళ, తమిళనాడు యాత్ర చేశాం. ఈ వివరాలను 'అనంత పద్మనాభుడి నుండి అరుణాచలేశ్వరుని దాకా' పేరుతో మీకు తెలియజేస్తున్నాను.

## అనంత పద్మనాభుడి నుండి అరుణాచలేశ్వరుని దాకా-1

### ఆలోచన

భారతదేశంలో దాదాపు అన్ని రాష్ట్రాలు తిరిగి చూశాము కాని కేరళా కాశ్మీర్ వెళ్లి చూడలేదనే బాధ నా మనసులో ఉంది. కార్తీకమాసంలో పంచారామ సందర్శనం తర్వాత ధనుర్మాస ప్రారంభంలో చిన్న తిరుపతి దర్శనం అయిన తర్వాత ఈ కోరిక మరీ బలీయమైంది. మా శ్రీమతి కూడా సరేనంది. మా కుటుంబ స్నేహితురాలు మాకు ప్రత్యక్ష ఆడపడుచు అని మేము భావించే సీతంరాజు మల్లికాంబగారు కూడా మాతో వస్తానన్నారు. మా అన్నయ్యగారి అబ్బాయి రాంబాబు కూడా కలుస్తానన్నాడు. ఇవన్నీ పూర్తి అయేసరికి డిసెంబర్ చివరి వారం వచ్చేసింది. మా రెండో అబ్బాయి శర్మకు ఈ ప్లాన్ చెప్పి రైల్ టికెట్ల సంగతి చూడమన్నాం. వాడు వెంటనే చూశాడు. కేరళలో అనంతపద్మనాభ స్వామిని గురవాయూర్‌లో శ్రీ కృష్ణుని కాలడిలో శంకరాచార్య జన్మస్థలాన్ని చూడాలనే మొదటి మా సంకల్పం. అటు నుండి మద్రాస్ వెళ్లి అక్కడి నుండి మళ్ళీ చిదంబరం అరుణాచలం వెళ్లాలని ఆలోచన ఈ విషయాన్ని మద్రాస్‌లో ఉన్న మా మేనకోడలి భర్త చంద్రశేఖర్‌కు చెప్పాం. అతను దారిలోనే విరుదాచలం స్టేషన్‌లో దిగి చిదంబరం, అక్కడి నుండి అరుణాచలం వెళ్లి మద్రాస్ వస్తే సమయం త్రిప్పటా కలిసి వస్తుందని సలహా ఇచ్చాడు. బాగుందను కొన్నాం.

శర్మ ముందుగా బెజవాడ నుండి త్రివేంద్రంకు, టికెట్ బుక్ చేసి, అక్కడ ఒక రోజు మాత్రమే ఉండి మర్నాడు ఉదయం కన్యాకుమారి, సుచీన్ద్రం నాగర్ కోయిల్ చూసి అక్కడ మళ్ళీ ట్రెయిన్ ఎక్కి గురవాయూర్ మర్నాడు ఉదయం చేరి స్వామి దర్శనం చేసి మధ్యాహ్నం నుండి కారులో కాలడి వెళ్లి రాత్రికి ట్రెయిన్ ఎక్కి మద్రాస్ చేరేట్లు టికెట్ రిజర్వేషన్ చేయించాడు. త్రివేంద్రంలో, గురవాయూర్‌లో హోటల్ రూమ్స్ బుక్ చేశాడు. అంతా ఆన్‌లైన్‌లోనే. గురవాయూర్ నుండి రాత్రికి మద్రాస్ బయల్దేరే ట్రెయిన్‌లో రిజర్వేషన్ చేయించాడు. దానిలో బయల్దేరి మర్నాడు సాయంత్రం

విరుదాచలంలో దిగి, అక్కడి నుండి చిదంబరం కార్‌లో వెళ్ళేట్లు మాట్లాడాడు చంద్ర శేఖర్. అతనే హోటల్ రూమ్స్ ఫోన్లో బుక్ చేశాడు. అక్కడి నుండి వైదీశ్వరలయానికి కార్‌లో వెళ్ళే ఏర్పాటు చేశాడు. చిదంబరంలో సాయంత్రం బయల్దేరి తిరువన్నామలైకు రాత్రి చేరి హోటల్ రూమ్‌లో ఉండేట్లు రిజర్వ్ చేయించాడు. మర్నాడు ఉదయం దర్శనం గిరి ప్రదక్షిణం చేసి రమణాశ్రమం చూసి మధ్యాహ్నం బస్‌లో బయల్దేరి చెన్నైకి రాత్రికి చేరే ప్లాన్ చెప్పాడు చంద్రశేఖర్. ఇది అందరికి నచ్చి దీన్ని బట్టి రిజర్వేషన్లన్నీ జరిపించారు శర్మా చంద్రశేఖర్ కలిసి.

## ఆచరణ

మాఘ మాసంలో కిందటి ఏడాది చంద్రశేఖర్ కుమారుడి ఉపనయనానికి మద్రాస్ వెళ్లి అతని సలహాతో కుంభకోణం తంజావూర్, పళని తిరువాయూర్, శ్రీరంగంలను తిరుచ్చి బేస్ చేసుకొని పర్యటించాం. ఇప్పుడు కూడా మాఘంలోనే మళ్ళీ ప్రయాణం. తమాషా అనిపించింది. కేరళలో మన భోజనం దొరకదు కనుక ఎలేక్ట్రిక్ కుక్కర్ తీసుకు వెళ్దామనుకున్నాం. కాని అనుమతించరు హోటల్‌లో అని చెప్పాడు చంద్రశేఖర్. అందుకని ఆ ఆలోచన విరమించుకున్నాం.

త్రివేంద్రం వెళ్ళేవరకు రైల్‌లో తినటానికి ఏర్పాట్లు చేసుకొన్నాం. మా ఇంట్లో పూరీకూరా నిలవ ఉండే గారెలు చేశాం. మల్లికాంబ గారు పెరుగన్నం తెచ్చారు. రాంబాబు బిస్కెట్లు స్వీట్ హాట్ మంచినీరు ఏర్పాటు చేశాడు. కారంపొడి చింతకాయ పచ్చడి నిమ్మకాయ ఊరగాయ అటుకులు తీసుకున్నాం. మనిషికి రెండే శాల్తీలు ఉండేట్లు అనుకొన్నాం. మా ఇద్దరి బట్టలు ఒక సూట్‌కేస్‌లో సర్దుకున్నాం. ఒక హాండ్ బాగ్‌లో కావలసిన కొన్ని బట్టలు, తయారు చేసినవి సర్దుకొన్నాం. అరటి ఆకులు కోసి తీసుకొన్నాం. ప్లాస్టిక్ గ్లాసులూ కాఫీకి ఫ్లాస్కు తీసుకొన్నాం దాదాపు తిండి కోసం ఏదీ కొనాల్సిన అవసరం లేకుండా చేశాం. కమలాలు ఆపిల్ పళ్ళు రాంబాబూతోబాటు మేము కూడా ఎవరికి వారం తెచ్చుకోన్నాం. ఒక్క గురవాయూర్‌లో తప్ప మిగిలిన చోట్ల సాయంత్ర దర్శనం ఉదయం దర్శనం అంటే రెండుసార్లు దర్శనం చేసేట్లు ఏర్పాట్లు చేసుకోన్నాం.

## ఇదీ ప్లాన్

4-2-14మంగళ వారం రాత్రి పన్నెండు గంటలకు బ్రష్ చేసి స్నానాదికాలు పూర్తిచేసి, అందరూ మా ఇంటికి వచ్చారు. మేమూ రెడీ అయ్యాం. మా అబ్బాయి రమణ రాము అని మాకు పరిచయం. అతనికి కారు కోసం చెప్పాడు. అతను కారు తీసుకొచ్చాడు. సామాను అంతా అందులో సర్దుకొని రాత్రి ఒంటి గంటకు బయల్దేరి బెజవాడ రైల్వేస్టేషన్‌కు చేరాం ఏడవ నంబర్ ప్లాట్ ఫారంకు. త్రివేంద్రం ఎక్స్ప్రెస్



22619 ఎక్కి s-3 లో 3,5,6,8 బెర్తులులోకి చేరాం. రాత్రి మూడు గంటలకు ట్రెయిన్ బయల్దేరింది. మమ్మల్ని ఎక్కించి రాము ఉయ్యూరు వెళ్ళాడు. రాంబాబు శిష్యుడు ఒకతను కూడా తోడు వచ్చాడు. ట్రెయిన్ ఎక్కించటానికి. తొమ్మిది శాల్తీలుతో బయల్దేరాం.. నిద్ర పెద్దగా పట్టలేదు. ఉదయం లేచి మాతో తెచ్చుకొన్న కాఫీ త్రాగాం. తర్వాత తెచ్చుకొన్న టిఫిన్ తిన్నాం. కాఫీ త్రాగగానే నేను తెచ్చుకొన్న పుస్తకాలతో సంధ్యా వందనం పూజా పూర్తిచేసి అరుణ పారాయణ మహా సౌర మంత్రంలను పూర్తి చేసి టిఫిన్ తిన్నాను. మధాహ్నం పెరుగన్నం పళ్ళు తిన్నాం. సాయంత్రం గారెలు తిన్నాం. రాత్రికి పూరీ కూరా తిన్నాం. అయిదవ తేదీ అంతా ప్రయాణమే అయిదు బుధవారం రాత్రిఒంటి గంటకు త్రివేంద్రం స్టేషన్ చేరుకొన్నాం. సామాను మేమే దింపుకొని ముప్పై రూపాయలిచ్చి మేము బుక్ చేసుకొన్న హోటల్‌కు చేరాం. హోటల్‌కు చాలా దగ్గర రోడ్డు దాటితే హోటలే.

## చైత్రంలో మాఘం

ఆరవ తేదీ గురువారం-త్రివేంద్రంలో మేము బుక్ చేసుకొన్నా కేరళ ప్రభుత్వ హోటల్ పేరు 'చైత్రం'. అంటే మేమిప్పుడు 'చైత్రం'లో మాఘ మాసం గడుపుతున్నామన్న మాట. రెండు రూములు బుక్ చేశాం. 310,320. మొదటి దాంట్లో ప్రభావతి మల్లికాంబగార్లు రెండవ దానిలో నేనూ రాంబాబూ ఉన్నాం. నిద్ర ఎలాగూ పట్టదు కనుక మూడింటికే లేచి కాలకృత్యాలు పూర్తి చేసుకొని అప్పటికే ఒకసారి కాఫి తాగాం. నేను స్నానం తర్వాత సంధ్య పూజ పారాయణ చేసి సిద్ధంగా ఉన్నాను. మిగిలిన వాళ్ళు కూడా రెడీ అయ్యారు. వెంట తెచ్చుకొన్న గారెలు బ్రేక్ ఫాస్ట్‌గా తినేశాం. హోటల్ ప్రక్కనే కేరళ టూరిజం డెవలప్‌మెంట్ కార్పోరేషన్ వాళ్ళ ఆఫీసు ఉంది. అక్కడికి వెళ్లి ఉదయం ఎనిమిదింటికి బయల్దేరే లోకల్ ట్రిప్‌కు మనిషికి మూడు వందలు చెల్లించి బుక్ చేసుకోన్నాం. సాయంత్రం నాలుగున్నర ట్రిప్‌కు రెండు





వందల చొప్పున హార్బర్, కోవలం బీచ్ లకు బుక్ చేసుకోన్నాం.

ఎనిమిది గంటలకు ఏ.సి.మినీ వాన్‌లో ఎక్కాం. మేము కాక ఇంకో దంపతులు మాత్రమే ఉన్నారు. మొదటగా శ్రీ అనంత పద్మనాభ స్వామి దేవాలయానికి తీసుకొని వెళ్ళారు. అక్కడ పాంటు చొక్కా కెమెరాలు, సెల్ ఫోన్లు చెప్పులు క్లోక్ రూమ్‌లో ఇచ్చి లుంగీపై పంచ మాత్రమే వేసుకొని నేను రాంబాబు తయారయ్యాం. ఆడవాళ్ళు చీర కట్టుకోవచ్చు. చుడీదార్ నిషిద్ధం. లుంగీలాంటి బట్ట కట్టుకోవాలి. శ్రీ పద్మనాభ దర్శనం కనులారా దర్శనం చేసుకొన్నాం. బయటికి వచ్చి మళ్ళీ డ్రెస్ మార్చుకొని అక్కడే ఉన్న స్వాతి తిరుణాల్ మ్యూజియం చూశాం. అక్కడి నుంచి పద్మనాభ బీచ్‌కు వెళ్లాం. అక్కడ ఒక అరగంట గడిపి కెనాల్ బాక్ వాటర్ డ్రైవ్‌కు తీసుకు వెళ్ళాడు. అక్కడ మనిషికి వంద రూపాయలు ఇచ్చి స్పెషల్ బోట్ ఎక్కి ఒకగంట అందులో ప్రయాణ సుఖం అనుభవించాం. కెనాల్ ప్రక్కనే విక్రం సారాభాయ్ స్పేస్ సెంటర్ ఉంది. దాన్ని బోటులోంచే చూశాం. తిరిగి వచ్చి ప్రక్కనే ఉన్న పార్కు చూసి మళ్ళీ కారులో జూలో మమ్మల్ని వదిలేశారు. జూ అంతా నేను రాంబాబు మల్లికాంబగారు తిరిగి చూశాం. ప్రభావతి ఒకచోట కూర్చుని ఉంది. జూలోలో పెద్ద జంతువులేవీ లేవు. పాములు, నెమళ్ళు, జింకలు, జిరాఫీలు కనిపించాయి. ఎండి పడిపోయిన చెట్లను జంతు ముఖాలుగా చెక్కిన తీరు బాగుంది. ఫోటోలు తీశాం.

అక్కడి నుంచి బయటికి వచ్చి 'రాజా రవి వర్మ చిత్రశాల' చూశాం. జీవితం ధన్యమైనదనిపించింది. కళ్ళు చెమర్చాయి. రవివర్మ లేకపోతే మన పురాణ పురుషుల రూపాలేలా ఉండేవో మనకు తెలియదు కదా. ఆ పుణ్యం ఆయనదే. కొన్ని చిత్రాలను ఫోటోలు తీశాం. కారు వాడు వెళ్లి పోయాడు. మేము ఆటోలో నలభై రూపాయలిచ్చి చైత్రానికి చేరుకొన్నాం. అక్కడే వాళ్ళ రెస్టారంట్‌లో మసాలా దోసె తిని కాఫీ త్రాగాం. రూమ్ చేరి విశ్రాంతి తీసుకొన్నాం. మధ్యాహ్నం మూడింటికే లేచి తయారై ఆటోలో 'అత్తకాల్ అమ్మవారి' గుడికి వెళ్లాం. మూసి ఉంది. తిరిగి ఆటోలో రూమ్ చేరుకొన్నాం.





నాలుగున్నరకు మినీ వాన్‌లో హార్బర్ , బీచ్‌లకు ప్రయాణమయ్యాం. మేము నలుగురమే ఎవరూ లేరు. ముందుగా హార్బర్‌కు ఒక ముప్పావు గంట ప్రయాణం చేసి తీసుకొని వెళ్ళాడు. డీప్ వాటర్ ఫిషింగ్ ఇక్కడే జరుపుతారు. అది చూపించి ఇంకో అరగంటలో కోవలం




బీచ్‌కు తీసుకొని వెళ్ళాడు. అక్కడ సముద్రాన్ని తనివి తీరా చూసి ఆనందించాం. అక్కడ బాదం చెట్లు విపరీతం. ఎర్రగా పండిన పళ్ళు రాలివడి ఉన్నాయి. మా చిన్నతనంలో మేము చూసిన బాదంపళ్ళు కాయల్ని కొట్టి లోపలి పప్పు తిన్న అనుభూతి జ్ఞాపకానికి వచ్చాయి. ఆ కాలంలో బాదం ఆకులతో విస్తళ్ళు కుట్టి అందులోనే భోజనాలు చేసే వాళ్ళం.. ముచ్చటేసింది. సాయంత్రం ఆరింటికి మమ్మల్ని అత్తుకాల్ భగవతి అమ్మవారి గుడి దగ్గర దింపమన్నాం. అలానే చేశాడు. అమ్మవారు 'కన్నగి'కి ప్రేరణ కాళికా అమ్మవారు. మధురను కన్నగి శపిస్తే అక్కడి నుంచి ఇక్కడికి వచ్చింది. అత్తకాల్‌లో ఉంది కనుక ఆ పేరు. అది చూసుకొని ప్రసాదం తిన్నాం. చాలా దేదీప్యమానంగా ఉంది అమ్మ వారు.. తొమ్మిదవ తేదీ నుండి పది రోజులు ఉత్సవాలు ఏర్పాట్లు ముమ్మరంగా చేస్తున్నారు. ఆ రోజుల్లో నలభై లక్షల మంది సందర్శిస్తారు. నాలుగు కిలోమీటర్ల దూరం వరకు ప్రత్యేకమైన పొయ్యిల మీద పొంగళ్ళు వండి అమ్మవారికి నైవేద్యం పెడతారట. రాత్రి త్రివేంద్రంలో ఈస్ట్ ఫోర్ట్ రోడ్‌లో ఒక చేనేత వస్త్రాలయానికి వెళ్ళి నేను కేరళ పంచె, మా ఒదినకు చీర,





రాంబాబువాళ్ళ అమ్మకు చీరలు ప్రభావతి రెండు చీరలు, మల్లికాంబగారు చీరలు కొని రూమ్‌కు ఆటోలో చేరుకొన్నాం.

ఏడవ తేదీ శుక్రవారం. తెల్లవారు ఝామున మూడుంబావుకే పద్మనాభ దేవాలయం తెరుస్తారు. అప్పటికే మేము లేచి అన్నీ పూర్తి చేసుకొని నా సంధ్యా, పూజా, పారాయణ అయిన తర్వాతా మూడు ముప్పావుకు గుడికి చేరుకొన్నాం. స్వామి అభిషేకం కనులారా చూశాం. అమ్మవారినీ దర్శించి, కాఫీ తాగి చైత్రానికి చేరాం. కాసేపు విశ్రాంతి తీసుకొని తొమ్మిదింటికి రూములు ఖాళీ చేసి దగ్గరే ఉన్న రైల్వే స్టేషనుకు సామాన్లను మేమే తీసుకొని వెళ్లాం. తొమ్మిదింబావుకు 1638 కన్యాకుమారి ఎక్స్‌ప్రెస్. అందులో S-4లో 33,34,35,36, సీట్లలో కూర్చున్నాం. అది కన్యాకుమారికి మధ్యాహ్నం పన్నెండుకు చేరింది. మిగిలిన విషయాలు మరోసారి. ఇలా మాకు 'చైత్రంలో మాఘం' గడిచింది.

## 1) తిరువనంతపురంలో
## అనంత పద్మనాభ స్వామి

కేరళ రాష్ట్రంలో తిరువనంతపురంఅనే త్రివేంద్రంలో శ్రీ అనంత పద్మనాభ స్వామి కొలువై ఉన్నాడు. ఆయన దర్శనం త్రిమూర్త్యాత్మక దర్శనమే. మేము 'రథ సప్తమి' రోజున పద్మనాభుడిని దర్శించి తరించాం. ఆ రోజు మేము ఉయ్యూరు నుండి తెచ్చుకొన్న జిల్లేడు ఆకులను శిరసు మీద, ఒంటిమీద పెట్టుకొని మంత్రపూతంగా పవిత్ర స్నానం చేసి, ఆలయానికి వెళ్లి స్వామిని దర్శించటం మా పూర్వజన్మ సుకృతంగా భావిస్తున్నాము. అనంతపద్ముని ఆలయ విశేషాలు వివరిస్తాను.



### పద్మనాభుడే చక్రవర్తి – రాజు పద్మనాభ దాసుడు మాత్రమే

ఒకప్పుడు తిరువనంత పురం 'ఎట్టు వీటి పిళ్ళై' అధీనంలో ఉండేది. తరువాత రాజా మార్తాండ వర్మ, పిళ్లైను



జయించి ఈ భాగాన్ని స్వాధీన పరచుకొన్నాడు. మార్తాండ వర్మ మహారాజే ఈ ఆలయ నిర్మాత. తనను, తన రాజ్య సర్వస్వాన్ని ఆయన పద్మనాభ స్వామికి స్వాధీన పరచి 'పద్మ నాభ దాసుడు'గా ఉండి పోయాడు. తన తర్వాతి రాజులు కూడా పద్మనాభ దాసులుగా ఉండాలని తీర్మానించాడు స్వామి సమక్షంలో. కనుక అప్పటి నుండి రాష్ట్రానికి చక్రవర్తి 'అనంత పద్మనాభ స్వామి'యే. ఆయన శంఖమే రాష్ట్ర చిహ్నం. ''జూ' దగ్గర పెద్ద శంఖం మనం చూడవచ్చు. మార్తాండ వర్మ వంశీకులు అందరూ వర్మ లాగానే ప్రవర్తించారు. బ్రిటిష్ ప్రభుత్వం కూడా స్వామికి '21gun salute'ను సభక్తికంగా సమర్పించేది. ఇందిరాగాంధి చేసిన రాజ భరణాల రద్దుతో ఇప్పుడు ప్రభుత్వ పరం అయింది ఆలయం. అయినా ఆ వంశీకులదే ప్రథమ పూజ. ఆలయంలో పద్మనాభుడితో బాటు శ్రీ నరసింహస్వామి, శ్రీ కృష్ణుడు గరుడ వాహనం మీద అరేబియా సముద్రంలోని శంఖు ముఖం బీచ్ వరకు ఊరేగుతారు. పది రోజుల ఉత్సవాలు నిర్వహిస్తారు. వాటిని 'ఆరాట్టు ఉత్సవాలు' అంటారు. ఆ పది రోజులూ పబ్లిక్ సెలవులే. విమానాలు కూడా ఎగరవు అంత పకడ్బందీగా ఉంటుంది. స్వాతి తిరుణాల్ వంశజుడైన శ్రీ రామ కుమార వర్మ ఇప్పుడు ఇక్కడ స్వాతి ఉత్సవాలను నిర్వాహిస్తారు. ఆయన గొప్ప సంగీత విద్వాంసుడు. శ్రీ వేంకటేశ్వర భక్తి ఛానెల్‌లో విద్యార్థులకు సంగీతం నేర్పుతూ సాయంత్రం పూట కనిపిస్తారు.

Padmanabha Swamy temple at midday

## పద్మనాభ విగ్రహం

పద్మనాభ స్వామి విగ్రహానికి ''సాదు సరక్కర' అనే ఆయుర్వేద మిశ్రమంతో పూత పూస్తారు. అనంతునిపై శయనించే భంగిమలో పద్మ నాభుడు దర్శనం ఇస్తాడు. శిరస్సు దక్షిణానికి, చూపు మాత్రం తూర్పుకు ఉంటుంది. ఆదిశేషుడు తల పైకెత్తి స్వామి బొద్దులోంచి పైకి వచ్చిఎడమ చేతిలోని పద్మ సౌరభాన్ని ఆఘ్రాణి స్తున్నట్లు కనిపిస్తాడు. స్వామి కుడి చేయి కిందకు ఉండి శివలింగం శిరసుపైన ఆనించిన ట్లుంటుంది. బొడ్డులోని పద్మంలో బ్రహ్మ దేవుడు కనిపిస్తాడు. బ్రహ్మ ప్రక్కనే శ్రీదేవి భూదేవి నిలబడి ఉంటారు.. 1,008 సాలగ్రామలతో చేసిన మాల పద్మనాభుని ఛాతీపై ప్రకాశిస్తూ ఉంటుంది. ఈ సాలగ్రామాలను నేపాల్‌లోని గండకి నది నుండి తెప్పించి

అతికించారు. అతకతానికి 'కటు సర్కర యోగం' అనే ప్రత్యేక ఆయుర్వేద మిశ్రమాన్ని ఉపయోగించారు. ఇలా చేయటం వలన క్రిమి కీటకాలు దరికి చేరవట. స్వామికి అభిషేకం చేయక పోవటం ఇక్కడి ప్రత్యేకత. ప్రత్యేక మూర్తికే అభిషేకం నిర్వహిస్తారు. స్వామికి పుష్పమాలను మాత్రమే సమర్పిస్తారు. మా శ్రీమతి ప్రభావతి ఉయ్యూరు నుండి మాల అల్లుకొని వచ్చి స్వామికి సభక్తికంగా సమర్పించి ధన్యురాలైంది. అలానే గురవాయూర్ కృష్ణస్వామికి , చిదంబర నటరాజుకూ ఉయ్యూరు నుండే మాలలు అల్లి తీసుకొచ్చి సమర్పించింది. పూలను 'నెమలి ఈకలతోనే' ఊడ్చి తొలగించి శుభ్రం చేస్తారు ఆలయాన్ని. అదొక ప్రత్యేకత.



## మూడు ద్వారాలలో దర్శనం

స్వామి గర్భగృహం ఒకే రాతితో నిర్మించారు. అందుకే దీనిని 'ఒత్తక్కార్ మండపం' అంటారు. పద్మనాభ స్వామిని మూడు ద్వారాల ద్వారా దర్శించాలి. అదొక ప్రత్యేకత. మొదటి ద్వారం నుండి చూస్తే పద్మనాభుని ముఖము కుడిచేతి కింద ఉన్న శివలింగం కనిపిస్తాయి. రెండవ ద్వారం నుండి చూస్తే బ్రహ్మదేవుడు ఉత్సవమూర్తి, శ్రీ దేవి భూదేవి దర్శనమిస్తారు. మూడవ ద్వారం నుండి చూస్తే స్వామి పాదాలు మాత్రమే దర్శనమిస్తాయి. మొదటి ద్వారం ద్వారా శివుడిని రెండవ ద్వారం ద్వారా బ్రహ్మను మూడవ ద్వారం ద్వారా శ్రీ మహా విష్ణువు పాదాలను దర్శిస్తాము అన్నమాట. అంటే త్రిమూర్తుల దర్శనం అనంత పద్మనాభుడు కలిగిస్తున్నాడు. ఈ మూడు రూపాలు దర్శిస్తే కైవల్య ప్రాప్తి లభిస్తుందని సంపూర్ణ విశ్వాసం.

ఇలా దర్శించటానికి ఒక కథ ఉంది. పూర్వం బిల్వ మంగళ మహర్షి (దివాకర ముని) శ్రీ కృష్ణుని దర్శనం కోసం ప్రార్ధించాడు. ఆయన బాల కృష్ణుడుగా దర్శనమిచ్చాడు. ముని పూజామందిరంలో ఉన్న సాలగ్రామాన్ని చిలిపి బాలకృష్ణుడు అమాంతం మింగేశాడు. మునికి కోపం వచ్చి దండించటానికి దండంతో వెంబడిస్తే బాలకృష్ణ పారిపోయాడు. వెంబడించాడు మునిఅరణ్యంలో ఒక చెట్టు వెనక దాక్కున్నాడు కొంటె కిష్టయ్య. ముని అక్కడికి చేరేసరికి ఆ మహావృక్షం నేల వాలిపోయి అందులోంచి అనంత





శయన మహావిష్ణువుగా అతి భారీ విగ్రహ మేర్పడింది. బిల్వ మంగళుడు చూసి ఇంత భారీ విగ్రహాన్ని తాను ప్రదక్షిణం చేసి అర్చించలేనని చెప్పాడు. తన యోగ దండానికి మూడు రెట్లు మాత్రమే పొడవు ఉండేట్లుగా మారి పొమ్మని ప్రార్థించాడు. భక్త సులభుడైన స్వామి అనుగ్రహించి అలానే సైజు తగ్గించుకొన్నాడు. అదే ఇప్పుడు మనం ఆలయంలో దర్శించే మూర్తి. స్వామి తనను మూడు ద్వారాల ద్వారా దర్శించాలని అప్పుడే ముక్తి లభిస్తుందని తెలియజేశాడు. అప్పటి నుండి మూడు ద్వారాల ద్వారా దర్శనం అనుగ్రహిస్తున్నాడు. మూడు ద్వారాలు వెండితో చేయబడి ప్రక్క ప్రక్కనే ఉంటాయి.

## అనంత పద్మనాభుని ప్రత్యేకత

108 వైష్ణవ దివ్య క్షేత్రాలలో స్వామి పడుకొని కాని కూర్చుని కాని నుంచొని కాని ఉంటే ఇక్కడ అనంత పద్మనాభుడు మూడు రకాలుగా దర్శనం ఇవ్వటం మరో విశేషం. గర్భ గుడిలో పడుకున్న భంగిమలోను మధ్య ద్వారంలో నిలుచున్న భంగిమలో, ఉత్సవమూర్తి కూర్చుని ఉన్నట్లు దర్శనమివ్వటమే ఆ విశేషం. గర్భ గుడిలోకి వెళ్లి వంగి నమస్కారం చేసే అర్హత ఒక్క తిరువాన్కూర్ మహారాజుకే ఉంటుంది. గర్భ గుడిలో వదిలి పెట్టిన ఏ వస్తువైనా అనంతునికే చెందుతుంది. రాజును 'పద్మనాభ దాసు' అనే అంటారు. విష్ణువే ఈ రాజ్యపాలకుడు అని ముందే చెప్పుకొన్నాం. క్షేత్రపాలకులు గరుడుడు విష్వక్సేనుడూ.. అనంత పద్మనాభుని ముఖం చాతీ తప్ప అంతా బంగారు మయమే అని ఇటీవలే కనుగొన్నారట. ముస్లిం పాలకుల దండ యాత్రల భయంతో 'కటు సర్కర ఆయుర్వేద యోగం' కలిగించి బంగారం కనపడకుండా చేశారు. శిరసున ఉండే కిరీటంలో చెవులకు కుండలాలు ఉంటాయి. ఎడమ చేతిలో కమలం, శివుడు కూడా బంగారు మయమే.



## నైవేద్యమూ ప్రత్యేకమే

ఏడు పరశురామ క్షేత్రాలలో తిరువనంతపురం ఒకటి. స్వామికి నైవేద్యంగా పాయసం పెడతారు.



తులాపాయసం, పరవాన్నం, పాల్ మంగ, ఒట్ట తులా పాయసం, పంత రానుకాల పాయసం, పాల పాయసం ముఖ్య నైవేద్యాలు. వీటన్నిటికంటే ప్రత్యేక నైవేద్యం ఒకటి ఉంది. దాన్ని 'ఉప్పు మంగ' అంటారు. అంటే ఉప్పు నీటిలో పచ్చి మామిడి కాయను నాన వేసినది అని అర్ధం. దీన్ని నైవేద్యం పెట్టటానికి బంగారు పూత పూసిన ఎండుకొబ్బరి చిప్పలో పెట్టి నివేదన చేస్తారు. దీనికి 'చిరట్ట' అని పేరు. ఈ చిప్ప 1200 ఏళ్ళ నుండీ ఉందట. ఇదీ విశేషమే. ప్రక్కనే ఉన్న నరసింహ స్వామికి పానకం, అప్పాలు, ఉండ్రాళ్ళు, అవల్ నైవేద్యం పెడతారు.



### ఉత్సవాలకూ ప్రత్యేకతే

అక్టోబర్-నవంబర్ నెలలలో 'అల్పషి ఉత్సవం', మార్చి-ఏప్రిల్‌లో 'పైన్ కుని ఉత్సవాలను' పదిరోజులపాటు పరమ వైభవంగా నిర్వహిస్తారు. అంటే ఏడాదికి రెండుసార్లు ఘనంగా ఉత్సవాలు చేస్తారు. నవరాత్రి ఉత్సవాన్నీ ఘనంగా చేస్తారు. సరస్వతి దుర్గ కుమారస్వామి విగ్రహాలను 'కుటీర మాలిక'కు తీసుకొని వస్తారు. ఆ తర్వాత పెద్ద ఊరేగింపు నిర్వహిస్తారు. తొమ్మిది రోజులు 'మహా భక్త కవి రాజు స్వాతి తిరుణాల్' సంగీతోత్సవాన్ని అద్భుతంగా జరుపుతారు. స్వాతి తిరుణాల్ త్యాగరాజ స్వామి సమకాలికుడు. సంగీతత్రయం త్యాగరాజు ముత్తుస్వామి దీక్షితులు శ్యామ శాస్త్రి. స్వాతి తిరుణాల్‌తో కలిసి సంగీత చతుష్టయం అవుతారు. త్యాగరాజ స్వామిని తన తిరువాన్కూర్ ఆస్థానానికి పిలిపించి సన్మానించాలని చాలాసార్లు భక్తి పూర్వాకంగా కబురు చేశాడు. ఆహ్వానించాడు. కాని త్యాగయ్య రాలేదు. చివరిసారి ఆహ్వానం పంపితే 'మనిద్దరం కలుసుకొనేది అక్కడే. పై లోకంలోనే' అని మర్యాదగా రాసి పంపారట. అలాగే ఇద్దరూ పెద్దగా వ్యవధి లేకుండానే మరణించారు. అమర లోకంలో ఇద్దరూ కలుసుకొన్నారని భావించారందరూ. ఆరేళ్ళ కొకసారి జనవరి 14న లక్ష దీపోత్సవం చేస్తారు. అప్పుడు 56 రోజులపాటు మూడు వేదాలను పారాయణ చేస్తారు.

అనంత పద్మనాభుని ఆలయ గోపురాన్ని 1566లో నిర్మించారు. 100 అడుగుల



ఎత్తు 7 అంతస్తులతో ఉంటుంది. ఆలయం ప్రక్కనే పుష్కరిణి ఉంది. దీనికే 'పద్మనాభ తీర్థం' అని పేరు. ఆలయంలో 365 పెద్ద గ్రానైట్ స్తంభాలున్నాయి. ఆలయం ముందు 80 అడుగుల ఎత్తైన ధ్వజస్తంభం ఉంది. గోపురం కింది భాగాన్ని 'నాటక శాల' అంటారు. ఆలయ ఉత్సవాల రోజుల్లో ఇక్కడే కేరళ సంప్రదాయ నృత్యమైన 'కథాకేళి' నృత్య ప్రదర్శన నిర్వహిస్తారు.

సంప్రదాయాన్ని కేరళీయులు బాగా పాటిస్తారు. ఏ ఆలయంలో చూసినా ఏనుగులు కనిపిస్తాయి.ఆడవాళ్ళూ మగవాళ్ళు కూడా బంగారు రంగు వెడల్పు అంచు తెల్లచీరలు, పంచలు కడతారు. చూడ ముచ్చటగా ఉంటుంది. మన దేవాలయాలు లాగా ఇక్కడి ఆలయాలు ఉండవు. అన్నీ కొయ్య, పెంకుల కప్పుతో ఉండి మన పూర్వపు వసారా ఇల్లులాగా ఉంటాయి. ఎంత పెద్ద బిల్డింగ్ మీదనైనా చివర యెర్ర పెంకులుండాల్సిందే. స్వాగత ద్వారాలు అదే సంప్రదాయంలో ఉంటాయి. అక్కడ కనిపించిన పూజారులను, అధికారుల భక్తులను 'నేల మాళిగ'ల గురించి అడిగాను. ఎవ్వరూ చెప్పలేదు. అడగరాదు. చెప్పరాదు అన్నట్లు, 'ఆ ఒక్కటీ అడక్కు' అన్నట్లు వారు ముఖాలు పెట్టారు చిరునవ్వు నవ్వుతూ.



## అత్తుకాల్ భగవతి ఆలయం

కేరళలో తిరువనంతపురానికి మూడు కిలో మీటర్ల దూరంలో అత్తుకాల్ అనే చోట ఉన్న దేవతనే అత్తుకాల్ భగవతి అమ్మవారు అంటారు. కాళికాదేవి అంశ, మధుర మీనాక్షీ దేవి స్వరూపం ఉన్న దేవి. కన్నగి అనే అమ్మాయిని కోవలం అనే ధనికుడికి ఇచ్చి వివాహం చేశారు. అతను వేశ్యాలోలుడై భార్యను మరిచిపోయాడు. ఉన్నది అంతా క్షవరం అయి చివరికి తిండిలేక భార్య కన్నగి దగ్గరకు చేరాడు. ఆమె దగ్గర కూడా ఒక్క కాలి బంగారు అందెలు తప్ప అమ్ముకొని తినటానికి ఏమీ లేదు. మధుర వెళ్లి అమ్ముదామని ఇద్దరూ మధుర రాజ్యానికి చేరారు. ఒక అందె ఇచ్చి

మధుర రాజుకు అమ్మమని కన్నగి భర్తను పంపింది. అతడు వెళ్లి అమ్మే ప్రయత్నం చేయగా అది రాణి గారి నగ అని దొంగిలించాడని కోవలంను ఖైదులో పెట్టించాడు రాజు.. ఈ విషయం కన్నగికి తెలిసి రాజును రాణిని కలిసింది. తన దగ్గర ఉన్న రెండవ అందెను రాజుకిచ్చి రాణీ గారి అందెనూ తెప్పించమని కోరింది. తన అందెను పగలకొడితే అందులో వజ్రాలు బయట పడ్డాయి. రాణిగారి నగను పగల కొడితే అందులోంచి ముత్యాలు బయట పడ్డాయి. రాణి చెప్పింది అబద్ధం అని తేలింది. రాణి మోసం చేసి తన భర్తను ఖైదు చేయించిందని కన్నగి మధుర రాజు రాణీలను నగరాన్ని శపించింది. కన్నగి ముక్తి పొందగా, ఆ నగర దేవత దర్శనమిచ్చింది.. స్వంత ఊరు కొడుంగల్ వెడుతుంటే అక్కడ అట్టుకల్ నది దాటింది. అక్కడ ఒక ముసలాయన నదిని దాటలేక ఇబ్బంది పడుతుంటే చిన్న పిల్లగా మారి ఆయన చేయి పట్టుకొని నది దాటించి వాళ్ళ ఇంటి దగ్గర దిగబెట్టి అదృశ్యమైంది. ఆ రాత్రి ఆ ముసలాయన కలలో కన్పించి తనకు ఒక ఆలయాన్ని నిర్మించమని కోరింది. మూడు బంగారు గీతలు కనిపించిన తోటలో ఆలయాన్ని కట్టమని ఆదేశించింది. అలా వెలసిన ఆలయమే ఈ దేవాలయం..

కుంభమేళా నాడు లక్షలాది భక్తులు సందర్శించి అమ్మవారికి పొంగళ్ళు నైవేద్యం వండి పెడతారు. ఎటు చూసినా అయిదు కిలోమీటర్ల దూరంలో పొయ్యిల మీద పొంగళ్ళు వండి నైవేద్యం పెట్టేవారే కనిపించి ఆశ్చర్యపరుస్తారు. ఇది గిన్నీస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌లోకి ఎక్కింది. అంతటి ప్రాధాన్యత ఉంది ఈ ఆలయానికి. అమ్మవారికి శాస్త్రోక్తంగా పూజాదికాలు బ్రాహ్మణులు నిర్వహిస్తారు. చాలా మహిమాన్వితమైన అమ్మ వారుగా ప్రసిద్ధి. సాయంత్రం అర్చన చేసి హారతి ఇస్తూంటే కన్నుల పండువగా మహా వైభవం ఆ మధుర మీనాక్షీ దేవిని చూస్తున్నంత దివ్య విభూతిగా ఉంటుంది. ఫిబ్రవరి తొమ్మిది నుండి పదిహేను రోజులపాటు ఉత్సవాలు జరుగుతాయి. మేము వెళ్ళేనాటికే ఏర్పాట్లు ముమ్మరంగా జరుగుతున్నాయి. విశాలమైన ప్రాంగణం. కళా భవనం ఆరు బయట పొంగళ్ళకు ఏర్పాట్లు కనిపించాయి.

నాల్గు భుజాలతో, చేతులలో ఆయుధాలతో అమ్మవారు దర్శనమిస్తుంది. విగ్రహాన్ని బదరీనాథ్ నుంచి వచ్చిన పురోహితుడి ఆధ్వర్యంలో ప్రతిష్ఠించారు. ఈ ఆలయాన్ని 'మహిళా శబరిమల దేవాలయం' అని కూడా అంటారు. కన్నగి మధురను శపించి ఇక్కడ దేవతగా వేలిసిందని చరిత్ర. ఆమె సాక్షాత్తు పార్వతీదేవి అవతారంగా భావిస్తారు. తమిళ సంగం సాహిత్యంలో కన్నగి కథకు విశేష ప్రాముఖ్యం ఉంది. కేరళకు చెందిన విద్యాధర చట్టంగి స్వామి ఆలయాన్ని గుర్తించి పునర్ వైభవానికి కారకుడయ్యాడు. ఆలయ శిల్పకళ ముగ్ధుల్ని చేస్తుంది. కేరళ, తమిళ కళా మిశ్రమ శిల్పకళ ఉంటుందిక్కడ. ఆలయంలో మహిషాసురమర్దిని, రాజరాజేశ్వరి, పార్వతిదేవి

విగ్రహాలు కనుల విందు చేస్తాయి. గోపురం మీద దశావతార చిత్రాలు కన్నగి జీవిత చరిత్ర శిల్పాలు ఆకర్షణీయంగా ఉంటాయి. దక్షయజ్ఞ శిల్పాలూ ఉన్నాయి. గర్భాలయంలో రెండు అమ్మ వారి విగ్రహాలుంటాయి. అందమైన విగ్రహం సకల ఆభరణ సుసోభితమై ఉన్న మనోజ్ఞ సుందరమూర్తి ఒకటి. ఈ అమ్మవారి వెనుక ఇంకొక విగ్రహం అమ్మ వారిది ఉంటుంది. గణేశుని శిల్పాలూ ఉన్నాయి. ఒకవైపు భగవతి చిత్రం రెండవ వైపు శ్రీ చక్రం ఉన్న బంగారు నాణాలు ఇక్కడ ప్రత్యేకత. వీటిని కొని భద్రంగా దాచుకొంటాడు భక్తులు భక్తిగా.



## అనంతపద్మనాభుడి నుండి అరుణాచలేశ్వరుని దాకా-2

### కన్యాకుమారి ట్రిప్

కన్యా కుమారి ఎక్స్‌ప్రెస్ ఫిబ్రవరి ఏడవ తేదీ శుక్రవారం ఉదయం తొమ్మిది న్నరకు త్రివేంద్రం నుండి బయల్దేరి మధ్యాహ్నం పన్నెండుకు కన్యాకుమారి స్టేషన్ చేరింది. అంతకు ముందే చంద్రశేఖర్ మాకు అక్కడి నుండి తన బి.ఎస్.యెన్ ఎల్.ఆఫీసులో అక్కడ పని చేస్తున్న మణికంఠ రాజన్ అనే స్వంత టాక్సీ డ్రైవర్‌ను ఏర్పాటు చేశాడు. అతను స్టేషన్‌కు వచ్చాడు. సామాన్లను కారులో పెట్టి మమ్మల్ని శరవణభవ హోటల్‌కు తీసుకువెళ్ళాడు. అక్కడ నేను మా ఆవిడా రాం బాబూ భోజనం చేశాం. పొద్దుటి నుండి నాకెందుకో కొంచెం వామిటింగ్ సెన్సేషన్ ఉంది. తినబుద్ధి కాకపోయినా ఏదో కతికాను. మల్లికగారు ఇడ్లీ తిన్నారు. అక్కడి నుంచి సముద్రం దగ్గరకు తీసుకు వెళ్ళాడు. సామాను కారులోనే ఉంచి వివేకానంద రాక్ మెమోరియల్‌కు టికెట్లు తీసుకొన్నాం.

మనిషికి ముప్ఫై రూపాయలు రాను పోను. ఎక్కిన తర్వాతా లైఫ్ సేవింగ్ జాకెట్స్ వేసుకొన్నాం. ఎక్కడ బోట్ ఎక్కినా ఈ తతంగం తప్పదు. బాక్ వాటర్ డ్రైవ్‌లోనూ త్రివేంద్రంలో ఇలాగే చేశాం. పది నిమిషాల్లో మెమోరియల్ చేరాం. అరేబియా సముద్రం బంగాళా ఖాతం సముద్రాలూ ఇక్కడ కలిసి ఉండి నీలం, రంగులోను, కొంచెం తెల్లగా స్పష్టంగా కానిపిస్తాయి. బోట్లోంచి బయటకు వచ్చి మెమోరియల్

చూశాం. మల్లికగారు రాంబాబూ తిరిగి చూసి వచ్చారు. మేము ఇదివరకు ఒకారి చూశాం కనుక వెళ్ళలేదు. రాంబాబుకు ఇది మొదటిసారి. మల్లికగారు ఒకసారి చూశారు. అక్కడి నుండి మళ్ళీ బోట్లో తిరువల్లువార్ విగ్రహం. అపూర్వంగా ఉంటుంది. ఇందుకు కరుణానిధిని అభినందించాలి. తమిళ తొలి కవికి ఇచ్చిన అరుదైన గౌరవం. మన రాష్ట్ర ప్రభుత్వం ఏ కవికీ ఇలాంటి గౌరవం కల్పించక పోవటం దురదృష్టం. తిరువల్లువార్ సూక్తులను 'తిరుక్కురళ్' నుంచి ఏరి తమిళనాడు బస్సుల్లో రాయించి మరీ ప్రాచుర్యం కల్పిస్తున్నారు. స్తూపం చేరాం. చాలా భారీ విగ్రహం. తమిళనాడు ప్రభుత్వం కరుణానిధి ఆధ్వర్యంలో ఏర్పాటు చేశాడు.

అక్కడి నుండి మేము కారులో గాంధీ స్తూపం చేరాం. గాంధీగారి అస్థికలను ఇక్కడ ఉంచి సముద్రంలో కలిపారు. మంచి స్మారక భవనమే కట్టారు. లోపల రాట్నం వడికే ఏర్పాట్లున్న రెండస్తుల భవనం ఇది. ఇక్కడే సునామీ మెమోరియల్ కూడా ఉంది. ఆది శంకరాచార్యుల గుడి కూడా ఉంది. అక్కడ నుంచి నడిచి సముద్రం వెంట కన్యాకుమారి అమ్మవారి దర్శనం చేశాం. నాలుగింటికి దర్శనం. పైన చొక్కా లేకుండా దర్శించాలి. అలానే చేశాం. శుక్రవారం అమ్మవారి దర్శనం పరమ పవిత్రం కుమరి ఆలయం Mahatma Gandhi Mandapam బాణాసురుడిని సంహరించిన అమ్మవారి కుమరి ఆలయం చూడదగ్గ మరో పర్యాటక ప్రదేశం. మూడువైపులా ఎత్తైన గోడలున్న ఈ ఆలయంలో మూడు ప్రాకారాలున్నాయి. ఆలయంలోని ముగ్ధ మోహనదేవి విగ్రహం భక్తులను పరవశింపజేసేలా ఉంటుంది. ఒకప్పుడు దేవి ముక్కెరలోని రత్నపు కాంతి నావికులను ఆకర్షించి నావలు రేవులోని బండరాళ్లను ఢీ కొనేవని చెబుతుంటారు. బంగాళాఖాతానికి అభిముఖంగా ఉండే ఈ ఆలయ ద్వారాన్ని ఎల్లప్పుడూ మూసే ఉంచుతారు. సంవత్సరంలో ఓ నాలుగైదుసార్లు మాత్రమే ఉత్సవాల సందర్భంగా తెరుస్తారు.

## ఆలయ చరిత్ర

పురాణ కథనాల ప్రకారం కుమరి ఆలయంలో దేవతగా కొలువబడుతున్న కన్యాదేవి, పరమశివుడిని వివాహం చేసుకునేందుకు సిద్ధపడిందట. అయితే ముహూర్తం సమయానికి కూడా శివుడు రాకపోవటంతో విందుకు సిద్ధంచేసి పెట్టుకున్న బియ్యం రాశులను, మిగిలిన వస్తువులను అలాగే ఉంచేశారట. కాలక్రమంలో అవే చిన్న చిన్న రాళ్లుగా, బండలుగా మారిపోయాయని స్థానికుల నమ్మకం. అందుకే ఇప్పటికీ కన్యాకుమారి సముద్రం ఒడ్డున బియ్యాన్ని పోలిన సన్నటి రాళ్లు కనిపిస్తుంటాయని చెబుతుంటారు.

ఈ ఆలయ ప్రధాన ద్వారం అనగా తూర్పు వైపున వున్న మహాద్వారాన్ని

మూసి వుంచడానికి ఒక కథను చెప్తారు. అదేమంటే.... గతంతలో తూర్పు వైపున వున్న మహాద్వారం ద్వారానే భక్తులకు ప్రవేశం వుడేది. అనగా బంగాళాఖాత సముద్రానికి ఎదురుగా ... ఆలయంలోని అమ్మవారి ముక్కుపుడక నుండి వెలువడే కాంతి సముద్రంలో సుధూరంలో వున్న ఓడలకు చేరి... ఇది సురక్షితమైన రేవుగా భావించి నావికులు ఆ వెలుగు ఆధారంగా తీరానికి రావడానికి ప్రయత్నించి .... సముద్రంలో అక్కడున్న నల్ల రాతి గుట్టలకు ఢీకొని ప్రమాదాలకు గురయ్యేవని..... దానివలన తూర్పు ద్వారం మూసివేశారని అంటుంటారు. సంవత్సరంలో కేవలం నాలుగు రోజులు అదీ మహోత్సవాల సందర్భంలో మాత్రమే తూర్పు వాకిలి తెరుస్తారు. మిగతా రోజులలో ఉత్తర దిక్కున వున్న ద్వారం ద్వారానే భక్తులకు ప్రవేశం. సూర్యాస్తమయాన్ని చూడాలని కాచుకు కూచున్నాం. సరిగ్గా సాయంత్రం ఆరు గంటల ఇరవై నిమిషాలకు సూర్యాస్తమయాన్ని కళ్ళు ఆర్పకుండా తనివితీరా చూశాం. ఇక్కడే హిందూ మహాసముద్రం బంగాళా ఖాతం అరేబియా సముద్రం మూడు సముద్రాలు కలుస్తాయి. 'త్రి సాగర సంగమం' అన్నమాట. పూర్వం వచ్చినప్పుడు సూర్యోదయాన్ని మబ్బులు కమ్మటం వలన చూడలేక నిరాశ చెందాం. ఇవాళ ఆ అదృష్టం మాకు కలిగింది. అంతకు ముందు అరగంట క్రితం నేను ఒక్కడినే అక్కడ తిరుగుతూంటే పెద్ద వాంతి అయి తిన్నది సగం వెళ్లిపోయింది. వాటర్ బాటిల్ కొని నోరు కడుక్కున్నాను. వీళ్ళకు చెబితే కంగారు పడుతారని చెప్పలేదు. ఇంకో పది నిమిషాలకు అస్తమయం అవుతుందనగా మళ్ళీ వీళ్ళ ఎదుటే పెద్ద వాంతి అయి అంతా ఖాళీ అయింది. అప్పుడు వీళ్ళు చూసి కంగారు పడ్డారు. నేను నిబ్బరంగానే ఉన్నాను. నోరు కడుక్కుని అస్తమయ సూర్యుడిని చూస్తూ ఫోటోలు తీస్తూనే ఉన్నాను.

## సుచీన్ద్రం

కన్యాకుమారిలో పావుతక్కువ ఏడుకు బయల్దేరి పన్నెండు కిలోమీటర్లదూరంలో ఉన్న సుచీన్ద్రానికి తీసుకెళ్ళాడు రాజన్. అక్కడ గుడి మూసే సమయం అవుతోంది. కంగారుగా లోపలివెళ్లి త్రిమూర్త్యాత్మక శివుడిని దర్శించాం. అక్కడ నాకు వామిటింగ్ ఆవబోతే బలవంతంగా ఆపుకోన్నాను. అక్కడే ఉన్న భారీ ఆంజనేయస్వామి విగ్రహాన్ని సందర్శించాం. ఈ ప్రదేశంలోనే ఇంద్రుడు తనకు ఒళ్లంతా ఉన్న కళ్ళను శివుడిని అర్చించి పోగుట్టుకొన్నాడు. ఇంద్రుడు శుచి అయిన ప్రదేశం కనుక సుచీన్ద్రం అయింది. ఇక్కడే అనసూయాదేవి త్రిమూర్తులను పసిపాపాలను చేసి ఆడించింది. మేము ఇదివరకు చూసినదే. ఇక్కడి సరస్సు చాలా పెద్దది. శుచీంద్రం ఆలయం వాస్తుశిల్పాలకు నెలవైన అద్భుత కళాఖండం. 134 అడుగుల గోపురం, ముఖద్వారం వద్ద వాహనారూఢులైన లక్ష్మి, పార్వతి, సరస్వతి విగ్రహాలు దర్శనమిస్తాయి. చక్కగా నగిషీలు

చెక్కిన తలుపులు,24 అడుగుల ఎత్తు పైకప్పుతో నాటకశాల మొత్తం చూడడానికే ఒకరోజు కావాలనిపిస్తుంది.

ప్రధాన ఆలయం చుట్టూ వరుసగా వందల స్తంభాలుంటాయి. ప్రధాన ద్వారానికి సమీపంలో ఊంజల మంటపం విశాలంగా ఉంటుంది. దాని నాలుగు స్తంభాలకు మన్మధుడు, రతి, అర్జునుడు, కర్ణుడు ప్రతిమలుంటాయి. అక్కడి నుండి తూర్పువైపుకి తిరిగితే దక్షిణామూర్తి విగ్రహం ఉంటుంది. ముందుకు వెళ్తే వసంతమంటపంలో ప్రవేశిస్తాం. ఆశ్చర్యమేమిటంటే ఎక్కడా చూడని విధంగా నవగ్రహాల విగ్రహాలు మంటపం పైకప్పున ఉంటాయి. ఈ మంటపం మధ్యలో శుచీంద్రస్వామికి, అమ్మవారికి వసంతోత్సవం నిర్వహిస్తారట. ఈ మంటపానికి ఎదురుగా నీలకంఠ వినాయకస్వామి దర్శనమిస్తాడు. వినాయకుని దర్శించుకుని దక్షిణంవైపుగా వెళ్తే కంకాళనాథుడు ఉంటాడు. కంకాళనాథుడంటే పుర్రెలో భిక్షాటన చేసే శివుడు. కంకాళనాథుడిని దర్శించుకోవాలంటే కొన్ని మెట్లు ఎక్కాలి. ఈ ఆలయం చాలా ప్రాచీనమైనది. క్రీ.శ 5వ శతాబ్దంనాటి శాసనాలు ఈ ఆలయంలోని రాళ్లపై చెక్కి ఉన్నాయి. శాసనాలు బ్రాహ్మిలిపిలోనూ, తమిళంలోనూ ఉన్నాయి. ఆలయం నైరుతి దిశలో శ్రీసీతారామలక్ష్మణ విగ్రహాలు ముచ్చటగా కనిపిస్తాయి. ఆమూర్తులకెదురుగా ముకుళితహస్తాలతో ఆంజనేయస్వామి ఉంటాడు. 18 అడుగుల ఎత్తున ఈ విగ్రహం సుందరకాండలో సీతాదేవికి అశోకవనంలో చూపించిన విశ్వరూపానికి ప్రతిరూపగా ఉంటుంది. విదేశీయుల దాడుల నుండి కాపాడడానికి ఈ విగ్రహాన్ని భూమిలో పాతిపెట్టి, 70 సంవత్సరాల క్రితం బయటకు తీశారని ఆలయ నిర్వహకులు చెప్పారు. ఈ విగ్రహానికి వెనుకవైపు చిత్రసభలో ప్రవేశిస్తే మెట్లకు రెండువైపులా రెండు ఏనుగు ప్రతిమలు, గోడలకు శక్తి, గణపతి, బాలసుబ్రహ్మణ్యం ప్రతిమలు ఆకట్టుకుంటాయి. గర్భగుడిలోని అద్దంలో మనల్ని మనం చూసుకుంటాం. ఇది ఆత్మదర్శనానికి నిదర్శనం.

## సందేశమిచ్చే శిల్పం...

ఇక్కడి శిల్పాలలో తప్పక చూడాల్సిన శిల్పం ఒకటుంది. ఈ శిల్పంలో ఒక చెవిలో గడ్డిపోచపెట్టి ఇవతలి చెవిలో నుంచి తీసి పూజారి చూపించినప్పుడు ఆశ్చర్యపోతాం. మరల ఒక గడ్డిపోచను ఒక చెవిలో పెడితే అది లోపలికి వెళ్లిపోయింది. అంటే చెడ్డ మాటలు ఈ చెవితో విని ఆ చెవిలో నుండి వదిలివేయాలని మొదటిదానికిఅర్థం. మంచిమాటలు విని మనసులోనే నిలుపుకోవాలని రెండవ దానికి అర్థమని అక్కడివాళ్లు చెబుతుంటే మన శిల్పుల నేర్పుకు జోహార్లు చెప్పకుండా ఉండలేం. ధ్వజమంటపంలో రెండు ధ్వజస్తంభాలుంటాయి. ఒకటి స్థాణుమలయునకెదురుగా, రెండవది విష్ణుమూర్తికెదురుగా నిలిచి ఉంటాయి.

## శివుడు ఇలా స్థాణువయ్యాడట!

శుచీంద్రాలయానికి కన్యాకుమారికి సంబంధించిన పూర్వగాథ ఒకటి ఉంది. మహేశ్వరి కన్యాదేవతగా అవతరించినప్పుడు ఆమెను వివాహమాడాలని శివుడు శుచీంద్రానికి వచ్చాడు. బాణాసురుని సంహరించడానికి కన్యారూపందాల్చిన పరమేశ్వరి వివాహం చేసుకుంటే రాక్షస సంహారం జరగదని భావించిన దేవతలు పెళ్లి చెడగొట్టమని నారదుని పంపించారు. ఎందుకంటే బాణాసురుడు కన్యచేతిలో తప్ప మరేవిధంగా మరణం లేకుండా వరం పొంది ఉన్నాడు. పరమేశ్వరిని ప్రార్థించి శివుని ఒక కోరిక కోరమన్నాడు నారదుడు. కన్నులులేని టెంకాయ, గణుపులులేని చెఱకుగడ, నరాలులేని తమలపాకులు సూర్యోదయానికి ముందే తెమ్మని శివునికి చెప్పమన్నారు. పరమేశ్వరి అలాగే కోరింది. శివుడు అవి తీసుకుని శుచీంద్రం నుండి బయలుదేరే సమయంలో నారదుడు కోడి రూపంలో కూత వేశాడు. అది విని శివుడు శుచీంద్రంలోనే స్తంభించి స్థాణుమూర్తిగా నిలిచిపోయాడు. శుచీంద్రానికి ప్రతిరోజూ అరమ్వలర్తళ్ అనే భక్తురాలు ప్రతిరోజూ వచ్చి స్వామిని భక్తి శ్రద్ధలతో దర్శించేది. ఆమె వెల్లాల కులానికి చెందినది. స్వామి ఆమె భక్తికి మెచ్చి పత్నిగా స్వీకరించాడట. అప్పుడు ఆలయంలో అరమ్వలర్తళమ్మ దేవత వెలసిందట. స్వామితో ఆమెకు ప్రతి సంవత్సరం కల్యాణం చేస్తారట. ఆ సమయంలో ఆమె వంశీయులు పెళ్లి కానుకలతో ఆలయానికి వస్తారు.

## ఆ పేరు ఇలా వచ్చిందట...

ఇదంతా చెప్పాల్సిన అవసరం ఎందుకంటే, ఇంద్రుడు తపస్సు చేశాడని చెప్పే కొండ 'మరుత్తమల' ఇక్కడే ఉంది. ఇంద్రుడు రథం నిలిపిన ప్రదేశం 'తేరూరు'. పూజకు ముందు ఇంద్రుడు స్నానం చేయాలనుకున్నాడు. ఐరావతం దంతాలతో తూర్పుకొండల నుండి జ్ఞాన వనం వరకు ఒక కాలువను తవ్వింది. ఏనుగు తవ్విన నది కావడంతో దీనిని దంత నది అంటారు. శుచీంద్రంలో వరి సాగు, తోటల పెంపకానికి ప్రధాన నీటి వనరు ఈ దంత నదే. ఇంద్రుడు స్నానం చేసి వినాయకుని, నందిని, రావిచెట్టును పూజించి మరుగుతున్న నేతిలో పంచాక్షరీ జపం చేస్తూ మునిగాడు. అతని భక్తి మహిమ వల్ల సెగ కలగలేదు. త్రిమూర్తులు ప్రత్యక్షమై ఇంద్రునికి శాపవిమోచనం ప్రసాదించారు. ఇంద్రుడు శుచియైన ప్రదేశం కాబట్టి దీనికి శుచీంద్రం అనే పేరు వచ్చింది.

## ఇంద్రుడు తపస్సు చేసిన మరుత్తమల...

త్రిమూర్తులు అత్రి ఆశ్రమంలో ఉన్నారని నారదుని ద్వారా తెలుసుకున్న ఇంద్రుడు అక్కడకు వెళ్లాడు. త్రిమూర్తులు ఇంద్రుని కాపాడడానికి అంగీకరించి

ప్రజ్ఞాతీర్థం దక్షిణ దిక్కునగల రావిచెట్టు కింద కూర్చున్నారు. ఇంద్రుని రావిచెట్టు దగ్గరకు వెళ్లకుండా నంది అడ్డుకున్నాడు. ముందుగా కులగురువును పూజించి రమ్మన్నాడు. జ్ఞానారణ్యంలో తూర్పుదిక్కున ఉన్న కొండమీదకు పోయి బృహస్పతిని గురించి తపస్సు చేశాడు. ముందుగా వినాయకుని పూజించి తర్వాత రావిచెట్టును పూజించమని బృహస్పతి చెప్పాడు. రావిచెట్టు కిందిభాగంలో బ్రహ్మ, మధ్య భాగంలో విష్ణువు, పైభాగంలో శివుడు ఉపస్థితులై ఉన్నారు. రావిచెట్టు ముందు ఒక తొట్టిని ఉంచి అందులో మరుగుతున్న నేతిలో పంచాక్షరీ మంత్రం జపిస్తూ 1003 సార్లు మునకలు వేయమని బృహస్పతి ఇంద్రునికి చెప్పాడు.

సుచీంద్రం నుండి నాగర్ కోయిల్‌కు బయల్దేరుతుండగా మూడవసారి పెద్ద వాంతి కారులో కూర్చుండగానే అయింది. నోరు కడుక్కొని డైజిన్ టాబ్లెట్లు వాంతి నిరోధక మందులు రాంబాబుతో మెడికల్ షాప్ నుంచి తెప్పించి వేసుకోవటం మొదలు పెట్టాను. కొంత కంట్రోల్ అయింది. నాగర్ కోయిల్ చేరాం. 'నాగరాజ కోవెల' నాగర్ కోయిల్‌గా మారింది. ఇది పెద్ద ఓడ రేవు. ఇక్కడి నాగ రాజస్వామిని తనివారా దర్శించాం. అందమైన ప్రకృతి దృశ్యాల వల్ల నాగర్ కోయిల్ భారతదేశంలో ఒక పర్యాటక కేంద్రంగా మారిపోయింది. ఇది తమిళనాడులోని కన్యాకుమారి జిల్లాలో కలదు. దీనికి ఒకవైపు అరేబియా సముద్రం, మరోవైపు దట్టమైన పశ్చిమ కనుమలు ఉండి, మొదటిసారి ఈ ప్రాంతాన్ని సందర్శించే పర్యాటకులను కనువిందు చేస్తుంది. కన్యాకుమారి లోగానీ లేదా దాని చుట్టుపక్కలగానీ దేశ, విదేశీ పర్యాటకులు ఉంటే తప్పక నాగర్ కోయిల్‌కు వెళతారు. అక్కడి ప్రకృతి దృశ్యాలను, జలపాతాలను మరియు ఇతర సైట్ సీఇంగ్ ప్రదేశాలను చూసి వారు మంత్రముగ్ధులవుతారు. పూర్వం ఈ ప్రాంతాన్ని వివిధ రాజవంశాలు పరిపాలించారు. వారిలో చోళ, చేర మరియు పాండ్యులు ముఖ్యులు. నాగరాజ దేవాలయం, ఒలకరువి జలపాతం ఇక్కడి ప్రధాన ఆకర్షణలు. వీటితో పాటు సుగంధ ద్రవ్యల తోటలు, ప్యాలెస్‌లు మరియు మరికొన్ని ఆలయాలు ఈ పట్టణంలో చూడదగినవిగాఉన్నాయి. నాగర్ కోయిల్ పట్టణంలో నాగరాజ దేవాలయం తప్పక దర్శించాలి. ఈ కోవెల్ పేరుమీదనే పట్టణానికి ఆపేరొచ్చింది. ఆలయంలో ఆనందకృష్ణ మరియు నాగరాజ రెండు ప్రధాన దైవాలుగా ఉన్నారు. భక్తులు పసుపు మరియు పాలతో విగ్రహాలను అభిషేకిస్తారు.

నాగరాజ దేవాలయం నాగరాజ గుడి ముందు భాగంలో పెద్ద కోనేరు ఉంది. ఇందులో భక్తులు స్నానాలు ఆచరించి నాగరాజును దర్శిస్తారు. కోనేరు పక్కనే పెద్ద దిమ్మె మీద చాలా నాగరాజ ప్రతిమలు ఉన్నాయి. ఈ గుడిలో ఎక్కడ చూసిన నాగరాజ ప్రతిమలే కనిపిస్తాయి.

## నాగరాజ ఆలయం

ప్రత్యేకత నాగరాజ గర్భాలయంలో వూరు నీటి ఊటలోని నీటిని తీర్థముగా ఇస్తారు. ఈ నీట ఊటలోని ఇసుక సంవత్సరంలో సగభాగం తెల్లగా మరియు మిగిలిన సగభాగం నల్లగా ఉంటుంది. ఆలయంలో ఇతర ఆకర్షణలు ఈ ఆలయంలో నాగ దేవతలతో పాటు జైన తీర్థాంకులైన మహావీర, పార్శ్వనాథ మందిరాలు ఉన్నాయి. ముఖద్వారంపై బుద్ధ విహారంలోని చైనా శిల్పకళ అబ్బురపరుస్తుంది. ఒలకరువి జలపాతాలు నాగర్ కోయిల్ నుండి 20 కిలోమీటర్ల దూరంలో ఉన్న ఒలకరువి జలపాతాలు ప్రసిద్ధ పర్యాటక గమ్యస్థానంగా ఉన్నాయి. తరచూ కన్యాకుమారికి వచ్చే దేశ, విదేశీ పర్యాటకులు ఈ జలపాతాలను తప్పక సందర్శిస్తారు. అక్కడి నుండి మణి మమ్మల్ని నాగర్ కోయిల్ స్టేషన్‌లో దిగ బెట్టాడు. అతనికి పన్నెండు వందల రూపాయలు ఇచ్చాం. ఏ.సి.కారు, సామానుకు భద్రతా చంద్రశేఖర్ ఆఫీసు మనిషి. మంచి నమ్మకం ఉన్నవాడు. ట్రెయిన్ 6127 గురవాయూర్ ఎక్స్ప్రెస్‌లో S 3 లో 17, 18, 19, 20 బెర్తులను చేరి పడుకోన్నాం.

## గురవాయూర్

8-2-14- శనివారం ఉదయం ఆరు గంటలకు గురవాయూర్ స్టేషన్ చేరుకొన్నాం. అక్కడి నుండి ట్రాలీలో లగేజ్ చేర్చి ప్రభావతిని కూడా దానిలో కూర్చున్న బెట్టి స్టేషన్ బయటికి వచ్చి, ఆటోలో అరవై రూపాయలిచ్చి మేము బుక్ చేసుకొన్నా గోకుల్ రిసార్ట్స్‌కు పది నిమిషాల్లో చేరాం. అప్పటికే ఆ హోటల్ వాళ్ళు రెండుసార్లు ఫోన్ చేశారు. ఒకే రూమ్‌లో నాలుగు మంచాలున్న రూమ్. పదమూడు వందల అరవై రెంటుకట్టాం. ముందుగా కాఫీ తెప్పించుకు తాగి స్నానాలకు ఉపక్రమించాం. అన్నీ పూర్తిచేసి నా సంధ్య, పూజా, పారాయణ పూర్తి చేశాను. మిగిలిన వాళ్ళూ రెడీ అయ్యారు. అంతా ఆటోలో నలభై ఇచ్చి గురవాయూర్ దేవాలయం చేరాం. నేను కులశేఖర ఆల్వార్ అనే మహారాజు కవి రాసిన 'ముకుందమాల' పుస్తకం వెంట తెచ్చుకొని వీలైనప్పుడల్లా చదువుతూ ఉన్నాను.

గురువాయూర్‌లో లుంగీ, పై పంచెతోనే దర్శనం. రూమ్ నుండి అలానే బయల్దేరాం. జనం బాగా ఉన్నారు. ఆడవాళ్ళకు ప్రత్యేక క్యూ ఉంది. వీళ్లిద్దరిని అందులో నుంచో బెట్టి మేమిద్దరం వెనక ఉన్న క్యూలో చేరాం. కెమెరా సెల్ అక్కడ క్లోక్ రూమ్‌లో ఇచ్చే వచ్చాం. దాదాపు గంటన్నర పట్టింది గురవాయూరప్ప దర్శనానికి. జీవితం ధన్యమైన దర్శనం ఇది. ఎన్నో ఏళ్ళుగా ఎదురు చూసింది. విగ్రహం చిన్నదే చిన్నదే అయినా మహా మహిమాన్వితమైనది. సాక్షాత్తూ శ్రీ కృష్ణుడే అందులో తనను తాను ఆవిష్కరించుకొన్న విగ్రహం. శ్రీకృష్ణుని రూపంలో శ్రీ మహావిష్ణువు అర్చన జరగటం ఇక్కడి విశేషం. ద్వారక మునిగిపోయేటప్పుడు ఈ విగ్రహాన్ని తనకు అత్యంత

ఆప్పుడైన ఉద్ధవుడికి శ్రీకృష్ణుడు విగ్రహాన్ని ఇచ్చి అక్కడి నుండి వెళ్లి పోయి తగిన ప్రదేశంలో ప్రతిష్ట చేయమని ఆనతిచ్చాడు. ఆయన కు దేవగురువు బృహస్పతి, వాయుదేవుడు, పరశు రాముడు కలిసి ప్రదేశాల కోసం వెతికి ఇక్కడికి అంటే మలబార్ తీరానికి వచ్చారు. శివుడు కూడా ఇక్కడే కృష్ణ విగ్రహాన్ని ప్రతిష్టించమన్నాడు. అప్పుడు ఇక్కడ ప్రతిష్టించారు.. 'గురువు వాయువుల ఊరు' కనుక ఇది 'గురవాయూర్' అయింది. 'పాతాలాన్జన శిల' అనే 'యాంటి మని' అనబడే అయస్కాంత శిలావిగ్రహం ఇది. అందుకే అంతశక్తి. దక్షిణ ద్వారక అంటారు గురవాయూర్‌ను. ఎందరెందరో మహానుభావులు దర్శించిన దేవాలయం ఇది. తరించిన దివ్యక్షేత్రం ఇది. దర్శనం పూర్తయిన తర్వాతా ఫోటోలు కొని, తీసుకొని ఆటోలో రూమ్ చేరాం. తెచ్చుకున్న బిస్కట్లు పళ్ళు తిన్నాం భోజనం చేయలేదు కేరళలో బాయిల్డ్ రైస్‌తో అన్నం వండుతారు. మనం తినలేము. కాసేపు విశ్రమించాం. మధ్యాహ్నం రెండు గంటలకు కారులో బయల్దేరి శ్రీ ఆదిశంకరాచార్యుల జన్మక్షేత్రం 'కాలడి గ్రామానికి' వెళ్ళటానికి హోటల్ వాళ్ళతో కారును ఏర్పాటు చేసుకోన్నాం. రాను పోను నూట యాభై కిలో మీటర్లు. రెండు వేల రెండువందల రూపాయలు.

## దక్షిణ ద్వారక

దక్షిణదేశ ద్వారకగా, కలియుగ వైకుంఠంగా ప్రసిద్ధిచెందింది గురవాయూర్. అయినా 108 వైష్ణవ దివ్యక్షేత్రాలలో గురవాయూర్ చేరకపోవటం విశేషం. కేరళ రాష్ట్రం మలబార్ తీరంలో గురవాయూర్ శ్రీకృష్ణక్షేత్రం ఉంది. దేవతల గురువు బృహస్పతి అనబడే 'గురువు వాయువుల ఊరు' కనుక గురవాయూర్ అనే పేరు వచ్చింది. ఇక్కడ శ్రీకృష్ణుని ఆకారంగా శ్రీమహావిష్ణువు ఆరాధన జరగటం మరో విశేషం. స్వామి పాంచజన్య శంఖువు, సుదర్శనచక్రం, కౌమోదకి గద, పద్మాలతో, మెడలో తులసిమాలతో గురవాయూరప్ప అయిన శ్రీకృష్ణుడు శోభిల్లుతూ దర్శనమిస్తాడు. ఈ మూర్తికి ఒక విశేషంఉంది. వసుదేవునికి దేవకీదేవికి శ్రీకృష్ణ జననం ముందు సాక్షాత్కరించిన శ్రీమహావిష్ణువు రూపమే ఇది. ఆదిశంకారాచార్యుల వారు నిర్దేశించిన విధానంలోనే ఇక్కడ పూజాదికాలు నిర్వహింపబడుతాయి. అందుకే దక్షిణ ద్వారక అన్నారు. 1427 నుండి 'చెన్ననారాయణ నంబూద్రి' బ్రాహ్మణులే ఇక్కడ అర్చకులుగా ఉన్నారు. ముఖ్య పూజారి తెల్లవారుఝామున 2-30 గం.లకు గర్భగుడి ప్రవేశంచేసి పూజదికాలను పూర్తిచేసిసరికి మధ్యాహ్నం 12-30 అవుతుంది. అంతవరకు పచ్చిగంగ కూడా పుచ్చుకోకుండా నియమంగా ఉంటాడు. అదీ ప్రత్యేకతే. ప్రసిద్ధ యాత్రాస్థలం.

5,000 ఏళ్ళనుంచి పూజింపబడుతున్న అర్చామూర్తి శ్రీ గురవాయూర్ శ్రీకృష్ణుడు. 14వ శతాబ్దం వరకు 'కోకసందేశం' అనే కావ్యంలో 'కురువాయూర్'గా

ప్రసిద్ధం అయింది. కరువై అంటే సముద్రం. మలబార్ సముద్రతీరంలో ఉంది కనుక ఆ పేరు సార్ధకమైంది. క్రమంగా పేరు గురవాయూర్‌గా మారింది. 'మామన్కం' అనేది ఇక్కడి స్థానిక సంఘటన. 'తిరునాయ' అనే చోట 'భారతపుజ్జక' తీరంలో జరిగింది. కాలికట్ జమీందార్లకు, వళ్ళువనాప్రజలకు ఇక్కడే అనేకసార్లు యుద్ధాలు జరిగాయి. కాలికట్ జమీందారు వైష్ణవుడై శ్రీకృష్ణభక్తుడుగా మారిపోయాడు. యదారాజా తదాప్రజాగా ప్రజలూ శ్రీకృష్ణ భక్తులైపోయారు. 1638 గర్భాలయాన్ని ముందుగా నిర్మించారు. 'విశ్వబలి' చేసి దుష్టశక్తులను తరిమేశారు. పదహారవ శతాబ్దానికే గొప్పయాత్రా స్థలమైంది గురవాయూర్.

## శ్రీకృష్ణ విగ్రహం

గురవాయూర్లోని శ్రీకృష్ణమూర్తి విగ్రహం 'పాతాలాన్జనశిల' అంటే యాంటిమొని అనే అయస్కాంత శిల అంటే 'సుర్మాశిల'తో తయారుచేయబడింది. శ్రీమహావిష్ణువు నిద్రలేవగానే శ్రీకృష్ణరూపం దాల్చి తన విగ్రహాన్ని శివుడికి ఇచ్చాడు. అయన బ్రహ్మకు అందజేస్తే బ్రహ్మ మనువుకు అతని భార్యకు అప్పగించాడు. శతరూపచక్రవర్తి మగ సంతతి కోసం విష్ణుమూర్తి దర్శనం కోసం తపస్సు చేశాడు. ఆయన అనుగ్రహించి తాను వారికి పుత్రుడుగా జన్మిస్తానని తెలియజేశాడు. అది నాలుగుజన్మలలో సాధ్యం అవుతుందని చెప్పాడు. నాలుగుజన్మలలో నాలుగు రూపాలుగా పుడతానని తెలియజేశాడు. శతరూప దంపతులకు మొదట 'పృశ్నిగర్భుడు'గా విష్ణువు జన్మించాడు. అతడు ఐహిక వాంఛలకు దూరమై బ్రహ్మచర్య వ్రతదీక్షలో గడిపాడు. రెండవ జన్మలో కశ్యప ప్రజాపతి అథితిలకు వామనుడుగా జన్మించాడు. మూడవజన్మలో కౌసల్యాదశరధులకు శ్రీరామునిగా జన్మించాడు. నాలుగవ జన్మలో దేవకీ వసుదేవులకు శ్రీకృష్ణుడిగా విష్ణువు పుట్టాడు. వారి కోరిక తీర్చాడు. శ్రీకృష్ణ విగ్రహాన్ని ఉద్ధవుడు రుక్మిణీదేవి అత్యంత భక్తిశ్రద్ధాలతో పూజించారు. ద్వారకా నగరంలో తరతరాలుగా వస్తున్న ఈ శ్రీకృష్ణ విగ్రహాన్ని స్వయంగా శ్రీకృష్ణపరమాత్మయే ప్రతిష్టించాడు.

## కృష్ణ విగ్రహం గురవాయూర్చేరిన వైనం

ద్వాపర యుగాంత సమయంలో శ్రీకృష్ణునితో సహా సకల యాదవ నిర్యాణ సమయంలో ద్వారక సముద్రంలో మునిగిపోతుందన్న సంగతి తెలిసిన కృష్ణుడు తన విగ్రహాన్ని తనకు అత్యంత ఆప్తుడు అయిన ఉద్దవునికి అప్పగించి ద్వారక నుండి వెళ్లిపోయి సరి అయిన ప్రదేశంలో విగ్రహాన్ని ప్రతిష్టించమని కోరాడు. ద్వారక సముద్రంలో లయం అయిపోగానే ఉద్ధవుడు శ్రీకృష్ణ విగ్రహాన్ని తీసుకొని బయటపడ్డాడు. దారిలో దేవగురువు బృహస్పతి కలిసి తానూ అదే పని మీద వచ్చినట్లు చెప్పాడు. ఇద్దరూ

కలిసి వెడుతుంటే వాయుదేవుడూ అదే పని మీద వచ్చినట్లు చెప్పి కలిశాడు. పాల్ఘాట్సముద్ర తీరం చేరారు ముగ్గురూ. అప్పుడు పరశురాముడు కనిపించి తాను శ్రీకృష్ణ విగ్రహం కోసం ద్వారకకు వెడుతున్నట్లు తెలియజేయగా తమవద్దే విగ్రహం ఉందని ఈ ముగ్గురూ చెప్పారు. అందరూ కలిసి తగిన ప్రదేశం కోసం అన్వేషిస్తూ గురవాయూర్వచ్చారు. అప్పుడు ఇక్కడ శివపార్వతులు ప్రశాంతంగా తపస్సు చేసుకొంటున్నారు. వీరు వచ్చిన విషయం తెలుసుకొని శ్రీకృష్ణ విగ్రహ ప్రతిష్ఠాపనకు ఇదే అత్యంత అనువైన ప్రదేశం అని చెప్పి తామిద్దరు అక్కడి నుంచి వేరొక ప్రశాంత స్థలానికి వెళ్లి తపోదీక్ష కొనసాగించారు. పరశురాముని నేతృత్వంలో గురువు వాయువు సాయంతో ఉద్ధవుడు ద్వారక నుంచి తెచ్చిన శ్రీకృష్ణ విగ్రహాన్ని ప్రతిష్టించారు. అందుకే గురవాయూర్ అని పేరు పొందింది ఈ క్షేత్రం. గురవాయూర్ యాత్ర పూర్తి కావాలంటే ముందుగా ఇక్కడికి చాలా దూరంలో ఉన్న 'ముమ్మయూర్'లో శివదర్శనం చేసి ఇక్కడికి రావాలి. అందరూ అంతదూరం వెళ్ళలేరు కనుక గురవాయూర్లోనే శ్రీకృష్ణ దర్శనానికి ముందు 'ఈశాన్యం' వైపు తిరిగి శివుడిని స్మరించితే అక్కడి శివదర్శనం చేసినట్లే. ఈ విషయం మనకు ఎవరూ చెప్పరు. తెలుసుకొని గురవాయూర్వెళ్ళిన వారు దీన్ని ఆచరించాలి.

## పంచ శ్రీకృష్ణ క్షేత్రాలు

పూరీలోని జగన్నాధస్వామి, తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వరస్వామి, రాజస్థాన్లోని నాథద్వారా, గుజరాత్లోని ద్వారక, కేరళలోని గురవాయూర్ ఈ అయిదు శ్రీకృష్ణ క్షేత్రాలుగా ప్రసిద్ధిచెందాయి. భూలోక వైకుంఠంగా గురవాయూర్ను భావిస్తారు. స్వామిని ఆప్యాయంగా ముద్దుగా 'గురవాయూరప్పన్' అంటే గురవాయూర్తండ్రి, నాయన, దేవుడు అని పిలుచుకొంటారు. అదే సరదాగా 'ఏమప్పా! గురవాయూరప్పా!' అని వ్యంగ్యంగా లోకంలో ప్రసిద్ధమైంది కూడా.

## శ్రీకృష్ణమూర్తి

కృష్ణ విగ్రహం చిన్న నల్లరాతి విగ్రహం. రెండు అడుగులే ఉంటుంది. నల్లయాంటిమొని అనే అయస్కాంత పదార్ధంతో తయారుచేయబడిన విగ్రహం. అందువలన ప్రత్యేక వైద్యగుణాలు ఈ విగ్రహంలో ఉన్నాయి. అందుకే ఇన్ని లక్షలమంది ఎంతెంతో దూరాలను నుంచి వచ్చి దర్శనం చేసి పులకించిపోతారు. కృష్ణవైభవం వర్ణనాతీతం. బహుసుందర కృష్ణమూర్తి. విగ్రహాన్ని ప్రతిరోజూ నువ్వుల నూనెతో తుడుస్తారు. 'వాక' అనే వనమూలికా భస్మాన్ని విగ్రహంపై చల్లుతారు. అప్పుడు దివ్యమైన కళా, కాంతి, తేజస్సు గోచరిస్తాయి. ఆ తర్వాత విగ్రహానికి అభిషేకం

చేస్తారు. ఈ అభిషేక జలాన్ని భక్తులు పవిత్రతీర్థంగా భావించి భక్తితో సేవిస్తారు. రోగనివారకం అని గొప్ప నమ్మకం. ఇక్కడ తులాభారం తూగి స్వామికి దాన్ని కానుకగా ఇవ్వటం పెద్ద విశేషం. దీనికోసం క్యూలో జనం నిలబడి మొక్కు తీర్చుకొంటారు. ఆలయంలో ఏనుగులు మరీ ఆకర్షణ.

ఇక్కడి సరస్సును రుద్రతీర్థం అంటారు. ఇక్కడే శివపార్వతులు కృష్ణ విగ్రహ ప్రతిష్ఠాపన ముందువరకు విహరించారు. పైన బట్టలేకుండా శ్రీకృష్ణుని దర్శించటం ఇక్కడి సంప్రదాయం. అందరూ పాటిస్తారు. ఒక్కసారి దర్శిస్తే చాలు జీవితం ధన్యమయినట్లే. ఎందరెందరో మహానుభావులు దర్శించిన దేవాలయం ఇది. తరించిన దివ్యక్షేత్రం ఇది. దర్శనం పూర్తి అయిన తర్వాత ఫోటోలు కొని, తీసుకొని ఆటోలో రూమ్చేరాం. తెచ్చుకున్న బిస్కట్లు, పళ్ళు తిన్నాం. భోజనం చేయలేదు..

## కాలడిలో ఆదిశంకర జన్మక్షేత్ర దర్శనం

సరిగ్గా రెండు గంటలకు ఏ.సి. ఇండికా కారు వచ్చింది. ఎక్కి కూర్చున్నాం. రోడ్డు మీద విపరీతమైన ట్రాఫిక్ మెలికల రోడ్లు పల్లెటూరి వాతావరణం. అందుకని గంటకు ఇరవై పాతిక కిలో మీటర్ల వేగమే. ఈ విషయం నెట్ ద్వారా ముందే తెలుసుకొన్నాం. రాత్రి తొమ్మిదింటికి మేము మద్రాస్ ట్రెయిన్ ఎక్కాలి కూడా. దారిలో ఎక్కడ చూసినా పల్లెటూరి కేరళ దర్శనమే కలిగింది. ప్రశాంత వాతావరణం. ఇళ్ళల్లో కొబ్బరి చెట్లు వరి చేలు ఫలవృక్షాలు ముచ్చటగా ఉంది. కాలడి చేరే దాకా మన కోన సీమ అందాలు కన్పించాయిక్కడ. పవిత్రత గోచరమైంది. పులకించే ప్రకృతి ఆహ్లాదాన్ని చేకూర్చింది. ఇదే తీరు మధ్యలో ఒక పెద్ద సిటీ ఉంది. కాలడికి అయిదింటికి చేరాం. అక్కడ శ్రీ శంకర భగవత్పాదుల జన్మస్థలాన్ని వారి తల్లిగారైన ఆర్యాంబను దహనం చేసిన ప్రదేశాన్ని అక్కడే ఏర్పాటు చేసిన ఆమె స్మారకాన్ని ఆమె కోసం ఏర్పాటు చేసిన నిరంతరం వెలిగే జ్యోతిని దర్శించి సాష్టాంగ నమస్కారం చేసి పులకించి పోయాను. ఎప్పుడెప్పుడా అని ఎదురు చూసిన క్షణం రానే వచ్చింది. నా జన్మ ధన్యమయింది. నిరుడు ఫిబ్రవరిలో త్యాగరాజస్వామి గారి తిరువయ్యార్ వెళ్ళి త్యాగరాజ స్వామి నిర్యాణం చెందిన ప్రదేశాన్ని ఆయన వర్ధంతినాడు పంచరత్న కీర్తనలను గాయకులందరూ గానం చేసే సంగీత సభ జరిగే ప్రదేశాన్ని చూసి తరించాం మేమిద్దరం మా మనవడు సంకల్ప్. ఈ ఫిబ్రవరిలో శ్రీ శంకరుల దివ్యక్షేత్ర సందర్శనం. ఈ జీవితానికిది చాలు అనిపించింది. అందరం ఎంతో ఆనందించాం. దీన్ని శ్రీ శృంగేరి మఠం కట్టించింది. ఇక్కడ నేను అయిదు వందల రూపాయలు నిధి సమర్పించాను. మల్లికగారూ అంతే. రాంబాబు వంద కట్టాడని జ్ఞాపకం. ప్రసాదం ఇరవై రూపాయలు కొన్నాం.

దీనికి దగ్గరే తల్లి ఆర్యాంబ కోసం శంకరులు పూర్ణా నదిని మళ్ళించిన ప్రదేశం,

తల్లికోసం నది ఒడ్డునశ్రీ కృష్ణ విగ్రహాన్ని ప్రతిష్టించిన గుడిని చూశాం. గుడి మూసే ఉంది. పూర్ణా నదిలో దిగి కాళ్ళు కడుక్కుని పవిత్ర జలాలను శిరసున చల్లుకున్నాం. కాలడి మొదట్లో కంచి శంకరమఠం ఎనిమిది అంతస్తుల స్మృతి గోపురం ఉంది. బయటి నుంచే చూశాం. ఎక్కి అంతా తిరిగి చూచే ఏర్పాటు ఉంది. శ్రీ శంకరుల జీవిత చరిత్ర అంతా అందులో చిత్రరూపంలో దర్శించవచ్చు. పై అంతస్తు నుంచి చూస్తే చాలా గొప్పగా ఉంటుందిట. శంకరులు నదిలో దిగి మొసలి పట్టుకొన్న ప్రదేశంను 'క్రోకడైల్ ఘాట్'అంటారు. అది చూడలేదు మేము. అక్కడి నుండి బయల్దేరి రాత్రి ఎనిమిది గంటలకు గోకుల్ రిసార్ట్‌కు చేరుకొన్నాం. టిఫిన్ తెప్పించుకొని పార్సెల్ చేయించుకొని ఆటో ఎక్కి స్టేషన్ చేరుకొన్నాం. రాత్రి 6128 చెన్నై ట్రెయిన్‌లో ఐ-4లో 17,18,19,20 బెర్తులు చేరుకొన్నాం. రాత్రి తొమ్మిదిం బావుకు ట్రెయిన్ చెన్నైకి బయల్దేరింది.

కేరళలో ఎక్కడా ప్లాస్టిక్ వాడకం లేదు. రోడ్లు స్టేషన్లు పరిశుభ్రంగా ఉన్నాయి. క్రమశిక్షణతో జనం ఉండటం చాలా ఆనందాన్ని కల్గించింది. రైలు స్టేషన్‌లలోనే కాదు, రైలు పట్టాల మీదా ఫినాయిల్ చల్లటం ఇక్కడి ప్రత్యేకత. చెత్త ఎక్కడా కనిపించదు. మగపిల్లలు కాని ఆడపిల్లలు కాని ఎక్కడా అసభ్యంగా ప్రవర్తించటం చూడలేదు. అందరూ ప్రశాంతంగా ఉన్నట్లే కనిపించారు. ఈవ్ టీజింగ్ కనిపించలేదు. దేవాలయాలలో లంచాలు లేవు. అందరూ సమానమే. దేవాలయాల్లో దళారీలు కనిపించలేదు. దేవునిపై అచంచల విశ్వాసం కనిపించింది. భిక్షగాళ్ళు కూడా ఎక్కడా కనిపించలేదు. ఎక్కడ చూసినా ప్రశాంతత గోచరించింది. మనసు ఆనందపడింది. మర్యాదగా అందరూ ప్రవర్తించారు. హోటల్ వాళ్ళూ చాలా ఆదరణా మర్యాదా చూపారు. ఇదొక అపూర్వమైన అనుభవంగా మిగిలిపోయింది. ఎంతో సంతృప్తితో కేరళను వదిలి వెళ్ళాము. దీనికి బాధ్యులైన వారందరూ అభినందనీ యులే.

## శ్రీ అదిశంకరాచార్యుల వారి జన్మక్షేత్రం - కాలడి

కేరళలో గురువాయూర్‌కు 75 కిలోమీటర్ల దూరంలో కాలడి గ్రామం ఎర్నాకులం జిల్లాలో ఉంది. ఇదే జగద్గురువులు శ్రీ ఆదిశంకరా చార్యులు వారు జన్మించిన పవిత్ర క్షేత్రం. ఇక్కడి నుండే కాలినడకన ఆసేతుహిమాచల పర్యంతం అనేకసార్లు తిరిగి నాలుగు ఆమ్నాయ పీఠాలు స్థాపించి ఆర్షధర్మాన్ని నిలబెట్టారు. వైదిక మతోద్ధారణ చేశారు. అద్వైత మత స్థాపనా చార్యులుగా కీర్తి శిఖరాన్ని అధిరోహించారు. పరమ విశిష్టమైన కాశ్మీర్ శారదాపీఠాన్ని సమర్ధత నిరూపించి శారదామాత అంగీకారంతో అధిరోహించి జగద్గురువు లనిపించుకొన్నారు. ఆ మహానుభావుడే లేకపోతే చైనా, పాకిస్తాన్ సరిహద్దులో ఉన్న భారతదేశ ప్రజలు ధర్మానికి దూరమైపోయి ఉండేవారు. ఆయన ప్రబోధం సకల మానవ సోదరత్వమే. ఆధ్యాత్మిక కీర్తిపతాకని ప్రపంచం

అంతా రెపరెపలాడించిన ఆ మహనీయమూర్తి జన్మస్థలాన్ని దర్శించాలనే తపన ఈ ఫిబ్రవరిలో తీరింది. ఆ మాహాత్మునికి ఏమిచ్చినా హిందూజాతి ఋణం తీరనే తీరదు. అలాంటి పవిత్ర కాలడి గురించిన విశేషాలు ఇప్పుడు తెలియజేస్తున్నాను.

## శ్రీశంకర జన్మక్షేత్రం గుర్తింపు

ఎర్నాకులంజిల్లాలో పెరియార్నదికి తూర్పున ఉంది కాలడి గ్రామం. ఈ గ్రామాన్ని గుర్తుపట్టటం మొదట పెద్ద సమస్యగా మారింది. అప్పుడు శృంగేరి పీఠంవారు మహాపండితుడు, చారిత్రిక పరిశోధకుడు శంకరుల జీవితంపై అథారిటీ అయిన శ్రీనడు కావేరి శ్రీనివాసశాస్త్రి గారిని కాలడికి పంపారు. అసలు ఆదిశంకరుల జన్మస్థలాన్ని అన్ని ఆధారాలతో తేల్చమని పంపారు. ఆయన ఇక్కడికి వచ్చి పరిశీలనా, పరిశోధనాచేసి కైఫీయత్తులను తిరగేసి ఇప్పుడు శ్రీశంకరుల దేవాలయం కట్టబడిన ప్రదేశమే అసలైన ఆదిశంకరుల జన్మక్షేత్రం అని నిర్ధారించి రుజువులతో సహా తెలియజేశారు. అప్పుడు ఈ ప్రదేశం అంతా 'కపిల్లిమన' అనే ఆయన స్వాధీనంలో ఉండేది. ఈ విషయాన్ని శృంగేరివారు తిరువాన్కూర్మహారాజా వారికి తెలియజేశారు. ఆ స్థలాన్ని తమకు ఇస్తే అక్కడ శంకర ఆలయం నిర్మించి స్మృతి చిహ్నంగా తీర్చిదిద్దుతామని చెప్పారు. మహారాజు మహదానందంపొంది 'కపిల్లమ'న నుంచి 1906లో ఈ ప్రాంతాన్ని స్వాధీనపరిచి శృంగేరి పీఠానికి అప్పగించాడు.

శృంగేరి మఠం ఇక్కడ 1910లో శ్రీ ఆదిశంకరుల ఆలయాన్ని నిర్మించింది. అదే కాలడి ఆవిర్భావ సంవత్సరంగా భావించారు. సరిగ్గా వంద ఏళ్ళకు 2010లో కాలడి శతవత్సర ఉత్సవాలను పీఠం ఘనంగా నిర్వహించింది. ఒక డాక్యుమెంటరీ చిత్రాన్ని పీఠం నిర్మించి ప్రచారంలోకి తెచ్చింది. లేకపోతే కాలడి అలాగే చరిత్ర గర్భంలో కలిసిపోయి ఉండేదేమో? బాలశంకరులు తన తల్లి ఆర్యాంబ కోసమై పూర్ణానదిని ఇంటివరకు మళ్లించిన ప్రదేశం శంకరాలయానికి దగ్గరలోనే ఉంది. దాని తీరం మీదనే శంకరులు శ్రీకృష్ణ విగ్రహం ప్రతిష్టించారు. ఇక్కడే 'అచ్యుతాష్టకం' చెప్పారు. శంకర ఆలయంలో శ్రీశంకర, శారదాంబ విగ్రహాలు జగన్మోహనంగా కనిపిస్తాయి. నిత్యం అభిషేకం పూజా హోమాదులు నిర్వహించే విశాలప్రాంగణం ఉంది. శంకరుల తల్లి ఆర్యాంబ సమాధి కూడా ఇక్కడే ఆలయంలో ఉంది. అక్కడ నిత్యం జ్యోతి వెలుగుతూనే ఉంటుంది. వినాయకుని చిన్న విగ్రహమూ ఉంది. ఇక్కడ తమిళ కన్నడ స్మార్తపాఠశాల ఉంది.

## శంకరాచార్య కీర్తి స్థంభం

శంకరాలయానికి దగ్గరే శృంగేరిపీఠం ఉంది. ఇక్కడి శ్రీకృష్ణ దేవాలయంలోనే

శ్రీశంకరులు 243 పంక్తుల 'ప్రబోధచంద్రోదయం' రాశారు. కాలడి దేవస్థానం అధీనంలో ఉంది. రామకృష్ణమఠం కూడా సమీపంలో ఉంది. కాలడి గ్రామంలో ప్రవేశించగానే మనకు కంచి కామకోటి పీఠంవారు నిర్మించిన ఎనిమిది అంతస్తుల 'కీర్తిస్థంభం' అనే బృహత్భవనం కనిపిస్తుంది. ఆదిశంకరుల జీవితచరిత్ర అంతా చిత్రాలలో ప్రదర్శించారిక్కడ. పైఅంతస్తుకు వెళ్లి నగరదర్శనం చేయవచ్చు. శ్రీశంకరాచార్య, శ్రీగణేశుల పెద్ద విగ్రహాలు ఇందులో ఉన్నాయి.

## చూడాల్సిన ప్రదేశాలు



కాలడికి ఒక కిలోమీటర్దూరంలో మాణిక్యమంగళంలో శ్రీకాత్యాయిని మాత దేవాలయం ఉంది. ఇది దుర్గామాత ఆలయం. ఇక్కడే శంకరుల బాల్యంలో తండ్రి శివశర్మ ఏదో పని మీద వెడుతూ కొడుకుకు అమ్మవారికి పాలు నైవేద్యం పెట్టిరమ్మని పంపాడు. అలానే బాలశంకరుడు అమ్మవారి ముందు పాలచెంబు ఉంచి నైవేద్యం పెట్టి తాగమని గోల చేశాడు. అమ్మవారు తాగక పోయేసరికి ఏడుపు లంకించుకొన్నాడు. అప్పుడు అమ్మవారు ప్రత్యక్షమై ఆ క్షీరాన్ని తృప్తిగా త్రాగి శంకరులకు ఆనందాన్ని కలిగించింది. ఈ అమ్మవారి గురించే తరువాత 'సౌందర్యలహరి' రాశారు శంకరాచార్య.

కాలడికి రెండు కిలోమీటర్ల దూరంలో 'మట్టూర్తిరువేలుమాన్శివ దేవాలయం' ఉంది. దీన్ని శంకరుల తండ్రి శివశర్మ ప్రతిష్టించాడు. ముసలితనంలో శంకరుని తలిదండ్రులు ఇంతదూరం వచ్చి పూజాదికాలు చేయలేక శివుడిని ప్రార్థించారు. అప్పుడు కలలో కన్పించి 'నాట్యం చేసే తెల్లజింక'ను అనుసరించి వెడితే తన లింగం దగ్గరకు చేరుస్తుందని చెప్పాడు. అలానే రోజూ చేసేవారు. అందుకే ఈ గుడికి 'తిరువెల్లమాన్మల్లి' అనే పేరొచ్చింది. అంటే 'నాట్యం చేసే తెల్లజింక' అని అర్థం.

నయతోడు శంకరనారాయణ దేవాలయం కాలడికి మూడు కిలోమీటర్ల

దూరంలో ఉంది. ఇది అద్వైత అర్చనకు గొప్పస్థానంగా ప్రసిద్ధ మైంది. ఈ శివాలయంలో శంకరాచార్య విష్ణువును ప్రార్థిస్తే ఆయన ప్రత్యక్షమై ఇక్కడి శివునిలో కలిసిపోయి శివకేశవులకు భేదంలేదని నిరూపించిన గొప్పక్షేత్రం ఇది. అందుకేముందు శివుడికి తర్వాత విష్ణువుకు ఇక్కడ అర్చన నిర్వహిస్తారు.

మంజప్పకు ఎనిమిది కిలోమీటర్ల దూరంలో శివశర్మ పూజారిగా ఉన్న 'మంజప్పకార్విల్లికావు శివటెంపుల్' ఉంది. అలాగే 'తెక్కేమదోం' అనేచోట శ్రీకృష్ణుని గుడి పక్కనే తిరుచ్చి శంకరమఠం ఉంది. ఈ మఠానికి చెందిన వారికే పూజార్హత. శంకరుని తల్లి ఆర్యామ్బకు దహన సంస్కారాలను జరిపినచోటు ఇప్పుడు శంకరాలయంలోనే ఉంది. పది నంబూద్రి కుటుంబాలలో శంకరునికి సాయం చేసినవి రెండే రెండు కుటుంబాలు. ఈ ప్రాంతాన్ని 'కపిల్లమన' అంటారు. ఆనాటి నుంచి ఈనాటి వరకు నిత్య దీపారాధన జరుగుతూనే ఉండటం విశేషం.

కాలడికరవు (ఆడట్టుకడవు) దగ్గరే నది మార్గం మారి కాలడి గ్రామం ఏర్పడింది. ఇక్కడే శంకరులు శ్రీకృష్ణ విగ్రహం స్థాపించారు. శ్రీకృష్ణ ఉత్సవాలలో ఇక్కడి నుండే జలాన్ని తీసుకువెడతారు. 'మూతలలకడవు' అంటే మొసలిఘాట్ –క్రోకడైల్ఘాట్ అంటారు. ఇక్కడే నదిలో స్నానం చేస్తుంటే బాలశంకరుని మొసలి పట్టుకుంది. తల్లి అనుమతితో నీటిలోనే ఆపద్ధర్మ సన్యాస దీక్ష తీసుకొన్నాడు బాలశంకరులు. ఇవి కాక శ్రీశంకరాచార్య యూనివర్సిటి, కాలేజి, ఇంజినీరింగ్ కాలేజి చూడతగిన ప్రదేశాలు.

## అనంతపద్మనాభుడి నుండి అరుణాచలేశ్వరుని దాకా-3

### చిదంబరేశ్వర సందర్శనం

9-2-14 ఆదివారం చెన్నై ట్రెయిన్‌లో పగలంతా ప్రయాణం. తిరుచ్చి మదురా తిరునల్వేలి వగైరా స్టేషన్‌లు దాటి ప్రయాణం చేసింది రైలు. అక్కడ కులోత్తుంగ స్టేషన్‌లో ప్లాట్ ఫాంపై వేస్తూన్న వేడి వేడి ఇడ్లీలు వడలు కొని తిన్నాం రుచికరంగా ఉన్నాయి. అంతకు ముందే నేను బ్రష్ చేసి సంధ్య, పూజా పారాయణ చేశాను. కాఫీ త్రాగాం. ప్రదేశాలను చూస్తూ కాలక్షేపం, మా మనవడు సంకల్ప్ తంజావూర్‌లో బి టెక్ ఫైనల్‌లో ఉన్నాడు. ట్రిచి మీదుగా ట్రెయిన్ వెళ్తుందని ముందు మాకు తెలియదు. తెలిస్తే వాడికి ఫోన్ చేసి స్టేషన్‌కు రమ్మనే వాళ్ళం. ట్రిచి స్టేషన్ దాటిన తర్వాత అనిపించింది. సరే. సాయంత్రం నాలుగు పదికి విరుదా చలం జంక్షన్ చేరాం. సామాన్లను మేమే దింపుకొని, స్టేషన్ బయటికి వచ్చాం. అక్కడి నుండి బస్ మీద చిదంబరం వెళ్లాలని మొదట అనుకొన్నాం. కాని ఇక్కడి నుండి కారు మాట్లాడుకొని సరాసరి వెడితే రాత్రి దర్శనం కలుగుతుందని వెంటనే నిర్ణయించి పన్నెండు వందలకు

కారు మాట్లాడుకొని చిదంబరం ఆరు గంటలకు చేరాం. మేము బుక్ చేసుకొన్న హోటల్ పేరు 'అక్షయ్'. సింగిల్ రూమ్‌కు రెండు వేల రూపాయలు కట్టాం. నాలుగు బెడ్స్. విశాలంగా బాగా నీట్‌గా ఉంది. కాఫీ తెప్పించి తాగి స్నానాలు చేసేశాం.



ఏడుమ్బావుకు నలభై రూపాయలిచ్చి చిదంబరం దేవాలయానికి చేరుకొన్నాం. హోటల్‌కు చాలా దగ్గరే సమయం చాలదని ఆటోలో వెళ్లాం. అప్పటికే ఎనిమిదయింది. సేవల కోసం ఇరవై నిమిషాలు దర్శనం ఆపేశారు. ఎనిమిదిన్నరకు దర్శనానికి అనుమతించారు. చాలా దూరం నుంచే దర్శనం. నటరాజస్వామి సరిగ్గా కనిపించలేదు. గర్భగుడి అంతా చీకటి. నల్ల విగ్రహం. హారతి దీపం వెలుగులో దర్శనం చేయాలి. నాకేమీ సంతృప్తి నివ్వలేదు. ఇంతదూరం ఆశపడి వచ్చి ఇదేమిటి అనిపించింది. పూజారులు లోపలి బయటికి తిరుగుతూ విగ్రహానికి అడ్డం వస్తూ చిరాకు కల్గించారు. అప్పుడు నేను కేకలేశాను పూజారుల మీద. "ఇంత దూరం ఇంత డబ్బులు ఖర్చుపెట్టి మీ పృష్టభాగాలను చూడటానికి రాలేదు. మేము దేవుని ముఖం చూడటానికే వచ్చాం తప్పుకొండి" అని ఇంగ్లీష్‌లో అరిచాను. అప్పుడు పక్కకు తప్పుకున్నారు. అప్పుడు కొంచెం దర్శనం బాగా అయింది. డబ్బులు దొబ్బి లోపలి పంపిస్తున్నారని తర్వాత తెలిసింది. కేరళలో అనంత పద్మనాభుడి గుడిలో దర్శనానికి నూట యాభై రూపాయల స్పెషల్ టికెట్లు తీసుకొన్నాం. దానితోబాటు వాళ్ళు పూజా సామగ్రి ఇచ్చారు. దర్శనం తర్వాత ప్రసాదం పంచామృతం ఇచ్చారు. గురవాయూర్‌లో దర్శనం ఫ్రీ. ఇక్కడ పది చేతిలో పెడితే స్వర్ణ మందిరంలోకి ప్రవేశం కల్పించి దర్శనం చేయిస్తున్నారు. ఈ విషయం దర్శనం తర్వాతే తెలిసింది. ఉదయం దర్శనం డబ్బులిచ్చి చేయాలను కొన్నా.. అక్కడే శ్రీ గోవిందరాజస్వామి దర్శనం చేశాం. అమ్మవారు శివ కామి దర్శనంకు వేళ అయిపోయింది. గుడి మూసేశారని చెప్పారు. దర్శనం తర్వాత ఫోటోలు కొని హోటల్‌కు నడిచి వెళ్లి అన్నం లేకపోతే ఇడ్లీ తిని రూమ్‌కు నడిచి చేరాం. హాయిగా రూమ్‌లో నిద్ర పోయాం.



# చిదంబర శ్రీ నటరాజ దేవాలయం

తమిళనాడులో చిదంబరంలో సుప్రసిద్ధ నటరాజస్వామి ఆలయాన్ని జీవితంలో ఒకసారైనా సందర్శించకపోతే జీవితం వృథా. అంతచక్కటి గొప్ప ఆలయం ఇది. శిల్పం పరాకాష్ట స్థాయికి తెచ్చిన ఆలాయనిర్మాణం సంభ్రమాశ్చర్యాలకు గురిచేస్తుంది. దీని శిల్పి విది వేల్విదుగు పెరుమతక్కన్. ఆయన శిల్పచాతుర్యానికి జోహార్లు. ఆలయాన్ని పల్లవ, పాండ్య, విజయనగర రాజులు వృద్ధిచేసి పోషించారు. ఇక్కడి కంచు శిలావిగ్రహాలు విశేషనాణ్యత చెందినవి. ఒకప్పుడు ఈ ప్రాంతం అంతా చింతచెట్లుతో బహుదట్టంగా అరణ్యంగా ఉండేది. ఇప్పుడు కూడా దారికిరువైపులా గుత్తులు గుత్తులుగా కాసిన చింతచెట్లు కనిపించి ఆనందాన్ని చేకూరుస్తాయి.

## చిదంబరాలయం

ఆలయగోపురం బంగారు తాపడం చేయబడి ఉంటుంది. ముఖ్యదైవం తిల్లైకూతన్ లేక తిల్లైనటరాజ్. అంటే నాట్యంచేసే శివుడు అని అర్థం. ఆయన చేసేది విశ్వనృత్యం అంటే కాస్మిక్డాన్స్. అమ్మవారు శివకామి. గర్భగుడిలో స్ఫాటికలింగం ఉంటుంది దీన్నే 'ఆకాశలింగం' అంటారు. ఈథర్స్పేస్ అని పిలవచ్చు. పంచభూత శివలింగాలలో దీనికే ప్రాధాన్యత ఉంది. 51 బంగారు బిల్వదళాల మాల స్వామికి అలంకరణగా ఉండి శోభాయమానంగా కనిపిస్తుంది. శివుడు 'ఆనంద తాండవ నృత్యం' చేస్తాడిక్కడ. 'పొన్నంబలం' అంటే స్వర్ణధామంలో నటరాజస్వామి కొలువై ఉంటాడు. ఆలయంలో భరతనాట్య భంగిమలున్న స్తంభాలు ఆకట్టుకొంటాయి.

ఆలయంలో అయిదు విశాల సభలు ఉన్నాయి. నిరంతరం మూడు వేదాలను పారాయణ చేసే బ్రాహ్మణులు దర్శనమిస్తారు. పాండ్య, నాయక్రాజ శిల్పకళ ముగ్ధుల్ని చేస్తుంది. ఎన్నో తటాకాలున్నాయి. ఒకటి కాళికా అమ్మవారైన శివకామి అమ్మవారి ఆలయానికి చెందినది. పతంజలి మహర్షి, పులికాల్ముని సందర్శించిన క్షేత్రం. 275. శివక్షేత్రాలలో అతిముఖ్యమైనది చిదంబరం. మధ్యయుగ శైవసాహిత్యంలో చిదంబరాన్ని అంబరానికి ఎత్తిన ప్రశస్తి కనిపిస్తుంది. తిరునాఉక్కరుసు, తిరుజ్ఞాన సంబందార్, సుందరకవి మొదలైనవారంతా నటరాజస్వామిని తనివితీరా వర్ణించారు, దర్శించి తరించారు. రెండవ కులోత్తుంగచోళుడు నాయనార్ల





దివ్యచరిత్రలను వెయ్యికాళ్ళ మండపంలో చెక్కించాడు. కోనేశ్వర (త్రిన్కోమలి) కైలాసాలతో దీన్ని పోలుస్తారు.

## శివతాండవం

ఈ సుందర అరణ్య ప్రాంతంలో చింతవృక్షాల నీడన శివుడు హాయిగా భిక్షాటన చేసేవాడు. ఇక్కడ వేలాది మునీశ్వరులు తపస్సు చేసుకొనేవారు. శివుడు సంధ్యానృత్యం చేస్తుంటే విష్ణువు మోహినీ రూపంలో అనుసరించేవాడు. మునులు ఇబ్బందిగా బాధపడేవారు. అరణ్యంలో ఉన్న సర్పాలను శివుడిపైకి ఉసిగొల్పారు మునులు. భయపడి పారిపోతాడనుకొన్నారు. కాని వాటిని శరీరంపై అలంకరణగా దాల్చాడు శివుడు. లాభంలేదని శివుడిపై పులిని ప్రేరేపించి పంపారు. దాన్ని చీల్చి దాన్ని చర్మాన్ని వస్త్రంగా చుట్టుకొని గోళ్ళను ధరించాడు. మునులు 'మాయలక' అనే రాక్షసుడికి తమశక్తులన్నీ ధారపోసి శివుడిపైకి పంపారు. శివుడు చిరునవ్వుతూ, ఆ రాక్షసుడి వీపుపై నిల్చుని 'ఆనంద తాండవం' చేశాడు. అదే చిదంబరంలోని నటరాజ విగ్రహంలో మనకు కనిపిస్తాయి. ఋషులకు కనువిప్పు కలిగింది. శివుని ముందు మంత్రాలు తంత్రాలేవీ పనిచేయవని వీటికి ఆయన అతీతుడు అని గ్రహించారు. దాసోహం అన్నారు. శివోహం అని తెలుసుకొన్నారు.

## దేవాలయ వైశిష్ట్యం

40 ఎకరాలసు విశాల దేవాలయం చిదంబర నటరాజ ఆలయం. చిత్ అంబరమే చిదంబరం. విమాన గోపురాన్ని 907-1014 కాలంలో రాజరాజు, కులోత్తుంగచోళుడు అనేక నిర్మాణాలు చేశారు. రాజరాజచోలుడి కుమార్తె రెండవ కుందవల్లి నిత్యపూజకు భారీ విరాళాన్ని 1118-1135 కాలంలో అందజేసింది. శివకామి అమ్మన్ దేవాలయం వద్ద 'శివగంగ తటాకం' ఉంది. ఆలయంలో అయిదు ప్రాకారాలున్నాయి. బయటిది బహిరంగ ప్రాకారం అంటే ఓ పెన్ప్రాకారం. లోపలి ప్రాకారంలో శివుడు ఉంటాడు. ఇంతకీ చిదంబరం అసలు విశిష్టత ఏమిటి? "విశ్వహృదయపద్మం యొక్క స్థానమే చిదంబరం". అంటే విరాట్ హృదయ పద్మస్థానమే చిదంబరం అని గ్రహించి మనం దర్శించాలి. నటరాజస్వామిని 'సకలచిరుమేని' అంటారు.

## చిదంబర రహస్యం

గర్భగుడిలో శివుడు మూడు రూపాలలో దర్శనమిస్తాడు. అసలు రూపం



నటరాజమూర్తి. దీన్ని 'సకలరూపం' అంటారు. ప్రక్కనే ఉన్న స్ఫటిక లింగంను 'సకలనిఖిలరూపం' అంటారు. మూడవది రూపరహిత ఆకాశ రూపం. దీనినే 'నిష్కలరూపం' అంటారు. ఇదే చిదంబర రహస్యం. ప్రపంచ అయస్కాంత మధ్యగత రేఖ అంటే 'మాగ్నటిక్మెరిడియన్' చిదంబరంలో ఉంది. అందుకే చిదంబరానికి అంతటి ప్రాధాన్యత వచ్చింది.

ఐదు పంచభూత ఆలయాలలో చిదంబరం ఆకాశలింగం. అరుణాచలంలో అగ్నిలింగం ఉంది. శ్రీకాళహస్తిలో వాయులింగం ఉంది. కంచిలో ఏకాంబరేశ్వర ఆలయంలో పృథ్విలింగం ఉంది. జలలింగం తమిళనాడులో నిజంబుకేశ్వరంలో ఉంది (తిరువనైకావల్) అంటే నాలుగు లింగాలు తమిళనాడులోనే ఉన్నాయి. ఒక్క వాయులింగమే ఆంధ్రప్రదేశ్‌లోని కాళహస్తిలో ఉంది.

## ఆలయ నిర్మాణంలో నిక్షిప్తమైన ఆధ్యాత్మిక భావనలు

చిదంబర నటరాజ ఆలయానికి తొమ్మిది ద్వారాలున్నాయి. ఇవి మానవ శరీరంలోని నవరంధ్రాలకు ప్రతీకలు. స్వర్ణమందిరం లేక చిత్త సభ లేక గర్భాలయం మానవ హృదయానికి ప్రతీక. పంచాక్షర పది. చిహ్నం అదే శివాయనమహః. దీనినే 'కనకసభ' అంటారు. చిత్సభ నాలుగు స్తంభాలపై ఉంటుంది. ఈ స్తంభాలు నాలుగు వేదాలకు ప్రతీకలు. పొన్నాంబలం అనే గర్భాలయం 28 స్తంభాలపై ఉంటుంది. ఇవి ఇరవై ఎనిమిది ఆగమశాస్త్రాలకు ప్రతీకలు. పైకప్పు 64 అడ్డ దూలాలతో ఉంటుంది. ఇవి 64 కళలకు చిహ్నాలు. మిగిలిన అనేక క్రాస్బీమ్స్మానవ శరీరంలోని రక్తనాళాలకు ప్రతీకలు. పైకప్పు 21,600 బంగారు ఇటుకలతో నిర్మించబడింది. వాటిపై శివాయనమఃఅని రాయబడి ఉంటుంది. ఇవి మానవుడు జీవితకాలంలో పీల్చే ఉచ్ఛ్వాస నిస్స్వాసాలకు ప్రతీక. వీటిని బంధించటానికి ఉపయోగించిన 72 000 బంగారు మేకులు



మానవ శరీరంలోని సమస్తనాడులకు ప్రతీకలు. పైకప్పులోని 9 కలశాలు నవశక్తులకు చిహ్నాలు. అర్ధమండలంలోని 6 స్తంభాలు ఆరు శాస్త్రాలకు ప్రతీకలు. అర్ధమండపానికి ఉన్న 8 స్తంభాలు ఎనిమిది పురాణాలకు సంకేతం.

ఆలయానికి ఉన్న తొమ్మిది ద్వారాల్లో నాలుగు ద్వారాలపై ఉన్న గోపురాలు ఏడు అంతస్తులు కలవి. ఇవి తూర్పుముఖంలో ఉన్నాయి. దక్షిణ గోపురాన్ని పాండ్యరాజు 'చొక్కాసీయతిరునవై' నిర్మించాడు. పాండ్యరాజులు రెండు పెద్దచేపలను నిర్మించారు. పశ్చిమ గోపురం 1150 కాలానికి చెందింది. ఇక్కడ దేవత మహిషాసురమర్దిని అమ్మవారు.. స్కందుడు నెమలిపై కనిపిస్తాడు. ఉత్తర గోపురం 1509-15లో శ్రీకృష్ణదేవరాయలు నిర్మించాడు. తూర్పు గోపురాన్ని పల్లవరాజు 'కోపెరుంసింగం' 1243-79లో నిర్మించాడు. తూర్పు ద్వారంపై 108 భరతనాట్య భంగిమలు భరతుడు రాసిన నాట్యశాస్త్రం ఆధారంగా శిల్పీకరించి చూపరుల దృష్టిని ఆకర్షిస్తాయి.

నటరాజ దేవాలయంలో కనకసభలోనే పూజాదికాలు నిర్వహిస్తారు. నృత్యసభలో 56 స్తంభాలుంటాయి. ముందు ధ్వజస్థంభం పెద్దదిగా ఉంది. ఇక్కడే కాళికాదేవిని నాట్యంలో శివుడు ఓడించాడు. ఆ భంగిమ కనిపిస్తుంది. రాజసభలో వెయ్యికాళ్ళ మండపం ఉంది. ఇదే సహస్ర దళపద్మం. సహస్రారానికి ప్రతీక. ఇక్కడే భగవద్దర్శనం లభిస్తుంది. ఈ చక్రమే వెయ్యి రేకుల పద్మానికి గుర్తు. సహస్రారచక్రంపైనే ధ్యాన ఉంచాలి. ఇదే భగవద్సాన్నిధ్యం. ఇదే యోగ రహస్యం. ఉత్సవ రోజుల్లోనే ప్రవేశం. దేవ సభలో పంచమూర్తులు గణేశుడు, సోముదుస్కందుడు, శివానందనాయకి మురుగన్, చండికేశ్వరులు ఉంటారు. ఈ విషయాలు ఎవరూ చెప్పరు. నేను ఇవన్నీ చదివి తెలుసుకొని మేము చూసిన అన్ని దేవాలయ విశేషాలను నోటుబుక్లో రాసుకొని మిగిలిన ముగ్గురికి ఆలయానికి వెళ్ళేముందే చెప్పి ఆ దృష్టితో చూడమని చెప్పాను. వాళ్ళు ఎంతో ఆనందించారు. ఇవన్నీ తెలుసుకొని దర్శిస్తేనే మనకు సంతృప్తి కలుగుతుంది. అంత ఓపికా, తీరికా ఉండాలి.



## శివాలయంలో విష్ణ్వాలయం

చిదంబరాలయంలో శ్రీగోవిందరాజస్వామి ఆలయం ఉండటం ప్రత్యేకతను

సంతరించుకొంటుంది. శివకేశవ అభేదానికి తార్కాణగా నిలుస్తుంది. ఇది 108 వైష్ణవి దివ్యక్షేత్రాలలో ఒకటిగా గుర్తింపు పొందింది. మహారాజ కవికులశేఖర ఆళ్వార్దీన్ని తన రామాయణంలో 'చిత్రకూటం' అని పేర్కొన్నారు. ఈ ఆలయంలో మూర్తి అచ్చంగా తిరుపతిలోని గోవిందరాజస్వామిలాగా ఉంటుంది. ఒకప్పుడు ఇక్కడి ఉత్సవమూర్తిని భగవద్రామానుజులు ఎత్తుకొని తనకు పడిన శిక్ష తప్పించుకోవటానికి పారిపోయారు. 1564-1572లో కృష్ణప్ప నాయకుడు మళ్ళీ విగ్రహ ప్రతిష్ట చేశాడు. నటరాజు ఆలయంలో విష్ణుమూర్తిని పెట్టటం ఏమిటని శైవులు అడ్డు పెట్టారు. కాని రాజు ప్రతిష్ట చేసేశాడు. శైవులకు వైష్ణవులకు కోర్టు తగాదాలు చాలా కాలం నడిచాయి. చివరికి కోర్టు వైష్ణవుల పక్షాన్నే అంటే ఆళ్వారుల పక్షాన్నే తీర్పునిచ్చింది. తగాదాలు సమసిపోయాయి. శివకామి ఆలయం నటరాజ ఆలయానికి వెనక ఉంటుంది. అమ్మవారు సర్వశుభదాయిని. కాళికామాత అంశ ఆలయం ప్రవేశమందిరంపై కప్పుమీద శివపార్వతుల కళ్యాణ ఘట్టాల వర్ణచిత్రాలు కన్నుల పండువుగా కనిపిస్తాయి.

## వైదీశ్వరాలయం



10-2-14 సోమవారం తెల్లవారు ఝామునే లేచి అన్నీ పూర్తిచేసుకొని ఇరవై ఏడు కిలోమీటర్ల దూరంలో ఉన్న 'వైదీశ్వరాలయం'కు హోటల్ వాళ్ళతో కారును తొమ్మిది వందల రూపాయలకు మాట్లాడుకొని ఆరు గంటలకే బయల్దేరాం. అక్కడ ఉన్న శివుడు సకల రోగ నివారకుడు. వైద్యనాథ శివుడన్నమాట వైదీశ్వరుడు అంటారు. చాలా ప్రాచీన దేవాలయం. గొప్ప మహిమ గల శివుడు. అంగారక క్షేత్రంగా కూడా ప్రసిద్ధి. అంగారక దోషం ఉన్నవారు అంటే కుజ దోషం ఉన్నవారు ఈ శివుడిని అర్చిస్తే దోష హరం అవుతుంది. పతంజలి విగ్రహం అగస్త్య మహాముని విగ్రహం ఉన్నాయి. పెళ్ళిళ్ళు జోరుగా ఆలయంలో జరుగుతున్నాయి. మహా సందడిగా ఉంది. ఇక్కడే శ్రీ రాముడు జటాయువుకు దహన సంస్కారాలు చేశాడు. అది గుడిలోనే ఉంది. దీన్ని జటాయు తీర్థం అంటారు. ఇక్కడ కోనేరును 'అమృత పుష్కరిణి' అంటారు. ఈ జలం సర్వ రోగ నివారిణి. సీసాలతో పట్టుకొని ఇంటికి తెచ్చుకున్నాం. శిరస్సున



అక్కడే చల్లు కొన్నాం. అమ్మవారు కాళీమాత రూపం. ఇది నాడీ జ్యోతిషానికి పేరున్న కేంద్రం. అగస్త్యుడే నాడీ జ్యోతిష్యాన్ని ఇక్కడ ఏర్పాటు చేశాడట. ప్రసాదాలు కొని, తిని కారులో ఎనిమిదిన్నరకు హోటల్ అక్షయ్ కు చేరుకొన్నాం. వాళ్ళ షెడ్యూల్‌లో ఈ రోజు మాకు బ్రేక్ ఫాస్ట్ ఉచితం. రెస్టారెంట్‌కు వెళ్లి ఇడ్లీ, గారే, ఊతప్పం తిన్నాం. వడలు మహా రుచిగా ఉన్నాయి. కారప్పొడి కమ్మగా రుచిగా ఉంది. గారెలతో పొట్ట నిపుకొన్నాం. ఎన్నైనా తినచ్చు లిమిట్ లేదు. కాఫీ త్రాగాం. సామాన్లు రూమ్‌లో పడేశాం. సోమవారం శివదర్శనం మహదానందంగా ఉంది. నడిచి నటరాజ స్వామి ఆలయానికి చేరుకొన్నాం. నలభై ఎకరాల ఆలయం. ఇది అనేక ప్రాకారాలు శిలాస్తంభాలు నాట్య రీతులున్న శిల్పాలు అంతా కన్నుల పండువుగా దర్శించాలి. మనిషికి యాభై రూపాయలు చేతిలో పెట్టి నటరాజ స్వామిని దగ్గరగా చూశాం. తనివి తీరా చూడ గలిగాం. ఆ భంగిమ చూసి తరించాం. నటరాజు గురించి వర్ణించి రాశాను కాని స్వయంగా చూడటం ఇదే.. చరితార్ధకమయింది నా జన్మ. అక్కడి నుండి అమ్మవారు 'శివకామి"ఆలయానికి వెళ్లాం. అక్కడ పైకప్పు మీద చక్కని వర్ణ చిత్రాలతో పార్వతీ కళ్యాణ ఘట్టాలు పులకింప జేశాయి. చిలక ముక్కు ఉన్న శుక మహర్షి చిత్రం మహాద్భుతంగా ఉంది. రాంబాబు ఫోటోలు తీయబోతే కోప్పడి వెంటబడితే బయటికి పరుగెత్తుకొని పారిపోయాడు. నేను ఎవరికంట పడకుండా ఫోటోలు నొక్కేశాను. నా జోలికి ఎవరూ రాలేదు. వాడు త్రివేంద్రంలో రవివర్మ చిత్రపటాలను ఫోటో తీస్తూ దొరికి పోయాడు. వాటిని అక్కడి మేనేజర్ కెమేరా లాక్కుని తొలగించింది కూడా. నేను తీశాను కానీ చిక్కలేదు. డబ్బు కట్టి ఫోటోలు తీసుకోవచ్చు ఎక్కడైనా. అన్నీ తిరిగి చూసి పన్నెండు గంటలకు నడిచి రూమ్‌కు చేరుకొన్నాం. సామాన్లను తీసుకొని ఎదురుగా ఉండే బస్‌స్టాండ్‌కు చేరాం. మధ్యాహ్నం ఒకటి ఇరవైకి బయల్దేరే బస్‌లో ఎక్కి మనిషికి డెబ్భై రూపాయల చార్జితో తిరువన్నామలై బయల్దేరాం.

## వైద్య ఈశ్వర (వైదీశ్వర) ఆలయం

తమిళనాడులో చిదంబరానికి ఇరవైఏడు కిలోమీటర్ల దూరంలో వైద్యంచేసే ఈశ్వరుడైన వైదీశ్వరాలయం ఉంది. ఈ శివదర్శనం సకలరోగహరణం. నవగ్రహ దేవాలయాలలో ఇది అంగారక క్షేత్రం. ఆలయం ప్రక్కనే ఉన్న పుష్కరిణి 'అమృత



పుష్కరిణి' అంటారు. ఇక్కడ స్నానం చేసినా ఈ నీరు తాగినా రోగాలన్నీ మాటుమాయం అవుతాయని ప్రగాఢ విశ్వాసం. అందుకే కాశీ, ప్రయాగలలో లాగా ఈ నీటిని భద్రంగా దాచుకొని తెచ్చుకుంటారు. తీర్ధంలాగా సేవించి వ్యాధులను పోగొట్టుకొంటారు. ఏడవ శతాబ్దంలో నాయనార్లు నిర్మించిన ఆలయం ఇది. ఈ మహిమాన్విత ఆలయాన్ని శ్రీరాముడులక్ష్మణ సమేతంగా దర్శించాడు. సప్తరుషులు సందర్శించిన క్షేత్రం ఇది.

అరణ్యవాసంలో ఉండగా సీతాసాధ్విని రావణాసురుడు అపహరించి లంకకు తీసుకొని వెడుతుండగా చూసిన జటాయువు దశకంఠునితో పోరాడి మరణించాడన్న సంగతి మనకు తెలుసు. సీతాపహరణం వార్తను రాముడికి చెప్పి మరణించాడు ఆ పక్షిరాజు. శ్రీరాముడు తన తండ్రి దాశరధ మహారాజుకు అత్యంత ఆప్తుడు స్నేహితుడు అయిన జటాయువును పితృసమానంగా భావించి ఇక్కడే దహన సంస్కారాలను విధ్యుక్తధర్మగా నిర్వహించాడు. ఆ ప్రదేశాన్ని ఇక్కడ 'జటాయుకుండం' అని పిలుస్తారు. స్వామి ఆలయానికి వెనుక భాగాన ఉంటుంది. ఇక్కడే శ్రీరామలక్ష్మణ జటాయు, నాథముని గాలవమునుల చిన్న విగ్రహాలు ఆ సంఘటనకు సాక్షీభూతంగా కనిపిస్తాయి.

కుజుడు అని పిలువబడే అంగారకుడికి ఒకప్పుడు కుష్టురోగం వచ్చి విపరీతంగా బాధపడ్డాడు. మహర్షుల మాటవిని ఈ వైదీశ్వరక్షేత్రానికి వచ్చి వైద్యఈశ్వరుడైనా వైదీశ్వరుడిని భక్తిగా నిష్టగా కొలిచాడు. శివుని అనుగ్రహంతో అంగారకుని కుష్టువ్యాధి నయమైంది. అంగారక విగ్రహం ఇక్కడ ఉంది. కుజదోషం ఉన్నవారు ఈ శివుడిని పూజిస్తే దోషనివారణం అవుతుందని నమ్మకం. ఆచార్య ధన్వంతరి కూడా ఈ స్వామిని అర్చించి తరించాడు. షణ్ముఖుడైన కుమారస్వామిని తల్లి పార్వతీదేవి ఒక్కముఖంతో కనిపించమని ముద్దుగా కోరితే తల్లి మాట మన్నించి ఒక్క ముఖంతో ఇక్కడే దర్శనమిచ్చాడు. తల్లి పార్వతి మురిసిపోయి ఎంతో సంతోషించి





కుమారునికి 'వీ' అనే ఆయుధాన్ని ప్రదానం చేసింది. దానితో కుమారస్వామి రాక్షసంహారం చేశాడు. ఒకసారి 'సూరపద్మ' అనే భీకర రాక్షసుడితో షణ్ముఖుడు ఘోర యుద్ధం చేశాడు. వాడు కొట్టిన బాణపు దెబ్బలకు కుమారుడి ఒళ్లంతా గాయాలై స్పృహ కోల్పోయాడు. అప్పుడు తండ్రి శివుడు వైద్యుడే కనుక కుమారుని గాయాలను వైద్యం చేసి, మాన్పి మళ్ళీ యుద్ధసంనద్ధుని చేశాడు. రెట్టించిన ఉత్సాహంతో పోరాడి ఆ రాక్షసుని సంహరించాడు స్కందుడు. ఇక్కడి శివుని విభూతి పరమ పవిత్రమైనదిగా, రోగనివారకమైనదిగా భావించి నుదుట ధరించి నోటిలో వేసుకొంటారు.

వైదీశ్వరాలయానికి అయిదు అంతస్తుల గోపురం ఆకర్షణీయంగా ఉంటుంది. లోపల సుబ్రహ్మణ్యస్వామి లోహ విగ్రహం ఉంది. ఈయన్ను 'ముత్తుకుమారస్వామి' అని ఆప్యాయంగా పిలుచుకుంటారు. నటరాజ, సోమస్కంద, దక్షిణామూర్తి, సూర్య వేద జటాయు సోదరుడైన, సంపాతి విగ్రహాలను సందర్శించి త్రేతాయుగ గాథలను జ్ఞప్తికి తెచ్చుకొంటారు.

ఇక్కడి అమ్మవారి పేరు 'తైయాలనాయకి'. అంటే దుర్గామాత అన్నమాట. ఆలయంలో శివుడు తన జటాజూటంలో బంధించిన గంగానదిని బయటకు వదిలే 'గంగావిసర్జన లోహవిగ్రహం' చూడముచ్చటగా ఉంటుంది. 1070–1120 కాలంలో రాజా కులోత్తుంగచోళుడు వేయించిన అయిదు శాసనాలు గొప్ప చారిత్రిక ఆధారాలుగా నిలుస్తాయి. అగస్త్యమహర్షి ఇక్కడి స్వామిని దర్శించి పునీతుడైనాడు. అగస్త్యుడే ఇక్కడి నాడీజ్యోతిషానికి ఆద్యుడు. వైదీశ్వరం 'నాడీ జ్యోతిషానికి' ముఖ్య కేంద్రంగా వర్ధిల్లుతోంది. నాడీజ్యోతిషంపై నమ్మకం ఉన్నవారు ఇక్కడికే వచ్చి జ్యోతిషం చెప్పించుకొంటారు. భూత భవిష్యత్వర్తమానాలను నాడీజ్యోతిషం తెలియజేస్తుందని విశ్వాసం గతజన్మలో తాము ఏ రూపంలో జన్మించామో, ఏ మంచి చెడు పనులు చేయటంవలన ఈ జన్మలో సుఖాలు కస్టాలు పడుతున్నామో తెలుసుకుంటారు. భవ్యమైన భవిష్యత్తుకు మార్గాలను తెలుసుకొంటారు. అదీ వైదీశ్వరా క్షేత్ర విశేషం. ఇహరోగాలను శివుడు బాపితే పరరోగాలను నాడీజ్యోతిషం బాపుతుందన్నమాట.

# తిరువన్నామలైలో అరుణాచలేశ్వర దేవాలయం

## తిరువన్నామలై

సాయంత్రం అయిదున్నరకు తిరువన్నామలై చేరుకొన్నాం. బస్‌స్టాండ్ దగ్గరే ఉన్న హోటల్ 'ఆకాష్'లో నాలుగు వందల యాభై రూపాయల చొప్పున రెండు రూములు ఇదివరకే బుక్ చేసుకొన్నాం. వెళ్లి కాఫీ తెప్పించుకొని త్రాగి స్నానాలు చేసి అరుణాచలేశ్వర దర్శనానికి బయల్దేరాం. అరుణాచల శివదర్శనం కండ్లారా పొంది అమ్మవారినీ దర్శించి, ఇడ్లీలను హోటల్‌లో తిని రూమ్‌కు వచ్చి హాయిగా నిద్రపోయాం. ఇలాగ మాకు మాఘ మాసం పవిత్ర సోమవారంనాడు వైదీశ్వర, చిదంబరేశ్వర, అరుణాచలేశ్వర శివ దర్శనం లభించింది అన్నమాట. చరితార్థమైన రోజుగా ఈ రోజు మిగిలిపోయింది మాకు.

తమిళనాడులో చెన్నైకి సుమారు రెండువందల కిలోమీటర్ల దూరం, చిదంబరానికి నూట నలభై కిలోమీటర్లలో తిరువన్నామలై క్షేత్రం ఉంది. ఇక్కడి కొండను అరుణాచలం అంటారు. ఈశ్వరుడిని అరుణాచలేశ్వరుడు అంటారు. పంచభూత శివలింగాలలో అరుణాచలం అగ్నిలింగ క్షేత్రం. శివుడిని 'అన్నమలయ్యార్' అని ఆర్తిగా పిలుస్తారు. అమ్మవారు పార్వతీదేవిని 'ఉన్నములైఅమ్మన్' అంటారు. ఏడవ శాతాబ్దికే ప్రసిద్ధి చెందిన ఆలయం ఇది. అరుణాచలేశ్వరాలయం 25 ఎకరాల విస్తీర్ణంలో ఆవరించి ఉంటుంది. నాలుగువైపులా నాలుగు ద్వారాలు గోపురాలు ఉన్నాయి. తూర్పుగోపురం ఎత్తు 217 అడుగులతో 11 అంతస్తులతో ఉంటుంది. ఆలయంలో వెయ్యిస్తంభాల మండపం ఆకర్షణీయం. ఉదయం అయిదుగంటల నుండి పదిగంటల వరకు దర్శనం. మళ్ళీ సాయంత్రం అయిదు నుంచి ఎనిమిదిన్నర వరకు.

కార్తీక పౌర్ణమినాడు దీపోత్సవం అరుణాచలం ప్రత్యేకత. గిరి పైభాగంలో జ్యోతిని ప్రజ్వలింపజేస్తారు. దీనికి వత్తి కిలోమీటరు పొడవు ఉంటుంది. అనేక వందల కిలోల ఆవునెయ్యితో వెలిగిస్తారు. సుమారు వారం రోజులబాటు దీపం వెలుగుతూనే ఉంటుంది. మైళ్ళ దూరానికి కూడా కనిపించి కనువిందు చేస్తుంది. ఈ కార్తీక దీపోత్సవాన్ని దర్శించేందుకు దేశం నలుమూల నుండి దాదాపు ముప్పై లక్షలకుపైనే భక్తులు వస్తారు. దివ్యజ్యోతిని దర్శించి తరిస్తారు. ఆలయాన్ని చోళరాజులు తొమ్మిదవ శతాబ్దంలో నిర్మించారు. పదహారు స్తంభాల దీపదర్శన మండపం చూడతగినది. ఆలయంలో షణ్ముఖ దేవాలయం ఉంది. ఇక్కడి మాజిఘ వృక్షం సుప్రసిద్ధమైనది.. సంతానం కోరుకొనేవారు దీనికి ఉయ్యాలకడతారు. పిల్లలు పుట్టగానే వచ్చి మొక్కు చెల్లించుకొంటారు. కళ్యాణమండపం వసంత మండపాలు కూడా ముఖ్యమైనవే. అన్నిటికన్నా 6 అడుగుల ఎత్తున్న నల్లరాతి నందివిగ్రహం మహా గంభీరంగా ఉంది.

శివుని దర్శనానికి అనుమతినిస్తున్నట్లుగా ఉంటుంది.

ఏడవ శతాబ్దిలో తిరుజ్ఞాన సంబంధార్ స్వామిపై కవితలు రాశాడు. తొమ్మిదో శతాబ్దిలో మాణిక్య సాగర్ 'ఆన్అమరి' కావ్యం రాశాడు. భగవాన్ రమణమహర్షి ఇక్కడ తపస్సు చేయటం వలన ఇరవయ్యవ శతాబ్దంలో తిరువన్నామలైకు విపరీతమైన ప్రశస్తి దేశవ్యాప్తంగా వచ్చింది.. ఇక్కడ పద్నాలుగు కిలోమీటర్ల గిరిప్రదక్షిణం చేస్తూ మధ్యలో అష్టదిక్పాలకులు ప్రతిష్టించిన శివలింగాలను దర్శిస్తూ ఆది అరుణాచలేశ్వరుని గుడి దర్శించి యాత్రను ఫలవంతం చేసుకొంటారు. ఆలయానికి కొద్ది దూరంలో ఉన్న శ్రీ రమణాశ్రమ సందర్శనంతో తిరువన్నామలై యాత్ర సంపూర్ణం అవుతుంది.

## అనంతపద్మనాభుడి నుండి అరుణా చలేశ్వరుని దాకా-4

## (చివరి భాగం)

### గిరి ప్రదక్షిణం - రమణాశ్రమం

అరుణాచలం 11-2-14 మంగళవారం తెల్లవారుఝామునే లేచి అన్ని కార్యక్రమాలు పూర్తి చేసుకొని మిగిలినవారూ, సంధ్యా పూజా, అరుణ పారాయణ మహా సౌరమంత్ర పారాయణ చేసి నేను, ఉదయం అయిదున్నరకు ఆటోలో అరుణా చలేశ్వరుడిని దర్శించాం. తీరికగా దర్శనం లభించింది. ఇరవై రూపాయల స్పెషల్ దర్శనం. తనివితీర అగ్ని జ్యోతిర్లింగాన్ని దర్శించి తరించాం. నిన్న రాత్రి దర్శనం ఇప్పుడు ప్రభాత దర్శనం. మనసు నిండుగా ఉంది. తర్వాత అమ్మవారి దర్శనం చేశాం. అక్కడా హాయిగా దర్శనమయింది. లోపల ఉన్న కుమారస్వామి గణేష్ మందిరాలను కూడా చూసి బయటికి సంతృప్తితో వచ్చాం. అక్కడే ఉన్న హోటల్‌లో ఇడ్లీ తిని కాఫీ తాగాం. గిరి ప్రదక్షిణం అరుణాచలేశ్వరుడిని చూడటం మల్లికాగారికి ఇదే మొదటిసారి. మేము చాలాసార్లు చూశాం. ఆమెకు ఎంతో అనుభూతి కలిగింది. ఇన్నిసార్లు వచ్చినా నేనెప్పుడూ గిరి ప్రదక్షిణం చేయలేదు. పద్నాలుగు కిలోమీటర్లు చుట్టి రావాలి. మధ్యలో ఎనిమిది శివలింగాలను చూడాలి. ఇవి అష్ట దిక్పాలకులు స్థాపించిన లింగాలుగా ప్రసిద్ధి. వీటితోబాటు ఆది అరుణాచలేశ్వర దేవాలయాన్ని కూడా దర్శించాలి. ఇవన్నీ తిరిగి రావటానికి మూడు వందల రూపాయలకు ఆటో మాట్లాడుకొన్నాం గుడి దగ్గరే. మమ్మల్ని చివరికి రమణాశ్రమం దగ్గర దించాలని చెప్పాం. అలాగే అని బయల్దేరాడు. వరుసగా ఎనిమిది లింగాలు ఇంద్ర, అగ్ని, వాయు, కుబేర ఈశాన వరుణ, యమ, నైరుతి శివలింగాలను దర్శించాం. ప్రతిచోటా ఆగటం చూడటం ఫోటోలు తీయటం చేశాం. మధ్యలో ఆది అరుణాచలేశ్వర

దేవాలయంలో శివ దర్శనం అమ్మవారి దర్శనం చేశాం. అంతా పూర్తయ్యేసరికి గంట సమయం పైనే పట్టింది. ఇదే మొదటిసారి. బాగా ఉంది.

ఈ గిరి ప్రదక్షిణం కోసమే మంచి రోడ్డు వేశారు. ఇదివరకు కొండ దగ్గర నుండి ప్రదక్షణం చేసేవాళ్ళు. ఇప్పుడు ఊరు పెరిగింది. కనుక గిరి ప్రదక్షిణం కాదు 'పురి' ప్రదక్షిణం అన్నాను. గిరి చుట్టూ ఉన్న ఓషధుల గాలి మనకు సోకి ఆరోగ్యాన్నిస్తుందని భావన. శేషాద్రి స్వామి ఆశ్రమం దగ్గర దిగాం. లోపలికి వెళ్లి చూశాం. ఆయన పేర ఉన్న లింగానికి అభిషేకం జరుగుతోంది. శేషాద్రి స్వామి మహాభక్తుడుగా ప్రసిద్ధి. ఆయన జీవిత చరిత్ర పుస్తకం అక్కడే ఉన్న షాప్‌లో లేదని ప్రింట్ అవుతోందని చెప్పారు. దీనికి దగ్గరే ఉంది శ్రీ రమణాశ్రమం. శ్రీ రమణాశ్రమం నడిచి శ్రీ రమణాశ్రమంకు వెళ్లాం. నేనిదివరకు ఎన్నోసార్లు సందర్శించాను. నాకు మహా ప్రశాంతంగా ఉంటుంది ఇక్కడ. అందుకే ఎన్నిసార్లు వెళ్ళినా మళ్ళీ వెళ్లాలని పిస్తుంది. మల్లికగారికి కూడా కొత్త. ఒకటి రెండుసార్లు ఇక్కడ ఆశ్రమంలో రాత్రి ఉన్నాం. ఇప్పుడు మళ్ళీ. అన్నీ తిరిగి చూశాం. గోశాల, భోజనశాల, వంటశాల మహర్షికి ఇష్టమైన లక్ష్మీ ఆవు, పావురం, కోతి, పిల్లి, కుక్కా, వాటి సమాధులు తిరిగి చూశాం. తర్వాత ఆశ్రమలో రమణుల అమ్మవారి సమాధి శివలింగం అభిషేకం చూశాం. రమణ మహర్షి ధ్యానమందిరం ఎంతో ప్రశాంతంగా ఉంది. ధ్యానం చేసే వాళ్ళు అన్ని దేశస్థుల వారూ ఉన్నారు. ఇక్కడ కులానికి వర్ణానికి వివక్షతకు స్థానం లేదు. అది చాలు. అందరం ఒకటేనని తెలియ జేయటానికి. పుస్తకశాలలో శ్రీ కావ్య కంఠ గణపతి రాసిన 'ఉమా సాహస్రం' అలాగే 'రుభు గీత' పూర్తి పుస్తకాలు, శ్రీ పింగళి లక్ష్మీకాంతం గారి అబ్బాయి సూర్య సుందరంగారు రాసిన 'రుభు గీతా సారం' చిన్న పుస్తకం, ఫోటోలు కొన్నాను.

అందరం రమణా శ్రమంలో భోజనం చేయాలనుకొన్నాం. అదొక దివ్యానుభూతి. నలుగురి మీద కలిపి రెండు వందల రూపాయలు ఆశ్రమ నిధికి జమ చేసి రసీదు తీసుకొన్నాం. సరిగ్గా పదకొండున్నరకు భోజనం పెడతారు. పది నిముషాలు ముందు అక్కడికి చేరాలి. అయితే మనం యెంత మంది భోజనానికి వస్తామో ఆఫీస్‌లో ముందుగా చెప్పితే చాలు. అన్నం, గోరు చిక్కుడు కాయ కూర, సాంబారు, రసం, ఖీర్ అనే పాయసం, మజ్జిగ నిమ్మకాయ



ఊరగాయతో మహా ప్రసాదంగా భోజనం అడిగి అడిగి వడ్డించారు. అందరూ ఒకే పంక్తిలో కూర్చుంటే ఎంతో ముచ్చటగా ఉంది. ఫోటోలు తీశాను. అందరూ ఎంతో ఆనందించారు. మా ఎదురుగా కూర్చున్న దంపతులు మహా ముచ్చటపడి నవ్వుతూనే ఉన్నారు మేము ఫోటోలు తీస్తుంటే. పన్నెండు గంటలకు రమణాశ్రమం వదిలి ఆటో మీద ఆకాష్ హోటల్‌కు చేరుకొన్నాము. ఒక గంట విశ్రాంతి తీసుకొన్నాం.



## చెన్నైకి చేరిక

సామాను తీసుకొని ఎదురుగుండా ఉన్న బస్‌స్టాండ్ చేరాం. పావుతక్కువ రెండు గంటలకు మద్రాస్ ఎక్స్‌ప్రెస్ ఎక్కాం. వందరూపాయలు బస్‌చార్జి. కారులో వెళ్ళటానికి ఈ రెండు వందల కిలోమీటర్ల దూరానికి మూడు వేల అయిదు వందలు అడిగారు. అంత అనవసరం అని బస్‌లోనే వెళ్లాం. నైవేలీ మీదుగా బస్ చెన్నైకి నాలుగున్నర గంటలు ప్రయాణం చేసి సాయంత్రం అయిదున్నరకు చేరింది. దారిలో జీడి మామిడి తోటలు విపరీతంగా కనిపించాయి. అలాగే గురవాయూర్ నుంచి వస్తున్నప్పుడు కూడా జీడి తోటలు బాగా ఉన్నాయి. అక్కడి నుంచి సామానుతో ఆటోలో రెండు వందలిచ్చి షినాయ్ నగర్లో ఉన్న మా మేనకోడలు కళా చంద్రశేఖర్‌ల ఇంటికి అరగంటలో చేరాం. వెంటనే కాఫీ ఇచ్చింది కళ. తాగి, స్నానాలు చేశాం. అప్పటికే ఆఫీస్ నుండి చంద్రశేఖర్, మా మేనల్లుడు శ్రీనివాస్ వచ్చి మా కోసం ఎదురు చూస్తున్నారు. చంద్రశేఖర్‌కు కృతజ్ఞతలు చెప్పి అతను తీసుకొన్న శ్రద్ధకు మానిటరింగ్‌కు, ఫోన్ పలకరింపులకు ఎంతో మెచ్చాము. అందుకే దీన్ని 'శర్మా చంద్రశేఖర విజయం' అన్నాను. ముసి ముసి నవ్వులు నవ్వాడు చంద్రశేఖర్. అతని ప్రణాళికయే ఇది. మా అబ్బాయి శర్మతో అతను సంప్రదిస్తూ ప్లాన్ తయారు చేసి ఇద్దరూ కలిసి ఈ కేరళ ట్రిప్ విజయానికి కృషి చేశారు. భోజనం చేసి పడుకున్నాం. నాకు నిద్ర పట్టలేదు. అందరూ పడుకొన్నారు. .



## షాపింగ్

12-2-14 బుధవారం నా సంధ్య, పూజా, పారాయణ అయిన తర్వాత టిఫిన్ చేసి కాఫీ రెండోసారి తాగి



పదింటికి ఆటోలో బయల్దేరి 'మదర్ షా' అనే వస్త్రాలయానికి వెళ్లాం. ఎప్పుడూ ఇక్కడే బట్టలు కొంటాం. క్వాలిటీ బాగా ఉంటుంది. అన్ని రకాలు ఉంటాయి. మా అమ్మాయికి, కోడళ్ళకు మా ఆవిడకు చీరలు కొన్నాం. మనవరాళ్ళు ఇద్దరికీ పట్టు వరికిణీబట్టలు కొన్నాం. మా సువర్చలాన్జనేయస్వామికి వస్త్రాలు కొందామనుకొంటే మంచివి దొరకలేదు. అమ్మవారికి మాత్రం తీసుకొన్నాం. అన్నీ పూర్తయ్యి ఇంటికి చేరేసరికి ఒంటి గంట దాటింది. భోజనం చేసి విశ్రాంతి తీసుకొన్నాం.

## కపాలేశ్వర, పార్ధసారధి కోవెల దర్శనం

సాయంత్రం నాలుగింటికి ఏ.సి.టాక్సీ నాలుగు గంటలకు ఆరువందల రూపాయలకు మాట్లాడుకొని బయల్దేరాం. ముందుగా మైలాపూర్‌లో శ్రీ కపాలేశ్వర స్వామిని దర్శించాం. అక్కడి నుండి ట్రిప్లికేన్‌లో శ్రీ పార్ధసారధి స్వామిని సందర్శించాం. అక్కడ ముప్పావు గంట లేట్ అయింది దర్శానికి. 'మీసాల కృష్ణుడు పార్ధసారధి'. మా చిన్నప్పుడు ఎప్పుడు మద్రాస్‌కు మా అక్కయ్యావాళ్ళ ఇంటికి వచ్చినా మా అక్కయ్య లోపా ముద్ర మమ్మల్ని ఈ రెండు గుడులకూ తీసుకువెళ్ళేది. బీచ్‌లు చూసేవాళ్ళం. అక్కడి నుంచి టి నగర్‌లో ఉన్న మా బంధువులు నోరి చారిటబుల్ ట్రస్ట్ నిర్వాహకులు మద్రాస్ సిమెంట్స్‌లో అత్యున్నత అధికారిగా పని చేసిన శ్రీ నోరి రామ కృష్ణయ్య గారింటికి వెళ్లి దంపతులను చూశాం. వీరిది ఉయ్యూరు దగ్గర తోట్ల వల్లూరు. రామ కృష్ణయ్య గారు మా రెండో కోడలు. చి. సౌ. ఇందిరకు చిన తాతగారు. చాలా మంచివారు. ఈ ప్రదేశానికి వచ్చినప్పుడల్లా వల్లూరు వెళ్లి మా ఇంటికీ వచ్చేవారు. అయిదారు నెలల క్రితమే వచ్చి వెళ్ళారు దంపతులు. మా శ్రీమతికి, మల్లికాగారికి చీరా జాకెట్ పెట్టి గౌరవించారు ఆయన సతీమణి. అక్కడి నుండి సరాసరి షినాయ్ నగర్ చేరుకొని భోజనం చేసి పడుకొన్నాం. నిద్ర అసలు



పట్టనే లేదు. ఈ రెండు రోజుల్లో మల్లికగారి దగ్గర బంధువు అయిన గాయని, బాలసుబ్రహ్మణ్యం చెల్లెలు ఎస్ పి శైలజ గారింటికి వెళ్దామనుకొన్నాం. మల్లికగారు ఆమెకు ఫోన్ చేస్తే హైదరాబాద్‌లో షూటింగ్‌లో ఉన్నానని, పదిహేను రోజులు అక్కడే ఉంటానని చెప్పారు. ఆమెకు ఇవ్వటానికి సరసభారతి పుస్తకాలు కూడా తీసుకొని వెళ్లాను. కాని ఆశా భంగమే అయింది. అలాగే వెస్ట్ మాంబళంలో ఉన్న 'సంజీవినీ పీఠం'ను కూడా దర్శించాలను కొన్నాం. కాని సమయం చాల లేదు. అదీ చూడలేక పోయాం.

## శ్రీసాయిమందిర సందర్శనం - ఉయ్యూరు ప్రయాణం

13-2-14 గురువారం ఉదయమే అన్నీ పూర్తిచేసి ఆటోలో దగ్గరలోనే ఉన్న శ్రీ షిర్డీ సాయిబాబా మందిరానికి వెళ్ళాము. ఇక్కడ ఈ మందిరాన్ని ఏర్పాటు చేసిన వారు స్వామి కేశవయ్యజీ. మహాభక్తులు. తెలుగువారే. ఎంతో ప్రాచుర్యం పొందిన మందిరం ఇది. సినీ గాయిని ఎస్ జానకి మొదలైన వారంతా దర్శించి హాయిగా గానం చేసి తరిస్తున్న ప్రదేశం. చాలాసార్లు చూశాను. కేశవయ్యగారి చేతనే ఉయ్యూరులో కే.సి.పి వారు ఫాక్టరీ దగ్గర శ్రీ సాయిబాబా మందిరాన్ని ప్రారంభింప జేశారు. మద్రాస్‌లోనూ ఇక్కడా బాబా చిత్రపటాలే. ఆ తర్వాతా ఉయ్యూరులో విగ్రహం పెట్టారు. కాని మద్రాస్‌లో ఇంకా ఆ చిత్రపటానికే అ పూజాదికాలు జరుగుతాయి. ప్రశాంతమైన ధ్యాన మందిరం, ప్రసాదాలు వినాయక గుడు ఉన్నాయి. దర్శనం తర్వాత అమర స్టోర్స్‌కు వెళ్లి ప్రిస్టేజ్ చిన్నకుకర్, ఇండక్షన్ స్టవ్ వగైరాలు కొని ఇంటికి చేరాం. అమర స్టోర్స్‌లో మంచి స్టీల్ వస్తువులు లభిస్తాయి. భోజనం చేసి విశ్రాంతి తీసుకొన్నాం. రాత్రి ఎనిమిదిన్నరకల్లా భోజనాలు పూర్తి చేసుకొని కాల్ టాక్సీలో సామాను పెట్టుకొని తొమ్మిదింటికి మద్రాస్ సెంట్రల్ స్టేషన్ చేరాం. పది గంటలకు తమిళ్‌నాడు ఎక్స్ప్రెస్‌లో ఎక్కి ఐ-7లో 3,4,6,8 మా రిజర్వేషన్ బెర్త్‌లలో చేరి పడుకున్నాం. తెల్లవారు ఝామున మూడున్నరకే నాన్‌స్టాప్‌గా ప్రయాణం చేసి బెజవాడ చేరింది ట్రెయిన్. సామాన్లు కూలీలకిచ్చి రెండు వందలు సమర్పించుకొని బయట మా కోసం ఉన్న రామూ టాక్సీ ఎక్కి ఉయ్యూరుకు అయిదింటికి అంటే పద్నాలుగవ తేదీ శుక్రవారం ఉదయం హాయిగా ఉయ్యూరు చేరాం. కేరళ ట్రిప్ సర్వం సంపూర్ణం. మద్రాస్‌లో మా మేనకోడలు కళా చంద్రశేఖర్ అబ్బాయి బాలాజీ మా మేనల్లుడు శ్రీనివాస్‌లు ఎంతో మర్యాదా మన్ననా ఆప్యాయతా ఆదరణా చూపించారు. మమ్మల్ని ముగ్ధుల్ని చేశారు. అందుకే ఈ యాత్ర ఇంత సంతృప్తిగా జరిగింది. ఇన్ని రోజుల యాత్రలో మద్రాస్ వచ్చేవరకు అంటే అయిదవ తేదీ నుండి పదకొండవ తేదీ వరకు కన్యాకుమారిలో ఒకపూట, రమణాశ్రమంలో ఒక పూట మాత్రమే మేము ముగ్గురం భోజనం చేశాం. మల్లికాగారు రమణాశ్రమంలో




మాత్రమే భోజనం చేశారు. మిగిలిన రోజులన్నీ టిఫిన్‌లతో సరిపెట్టకొన్నాం. అయినా ఏ మాత్రం నీరసంగా అనిపించ లేదు. ఉత్సాహం తగ్గలేదు. ఆకలి అనిపించి ఇబ్బందీ పడలేదు. ఏ రోజుకా రోజు ఆరోజు ఖర్చులు లెక్క వేసి నలుగురికీ పంచి డబ్బులు వసూలు చేసి ఇవ్వాల్సి వస్తే ఇచ్చి ఎక్కడా రూపాయి తేడా లేకుండా జాగ్రత్తగా గడిపాము. అందువల్ల అపార్థాలు వచ్చే అవకాశం లేకుండా చేశాను. రాంబాబుకే లెక్కలన్నీ అప్పగించాను. వాడు జాగ్రత్తగా అన్నీ బాధ్యతగా చూశాడు. నలుగురం ఆనందించాం. అందుకే 'కేరళ ట్రిప్ సక్సెస్'. చూసిన క్షేత్రాల గురించి వివరంగా విశేషాలతో వెంటనే తెలియజేస్తాను.

## మల్లికాంబగారింట్లో కేరళయాత్రా సంతర్పణ

మల్లికాంబగారింటి నుంచి భోజనం మామిడికాయ పప్పు, వంకాయ చిక్కుడు కూర ఆలూఫ్రై, కొత్త మామిడిముక్కాల అవకాయి, మామిడి అల్లం పచ్చడి, పరవాన్నం, చిత్రాన్నం, గారెలు పులుసు, అదిరే తియ్యటి గడ్డ పెరుగుతో భోజనం. కడుపునిండా తిని ఉన్నాం. భవానిగారు కూడా వచ్చారు. మా ఇద్దరికీ బట్టలు పెట్టారు మల్లికగారు.

## 7) మా నవరాత్రి యాత్ర

2014 ఏప్రిల్‌లో మేమిద్దరం మా అబ్బాయి రమణ మా అమ్మాయి విజయలక్ష్మి తొమ్మిదిరోజుల ఉత్తరదేశ యాత్ర చేశాం. ఆ వివరాలనే 'మా నవరాత్రి యాత్ర'గా మీకు అందిస్తున్నాను.

## మా నవరాత్రి యాత్ర-1

### ప్రయాణానికి నేపథ్యం

మా అమ్మాయి చి. సౌ. విజయలక్ష్మి అమెరికా నుంచి ఉయ్యూరుకు సరసభారతి

నిర్వహిస్తున్న 'శ్రీ జయ ఉగాది వేడుకలు, అందులో భాగంగా మా దంపతుల యాభై వసంతాల వివాహ వేడుకల కోసం వస్తోందని తెలిసి ఎంతో సంతోషించాం. మార్చి ఇరవైన బయల్దేరి హైదరాబాద్‌కు ఇరవై రెండు చేరి అన్నల ఇళ్ళల్లో రెండు రోజులు గడిపి, ఉయ్యూరుకు చేరింది. వచ్చిన దగ్గర్నుంచి హడావిడే.

సుమారు 32 ఏళ్ళ క్రితం మా కుటుంబం మా అమ్మ అస్తికలను కాశీలో గంగలో కలిపి, అక్కడే మాసికం కూడా జరిపాం. అప్పుడు మా అమ్మాయి చిన్నపిల్ల. దాన్ని ఉయ్యూరులోనే వదిలిపెట్టి మేమిద్దరమే వెళ్ళాం. కాని పాట్నా నుంచి మా రెండో అక్కయ్యా బావగారు, మేనళ్ళుడూ మేనకోడలూ, పూనా నుంచి మా తమ్ముడు మోహను భార్యా, పిల్లలూ కూడా వచ్చారు. అప్పుడని పించింది మా అమ్మాయి విజ్జిని కూడా తీసికేడితే బాగుండేదని. కాని అస్తికలు ఉయ్యూరు నుంచి తీసుకొనివెడుతూ, అమ్మాయిని మాతో తీసుకువెళ్ళటం ఉచితం కాదని మానేశాం. అదుగో అప్పటి నుంచి మా అమ్మాయి సరదాగా గునుస్తూనే ఉంది 'నన్ను కాశీ తీసికెళ్ళకుండా వెళ్ళారు' అని. అది సరదానే అన్నా మా ఇద్దరి మనస్సులో బాధగానే ఉంది. దానికి కూడా ఉత్తరదేశ యాత్ర ఫలం కలిగించాలని గాఢంగా మనసులో నిలిచిపోయింది. పిల్లలు అమెరికాలో ఉన్నారు కనుక ఎండలైనా ఇప్పుడే దానితో మేమూ వెళ్లి చూపించాలని నిర్ణయించాం. మా అబ్బాయి రమణ కూడా వీటిని చూడలేదు. కనుక మేము నలుగురం కలిసి సుమారు వారం రోజుల యాత్రకు ఆలోచించాం.

## రిజర్వేషన్లు – టూర్ ప్రోగ్రాం

మా అమ్మాయి అమెరికా నుంచి ఇంకా బయల్దేరక ముందే మా రెండో అబ్బాయి శర్మకు వివరాలు చెప్పి కాశీ, ప్రయాగ ఖజురహో, ఉజ్జెన్, ఓంకారేశ్వర్‌ల టూర్ ప్రోగ్రాం ఖరారు చేయమన్నాం. వేసవి కనుక ఏ.సి లోనే వెళ్ళమని, టికెట్లు చూస్తానని, హోటల్ రూములు కారు కూడా ఎసి మాత్రమే వాడుదామని సూచించి టికెట్ల వేటలో పడ్డాడు. ఎప్పుడు బయల్దేరాలి అన్న సమస్య వచ్చింది. నేను మాత్రం మా శ్రీ సువర్చలాన్జనేయ స్వామి ఆలయంలో శ్రీరామనవమి కల్యాణం చేసి మాత్రమే బయల్దేరాలి అని చెప్పాను. దాని ప్రకారం ఏప్రిల్ 8 మంగళవారం శ్రీ రామనవమి కల్యాణం అయిన రాత్రికే బయల్దేరే ఏర్పాటు చేశాడు. బెజవాడ నుంచి డైరెక్ట్ టికెట్లు దొరక్క పోవటంతో సికంద్రాబాద్ వెళ్లి, ఆ మర్నాడు అంటే తొమ్మిదో తేదీ ఉదయం పది గంటలకు సికందరాబాద్ నుంచి బయల్దేరే పాట్నా ఎక్స్‌ప్రెస్‌కు బయల్దేరేట్లు బుక్ చేశాడు. అది మర్నాడు అంటే పదవ తేదీ మధ్యాహ్నం అలహాబాదు చేరుతుంది. అక్కడ రైల్వే రిటైరింగ్ రూమ్స్ బుక్ చేశాడు. ఆ రోజంతా అలహాబాద్‌లో త్రివేణీ స్నానం నగర దర్శనం. మర్నాడు ఉదయమే నాలుగింటికి వారణాసి ఎక్స్‌ప్రెస్‌లో బయల్దేరి ఏడింటికి

కాశీ చేరటం 'కరి వెన' వారి సత్రంలో రూమ్స్‌లో ఉండి, అక్కడే భోజనం చేయటం, పన్నెండవ తేదీ సాయంత్రం ఖజురహోకి వెళ్ళే బుందేల్ ఖండ్ ఎక్స్‌ప్రెస్ ఎక్కి పదమూడు ఉదయం ఖజురహో చేరటం, ముందే బుక్ చేసిన హోటల్ రూమ్‌లో ఉండి స్నానాల తర్వాత కారులో ఖజురాహో దేవాలయ దర్శనాలు, వాటర్ ఫాల్స్ చూడటం రాత్రికి బయల్దేరి పద్నాలుగవ తేదీ ఝాన్సి మీదుగా ఉదయం ఉజ్జైన్ చేరటం. అక్కడే రైల్వే రూమ్స్‌లో ఉండటం. ఆ రోజూ మర్నాడు దర్శనాలు పదిహేను ఉదయం భస్మ హారతి దర్శనం తర్వాత ఏడింటికి బయల్దేరి కారులో ఓంకారేశ్వర్ వెళ్ళటం, రాత్రికి అంటే తెల్లవారితే పదహారు బయల్దేరి భోపాల్ మీదుగా విజయవాడకు రాత్రి రెండు గంటలకు చేరటంగా శర్మ టూర్ ప్రోగ్రాం తయారు చేసి ఆన్‌లైన్ రిజర్వేషన్ చేశాడు. హోటల్ రూములు రైల్వే రూములు కార్లు అన్నీ ఫోన్‌లోనో, ఆన్‌లైన్‌లోనో బుక్ చేశాడు కనక మాకు ఏ టెన్షన్ లేకుండా పోయింది.

ఉగాదికి అందరం ఉయ్యూరులో కలుసుకొన్నాం. ఉగాది వెళ్ళిన తర్వాతే నేను ప్రయాణం మూడ్‌లోకి వచ్చి టికెట్లు వరుసలో రమణ డౌన్ లోడ్ చేసి ప్రింట్ అవుట్ తీసి ఇస్తే లైన్‌లో పెట్టుకొన్నాను. మధ్యలో ఒక మార్పు జరిగింది. ఉజ్జైన్ నుంచి ఓంకారేశ్వర్‌కు రైల్ ప్రయాణానికి తిరుగు ప్రయాణానికి బుక్ చేశాడు ముందే. కాని రైల్వేవాళ్ళు అ ట్రాక్‌ను తీసేస్తున్నారని తర్వాత తెలియజేశారట. అందుకని రిజర్వేషన్ కేన్సిల్ చేసి ఉజ్జైన్ నుంచి ఓంకారేశ్వర్ అక్కడినుండి ఉజ్జైన్‌కి కారు బుక్ చేయాల్సి వచ్చింది. ఇది రేపు ప్రయాణం అనే వరకూ నేను గమనించలేదు. అప్పుడు శర్మకు ఫోన్ చేయటం వాడు వివరించి చెప్పటంతో విషయం అవగతమైంది.

## ప్రయాణ సన్నాహాలు

ఇక ప్రయాణ సన్నాహాలు ప్రారంభించాం. తలొక చిన్న సూట్‌కేసు, ఒక హాండ్ బాగ్‌తో బయల్దేరాలను కొన్నాం. అలహాబాద్ చేరే దాక భోజనం టిఫిన్ వగైరా అంతా తయారు చేసి తీసుకొని వెళ్ళాలను కొన్నారు తల్లీ కూతుళ్ళు. మా అమ్మాయి తెచ్చిన 'థేర్మో కూలింగ్ బాగ్'లో ఐస్ క్యూబులు వేసి ఇంట్లో తయారు చేసిన పూరీ కూర, అట్లూ అందులో సర్దారు. రెండు రోజుల వరకు అందులో పదార్థం వేడిగా చల్లగా ఉంటుంది. అదీ ఆ బాగ్ ప్రత్యేకత. బిస్కెట్లు పళ్ళూ పెరుగు అన్నీ సర్దారు. కాఫీ, మంచినీళ్ళకు డిస్పర్సిబుల్ గ్లాసులు, ప్లాస్టిక్ ప్లేట్లు, అరటి ఆకులు, నదీ స్నాన సమయంలో దీపారాధనకు అరటి దోప్పలూ, వత్తులూ, ఆవు నేయి అన్నీ వాళ్ళే సర్దుకొన్నారు. నేను ఆ క్షణం వరకూ కంప్యూటరులో ఆర్టికల్స్ రాయటం మా ఆవిడ భాషలో 'కంపు కొట్టు కొంటూ' శ్రీరామ నవమి ఫోటోలు పంపటం, మహిళా మాణిక్యాలు బుక్ పోస్ట్‌లో హితులకు సన్నిహితులకూ పంపటంతోనే సరిపోయింది.

## నవరాత్రికి మరో కారణం

ఇంతకీ ఈ టూర్ ప్రోగ్రాంకి ఇంకో కారణమూ ఉంది. తొమ్మిదేళ్ళ క్రితం మేము రెండోసారి అమెరికా వెళ్ళినప్పుడు మా అమ్మాయి వాళ్ళు ఉంటున్న 'మిచిగాన్' రాష్ట్రంలోని డెట్రాయిట్ దగ్గరున్న ట్రాయ్‌కి వెళ్ళాం. అప్పుడే మా అమ్మాయిని 'ట్విన్స్' మగ పిల్లలు పుట్టారు. డిసెంబర్ నెల గజ గజ వణికే చలి. రోజూ అడుగుకు తక్కువ కాకుండా ఐస్ పడేది. కాని అక్కడ మా అమ్మాయి స్నేహితురాళ్ళు ప్రీతీ, జ్యోతి, బిందు, లావణ్యా, షబ్రీన్ మొదలైన భలే మంచి బృందం ఉండేది. వారానికోసారి ఎవరో ఒకరి ఇంట భోజనాలు, బ్రేక్‌ఫాస్టు, సాయంకాలం టిఫిన్లు, విష్ణు.లలితా సహస్రనామ పారాయణాలు భలేగా గడిచి పోయింది. అంతా ఏంతో ఆప్యాయంగా ఆత్మీయంగా మా ఇద్దర్నీ 'ఆంటీ-అంకుల్' అంటూ మహా ప్రేమగా ఉండేవారు. భలే సరదా బృందం అది. కడుపుతో ఉన్న వాళ్లకు సీమంతాలు, పుట్టిన రోజు పండుగలు, భలే కాలాక్షేపం. అంత చలిలోను. ప్రీతీ, ఆమె భర్త శాస్త్రిగారి కోరికపై వాళ్ళ ఇంట్లో అమెరికాలో మొదటిసారిగా నేను శ్రీ సత్యనారాయణ స్వామి వ్రతం చేయించాను. ఆ ప్రీతి వాళ్ళు ఆ తర్వాత హైదరాబాద్ చేరారు. హైదరాబాద్‌లో మా అమ్మాయి వాళ్ళ మియాపూర్ స్వంత ఇంట్లో గ్రామ కుంకుమ నోము నోచుకొంటే ప్రీతి, ఆమె తల్లి గారు వచ్చి వాయినాలు తీసుకొని భోజనం చేసి వెళ్ళారు. ఇప్పుడు ప్రీతీ వాళ్ళు భోపాల్‌లో ఉంటున్నారు. అందుకని ప్రీతీ కోరికపై మా అమ్మాయి భోపాల్ వెళ్లి చూసి రావాలను కొన్నది. అది ఈ నవ రాత్రి యాత్రగా పరిణమించింది.

ఇక ప్రయాణం విషయాలు వరుసగా ముందు తెలియజేసి ఆ తర్వాత ఆ ప్రదేశ విశేషాలు ధారావాహికంగా రాస్తాను.

## మా నవరాత్రి యాత్ర-2

### అలహాబాద్‌లో త్రివేణీ సంగమం

ఏప్రిల్ ఎనిమిదవ తేదీ మంగళవారం రాత్రి మా ఆస్థాన టాక్సీ ఓనర్ రాము పంపిన కారులో సామాను అంతా సర్దుకొని తొమ్మిదింటికి బయల్దేరాం. బెజవాడ స్టేషన్ చేరే సరికి పది అయింది. నరసపూర్ ఎక్స్‌ప్రెస్ పదిన్నరకు వచ్చింది. అందులో ఎక్కి మా ఎసి రిజర్వేషన్ బెర్త్‌లలో పడుకొన్నాం. తొమ్మిది ఉదయం నాలుగు ముప్పావుకే అది గుంటూర్ మీదుగా సికంద్రాబాద్ చేరింది. వెంటనే ఆటోలో బయల్దేరి అయిదుం బావుకు మా పెద్దబ్బాయి శాస్త్రి వాళ్ళు ఉంటున్న మల్లాపూర్ చేరాం. అప్పటికే మా కోడలు సమత కాఫీ టిఫిన్లు రెడీ చేసి కూరలు, పచ్చళ్ళు, అన్నం వండి రెడీగా పెట్టింది.

మేము కాల కృత్యాల తర్వాత టిఫిన్ చేసి కాఫీ రెండోసారి తాగాం. మా అమ్మాయి, తల్లీ అన్నం వగైరాలు ప్లాస్టిక్ డబ్బాలలో సర్దుకొని 'బిస్లేరి' మంచినీళ్ళ బాటిల్స్ ముందే మా అబ్బాయితో కొనిపించి, బత్తాయిపళ్ళు వగైరా అన్నీ పూర్తిగా సర్దుకొన్నారు. మా కోడలు, మనవడు భువన్ స్కూల్ టైంకు స్కూల్‌కు వెళ్ళారు. కోడలు తెలిసిన ఆటోను స్టేషన్‌కు మమ్మల్ని తీసుకువెళ్ళటానికి మాట్లాడి ఉంచింది.



ఎనిమిదిన్నరకు ఆటోలో మేము నలుగురం అంటే నేను మా శ్రీమతి మా అబ్బాయి రమణ అమ్మాయి విజ్జి బయల్దేరి తొమ్మిదింబావుకు సికందరాబాద్ స్టేషన్ చేరాము. పాట్నా ఎక్స్ప్రెస్ తొమ్మిదిన్నరకే ప్లాట్ ఫాం పైకి వచ్చింది. ఇక్కడి నుంచే బయల్దేరుతుంది. ఎక్కి మాసామాను సర్దుకొని బెర్తులలో పడుకున్నాం. మధ్యాహ్నం ఒంటి గంటకు భోజనాలు చేశాము. మా అమ్మాయికి, అబ్బాయి రమణకు ఇదే మొదటిసారి ఈ రూట్‌లో ప్రయాణం. నాకు కాశీ ప్రయాణం ఐదోసారి మా ఆవిడకు నాలుగోసారి. సేవాగ్రం రాగానే పిల్లలతో బాటు నేనూ దిగి స్టేషన్‌లో ఫోటోలు తీసుకొన్నాం. మహాత్ముని 'వార్ధా ఆశ్రమం' ఇక్కడే ఉంది. ఇక్కడి నుంచే మొదటిసారిగా సమాజ సేవా కార్యక్రమాలు గాంధీ ప్రారంభించారు. నాగపూర్ రాత్రికి చేరింది. అక్కడ కమలా తోటలు నిండుగా కనిపిస్తాయని చెప్పా. చీకట్లో కనిపించలేదని 'దెప్పింది' మా అమ్మాయి. ట్రెయిన్ బాగానే వేగంగానే వెడుతోంది. రాత్రి టిఫిన్ పెరుగన్నం తినేసి పడుకొన్నాం. పగలు ప్రయాణం దారికి ఇరువైపులా 'మోదుగ చెట్లు' యెర్రని పూలతో వికసించి కనుల పండువు చేశాయి. వీటినే అగ్గి పూలు అంటారు. 'మోదుగ పూలు' పేరు మీద శ్రీ దాశరథి రంగాచార్యులు నవల రాశారు. చాలా పేరొచ్చిన నవల అది. మా చిన్న తనాలలో మోదుగ ఆకు విస్తళ్ళు ఉండేవి.





అందులోనే భోజనం. మెత్తగా బాగుండేవి. మోదుగ చెట్టు కొమ్మ ఒడుగు సమయంలో 'బ్రహ్మ దండం'గా పనికొచ్చే పవిత్రమైన కర్ర.

పదవ తేదీ ఉదయం పదకొండు గంటలకు రైలు అలహాబాద్ చేరింది. మేము బయల్దేరిన దగ్గర్నుంచి గూగుల్ పొజిషన్‌లో మా అబ్బాయి శర్మ ట్రయిన్‌ను గమనిస్తూ యెంత లేటో యెంత ముందు వస్తోందో ఫోన్ చేసి చెబుతూ తెలుసుకొంటూ మానిటరింగ్ చేస్తూనే ఉన్నాడు. ఏ స్టేషన్ తర్వాత యేది వచ్చేదీ 'ఇటినరీ' కూడా టైముతో సహా నెట్లో పంపిస్తే ప్రింట్ అవుట్ తీయించి వెంట తెచ్చుకొన్నాం. కనుక ఎవర్నీ అడగాల్సిన పనే లేకుండా పోయింది. అలహాబాద్‌లో దిగి సామాను అంతా మేమే వీల్ సూట్ కేసులను లాక్కుంటూ రిటైరింగ్ రూమ్స్‌కు చేరాం. కింద కేంటీన్ ఉంది. టూరిజం వాళ్ళ రూమ్ ఉంది. వాళ్ళను అడిగి త్రివేణీ సంగమ స్నానం, నగర దర్శనంకు ఇండికా కారు మాట్లాడాం. వెయ్యి రూపాయలు. బోటు ఖర్చులు మావే. స్నానానికి తినటానికి మాత్రమే సర్దుకొని, సామాను అంతా రూముల్లో ఉంచేసి పన్నెండు గంటలకు కారు



ఎక్కి బయల్దేరాం. ఒక అరగంటలో ప్రయాగ సంగమ ప్రదేశం చేరాం. కారు ఒడ్డునే ఆపేశాడు. సంగమ స్నానానికి తిరిగి తీసుకురావటానికి మనిషికి నాలుగు వందల ప్రకారం ప్రత్యేక బోటు మాట్లాడుకొన్నాం. బోటువాడు యమునా నదిని గంగానదినీ సంగమ ప్రదేశాన్ని చూపిస్తూ స్నానఘట్టానికి తీసుకువెళ్ళాడు. అక్కడ బోటులు లంగరు వేసి కదలకుండా ఉంచుతారు. బోటు అడుగు భాగాన లావుపాటి దూలం కడతారు దాన్ని ఆధారంగా చేసుకొని సంగమ స్నానం చేయాలి. ఇనప గొలుసులు కూడా అటూ ఇటూ కట్టి ఉంటాయి. ప్రవాహం ఉధృతంగా ఉంటుంది. కాళ్లు ఆనవు. కొద్ది అడుగులు దాటగానే మెరక తగుల్తుంది. దాని మీద నిలబడి స్నానం చేయాలి. బట్టలు సంచీలు బోటులో పెట్టి స్నానానికి మాత్రమే తయారై నేనూ మా ఆవిడా ముందు స్నానం చేశాము. మంత్రం నేనే చెప్పి సూర్యునికి అర్ఘ్యమిచ్చి సంధ్యావందనవమూ అయిందనిపించాను. తర్వాతా మా






అమ్మాయి దిగింది దానికీ మంత్రం చెప్ప మా అబ్బాయినీ దింపి మంత్రంతో స్నానం చేయించాను. మా అమ్మాయి 'మహా త్రిల్‌గా ఫీల్' అయింది. నిజంగా ఎన్నిసార్లు త్రివేణీలో స్నానం చేసినా కొత్తగానే ఉంటుంది. గొప్ప అనుభవం. ఎన్నో వేలమంది మహర్షులు పుణ్యాత్ముల పాద స్పర్శతో పులకించి పవిత్రవంతమైన నేల ఇది. గంగమ్మ తల్లి కరుణ యమునమ్మ తల్లి చల్లదనం, అంతర్వాహిని సరస్వతీ కలిసి పవిత్ర త్రివేణీ సంగమం అయింది. అందరూ పులకించి పరవశించాం. రెండేళ్ళ క్రితం జూన్ నెలలో మా బావ మరిది కుటుంబంతో కలిసి వచ్చాం. అప్పుడు నా పుట్టినరోజు కూడా బోటు మీదే త్రివేణీలో జరుపుకొన్నాం. మా శ్రీమతి ఉయ్యూరులో చేసి తెచ్చిన నాకు ఇష్టమైన 'మైసూర్ పాక్' అందరికి పెట్టి సంతోష పెట్టింది.

సంగమ స్నానం అయిన తర్వాత బట్టలు మార్చుకొని అందరం బోటు ఎక్కి ఒడ్డుకు చేరాం. ఒడ్డునే అక్బర్ చక్రవర్తి కట్టించిన కోట ఉంది. అందులోకి వెళ్ళి, అక్కడ వేలాది సంవత్సరాల వయసున్న 'అక్షయ వట వృక్ష' దర్శనం చేశాం. కోటలో నుంచి బయటికొచ్చి పక్కనే ఉన్న 'బడే హనుమాన్'ను దర్శించాం. పడుకున్న పోజులో హనుమ ఉంటాడు. అక్కడి నుంచి నాలుగింటికి భరద్వాజ ఆశ్రమం చేరుకొన్నాం. అనేక భూగర్భ గృహాలలో దేవతా దర్శనం చేశాము. అప్పుడే హైదరాబాద్ నుంచి శ్రీమతి పుట్టపర్తి నాగపద్మినిగారు ఫోన్ చేశారు. మధ్య మధ్యలో కట్ అవుతూ అస్పష్టంగా వినిపించాయి మాటలు. అలహాబాద్‌లో ఉన్నామని పదిహేడు ఉదయానికి ఉయ్యూరు వస్తామని అప్పుడు నేనే ఫోన్ చేసి మాట్లాడుతానని చెప్పాను. సరేనన్నరామె.



అక్కడి నుండి మోతీలాల్ నెహ్రూ గారి 'ఆనంద భవన్' చూసి చంద్రశేఖర ఆజాద్ పార్కు, హైకోర్టు, అలహాబాద్ యూనివర్సిటి వగైరాలు తిరిగి చూశాం కారులో. ఆరింటికి మొదటగా ప్రయాగలో కట్టిన శ్రీ మహావిష్ణు ఆలయం 'శ్రీ వేణీ మాధవ' దర్శనం చేశాం. రెండేళ్ళ క్రితం చూడ లేక పోయాం. చాలా ప్రాచీనమైన



ఆలయమిది. కొత్త నిర్మాణాలు చేసి వైభవోపేతంగా తీర్చిదిద్దారు. ఏడు గంటలకు రిటైరింగ్ రూమ్స్‌కు చేరుకొన్నాం. రైల్వే కేంటీన్‌లో టిఫిన్లు చేశాం.

## అలహాబాద్ విశేషాలు

'ప్రయాగ రాజసింహం లాంటిది. అత్యున్నత పుణ్యక్షేత్రం. పెద్ద పెద్ద పాపరాశులను క్షాళనం చేసి పవిత్రీకరించే క్షేత్రం ప్రయాగకు సాటి ఏదీ లేదు. ప్రయాగ మహిమ వర్ణించటం ఆదిశేషుని వల్ల కూడా కాదు అని శ్రీ రామచంద్రుడే తులసీదాస మహాకవి విరచిత 'శ్రీ రామచరిత మానస్'లో అంటాడు. దివ్య ధామం ప్రయాగ. అందుకే తీర్థరాజం (కింగ్ ఆఫ్ పిలిగ్రిమేజేస్) అంటారు. దేవ నదులైన గంగా, యమునా అంతర్వాహిని సరస్వతి సంగమ స్థానం ప్రయాగ. వేలాది సంవత్సరాలుగా వేలది యోగి పుంగవులు, మహర్షులు తపస్సు చేసి చరితార్థులైన ప్రదేశం. మాఘ మాసంలో జరిగే మాఘ మేళాకు లక్షలాది భక్తజన సందోహం త్రివేణీ స్నానం చేసి పునీతులౌతారు. పన్నెండేళ్ళకోసారి వచ్చే మహా కుంభమేళాలో దీని ప్రభావం వర్ణించటానికి అలవి కానిదిగా ఉంటుంది. ఇసుక వేస్తె రాలనంత జనం ఎక్కడో అరణ్యాలలో ముక్కు మూసుకొని తపస్సు చేసుకొనే అనేక రకాల సాదుసంతులు వచ్చి త్రివేణీ సంగమ స్నానం చేసి తమ వారికి జ్ఞానబోధ చేసి సన్మార్గంలో నడిచేట్లు చేస్తారు. ఇంతటి ప్రత్యేక మేళా నిర్వహించటానికి ఒక కథ ఉంది.

దేవ దానవులు సాగర మథనం చేస్తున్నప్పుడు అమృతం ఉద్భవించింది. దీనికోసం సురులు అసురులు పోట్లాడుకొంటారు. దానవులకు దక్కకుండా చేయాలని విష్ణువు మోహినీ రూపంలో వచ్చి అమృత కలశాన్ని జాగ్రత్త పరుస్తుంటే కొన్ని బిందువులు ఒలికి త్రివేణీ సంగమంలో పడ్డాయి. ఇక్కడేకాక నాసిక్‌లో, ఉజ్జైన్‌లో హరిద్వార్‌లో పడ్డాయి. అందుకే కుంభమేళా మహా కుంభమేళాలను నిర్వహిస్తారు. గంగానదీ దర్శనమే ముక్తి హేతువు అని పురాణ కథనం. గంగా యమునా దర్శనం చాలు అనేక జన్మ పాపాలు హరించి పోవటానికి అని గోస్వామి తులసీదాసు అంటారు. ప్రకృష్టమైన యోగం అంటే కూడలి కనుక ప్రయాగ అనే పేరొచ్చింది. బ్రహ్మదేవుడు 'ప్రకృష్ట యాగం' ఇక్కడ చేశాడు కనుక ప్రయాగ అయింది అని చెబుతారు. యజ్ఞం లేక యాగం వలన ఈ పేరొచ్చిందన్న మాట. పురాణ కాలం నుంచి ప్రసిద్ధమైన మహా పుణ్య స్థలం ప్రయాగ.

ఒకప్పుడు ఇక్కడే యమునా నదీతీరంలో నగరానికి పడమర 'కౌశాంబి' నగరం



ఉండేది. ఇదే రాజధాని. దాని అవశేషాలు ఇప్పుడూ అక్కడ కనిపిస్తాయి. 1997లో కౌశాంబి జిల్లా ఏర్పడింది. క్రీ.శ. ఆరవ శతాబ్ది వరకు కౌశాంబి మహోత్కృష్టంగా వెలిగింది. గౌతమ బుద్ధుడు చాలాసార్లు ఇక్కడికి విచ్చేసి జ్ఞానబోధ చేశాడు. వేలాది బౌద్ధ భిక్షువులకు ఆవాస భూమిగా ఉండేది. జైన మతానికీ కేంద్ర స్థానమైంది కౌశాంబి. మౌర్య సామ్రాజ్యానికి ఉపరాజధానిగా కౌశాంబి ఉండేదని చరిత్ర చెబుతోంది. అశోక చక్రవర్తి ఇక్కడ రెండు అంతస్తుల స్తంభాలు నిర్మించాడు. సముద్ర గుప్త చక్రవర్తి తన జయ గాథలను విజయ స్తంభాలపై 326 b.cలో చెక్కించాడు. సముద్ర గుప్తుడు ప్రయాగలో పన్నెండు ఏళ్ళు వరుసగా యాగాలు చేశాడు. దాని స్మారకార్థం 'సముద్ర కూపం' అనే బావిని విని ప్రతిష్ఠానపురంలో తవ్వించాడు. అప్పటిదాకా ప్రయాగ ఒక ఆశ్రమ స్థానంగానే ఉండేది. సముద్ర గుప్తుని పన్నెండు వరుస యజ్ఞాల వలన అనేక మంది మహర్షులు ఋషులు తాపసులు ఇక్కడికి వచ్చి స్థిరరపడి పోయారు. అనేక జాతులవారు మతాల వారు ప్రయాగ చేరి శాశ్వతంగా నిలిచిపోయి దీనికి ఒక పట్టణ స్థాయిని కల్పించారు. ప్రయాగ మహా పట్టణమే అయింది కాల క్రమంలో.

## మా నవరాత్రి యాత్ర-3

### అలహాబాద్ విశేషాలు

క్రీ.పూ. 644లో చైనా యాత్రికుడు హ్యుయాన్ సాంగ్ హర్ష చక్రవర్తి పరిపాలనా కాలంలో ప్రయాగ సందర్శించాడు. ప్రయాగలో ఉన్న రెండు నదుల మధ్య ప్రదేశం నాలుగు మైళ్ళ పరిధిలో వ్యాపించి ఉందన్నాడు. నగరంలో రెండు మతాలున్నాయని, అనేక దేవాలయాలు చంపక్ వాటికలో పెద్ద స్తూపం ఉందని, దాన్ని అశోకుడు నిర్మించాడని తెలియబరచాడు. మానవ జన్మ చరితార్థత ప్రయాగలోనే సాధ్యమని ఇక్కడ మరణిస్తే పునర్జన్మ ఉండదనే



విశ్వాసం ఉందని రాశాడు. 1575లో అక్బర్ నదీ ప్రయాణం చేసి ప్రయాగ చేరాడు. అప్పుడే ప్రయాగకు 'అలహాబాద్' అనే కొత్త పేరు అక్బర్ పెట్టాడు. తన కొత్త మతం 'దీన్ ఇలాహి' ఇక్కడే పుట్టింది. కనుక అలహాబాద్ పేరు సార్ధక నామమయింది. అందుకే హిందీలో 'ఇలహాబాద్' అని రాస్తారు.

మొగలాయీ సామ్రాజ్య విచ్చిన్నంతో మరాఠా రాజులు దీన్ని స్వాధీన పరచుకొని 'అవధ వంశ' పాలన సాగించారు. లక్నో రాజ్యం ఏర్పరచారు. కాని అవధలో అలహాబాద్ భాగంగానే ఉండేది. లక్నో నవాబులు అవధ కీర్తిని పెంచలేకపోయారు. చివరికి 1801 బ్రిటిష్‌వారి వశమయింది. ఆంగ్లేయులు 'ఆగ్రా అవద్ సంయుక్త రాష్ట్రాలు' పేర కొత్త రాజ్యాన్ని ఏర్పాటుచేశారు. దీనికి అలహాబాద్ రాజధాని.

బ్రిటిష్ వారిని దేశం నుంచి సాగనంపటానికి స్వతంత్ర సంగ్రామంలో అలహాబాద్ ముఖ్య కేంద్రమే అయింది. 1857 మొదటి స్వాతంత్ర సమరంలో అలహాబాద్ ప్రధాన పాత్ర పోషించింది. అనేక స్వతంత్రయోధులకు ఆవాస భూమి అయింది. చాలా తిరుగుబాట్లు ఇక్కడే పురుడు పోసుకొన్నాయి. కాంగ్రెస్ పార్టీ ప్రాభవంలోకి వచ్చినప్పుడు ఎన్నో కాంగ్రెస్ మహాసభలు అలహాబాద్‌లోనే జరిగాయి. గొప్ప యాత్రీక కేంద్రమే కాక అలహాబాద్ రాజకీయ పోరాట యాత్రిక కేంద్రమూ అయింది. దీనికి ఉదాహరణలే 'ఆనంద భవనం', ఆల్ఫ్రెడ్ పార్కులు. స్వాతంత్ర సాధన తరువాత కూడా అలహాబాద్ ప్రాముఖ్యత తగ్గలేదు. కారణం భారత తొలి ప్రధాని జవహర్‌లాల్ ఇక్కడి పూల్‌పూర్ లోక్‌సభా నియోజక వర్గం నుంచే ఎన్నికయ్యాడు. భరద్వాజ ఆశ్రమానికి సమీపంలో ఉన్న ఆనంద భవన్ ఉంది. నెహ్రూ తర్వాత లాల్ బహదూర్ శాస్త్రి అలహాబాద్ పార్లమెంట్ నియోజకవర్గం నుంచే గెలిచి ప్రధాని అయ్యారు. తరువాత ఇందిరా గాంధి, రాజీవ్, వి.పి సింగ్ ఇక్కడి నుంచే ఎన్నికై ప్రధానులయ్యారు. రాజకీయాలతో బాటు అనేక కార్యక్రమాలకు అలహాబాద్ కేంద్రంగా ఉందిజ గొప్ప విద్యా కేంద్రంగా గుర్తింపు పొందింది. ఫిరాఖ్ గోరఖ్ పూరి, హరి వంశరాయ్ బచన్, మహాదేవవర్మ రాంకుమార్ వర్మ సచ్చిదానంద హీరానంద వాత్సాయన్ (ఆగే) ఉపేంద్ర నాద్(అశ్క్), భగవతీ చరణ్ వర్మా, ఉపేంద్రనాథ సూర్యకాంత త్రిపాఠీ (నిరాలా) వంటి కవులు పండితులు తమ సాహితీ విహార భూమిగా అలహాబాద్‌నే ఎంచుకొన్నారు.

సంగమ క్షేత్రం ఒడ్డున అక్బర్ కట్టించిన పెద్ద కోట ఉంది. ఇప్పుడు సైన్యం అధీనంలో ఉంది. కోటలో అక్బర్ స్థంభం ఉంది. లోపల 'పాతాళ పురి' అనే ఆలయం ఉన్నది. అక్కడ అక్షయ వటవృక్షం చూడాల్సినది. దాని వ్రేళ్ళు చాలా లోతులో ఉంటాయి. చూడటానికి అనుమతించరు. సరస్వతి ఘాట్ యమునా నది ఒడ్డున ఉంటుంది. సాయం సంధ్యలో దీని దర్శనం మనోహరం. ఇక్కడే ఉన్న పురాతాన 'మన్ కామేశ్వర దేవాలయం' దర్శించాలి. ఈ స్వామిని అర్చిస్తే మనసులోని కోరికలు

తీరుతాయని విశ్వాసం. చంద్రశేఖర ఆజాద్ పార్క్ ఆ త్యాగధనుడి పేరు మీద నెలకొల్పారు ఇక్కడే ఆయన బ్రిటిష్ తుపాకీ దెబ్బలకు అసువులర్పించి వీర మరణం పొందాడు. స్మృతిచిహ్నాం యేర్పరచారు.



## భరద్వాజ ఆశ్రమం

త్రేతాయుగంలో శ్రీరాముడు, భరతుడు భరద్వాజ ఆశ్రమాన్ని సందర్శించి మహర్షి ఆశీస్సులు పొందారు. ఈ ఆశ్రమంలో అనేక మంది మునులు శిష్యులు ఉండి ఆయన ఆతిథ్యాన్ని పొందారు. ఇక్కడ ఉన్నత విద్యా కేంద్రాన్ని ఏర్పరచాలని ప్రభుత్వం ఆలోచనలో ఉంది. గంగా నది ఒడ్డున 'శివ కూటి' దేవాలయం ఉన్నది. నారాయణి ఆశ్రమమూ చూడదగినదే. గంగ ఒడ్డున ఝూన్సి అనే ప్రదేశం ఉంది. ఇదే పూర్వపు 'ప్రతిష్టానపురం'. ఇక్కడ అనేక ప్రాచీన ఆలయాలున్నాయి. శివాలయం, హంసాలయం 'సముద్ర కూపం' ఇక్కడే ఉన్నాయి. శృంగవేరపురం ఇక్కడే ఉంది. ఇదే గుహుడి రాజధాని. ఇక్కడే ఋష్య శృంగ మహర్షి ఉండేవారు. ఆయన సమాధి కూడా చూడచ్చు. మహాభారత కాలంలోని లక్క ఇల్లు అనే లాక్షా గృహం ఇక్కడి త్రవ్వకాలలో బయట పడింది. ఇది అలహాబాద్‌కు యాభై కిలోమీటర్ల దూరంలో ఉంది.

## స్వరాజ్య భవనం

1899లో మోతీలాల్ నెహ్రూ దీన్ని కొన్నాడు. అభివృద్ధి చేసి 'ఆనంద భవన్' అని పేరు పెట్టాడు. 1927లో నెహ్రూ కుటుంబం ఇక్కడ స్థిరపడింది. ఇది స్వతంత్ర పోరాటంలో ప్రముఖ పాత్ర పోషించింది. మోతీలాల్ ఇక్కడే కోర్టులో వకీలుగా ఉన్నాడు. తర్వాతా జవహర్ ఉన్నాడు. మ్యూజియం ఉంది. అనేక ప్రముఖులు ఇక్కడే సమావేశమై నిర్ణయాలు తీసుకొనేవారు. ఆనంద భవన్‌కు జవహర్‌లాల్ 1926లో శంకుస్థాపన చేశాడు. ఇందిరాగాంధి ఈ బృహత్తర





భవన సముదాయాన్ని1970లో జాతికి అంకితం చేసింది. అలహాబాద్ కోర్టు చూడతగినది.

## అలహాబాద్ విశ్వవిద్యాలయం

దేశీయ విశ్వవిద్యాలయాలలో అలహాబాద్ యూనివర్సిటీ ఒక ప్రత్యేక గుర్తింపు పొందింది. టతూర్పు దేశ ఆక్స్ ఫర్డ్ యూని వర్సిటి' అని పేరు పొందింది. 1887లో దీన్ని ఆల్ఫ్రెడ్ లాయల్ ప్రేరణ వలన స్థాపించారు. ప్రముఖ బ్రిటిష్ ఆర్కిటెక్ట్ ఎమర్సన్ దీన్ని డిజైన్ చేశాడు. ఇక్కడే పూర్వ భరద్వాజ ఆశ్రమం ఉండేది. ఈ యూనివర్సిటిని 1873లో లార్డ్ నార్త్ బ్రూక్ ప్రారంభించాడు. దీని విద్యార్థులు చాలా మంది స్వాతంత్ర సమరంలో పోరాడి చరిత్ర సృష్టించారు. అందులో ప్రముఖులు యెన్.డి.తివారి, హేమవతీ నందన్ బహుగుణ వంటివారున్నారు.

అలహాబాద్‌కు అరవై కిలోమీటర్లలో కౌశాంబి ఉంది. బుద్ధుడి కాలంలో పదహారు జిల్లాలకు ముఖ్య కేంద్రం. యమునా ఒడ్డున ఉన్నది. బౌద్ధ, జైన మతాలూ విస్తరించిన ప్రదేశం. ఉదయనుడు గొప్ప పరిపాలనా సమర్థుడనిపించుకొన్నాడు. త్రావ్వకాలలో అశోక స్థంభం, మౌర్య సామ్రాజ్య నివాస గృహాలు, గోశింత రామ నివాసం, ఒక రాజ భవనము వంటి అయిదు పెద్ద చిహ్నాలు బయటపడ్డాయి. కౌశాంబి ఇటుకలతో గృహ నిర్మాణాలు చేసుకొనేవారు. దిగంబర జైన దేవాలయం కూడా ఇక్కడ ఉన్నది. అలహాబాద్‌కు డెబ్భై కిలోమీటర్లలో 'కారా' అనే చోటు మౌర్య సామ్రాజ్య కాలంలో ప్రసిద్ధి చెందింది మౌర్యుల ప్రాంతీయ రాజధానిగా ఉండేది. ఇక్కడ ఇప్పుడు 'మాతా సీతలాదేవి' ఆలయం ప్రసిద్ధమైనది. ఈమెనే 'కారాదేవి' అంటారు. అందుకే కారా అనే పేరు వచ్చింది. ప్రముఖ కవి మాలుక్ దాస్ సమాధి ఇక్కడే ఉన్నది. సంగమ క్షేత్రానికి అరిల్ అనే ఈ నాటి ప్రదేశం 'అలార్క పురి'గా ప్రసిద్ధం. కాశీ రాజు అలర్కుడు బ్రాహ్మణుల కోసం నేత్రాలను దానం చేశాడు. అందుకే ఆ పేరొచ్చింది. వల్లభాచార్య మతానికి పట్టుగొమ్మగా ఉండేది. బుద్ధుడికి మహావీరుడికి సమకాలికుడైన ఉదయనుడు పాలించిన ప్రాంతం అలహాబాద్‌కు ఇరవై అయిదు కిలోమీటర్లలో ఉంది. విత్మే పట్టణ అనేవారు. అలహాబాద్‌కు ఇరవై కిలోమీటర్లలో 'గరా' అనే ప్రదేశంలో కోట ఉండేది. త్రవ్వకాలలో అనేక దేవతల విగ్రహాలు, గుప్తులకాలం నాటి గ్రంథాలు బయటపడ్డాయి. గుప్త రాజులు అనేక బంగారు నాణాలు బ్రాహ్మణులకు ఇక్కడ దానం చేశారని తెలుస్తోంది.

విష్ణుమూర్తి దశావతారాలతో ఒక దేవాలయం ఉందిక్కడ.

ప్రయాగలో గంగానది యమునా నదితో కలిసి నిండుగా ఉంటుంది. గంగ నీటి మట్టం పెరుగుతుందిక్కడ. కాశీ వైపుకు ప్రయాణించి అక్కడ కూడా భారీ జల రాశితో కళ కళ లాడుతుంది. యమునోత్రిలో పుట్టిన యమునా నది మధుర చేరి శ్రీ కృష్ణుని మురళీగానంతో పులకరించి ఆగ్రాలో తాజమహాల్‌కు స్నానం చేయించి ప్రయాగలో గంగలో కలిసిపోతుంది. కనిపించకుండా పోతుంది. అదే అంతర్వాహిని సరస్వతి నది.

ప్రయాగ ఒడ్డున ఉన్న బడే ఆంజనేయస్వామి దేవాలయం వరదలలో మునిగి పోతుంది. ఈ శయన ఆంజనేయుడిని త్రవ్వి తీసి వేరే చోట ప్రతిష్టించాలని చాలసార్లు ప్రయత్నించారు. త్రవ్విన కొద్దీ భూమిలోకి దిగి పోతుంది కాని బయటకు రావటం లేదు. అందుకని ఆ ప్రయత్నాన్ని విరమించుకొన్నారు. ఒకప్పుడు ఇక్కడ ఒక పెద్ద తటాకం ఉండేది అని తెలుస్తోంది. ఇటీవల నాలుగు అంతస్తుల విమాన మండపాన్ని కట్టారు. ఆలయం ఎత్తు నలభై మీటర్లు. ప్రతి అంతస్తులో ఒక్కో దేవతాలయం ఉంది. ఒకప్పుడిది శివాలయం. కుమార భట్టు, జగద్గురు శంకరాచార్య, కామాక్షిదేవి, తిరుపతి బాలాజీ యోగశాస్త్ర లింగ విగ్రహాలున్నాయి. ఆలయ గోడలపై రామాయణ చిత్రాలు ముచ్చట గొలుపుతాయి. ద్రవిడ సంప్రదాయంలో మలచిన ఆలయం ఇది.




దారా గంజ్‌లో నాగపూర్‌కు చెందిన భోంస్లే మహారాష్ట్ర రాజులు 'పాముల రాజు వాసుకికి' నాగ వాసు దేవాలయం నిర్మించారు. ఇది గంగ ఒడ్డునే ఉంది. నాగ పంచమి రోజు వేలాది యాత్రికులు సందర్శించి తరిస్తారు. కోటలో 'సరస్వతి బావి' ఉంది. దీని నుంచే అంతర్వాహినిగా సరస్వతి నది ప్రవహిస్తుందని భావిస్తారు. అక్షయ వట వృక్షంపై ప్రళయకాలంలో శ్రీ మహా విష్ణువు శయనిస్తాడని పురాణ కథనం. హుయాన్ సాంగ్ కూడా దీని గొప్పతనాన్ని వర్ణించాడు. ప్రపంచ ప్రసిద్ధి చెందిన ప్రాచీన వృక్షాలలో అక్షయ వటం ఒకటి. దారాగంజ్ గ మహల్లా దగ్గర 'వేణీ మాధవ మందిరం ఉంది'. ఇది అతి ప్రాచీనాలయం. ఇది శ్రీ మహావిష్ణు దేవాలయం. దారా గంజ్‌లో తెలుగు పురోహితులు హరి జగన్నాధశాస్త్రి గారు ఉండేవారు. ఆయన మరణం తర్వాత కుమారులు నిర్వహిస్తున్నారు. చక్కని తెలుగు మాట్లాడుతారు. భోజన వసతి కలిగిస్తారు. ఉండటానికి



రూములూ ఉంటాయి.

షేర్షానూరి రోడ్డులో అలోపీదేవి ఆలయం ఉంది. ఇది శక్తి క్షేత్రం. దేవి అలోప్ శాంకరి అంటారు. నవ రాత్రులలో గొప్ప ఉత్సవం జరుగుతుంది. ఇక్కడ అమ్మవారెవరూ ఉండరు. ఒక చిన్న కొయ్య ఉయ్యాలపై నుండి వేలాడుతూ ఉంటుంది. అదే అమ్మ వారు.

తెహసీల్ హాన్డియా అనే ప్రదేశం అలహాబాద్‌కు నలభై కిలో మీటర్లలో ఉంది. ఇక్కడే మహాభారత కాలంనాటి లక్క ఇల్లు ఉంది. పాండవులను మట్టు పెట్టటానికి కౌరవులు నిర్మించిన లాక్షా గృహం ఇదే. విదురుని సలహాతో పాండవులు బతికి బయటపడ్డారు. త్రవ్వకాలలో అనేక దేవతా విగ్రహాలు, నాణాలు దొరికాయి. తక్షశిలా కౌశాంబిల సమకాలీన నగరంగా భావించారు చరిత్రకారులు. అలహాబాద్‌కు పది కిలోమీటర్లలో జైత్వార్ దేహ్‌లో పాండవులు కొద్దికాలం ఉన్న ప్రదేశం ఉంది. ఇక్కడి దేవాలయం మహా మండలేశ్వరనాథ శివాలయం ఉంది. పంచ క్రోషి పరిక్రమ యాత్ర ఇక్కడితో పూర్తవుతుంది. ఇక్కడే భీముడు హిడింబా సురుడిని వధించి అతని సోదరి హిడింబను వివాహం చేసుకొని ఘటోత్కచునికి జన్మనిచ్చాడు. భీముడే ఇక్కడ ఈ శివలింగాన్ని ప్రతిష్టించాడని కథనం.

## మా నవరాత్రి యాత్ర-4

### కాశీ సందర్శనం



11 ఏప్రిల్ శుక్రవారం ఉదయం అలహాబాద్‌లో లోకమాన్య ఎక్స్‌ప్రెస్‌ను నాలుగు గంటలకు ఎక్కాం. అది మూడు గంటలు ప్రయాణం చేసి వారణాసికి ఉదయం ఏడింటికి చేరింది. 'అఖిల భారతీయ కరివెన నిత్యాన్నదాన సత్రం'లో ఫోన్‌పై రెండు రూములు ముందుగానే మా అబ్బాయి శర్మ బుక్ చేశాడు. నేరుగా స్టేషన్ నుండి ఆటోలో కరివెన సత్రం చేరాం. ఇది మానస సరోవర్ ఘాట్ దగ్గర ఉంటుంది. దీని దగ్గరే నారద ఘాట్, ఆంధ్రాశ్రమం

ఉంటాయి. కింద రూములు రెండు ఇచ్చారు. ఎసి లేక పోయినా చల్లగా ఉంది. భోజనం కూడా ఇక్కడే కనుక హాయిగా ఉంటుంది. స్నానాలకు కావలసిన బట్టలు విడిగా సంచులలో సర్దుకొని నారద ఘాట్ మీదుగా కేదార్ ఘాట్ నుంచి బోటులో మనిషికి వంద రానూ పోనూకు ఇచ్చి నీటి ప్రవాహం ఉన్నచోటకు చేరాం. అక్కడే అందరూ స్నానాలు చేస్తున్నారు. బోటు దిగి స్నానాలు నేను మంత్రం చెబుతూ చేయించాను. గంగమ్మకు మావాళ్ళు హారతి ఇచ్చారు. మళ్ళీ బోటు ఎక్కి కేదార్ ఘాట్ చేరాం. అక్కడ మెట్లు చాలా 'స్టేప్'గా ఉంటాయి. ప్రభావతికి కష్టమే అయినా ఎక్కింది మాతోబాటు. అప్పటికే సూర్యుడు మండిపోతున్నాడు. చెప్పులు తీస్తే కాళ్లు కాలిపోతున్నాయి. కేదారేశ్వర దర్శనం చేశాం. ఆలయం వెనక భాగం వైపుకు చేరాం. అక్కడ మంచి కాఫీ తాగాం. అక్కడి నుంచి ఆటోలో శ్రీ విశ్వనాథా లయానికి చేరాం. మేము చేరే సరికి పదకొండు దాటింది. అభిషేక సమయం. కనుక గంటసేపు క్యూ ఆపేశారు. పన్నెండు పావుకు దర్శనం మొదలైంది. పావుగంటలో ఆలయంలోకి చేరుకొన్నాం. తనివితీరా



కాశీవిశ్వేశ్వర జ్యోతిర్లింగాన్ని స్పృశించి పరవశించి క్షీరంతో అభిషేకం చేశాము. ఉత్తర దేశంలో శివుడికి ఉమ్మెత్త పువ్వులుతో దండ వేస్తారు. తనువూ చరితార్థమైంది. ఇది అయిదవసారి కాశీ రావటం. రెండేళ్ళ క్రితం వచ్చినప్పుడు బయటి నుండే దర్శించాల్సి వచ్చింది. స్వామి దర్శనం తర్వాత అన్నపూర్ణా దేవి దర్శనం చేసుకొన్నాం. అన్నపూర్ణాలయంలో ప్రసాదంగా 'బియ్యం' కొద్దిగా ఇస్తారు. వాటిని ఇంటికి వచ్చి మన బియ్యంలో కలుపు కొని పరవాన్నం వండుకొని నైవేద్యం పెట్టటం సంప్రదాయం. అమ్మవారి కుంకుమ కూడా తెచ్చుకోవాలి. ఆలయానికి ముందే సెక్యూరిటీ చెక్ ఉంటుంది. బాగులను అనుమతించరు. కెమెరా, సెల్‌ఫోన్ కూడా తీసుకు వెళ్ళరాదు. అందుకని ముందు మేమిద్దరం వెళ్లాం. రమణ, విజ్జి సామాను కాపలా కాశారు. మేము వచ్చిన తర్వాత వాళ్ళిద్దరూ వెళ్లి దర్శనం చేసుకొచ్చారు. నిన్న ఏకాదశినాడు త్రివేణీ స్నానం ఇవాళ శుక్రవారంనాడు అన్నపూర్ణా సమేత శ్రీ విశ్వనాథ దర్శనం. అనుకోకుండా భలేగా కుదిరి అదిరిందనుకొన్నాం. అందరికి ఎంతో సంతృప్తిగా ఉంది. అంతా అయి బయటికి వచ్చేసరికి ఒంటి గంట దాటింది. ఇక విశాలాక్షీదేవిని చూడటానికి

సమయం చాలదని రిక్షాలలో బయల్దేరి కరివెన వారి సత్రానికి చేరుకొన్నాం. కరివెన వారి నిత్యాన్నదాన సత్రం అప్పటికే ఒక బాచ్ భోజనాలు అయిపోయాయి. ఇక్కడ భోజనం చేయాలంటే ఉదయం పది గంటలలోపు చెప్పి రాయించు కోవాలి. గోత్రనామం చెప్పాలి. ఎందరు వచ్చి భోజనం చేస్తారో రాయించాలి. మేము ఉదయమే ఆ పని చేసే వెళ్లాం. కింద కూర్చో బెట్టి విస్తళ్లలో వడ్డిస్తారు. కూచోలేని వారికోసం రెండు టేబుళ్లున్నాయి. వాటిపై కుర్చీలలో కూర్చుని భోజనం చేయచ్చు. మా శ్రీమతి అలాగే చేసింది. మేము ముగ్గురం కిందే కూర్చున్నాం. చొక్కా బనీను విప్పేసి మగవాళ్ళు భోజనానికి కూర్చోవాలి. ఇది ఖచ్చితంగా అందరూ పాటిస్తారు.



రెండు కూరలు, పప్పు, పచ్చడి, పులుసు మజ్జిగ నెయ్యిలతో చాలా ఆప్యాయంగా భోజనం వడ్డించి మారు అడిగి మరీ వడ్డించి సంతృప్తిగా తినేట్లు చేయటం వీరి ప్రత్యేకత. ఎవరూ విసుక్కోరు, కసుక్కోరు. సేవా భావం అంకిత భావా లతో వడ్డిస్తారు. చల్లని మంచి నీరు పోస్తారు. అందరం భోజనానికి ముందు ఒకాయన చెప్పే అన్నపూర్ణ మంత్రం చెప్పి భోజనం చేయాలి. భోజనాంతరం అందరి చేత "అన్నదాతా! సుఖీభవ" అనిపిస్తారు. అందరం చాలా సంతృప్తిగా భోజనాలు ముగించాము. వడ్డన ఆడవాళ్లే చేస్తారు. పదార్థాలన్నీ రుచికరంగా మళ్ళీ మళ్ళీ అడిగి వేయించుకొనేట్లున్నాయి. ఇందులో కొందరు సేవాభావంతో చేస్తే కొందరు జీతాలకు పని చేస్తారు. మంచి వంటశాలా ఇద్దరు వంట మేస్త్రీలు ఉంటారు. ఎక్కడో కర్నూలు జిల్లా కరివెన గ్రామంలో శ్రీశైలం వెళ్ళే బ్రాహ్మణ యాత్రికులకు భోజన సదుపాయం వందేళ్ళ క్రితం ప్రారంభించిన సత్రం ఇవాళ కాశీ, శ్రీశైలం, షిర్డీ, భద్రాచలం మొదలైన ప్రదేశాలకు విస్తరించి ఉచితాన్న దానం చేసి ఎంతో సేవ చేస్తున్నారు. కరివెన వారి వారి ఉదాత్త ఆశయానికి ఇది మచ్చుతునక..

భోజనం చేసిన వారినెవరినీ రూపాయి కూడా అడగక పోవటం ఇక్కడి విశేషం. భోజనం చేసినవారు ఎంతోకొంత తమ సంతృప్తికోసం డబ్బు విరాళంగా ఇస్తారు. దానికి రసీదు ఇచ్చేస్తారు. ప్రతి రూపాయి జమ అవుతుంది. ఆడిట్ జమా ఖర్చులు



పర్యవేక్షణ నిఘా అన్నీ పకడ్బందీగా ఉంటాయి. అందుకే అపారమైన నమ్మకంతో డబ్బు చెల్లిస్తారు. పాతిక వేలు చెల్లిస్తే నిత్యాన్నదానం చేస్తారు. అట్లా దీనికి గ్రేడులు ంటాయి. ఆ డబ్బు ఫిక్సెడ్ డిపాజిట్‌లో ఉంచి వడ్డీ మీద కార్యక్రమం నిర్వహిస్తారు. నేను మా నాన్నగారి తిది 'కార్తీక శుద్ధ ఏకాదశి'నాడు అన్నదానానికి నిరుడే మా ఇంట్లో అద్దెకుంటున్న కృష్ణమూర్తి మేస్టార్‌గారి కుటుంబం ఇక్కడికి వస్తే 2050 రూపాయలు ఇచ్చి పంపి కట్టించాను కాశీలో. మా అమ్మగారికి, మా నాయనమ్మగారి తిథులకు 'ఫాల్గుణ శుక్ల పాడ్యమి' మరియు 'ఆశ్వయుజ శుక్ల అష్టమి' (దుర్గాష్టమి)లకు శ్రీశైలంలో ఒక్కొక్కరికి 2050 రూపాయల చొప్పున కట్టాను.

మా అన్నగారు స్వర్గీయ గబ్బిట లక్ష్మీ నరసింహశర్మ గారి తిది 'ఫాల్గుణ శుద్ధ సప్తమి'కి గాను మా అన్నగారబ్బాయి రామనాథబాబు నాకు ఇచ్చి పంపిన డబ్బు 2050 రూపాయలు చెల్లించి రసీదు తీసుకొన్నాను. కంప్యూటర్ రసీదు, డిపాజిట్ సర్టిఫికేట్ ప్లాస్టిక్ కవర్‌లో పెట్టి ఇచ్చారు. మా అమ్మాయి చి. సౌ. విజయలక్ష్మి, అల్లుడు చి. కోమలి సాంబావధానిల 'మేరేజ్ డే' సందర్భంగా జూన్ 18న అన్నదానం చేయించమని 1750 రూపాయలు చెల్లించి రసీదు తీసుకొన్నది. అలాగే అమెరికాలో ఉంటున్న మా అమ్మాయి స్నేహితురాలు చి.సౌ.మాధవి భర్త చి.సుధీంద్రలు ఇచ్చి పంపిన 1750 రూపాయలను వారి కోరిక మేరకు 'కార్తీక పౌర్ణమి'నాడు అన్నదానం చేయటానికి మా అమ్మాయి కట్టి రసీదు పొందింది. మనం రాయించిన తేదీకి ఆ పని చేస్తున్నట్లు కార్డు రాసి పోస్ట్ చేయటమూ వీరి ప్రత్యేకతే. ఇలా రోజూ ఎంతోమంది డబ్బులు చెల్లించి నిత్యాన్నదానానికి ప్రోత్సహిస్తూ ఉంటారు. ఏ మహానుభావుడు తన చల్లని చేతులతో ఈ సత్రాన్ని స్థాపించాడో ఆ మహనీయునికి అందరూ కృతజ్ఞత చెప్పుకోవాలి. ఈ ధనాన్ని ఆశించి వారెవ్వరూ ఈ సత్రం పెట్టలేదు. యాత్రకు వచ్చిన వారికి భోజనం ఇబ్బంది కలుగకుండా చేయాలన్న ఉన్నత ఆదర్శమే ఇంతగా విస్తరించింది. వందేళ్ళకు పైగా కరివెన వారి సత్రాలు యాత్రికులకు భోజన వసతి కలిపించి సేవ చేస్తున్నాయి. వారి ఉదార హృదయానికి నమశ్శతాలు..



Secretary- ABBKN Satram 67/87, Lakshmi Madhava Nilayam, Fort, Kurnool -- 518001 Andhra Pradesh, ındia. Phone: +91-8518-241175

కాశీ నగర సందర్శనం భోజనం చేసి మా రూముల్లోకి చేరి విశ్రాంతి తీసుకొన్నాం. సాయంత్రం నాలుగింటికి బయల్దేరి ఆటోలో మనిషికి వంద రూపాయలిచ్చి నగర సందర్శనకు బయల్దేరాం. తులసీ మానస మందిర్ చూశాం. ఇదే బిర్లా మందిరం. ఇక్కడే తులసీదాసు రామచరిత మానస్ మార్బుల్ గోడలపై శిలా ఫలకాలపై రాయబడి ఉంటుంది. రెండు అంతస్తుల భవనం తులసీదాసుగారి విగ్రహం మెట్ల ప్రక్కగా ఉంటుంది. ఆయన చేతిలో తులసీ రామాయణం ఉండి, పాడుతున్నట్లు రికార్డు వినిపించి ఆయనే పాడుతున్నాడా అనే అనుభూతి కలిగించడం ఇక్కడి విశేషం. తరువాత శక్తి పీఠం దుర్గాదేవి ఆలయం, సంకట మోచన హనుమాన్ దేవాలయం, మ్యూజియం అందులో అనేక శిలాలు చిత్రాలు ఆయుధాలు, పక్షులు జంతువులే కాక గాంధీగారికి విడిగా ఒక మ్యూజియం ఉన్నాయి. అన్నీ తిరిగి చూశాం. ఫోటోలు తీసుకోవటానికి పాతిక రూపాయలు చెల్లించి రసీదు తీసుకొన్నాం. ఎంట్రన్స్ ఫీజు మనిషికి అయిదు రూపాయలే. చాలా బాగా ఉంది. చూడాల్సిన మ్యూజియమే. ఇన్నిసార్లు వచ్చినా చూడటం కుదరనే లేదు. గాంధీగారి అపురూప ఫోటోలున్నాయి. దేన్నీ వదలకుండా ఫోటోలలో బంధించాను. పార్కు చూశాం. గవ్వల గౌరి దేవాలయం దర్శించాం. ఈమె విశ్వనాథుని సోదరి. గవ్వలు కొని ఆమెకు సమర్పించాలి. “గవ్వలు నీకు కాశీయాత్ర ఫలం నాకు” అని పూజారి చెప్పిస్తాడు.

ఇక్కడ కోతుల బెడద బాగా ఎక్కువ. సంకట మోచన్ దగ్గరా అంతే. అక్కడ ప్రసాదాలు కొని నైవేద్యం పెట్టించి తెచ్చుకొంటారు. ఇవన్నీ తిరిగి చూసి సాయంత్రం ఆరున్నరకు గంగా హారతి చూడాలనుకొన్నాం. కాని ఏడున్నర అయిపోయింది. మా అమ్మాయి గంగ హారతి మిస్ అయినందుకు మమ్మల్ని దెప్పుతూనే ఉంది. చివరగా శ్రీ కాలభైరవ దర్శనం చేశాం. అక్కడే మా ఆవిడ తప్పిపోయి పావుగంట మమ్మల్ని



తిప్పలు పెట్టి మా అమ్మాయి తిరిగి గుడిలో ఉంటే తీసుకొచ్చింది. ఒక సిల్క్‌సారీ షాప్‌లో మా అమ్మాయి చీర కొనుక్కొంది. అక్కడి నుండి సరాసరి ఆటోలో కరివెన సత్రం చేరాం. రాత్రిపూట భోజనాలు ఉండవు. టిఫిన్ మాత్రమే. మా నలుగురికి పిండి ఉప్మా టిఫిన్ నాలుగు పాకెట్లు కట్టిఇచ్చి మజ్జిగ కూడా పాక్‌చేసి ఇచ్చారు. రూముకు తెచ్చుకొని తిని పడుకొన్నాం. రేపు మళ్ళీ విశ్వనాధ విశాలాక్షీ అన్నపూర్ణా దర్శనం చేయాలి.

## మా నవరాత్రి యాత్ర-5

### కాశీయాత్ర

12వ తేదీ శనివారం ఉదయమే లేచి కరివెన వారి సత్రం రూముల్లోనే స్నానాలు పూర్తి చేసుకొని బయటికి వచ్చాం. ప్రక్కనే ఒక దక్షిణాది హోటల్ ఉంటే అక్కడే ఇడ్లీ, అట్టు తిని కాఫీ తాగాం. అక్కడి నుండి రిక్షాలో బయల్దేరి శ్రీవిశాలాక్షి అమ్మవారి దేవాలయానికి చేరాం. అమ్మవారిని దర్శించాం. మా అమ్మాయి వందరూపాయలు పూజారికిచ్చి పూజాసామగ్రి గాజులు, పసుపు కుంకుమ, జాకెట్టు ప్రసాదంగా తీసుకుంది. విశాలాక్షి గుగి అనగానే రెండేళ్ళక్రితం మా బావమరిది కుటుంబంతో విశ్వనాధ దేవాలయం నుండి రాత్రివేళ బయల్దేరి దగ్గరలోనే ఉన్న విశాలాక్షి మందిరానికి రావటానికి దారి తెలీక బురదలో, రొచ్చులో, ఆవుల మధ్య, వాటి పేడలమధ్య, ఇరుకు సందు గొందులు, తిరిగి గంటపైగా నడిచి, కరెంటుపోయి, చీకటిరాత్రి ఎట్టకేలకు అమ్మవారి గుడికి చేరిన సంఘటన గుర్తుకొచ్చింది. దశాశ్వమేధ ఘాట్ ఒడ్డునే విశాలాక్షి ఆలయం ఉంది. కాశీ విశాలాక్షీదేవిగా భక్తులపాలిటి కొంగుబంగారంగా అమ్మవారు కాశీలో కొలువై ఉంది. అమ్మవారి దర్శనం సకల పుణ్యఫలదం అని అందరి విశ్వాసం. దివ్యంగా దర్శనం పొంది ఆనందించాము.

గుడికి దగ్గరలోనే చేనేత వస్త్రాలయం ఉంటే మావాళ్ళు అందులో దూరి మూడు వందల రూపాయల చీరే రెండు వందల ఇరవైకి బేరమాడి పదిహేను చీరలు వివిధ రంగుల్లో కొన్నారు. అందులో జాకెట్ పీసు కూడా ఉండటం విశేషం. అక్కడి

నుంచి నడిచి దగ్గరలోనే ఉన్న శ్రీవిశ్వేశ్వర మహాజ్యోతిర్లింగా దర్శనం రెండవసారి చేశాం. విశాలాక్షి గుడి నుండి విశ్వనాథ గుడికి రెండో నంబర్ గేటు ద్వారా వెళ్ళాలి. .గేటు నంబరు తెలీకుండానే సెక్యూరిటీ అంతా పూర్తి చేయించుకొని మా అమ్మాయిని రమణను అక్కడే ఉంచి మా దంపతులం లోపలికి వెళ్లి తనివితీరా విశ్వేశ్వర దర్శనం చేసి అభిషేకం చేసి, అన్నపూర్ణ అమ్మవారి దర్శనమూ చేసి సెక్యూరిటీ నుండి బయటపడ్డాం. బయటికొచ్చి చూస్తే మావాళ్ళిద్దరూ కనిపించలేదు. కంగారుపడ్డాం. అటూ ఇటూ అరగంట తిరిగి పోలీసులను అడిగి రెండో నంబర్ గేటు దగ్గరకు చేరుకొన్నాం. అక్కడే ఉన్నాడు మా రమణ. మా అమ్మాయి కనిపించలేదు. ఏమయిందని అడిగితే మీ కోసమే వెళ్ళింది అన్నాడు . ఫోన్ తీసుకెళ్లలేదన్నాడు. నాకు "ఎక్కడో కాలింది". అరిచాను. సరేవాడినీ, వెళ్లి దర్శనం చేసుకురమ్మన్నాం. వెళ్లి అన్నా చెల్లీ ఒకపావుగంటలో వచ్చారు.. జనం విపరీతంగా ఉన్నారు. క్యూలో ఉన్న భక్తులకు ఇక్కడ కాశీలో ఏ దేవుడు ఉన్నాడో, ఎవరిని దర్శించటానికి వచ్చారో కూడా తెలియదు అని వారిని మాట్లాడిస్తే అర్ధమైంది. వివరంగా నేనే చెప్పాను. గ్రూపులను వెంటబెట్టుకొని దర్శనం చేయించే వారుంటారు. వారేమీ వీరికి వివరంగా చెప్పకపోవటంతో వచ్చిన చిక్కు ఇది అని అర్ధమయింది. అంతా హడావిడే, సందడే. ఏ గేటులో నుంచి లోపలికి వేడుతున్నామో గ్రహించి వెళ్ళకపోవటంతో వచ్చిన తిప్పలు ఇవి. అందుకని గుడికి వెళ్ళేవారందినీ హెచ్చరించి చెప్పాం.

మేము రెండేళ్ళక్రితం వచ్చినప్పుడు తెల్ల పైజమా లాల్చీ మొదటిసారిగా ఇక్కడే కొన్నాను. అంతకు ముందేప్పుడూ వీటిని ధరించలేదు. వేసుకోవటం మొదలెట్టిన తర్వాత బానే ఉందని పించింది. అప్పుడు జత నూటయాభైకే కొన్నాం. ఇప్పుడు చూస్తే మూదొందలకు పైగా చెప్పాడు. ఒక హోల్సేస్ షాపు మీదపడి ఒక జత తెల్లవి పట్టుది ఒకటి కొన్నాను. మా రమణా కొనుక్కున్నాడు. మా మనవళ్ళు



సంకల్ప్, భువనహర్ష చరణ్లకు కూడా తెల్ల పైజమా లాల్చీలు మా అమ్మాయి కొన్నది . రమణ మా అమ్మాయి పిల్లలు శ్రీకెత్, ఆశుతోష్, పీయూష్లకు కుట్టిన పట్టుపంచెలు కొన్నాడు. వాడూ పట్టుబట్టలు కొనుక్కున్నాడు. మా ఆవిడా రెండొందలకు నేత చీర కొన్నది. మా అమ్మాయి మా అల్లుడికీ తెల్ల పైజమా లాల్చీకొంది. మా శ్రీ



సువర్చలన్జనేయస్వామి వారలకు పట్టుబట్టలు కొన్నాం.

మౌంట్ సోమూఆవిడ మా అమ్మాయిని వాళ్ళ ఆయనగారికి అంటే ప్రసాదావధాని గారికి కుట్టిన పట్టుపంచెలు కొనమంటే రెండు జతలు కొన్నది. మంచి రంగువే దొరికాయి. నిన్నటి నుంచి మా అమ్మాయి స్పటిక శివలింగాలు కొందామని ప్రయత్నిస్తే ఇవాళ ఒకచోట దొరికాయి. శివలింగం, పాను వట్టం ఉన్నవి రెండు, మధ్య రకంవి కొన్నది. అభిషేకం చేసే స్టాండ్పై నీటి ధారా పాత్ర ఉన్నది ఒకటి ఉన్న లింగం పెద్దది కొన్నది. వీటి ఖరీదు రెండువందల యాభై ఒక్కొక్కటి. 'సోమామా'గారి కోసం దర్భచాపల సెట్నాలుగు చాపలసెట్ ఎనభై రూపాయలకు కొన్నది. ఇక్కడా దర్భచాపలు అని అడిగితే యెవరి ఏ తెలీదు. వలీ 'కుశాసన్' అని అడగాలని ఒక సాధువు చెప్పాడు. దేవుడి ఫోటోలు, ప్రసాదాలు కొన్నాం. పైజమా షాపు వాడు మంచి టీ తెప్పించి ఇప్పించాడు.

షాపింగ్ అంతా అయేసరికి ఒంటిగంట దాటింది. బయటికి వచ్చి రిక్షాలు ఒక్కొక్కటి నలభై రూపాయలకు మాట్లాడి కరివేన సత్రం చేరాం. సామానంతా రూముల్లో పడేసి రమణ ఆకలిగా లేదంటే మేము ముగ్గురం సత్రానికి భోజనానికి వెళ్లాం. అప్పటికే రెండు బాచీలు భోజనం చేశారు. మా అమ్మాయి కింద కూర్చుంటే మేమిద్దరం టేబుళ్ళ వద్ద కుర్చీలలో కూర్చున్నాం భోజనానికి. లుంగీ తువ్వాలతో నేను వచ్చాను. పప్పు, బంగాళాదుంప వేపుడు వంకాయ కూర, దోసకాయ చట్నీ, పరవాన్నం, బజ్జీ, సాంబారు, మజ్జిగలతో బహు కమ్మని భోజనం పెట్టారు. అడిగి అడిగి వాళ్ళూ కావాల్సినవి అడిగి మేమూ కడుపు నిండా తిని 'బ్రేవ్మని త్రేంచాం'. "అన్నదాతా సుఖీభావ" భోజనదాతలకు కృతజ్ఞత చెప్పాం. భోజనానికి ముందు అన్నపూర్ణాదేవిని స్తుతించాం .

రూము రెంటుయెంత అని అడిగితే గదికి మూడొందలు అని చెప్పారు. రెండు రూములకు రెండు రోజులకు పన్నెండు వందలు చెల్లించి రసీదు తీసుకొన్నాను. నిన్నా ఈ రోజు భోజనాలు చేసినందుకు సత్రానికి డొనేషనుగా అయిదు వందలు ఇచ్చాను. రసీదు ఇచ్చారు. నాలుగింటికి రూములు ఖాళీ చేస్తామని చెప్పి గదులకు చేరాం. ఈసారి 'కరెంటుకోత' పెద్దగా లేదనిపించింది. రెండేళ్ళ క్రితం వచ్చినప్పుడు కనీసం నాలుగైదు గంటలు పగలూ రాత్రి కరెంట్ కట్ చేశాడు. ఊపిరాడక చాలా ఇబ్బంది పడ్డాం.

ఎన్నికల రోజులు కనక జాగ్రత్త పడ్డారేమో? మూడున్నర దాకా విశ్రాంతి తీసుకొన్నాం. సామాను అంతా సర్ది రెడీగా ఉంచుకొన్నాం. తొమ్మిది నెలలు బ్రాహ్మణ సేవ చేయాలనే తలంపుతో రామయ్య అనే ఒక గోల్లాయన కరీంనగర్నుంచి వచ్చి ఇక్కడ సేవకుడిగా సత్రంలో సేవ చేస్తున్నాడు. భోజనం టిఫిన్లు వసతి ఉచితం అని చెప్పాడు. మా సామాను ఆటోవరకు తీసుకురావటానికి మాకు సహాయం చేశాడు. రమణ ఆయన జేబులో కొంత డబ్బు పెట్టాడు.. ఇక్కడే 'సైకిల్స్వామి' ఆశ్రమం ఉంది. సరాసరి వెడితే శ్రీవిశ్వనాథ గల్లీ చేరుతుంది. దారికోసం కంగారు పడక్కరలేదు. నడిచి తిన్నగా కాశీవిశ్వేశ్వరుడిని దర్శించవచ్చు. ఆటోకు రెండువందలు ఇచ్చి వారణాసి స్టేషనుకు చేరుకొన్నాం . అయిదు ముప్పావుకు 'ఖజురహో' వెళ్ళే బుందేల్ఖండ్ ఎక్స్ప్రెస్ ఎక్కాం. అది వారణాసి నుంచే బయల్దేరే లింక్ఎక్స్ప్రెస్. అనేక స్టేషన్లలో బోగీలు తగిలించుకొంటూ వదిలిన్చుకొంటూ, చివరికి యిదే యిదే అయిదు బోగీలతో అందులో ఒకే ఒక ఏసి బోగీతో మర్నాడు అంటే పదమూడు ఆదివారం ఉదయం అయిదున్నరకు ఖజురహో చేరాము. ఆ విశేషాలు ఈసారి.

## మా నవరాత్రి యాత్ర-6

### అదరహో ఖజురహో

ఖజురహో స్టేషన్ను చూస్తే కొత్తగా నిర్మించినట్లనిపించింది. అప్రోచ్ రోడ్లూ కొత్తవే. పర్యాటక కేంద్రంగా స్టేషన్ నుంచి ఊరిలోకి ఎనిమిది కిలోమీటర్ల దూరం. రోడ్డు కచ్చా పచ్చాగా ఉంది. దారికి రెండు వైపులా 'ఇప్ప చెట్లు' విరగ బూసి ఉన్నాయి. ఇప్పపూలు రాలి నేలమీద విపరీతంగా పడుతున్నాయి. వాటిని చిన్నా పెద్దా ఆడా మగా అంతా సంచుల్లోకి ఏరుకుం టున్నారు. ఇప్ప పూవు భద్రాద్రి రామయ్యకు ప్రసాదం అని మనకు తెలుసు. ఇప్పపూవు సారా మంచి 'కిక్' ఇస్తుందంటారు. కనుక దానికోసం ఏరి సొమ్ము చేసుకొంటున్నారు. దారిలో మోదుగ చెట్లు అగ్గిపూలతో మధ్యప్రదేశ్ ఎండలకు సాక్ష్యంగా కనిపిస్తున్నాయి. అభివృద్ధి చేయుటానికి కృషి



చేస్తున్నట్లనిపించింది. విమానశ్రయమూ ఏర్పడింది.

సూర్యా హోటల్‌లో రూమ్ బుక్ చేశాడు మా అబ్బాయి శర్మ. హోటల్ వాడు పంపిన ఆటోలో హోటల్‌కు చేరాము. సౌకర్యంగానే ఉంది.. వేడి నీరు వస్తోంది. పళ్ళు తోముకొని వేడి నీట జలకాలాడి సిద్ధమయ్యాం.

ఇండికా కారు బుక్ చేశాడు మా వాడు. డ్రైవర్‌ను ఎనిమిదింటికి రమ్మని చెప్పాం. హోటల్‌లో కాఫీ తాగుదామని అడిగితే ముప్ఫై రూపాయలన్నాడు. అమ్మో అనిపించింది. డ్రైవర్ వచ్చేసరికి రెడీ అయ్యాం. కారులో బయల్దేరి దగ్గరలో ఉన్న 'మద్రాస్ హోటల్'కు చేరాం. ఇంకా 'పొయ్యి వెలిగించిన' వాసన కనిపించ లేదు. వెళ్ళిపోబో తుంటే 'ఓనరైన అమ్మాయి' అయిదు నిమిషాల్లో కాఫీ, పది నిమిషాల్లో టిఫిన్ రెడీ అవుతుందని ఉండమని చెప్పింది. కూల బడిపోయాం. నాకేమీ తినాలనిపించలేదు. ఆ వాతావరణం చూసి. రెండు కాఫీలు తెప్పించి నలుగురం తాగాం. ప్రభావతి సాదా దోసె ఆర్డర్ ఇచ్చి తిన్నది. పరవాలేదని చెప్పింది. కాలే కడుపుతో పొద్దున్న తిన్న హార్లిక్స్ బిస్కట్లతో మళ్ళీ కారు ఎక్కి దగ్గరలోనే ఉన్న ఖాజురాహో దేవాలయ సముదాయాలను దర్శించటానికి వెళ్లాం. కారు బయటే ఆపేసి మమ్మల్ని లోపలి తోలాడు. డ్రైవర్ టికెట్టు కూడా ఉంది. మనిషికి పది రూపాయలు. ప్రభుత్వం చాలా శ్రద్ధ తీసుకొని ఆ విశాల ప్రాంగణం చుట్టూ ఫెన్సింగ్ ఏర్పరచి కాపలా పెట్టి ఆ విలువైన శిల్ప సంపదని రక్షిస్తోంది.. మంచి నీటి సౌకర్యం, పచ్చగడ్డి తివాచీలు కూర్చోటానికి బెంచీలు అన్నీ సౌకర్యాలు కలిపించింది. సాయంవేళ 'లైట్ అండ్ సౌండ్'లతో ఈ శిల్ప రహస్యాలను తెలియజేసే ప్రోగ్రాం ఉంది. మేము సాయంత్రం తిరుగుటపా. మొద టగా వరాహ దేవాల యం చూశాం. అక్కడే లక్ష్మణ దేవాలయం ఉంది. చిత్రగుప్తుడికి, శివుడికీ ఆలయాలు న్నాయి. ప్రక్కనే మాతంగేశ్వ రాలయం ఉంది. అమ్మవారి గుడీ ఉంది. అన్నీ 'జైగాంటిక్ టెంపుల్స్' అనిపిం చాయి. అన్ని ఆలయాల గర్భాలయాలు ఒకే రీతిలో ఉండటం విశేషం. నందీశ్వరాలయం బృహత్తరం. పన్నెండుకుపైగా ఆలయాలున్న మహా ప్రాంతం ఇది. ఎండ ముదరక ముందే చూడాలి. లేకపోతే వేడి తట్టుకోలేము. ఆలయాల శిఖరాలు మహా సున్నితంగా మలచబడ్డాయి. కామశాస్త్ర శిల్పాలే ఎక్కడ చూసినా వివిధ భంగిమల్లో కని పిస్తాయి. ఏ దేవాలయంలోను నిత్యపూజ లేదు. మాతంగేశ్వరాలయంలో పెద్ద పానువట్టం మీద ఆరేడు అడుగుల ఎట్టు రెండడుగుల వెడల్పు పసుపురంగు శివలింగం ఉంది. పానువట్టం మీదనే కూర్చుని పూజారి పూజ చేస్తాడు. మనమూ దానిమీదే నడవాలి. తమాషా అనిపిస్తుంది.. ఒక్కో ఆలయానికి కనీసం ఇరవై ఎత్తైన నిలువు మెట్లు ఉంటాయి. ఇవి ఎక్కి దిగాలి. అంటే ఎంతో ఓపిక కావాలి. మా ఆవిడ రెండు దేవాల యాలు మాత్రమే చూసి నీడలో కూలబడింది. మా అబ్బాయి మరో రెండు చూసి చతికిల పడ్డాడు. పట్టువదలని



విక్రమార్కులంలాగా నేనూ మా అమ్మాయి అన్ని దేవాలయాలు చూసి పిచ్చ పిచ్చగా ఫోటోలు తీశాము. దేనినీ వదలలేదు. ఆ అమ్మాయి 'ఐ పాడ్'తో తీసిన ఫోటోలు బాగా పెద్దవిగా 'అదర హోగా' వచ్చాయి. నాది తొమ్మిదేళ్ళనాడు అమెరికాలో కొన్న కోడాక్. బుజ్జిముండ ఎన్నివేల ఫోటోలు ఇప్పటి దాకా తీసిందో తెలీదు. అద్భుతంగా పని చేస్తోంది. వీడియోకూ పనికొస్తుంది. ప్రయాణం కనుక ఆ అవకాశం ఉపయోగించు కోలేకపోయాం. ఇవన్నీ చూసి అక్కడి నుండి జైన దేవాలయానికి తీసుకెళ్ళాడు. 'డ్రైవర్ రాముడు'. ఇవాళ 'మహావీర్ జయంతి' అని అక్కడికి వెళ్ళేదాకా తెలీదు మాకు. జైనులు పెద్ద సంఖ్యలో వచ్చి దర్శిస్తున్నారు. పార్శ్వనాథ, ఆది జైన ఆలయాలను దర్శించాం తెలీకుండానే. మహా పర్వదినాన జైన మహావీర సందర్శనం జరగటం మా పూర్వ జన్మసుకృతం అనిపించింది. మధ్యలో మరో రెండు దేవాలయాలు చూపించి మమ్మల్ని 'ఖజురహో వాటర్ ఫాల్స్'కు పదిహేను కిలోమీటర్ల దూరం డ్రైవ్ చేసి తీసుకెళ్ళాడు. కారుకు ఎంట్రన్స్ ఫీజు మనమే కట్టాలి. ఫీజు మూడు వందలు ఎండ అదిరిపోతోంది. కాళ్లు కింద పెట్టాలంటే బెదురుగా ఉంది. అలాగే దిగి మా ఆవిడను కారులోనే ఉంచి మేము ముగ్గురం చూశాము. అక్కడ ఒకతను దీని వివరాలు చెప్పాడు. అతని చేతిలో ఇరవై పెట్టాను. అతను చెప్పిన దాని ప్రకారం కొన్ని వేల సంవత్సరాల క్రితం ఇక్కడ అగ్నిపర్వతం బ్రద్దలై, లావా ఎగచిమ్మి ఈ కొండ ప్రాంతం ముక్కలు ముక్కలుగా చీలి ఒక పెద్ద, ఒక చిన్న జల పాతాలేర్పడ్డాయి. వేసవిలో కూడా నీరు పై నుంచి కిందికి ప్రవహిస్తూనే ఉంటుంది. జూన్ జులై నెలల్లో ఈ ప్రదేశం అంతా అంతులేని జలరాసితో కళకళలాడుతుంది. అప్పుడు దీని సౌందర్యం వర్ణనాతీతం అన్నాడు. దీని ప్రక్కనే అభయారణ్యం ఉంది. ఇక్కడ వాల్కనో వలన అనేక రంగుల శిలలేర్పడ్డాయట. డోలమైట్, క్వార్ట్జ్, గ్రానైట్ మొదలైనవి. ఇవన్నీ చూసి డ్రింకులు అంటే 'స్ప్రైట్'ఆరగా ఆరగా తాగుతూ హోటల్ సూర్యాకు చేరేసరికి దాదాపు రెండు గంటలైంది మధ్యాహ్నం. మావాళ్ళు ఇక కాలు తీసి కాలు బయట పెట్టలేమంటున్నారు. రమణా అలసిపోయాడు. ఇంకా రెండు



దేవాలయాలున్నాయన్నాడు డ్రైవర్.

ఆడవాళ్లిద్దర్నీ హోటల్ రూమ్‌కు చేర్చి నేను రమణ, మద్రాస్ హోటల్‌కు వెళ్లాం. నేనూ వాడు ఇడ్లీ ఆర్డరిచ్చి తిన్నాం. చట్నీ సాంబారు ఇచ్చాడు. నాకెందుకో లోపలి పోలేదు. ఏదో 'కతికా'. వాడు దోసె కూడా తిన్నాడు. తల్లీ కూతుళ్ళకు ఇడ్లీ దోసె పార్సెల్ చేయించుకొని, మజ్జిగ కొని రమణను రూమ్ దగ్గర దింపాను. డ్రైవర్‌తో మిగిలిన రెండు దేవాలయాలు చూడటానికి బయల్దేరా. మా వాళ్ళు వెళ్ళద్దని గోల. వెళ్లి తీరాల్సిందేనని నేను పట్టు బట్టాను. సరే అందులో ఒకటి 'బలరాముడి' దేవాలయం. రెండవది 'వామనావతార్' దేవాలయం. రెండూ చూసి రూముకు చేరేసరికి మధ్యాహ్నం మూడు దాటింది. సాయంత్రం అయిదూ నలభై అయిదుకు నిజాముద్దీన్ ఎక్స్ప్రెస్ పట్టుకోవాలి. కాసేపు రెస్ట్. తరువాత నాలుగున్నరకే సామాను సర్దేసి హోటల్ దగ్గరే ఉన్న ఆటో మాట్లాడుకొని స్టేషన్‌కు బయల్దేరాం. శర్మ మాట్లాడిన 'పాకేజ్' ప్రకారం ఖజురాహో చూపించటానికి ఇండికా కారుకు 1750 రూపాయలు, హోటల్ రెంట్ అయిదు వందలు. హోటల్ రెంట్ ఫరవాలేదు కాని కారు డబ్బులు దండగే అనిపించింది. అంత దూరం తిరిగిందేమీ లేదు. చలికాలం ఆటో చాలు. లేకపోతే మామూలు కారు చాలు. కాని వేసవి కనుక తప్పదని సర్దుకొన్నాం. మా అమ్మాయి రాత్రి నుంచి 'లూజ్ మోషన్స్'తో బాధ పడుతోంది. చెబితే తిడతానేమోనని చెప్పలేదు. ఈ ఉడుకు ప్రదేశంలో ఇప్పటికే మూడు ప్రాంతాలలో తిరుగుడు. తెల్లవారు జామున లేవటాలు దారిలో తిండి లేకపోవటాలు అన్నీ కలిసి అందర్నీ బాధించాయి.

నాకూ అలానే ఉన్నా ఎక్కడి నుంచి వచ్చిందో ఓపిక నాకే అర్థం కాలేదు. దాదాపు అన్ని దేవాలయాల 600 మెట్లూ ఎక్కి దిగానంటే నాకే ఆశ్చర్యంగా ఉంది. కాళ్లు తేలిపోతున్నాయి. పడతానేమోనని మావాళ్ళు మధ్య మధ్యలో హెచ్చరిస్తున్నారు. "ఈ సీతయ్య ఎవరి మాటా వినడు" అన్నట్లు మొండిగా అంతా ఎక్కి, దిగి, కలయ తిరిగి చూసి ఆనందాన్ని సంతృప్తినీ పొందాను. ఎప్పటి నుంచో ఖజురహో చూడాలనే తాపత్రయం. మా అమ్మాయి వలన ఈ 'నవరాత్రి మహాత్మ్యం'లో తీరింది. ఇక్కడ

గబ్బిట దుర్గాప్రసాద్



అంతా వర్షాధార పంటలే. బావుల నీటితో వ్యవసాయం. సెనగ పంట బాగా పండుతుంది. ఖజురహో అంటే 'ఖర్జూర వనం' అని అర్థం. దాదాపు ఎడారి ప్రాంతంలా ఉంటుంది. కాని పంటలు బాగానే పండిస్తున్నారు. ఖజురాహో విశేషాలు ఈసారి రాసి అదురహో అనిపిస్తాను. ట్రెయిన్ అయిదింటికే స్టేషన్‌లోకి వచ్చింది. ఇక్కడి నుంచే బయల్దేరాలి. ఒకే ఒక ఎసి బోగీ. ఎక్కి కూర్చున్నాం. ఇంతలో కోసూరు నుండి ఆదినారాయణ ఫోన్ చేసి పెదముత్తేవి వార్షికోత్సవం పందొమ్మిదో తేదీ అని గురువుగారు సీతారామ యతీంద్రుల వారు చెప్పారని నన్ను తప్పక వచ్చి మాట్లాడమని ఆదేశించారని చెప్పారు సరే నన్నాను.

ఆ తరువాత నా శరీరం నా స్వాధీనంలో లేదు. వెంట వెంటనే మూడు విరేచనాలు అయ్యాయి. విపరీతంగా నీరసంగా ఉంది. వెంట తెచ్చుకొన్న 'నేట్రం మూర్' హోమియో మందు వడదెబ్బ తగలకుండా ప్రయాణం మొదట్నించీ వేసుకొంటూనే ఉన్నాము. దానితోబాటు 'ఫెర్రం ఫాస్' కూడా ఇప్పుడు వాడాను. కొంత ఉపశమనంగా ఉంది. నిద్ర బానే పట్టింది. రాత్రి రెండు గంటలకు ఝూన్సీ చేరాం. అక్కడ ఇండోర్ ఎక్స్ప్రెస్‌ను తెల్లవారుజామున నాలుగిం టికి ఎక్కి ఉజ్జైన్ మధ్యాహ్నం పదకొండింటికి చేరుకొన్నాం. నా బాధ సంగతి మావాళ్లకు చెప్పలేదు. చెబితే 'తకిట తడికిం' అవుతుందని మూసుక్కూర్చుని. ఉజ్జైన్‌లో రైల్వే రిటైరింగ్ రూమ్‌కు చేరిన తర్వాత నెమ్మదిగా చెప్పాను.

## మా నవరాత్రి యాత్ర-7

### అదరహో ఖజురహో విశేషాలు

ఇండియాలో ఆగ్రా తర్వాత ఎక్కువమంది సందర్శించే క్షేత్రం ఖజురాహో. "ఇండో ఆర్యన్ కళకు" అద్దంపట్టే శిల్ప వైభవం ఇక్కడే చూస్తాం. దేవాలయ శిల్పకళకు అపూర్వ శిల్పాలకు ప్రపంచంలోనే గొప్ప ప్రదేశం ఖజురహో. తొమ్మిదో శతాబ్దం నుండి పదకొండవ శతాబ్దిలోపు నిర్మితమైన దేవాలయ సముదాయం ఇది. చండేలా రాజ వంశీకుల అద్వితీయ కళాతృష్ణకు శిల్పుల కళాసృష్టికి దర్పణం. 85 దేవాలయాలలో

ఇప్పుడు మిగిలింది కేవలం 25 మాత్రమే. ఖజురహో సాగర్ ఒడ్డున ఖజురహో గ్రామం ఎనిమిది వేల జనాభాతో ఉంది. మధ్యప్రదేశ్‌లో చట్టర్పూర్ జిల్లాలో ఖజురహో ఉంది. నర్మదా, చంబల్ నదుల పరివాహక ప్రాంతం. ఉత్తర దక్షిణ భారత దేశాలను వేరు చేసే వింధ్య పర్వత శ్రేణులలో ఉన్న ఈ ప్రదేశం శిల్పకళకు కాణాచిగా వెలసిల్లింది. సాత్నా రైల్వేస్టేషన్ దీనికి దగ్గరగా ఉంటుంది. వాతావరణం ఉష్ణమండల శీతోష్ణ స్థితి. పూర్వకాలంలో వర్షపు నీటిని నిలవ చేయటానికి 60 తటాకాలుండేవి. ఇప్పుడు మూడు తటాకాలు మాత్రమే ఉన్నాయి. అవే ఖజురహో సాగర్, శివసాగర్, ప్రేమసాగర్‌లు. ఇక్కడ ఇప్ప పూల చెట్లు విపరీతం. వీటిని సాగుచేసి పెంచుతారు. ఇవి సారా పరిశ్రమకు తోడ్పడి ఆదాయం పెంచేవి. 16వ శతాబ్దికి ఖజురహో వైభవం అంతా హారతి కర్పూరం అయిపోయింది. 1838 వరకు దీని గురించి బయటి ప్రపంచానికి తెలియలేదు. కెప్టెన్ టి ఎస్ బర్ట్ పల్లకీలో వెడుతూ ఉంటే అది ఒరిగి పడిపోతే బాగు చేయిస్తూ ఈ కళాఖండాలను చూసి ఆశ్చర్యపడ్డాడు. "భారతదేశంలోని అన్ని దేవాలయాల వైభవం ఇక్కడే దర్శించవచ్చు" అని రిపోర్టు రాశాడు. "దంగాకు చెందిన 1002 నాటి శిలాశాసనాన్ని" కాపీచేసి పెట్టుకొన్నాడు. ఇది విశ్వనాథ దేవాలయంలో ఉంది. అలేక్సాండర్ కన్నింగ్ హాం ఖజురాహో అంటే 'ఖర్జూర వనం' అని అర్థం చెప్పాడు. 'ఖర్జూర వాటిక' అనేవారు ఆనాడు. అది ఉచ్ఛస్థితిలో ఉన్నప్పుడు ఇక్కడ ఖర్జూరం విపరీతంగా పండేది. దీనికి సాక్ష్యంగా రెండు బంగారు ఖర్జూరాలు సిటీ గేట్ల వద్ద త్రవ్వకాలలో లభించాయి. ఈ ఆలయాలపై బూతు బొమ్మలు అధికం. వాటిని విడిగా చూడకుండా మొత్తం ఒకే దృష్టితో చూడాలని చరిత్రకారులన్నారు. 1864లో కన్నింగ్ హాం దర్శించి 872 విగ్రహాలున్నాయని, అందులో గోడలకు వెలుపల 646 ఉన్నాయని రిపోర్ట్ రాశాడు. అవన్నీ చెల్లా చెదరుగా పడి కుప్పలుగా ఉండిపోయాయని ఆ శిలాశిల్ప నిధి అపూర్వమనీ చెప్పాడు.

మహాత్మా గాంధి ఈ ఆలయాలను చూసి "చాలా జుగుప్సా కరమైన శిల్పాలనీ వీటిని వెంటనే తొలగించేయాలని" హితవు పలికాడు. దానికి స్పందించిన గురుదేవులు రవీంద్రనాద టాగూర్ "ఖజురహో జాతీయనిధి అని దాన్ని కూల్చేయ మనటం అవివేకమని, అలా చేస్తే మన పూర్వీకులు మరీ శృంగార జీవులు అనే అభిప్రాయం ఏర్పడుతుంది" అని గాంధీకే 'క్లాస్' పీకాడు. ఖజురహో పద్నాలుగో శతాబ్దపు చండేలా వంశరాజుల మతాత్మక రాజధాని అన్నారు. ఆరబ్ యాత్రికుడు 'ఇబాన్ బుటూటా' దీన్ని 1335లో చూసి దీన్ని 'కజర్రా' అనేవారని ఇక్కడ యోగులు బారు గడ్డాలతో జటా జూటాలతో ఉండేవారని నిరాహారం వలన వారి శరీరాలు పాలిపోయి పసుపు రంగులోకి మారాయని రాశాడు. ఇప్పుడున్న ఖజురహో సాగర్ ఎనిమిది వందల మీటర్లు పడమటి దేవాలయాలకు దూరంగా ఉండేది. అప్పుడిది ఖజురహో నగరానికి గుండెకాయగా



వర్ధిల్లిందని చెప్పాడు. ఇప్పటికీ శివరాత్రి నాడు వేలాది భక్తులు వచ్చి దర్శించి తరిస్తారు. అప్పుడు గొప్ప ఉత్సవాన్ని నిర్వహిస్తారు. ఖజురహో వచ్చిన వారు ఇక్కడ ప్రభుత్వం ఏర్పాటు చేసిన 'లైట్ అండ్ సౌండ్' ప్రోగ్రాం తప్పక చూసి అనుభూతి పొందాలి. ఇక్కడ సాంస్కృతిక ఉత్సవాలు జరిగేవి. భారతీయ సర్వకళా ప్రదర్శన నిర్వహిస్తారు. ఖజురహో సంప్రదాయాన్ని ఇప్పటికీ గౌరవించి కొనసాగిస్తారు. ఎన్నో రకాల సెమినార్లు జరుగుతాయి. స్థానికంగా తయారైన అనేక కళాత్మక వస్తువులను విశాలమైన ప్రాంతంలో ప్రదర్శించి అమ్ముతారు. ఈ ఉత్సవం భారత దేశానికే కాదు ప్రపంచమంతటికీ ఆకర్షణీయమే.

## ఖజురహో వృత్తాంతం

చండేలా రాజులు రాజపుత్ర వంశానికి చెందిన చంద్ర వంశ రాజులు. చండేలా రాజులు మధ్య భారతాన్ని చాలా కాలం ఏలారు. తొమ్మిదో శతాబ్ది నుండి పద్నాలుగో శతాబ్ది వరకు వీరి పాలన సాగింది. వీరిని 'జేజక భుక్తి' రాజులనే వారు ఇప్పుడు 'బుందేల్ ఖండ్' రాజులంటారు. చాంద్ బర్దాయి అనే ప్రాచీన కవి ఢిల్లీ అజ్మీర్‌ల పాలకుడైన పృథ్వీరాజు చౌహాన్ ఆస్థాన కవిగా ఉండేవాడు. ఆయన రాసిన దాని ప్రకారం కాశీకి చెందిన గాహద్వారా రాజు ఇంద్రజిత్ ఆస్థాన పురోహితుడి కూతురు హేమవతి. హేమావతి గొప్ప అందగత్తె. ఇంద్రుడే ఆమె సౌందర్యానికి నీరైపోయాడు. అతన్ని పెళ్లి చేసుకోనంది. ఇంద్రుడి శాపం వలన విధవరాలైంది. అప్పటికి ఆమె వయసు పదహారే. ఒకరాత్రి విరహ వేదన భరించలేక 'రతి తాలిబ్' అనే సరస్సులో నగ్నంగా స్నానం చేస్తుంటే చంద్రుడు ఆమెను మోహించి ఆమెను చేరి సల్లాపాలాడాడు. ఆమె కన్యత్వం కోల్పోయింది. ఈ పరాభవాన్ని దాచుకోవటానికి ఎంతో ప్రయత్నించింది. చంద్రుడు ఆమెను కర్ణావతి నదీ తీరంలోని ఖజూర వాటికలో తల దాచుకోమని సలహా ఇచ్చాడు. ఆమెకు పుట్టబోయే కుమారుడు అద్వితీయ బల సంపన్నుడై పదహారవ ఏట రాజు అవుతాడని రాజ్యవిస్తరణ చేస్తాడని అనునయించి అదృశ్యమైనాడు చంద్రుడు.

హేమావతి కాశీలో తండ్రి ఇంటికి చేరింది. మళ్ళీ కలన్జార్‌కు తిరిగొచ్చింది. కొడుకును కన్నది. చంద్రవర్మ అనే పేరు పెట్టింది. అతడు పెరిగి పెద్దవాడై బల

పరాక్రమ సంపన్నుడైనాడు. పదహారో ఏట ఒక సింహాన్ని పులిని సునాయాసంగా పోరాడి చంపాడు. సంతోషించిన తల్లి హేమావతి చంద్రుని ప్రార్ధించింది. చంద్రుడు దిగి వచ్చి కొడుక్కి 'ఒక పరుస వేది' నిచ్చాడు. అది దేన్నీ తాకితే అది బంగారం అవుతుంది. క్రమంగా ధనమూ పెరిగి 'మహోబా'కు రాజై రాజ్య విస్తరణ చేశాడు. కాశీలోని గాహద్వారా రాజును ఓడించి కాశీని కూడా తన రాజ్యంలో కలిపేశాడు హేమావతి కొడుకు చంద్రవర్మ రాజు. వివాహం చేసుకొని రాణీతో ఖజురాహో చేరి 'భంద్య యజ్ఞం' చేసి తల్లిపై పడిన మచ్చను అవమానాన్ని తొలగించాడు. తల్లి కోరినవన్నీ తీర్చాడు. విశ్వకర్మను ఆహ్వానించి ఖజురహోలో 85 దేవాలయాలను నిర్మించి తల్లి హేమావతికి కానుకగా సమర్పించాడు. అందుకే ఇక్కడ ఏ దేవాలయంలో చూసినా ఆలయం ముందు సింహంతో పోరాడే బాలుడి శిల్పం కనిపిస్తుంది. ఆ బాలుడే చంద్ర వర్మ.

## మా నవరాత్రి యాత్ర-8

### ఖజురహో కళలహో అదరహో



### చారిత్రకాంశాలు

ఆర్.వి రసెల్ పండితుని దృష్టిలో మధ్య భారతంలో సుప్రసిద్ధులైన 'భారులు' అనే శిల్ప వంశానికి చెందినవారే. చండేలా రాజ వంశ మూల పురుషులు. 954 కాలపు శిలాశాసనం ప్రకారం ఈ వంశ మూలపురుషుడు 'చంద్రాత్రేయ మహర్షి'. కనుక చంద్రాత్రేయుడు లేక చంద్రవర్మ ఈ వంశానికి మూలపురుషుడు. చంద్రవర్మ ఖజురహోలో రాజధాని నేర్పరచి పాలించాడు. కన్నింగ్ హాం ఊహించిన దాని ప్రకారం కాశీకి చెందిన ఘద్వారా రాజు ఇంద్రజిత్ పురోహితుడు హేమరాజే చంద్రవర్మగా క్రీ.శ.168లో ఖజురహో రాజుగా అభిషిక్తుడయ్యాడు. చరిత్ర లోతుల్లోకి వెడితే తొమ్మిదో శతాబ్ది పూర్వభాగంలో పాలించిన 'నన్నూకుడు' ఈ వంశానికి మొదటి రాజు. ప్రతీహార రాజులు బలహీన పాలకులుగా తయారై విచ్చిత్తి చెందే సమయంలో చందేలీ రాజులు స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొన్నారు. నన్నూకుడే మొదట స్వాతంత్ర చండేలా రాజు. అతని తర్వాత కొడుకు 'వాక్ పతి' రాజు అయి తొమ్మిదో శతాబ్దం ఉత్తరార్ధం అంతా పాలించాడు. సామ్రాజ్యాన్ని క్రమంగా

విస్తరిస్తూ వింధ్య పర్వతభాగాలలో కొన్ని స్వాధీన పరచుకొన్నాడు వాక్ పతి.. అతని ఇద్దరు కొడుకులు జయశక్తి, విజయశక్తి తండ్రి తరువాత చందేలా రాజులై పాలించారు. అన్నదమ్ములిద్దరూ ధైర్య సాహసవంతులైనందున అనేక రాజ్యాలను జయించి సామ్రాజ్యాన్ని విస్తరించారు. మొదట జైశక్తి రాజై రాజ్యం చేశాడు. ఇతనినే 'జైజక్' లేక 'జేజకా' అనేవారు. తను పాలించిన ప్రాంతాన్ని అంతటిని 'జైజక భుక్తి'గా ప్రకటించుకొన్నాడు. కొడుకులు లేనందున వారసుడిగా తమ్ముడు విజయశక్తిని ప్రకటించి రాజ్యపాలన చేయించాడు.

శిలా శాసనాధారాలను బట్టి విజయశక్తి అనేక యుద్ధాలు చేసి చాలా రాజ్యాలను వశ పరచుకొని రాజ్యవిస్తరణ చేసి విజేత అయ్యాడు. అన్నదమ్ములైన జయ, విజయుల వీరగాధలను కథలుగా గేయాలుగా పాడుకొనేవారు. ఇద్దరూ కలిసి పాలించినట్లే భావించేవారు ప్రజలు. విజయశక్తి తర్వాత కొడుకు రాహిల్ రాజయ్యాడు. రెండేళ్ళు పాలించాడు. మహోబాకు దగ్గరలో రహీలా గ్రామం అతని పేర ఏర్పడింది. 'రహీల్ సాగర్' సరస్సు నిర్మించాడు. అతని తర్వాత కొడుకు హర్షదేవుడు క్రీ.శ. 900లో రాజై, 25 ఏళ్ళు సుదీర్ఘ రాజ్యపాలన చేశాడు. అతని కాలమే మహోన్నతమైనదిగా చరిత్రాకారులు భావిస్తారు. 'ఓద్'కు చెందిన కనోజ రాజ్యానికి ప్రతీహార రాజు మొదటి మహీపాలుడిని రాజుగా చేయటానికి హర్ష దేవుడు కృషి చేశాడు. అంతకు ముందు రాష్ట్ర కూటులు మహీపాల్‌ను ఓడించి రాజ్యాన్ని లోబరచుకొన్నారు. ఇది 915లో జరిగింది. ఈ వరుస విజయాలతో హర్షదేవరాజు ఖజురాహోలో 'మాతంగేశ్వరాలయం' నిర్మించి శివుడికి కానుకగా సమర్పించాడు.

అతని కుమారుడు యశోవర్మ హర్షదేవుని తర్వాత రాజయ్యాడు. అతన్ని లక్షవర్మ అని అంటారు. యశోవర్మనే చండేలా రాజ్యపాలకులలో మహా శ్రేస్టుడని అంటారు. ధీర, వీరశూరుడైన యశోవర్మ దక్కన్ పాలకులు రాష్ట్ర కూటుల్ని జయించి, దక్షిణాన మాల్వా వరకు తూర్పున గండా, మిధిల వరకూ రాజ్య విస్తరణ చేశాడు. తానే సర్వ స్వతంత్రరాజుగా ప్రకటించుకొన్న ధీశాలి యశోవర్మ. ఇతని కాలంలో చండేలా రాజులు మధ్య భారతంలోనే మహాశక్తివంతులుగా సమర్థులుగా గణన కెక్కారు. యశోవర్మ సర్వ సమర్థుడే కాక కళా పిపాసి. అందువల్లనే ఖజురాహోలో ఇంత విశేష దేవాలయ సముదాయ నిర్మాణం జరిగింది. 'లక్ష్మణ దేవాలయాన్ని' యశోవర్మ నిర్మించాడిక్కడ. దీన్ని శ్రీ మహా విష్ణువుకు అంకితమిచ్చాడు.

యశోవర్మ కొడుకు 'దంగా' తరువాత రాజై 954-1002 కాలంలో రాజ్యం చేశాడు. ప్రతీహారులకు తండ్రిలాగే కప్పం కట్టకుండా కనోజ్ రాజులకు విదేయుడైనాడు. చాలా రాజ్యాలు జయించి రాజ్య విస్తరణ చేశాడు. 'మహా రాజాధి రాజు' అనిపించు కొన్నాడు. యుద్ధ నిపుణుడేకాక కళా సంస్కృతులపై అపారమైన అభినివేశం ఉన్నవాడు



దంగా రాజు. అతని కాలంలోనే మహోత్రుష్టమైన 'విశ్వనాథ దేవాలయం', 'పార్శ్వనాథ దేవాలయం' నిర్మించాడు. పదవ శతాబ్దంలో ఉత్తర భారత దేశంలో దంగా మహాశక్తి వంతమైన మహారాజుగా వెలిగి పోయాడు. దంగా తర్వాత కొడుకు 'గండ' రాజయ్యాడు. ఇతను (1108–1017) కాలంలో రాజ్యపాలన చేశాడు. తొమ్మిదేళ్ళు మాత్రమే పాలించి రాజా గండ 'చిత్ర గుప్త' దేవాలయం 'శ్రీ జగదాంబా దేవాలయాల'ను నిర్మించాడు.

రాజా గండ మరణం తర్వాత కుమారుడు 'విద్యాధరుడు' రాజై 1017–1029 పాలించాడు. యుద్ధవీరుడు, శక్తివంతుడు అయిన విద్యాధరుడు మహమ్మద్ గజనీతో రెండుసార్లు యుద్ధం చేసి (1019,1022) కల్చారీలను, పాలమారులను ఓడించి మధ్యభారతంలో విశిష్ట స్థానాన్ని సంపాదించాడు. ఇతని కాలంలో చండేలా రాజ్యపాలన ప్రఖ్యాతమైంది. యుద్ధవీరుడేగాక కళాభిమాని, సంస్కృతీ గౌరవం ఉన్న మహారాజు. ఖజురాహోలో 'కందారియా మహాదేవా' ఆలయాన్ని అత్యద్భుత శిల్పకళా నికేతనంగా నిర్మించాడు. ఇతని కొడుకు 'విజయపాలుడు' తండ్రి రాజాన్ని సుస్థిరం చేసి దేవాలయ నిర్మాణాలను కొనసాగించాడు. యితడు నిర్మించినదే 'వామన దేవాలయం'. ఇతని పెద్దకొడుకు దేవవర్మ తండ్రి మరణానంతరం రాజయ్యాడు. రాజ్యాన్ని కల్చూరీల వరకు వ్యాపింప జేశాడు. ఇతను చనిపోయిన తర్వాత 1060లో తమ్ముడు 'కీర్తివర్మ' రాజయ్యాడు. అనేక యుద్ధాలు గెలిచి కల్చూరియాలు ఆక్రమించిన భాగాలన్నిటిని కైవశం చేసుకొన్నాడు.

చండేలా రాజు కీర్తివర్మ 40 ఏళ్ళు ఖజురహోను పరిపాలిం చాడు. కళలను సాహిత్యాన్ని సంస్కృతినీ అభివృద్ధి చేశాడు. ఇతని కాలంలోనే 'ప్రబోధ చంద్రోదయం' రచింపబడి కీర్తివర్మ ఎదుట ప్రదర్శింప బడింది. 'ఆదినాథ దేవాలయం', 'జవేరి అంటే బలరామ దేవాలయం', 'చతుర్భుజ కృష్ణ దేవాలయం' మొదలైన వాటిని నిర్మించాడు. కీర్తివర్మ పాలన 1100తో పూర్తయింది. అతని తర్వాతి రాజులు అనేక క్లిష్ట పరిస్థితుల నెదుర్కొన్నారు. వారి పాలన అంతా యుద్ధాలతోనే గడిచి పోయింది. ఉత్తర, మధ్య భారతాలలో ఈ యుద్ధ వాతావరణం పరమ భీభత్సంగా ఉండేది. చాళుక్యులు కల్చూరియలు ఎప్పుడూ ఖజురహోపై దండయాత్ర చేస్తూనే ఉండేవారు. కీర్తివర్మ తర్వాతి రాజు 'సల్లక్షన్' లేక హోల్లక్షన్ వర్మ రాజై, తర్వాత జైవర్మకు పాలన అప్పగించాడు. జయవర్మ గాహర్వార్ రాజుగోవిందవర్మ చేతిలో1120లో ఓడిపోయాడు. రాజ్యం

వదిలి అరణ్యాలకు చేరాడు.

పృధ్వీవర్మ అనే ఇతని పినతండ్రి రాజయ్యాడు. ఏదో విధంగా ఖజురహో రాజ్యాన్ని కాపాడాడు. తర్వాత పృధ్వీవర్మ కొడుకు 'మండనవర్మ' 1130లో సింహాసనం ఎక్కిపోయిన రాజ్యాన్ని కీర్తిని మళ్ళీ సంపాదించి పునర్వైభవం కల్పించాడు. కలిన్జార్, మహోబా, అజైగర్‌లను లోబరచుకొని పరాక్రమోన్నతుడు అయ్యాడు. 'దులాదేవ' ఆలయాన్ని ఖజురాహోలో నిర్మించాడు. 1163 వరకు మండనవర్మ పాలన సాగింది. తర్వాత కొడుకు 'యశోవర్మ' రాజయ్యాడు. రెండేళ్ళు మాత్రమే పాలన చేశాడు. తండ్రి హఠాన్మరణం వలన కొడుకు 'పరమార్ధ దేవుడు' రాజ్యానికి వచ్చాడు. చందేలా రాజ వంశానికి పారమార్ధి దేవుడే చివరి రాజు. 35 ఏళ్ళు సమర్ధవంతంగా రాజ్యం ఏలాడు. డిల్లీ రాజపుత్రారాజు పృధ్వీరాజ చౌహాన్ పారమార్ధి దేవుడిపై దాడి చేశాడు. పారమార్ధి కుమారులు అలహా, ఉదాల్‌లు వీరోచిత యుద్ధం చేశారు. వారి సాహసోపేత ధైర్య సాహస పోరాటాలను ఈనాటికే పాటలుగా పాడి కీర్తిస్తూనే ఉంటారు జనం. 'అలహా ఉదాల్' అనే జానపద గీతం ఇందులో బాగా ప్రసిద్ధి, ప్రచారం పొందింది. ముఖ్యంగా ఉత్తరభారతంలోను బుందేల్ ఖండ్ ప్రాంతంలోను. 1182లో పృధ్వీరాజు పరమార్ధ దేవ మహారాజును యుద్ధంలో జయించాడు. మహోబాను కోల్పోయాడు. 1202లో కుతుబుద్దీన్ ఐబక్ అనే మహమ్మద్ ఘోరి బానిస కలన్జార్‌పై దాడిచేసి ఓడించాడు. పారమార్ధి దేవుడు లొంగిపోయాడు. అతని మంత్రి ఈ పిరికితనానికి ఇతన్ని చంపేశాడు. అప్పటి నుంచి చందేలా రాజ్యం సుల్తానుల పాలనలోకి వచ్చింది. ఇంతకాలం ఖజురహోను కాపాడుకుంటూ కళా సాంస్కృతిక విస్తరణ చేస్తూ దేవాలయ నిర్మాణాలకు కొత్త జవం జీవం ఇస్తూ సాగిన చందేలా రాజ్యపాలన ఇలా అర్ధాంతరంగా ముగిసింది. ఇంత మంది రాజుల చరిత్రతో సుత్తి కొట్టాననుకొంటున్నారా? వారందరూ లేకపోతే ఖజురహో దేవాలయ శిల్పచాతుర్యం ప్రపంచానికి తెలిసేదే కాదు. అందుకే ఈ ప్రయత్నం ఖజురహో శిల్ప సంపద విశేషాలను తరువాత అందజేస్తాను.

## మా నవరాత్రి యాత్ర-9
## ఖజురహో ఆలయ శిల్పకళా వైభవం



ఖజురహో దేవాలయ సముదాయ శిల్పకళ ఇండో ఆర్యన్‌సంస్కృతికి చెందింది.



మధ్యయుగ శిల్పకళా వైభవానికి నిలువెత్తు నీరాజనాలివి. శిల్పకళ పరిపూర్ణంగా వర్ధిల్లి నేటికీ భద్రంగా రక్షింపబడిన సమూహం ఇది. బెంజమిన్ రోలాండ్ అనే ప్రఖ్యాత శిల్ప శాస్త్రవేత్త దీన్ని "The Khajuraho artist seems to be thoroughly versed in the mnemonic traditions and textual canons, the grammar and syntax of architecture and iconography" అని కీర్తి కిరీటం పెట్టాడు. ఇండో ఆర్యనుల కళా మేళవింపు మేధావితనం ఈ సముదాయాన్ని సర్వోత్కృష్ట స్థితికి తెచ్చిందని మెచ్చుకున్నాడాయన.

నగర్ ఆలయ నిర్మాణ శైలి భూమి, పై శిఖరంలోను, సూచీ అగ్రంగాను చుట్టూ విస్తరించి ఉండటంలోను ద్యోతకమవుతుంది. చౌన్స్ నాథ దేవాలయం తప్ప మిగిలిన ఖజురహో ఆలయాలన్నీ అత్యంత నాణ్యమైన శుద్ధి చేసిన ఇసుక రాయితో నిర్మితమైనాయి. లేత పసుపురంగు కొద్దిపాటి ఊదారంగు రాయి తూర్పు తాటాక తీరంలోని 'పన్నా' నుండి తెచ్చారు. పెద్ద రాళ్ళను క్వారీల వద్దనే శిల్పాలుగా మలిచి ఇక్కడికి రవాణా చేశారు. వాటిని దేవాలయ ప్రాంతంలో ఒకదానితో ఒకటి అంటించి ఆలయాలన్నిటినీ నిర్మించారు. చౌశాత్ యోగిని దేవాలయాన్ని మాత్రం గ్రానైట్ రాయితో కట్టారు. స్థానికంగా దొరికే గ్రానైట్ ముతకగా ఉండటంతో పన్నా వెళ్లి ఇసుక రాతిని తేవాల్సివచ్చింది.

ఫెర్గూసన్ పండితుడు "ఖజురహో దేవాలయాలను ఒకదానికొకటి విడమరచి తెలుసుకోవటానికి సూక్ష్మ పరిశీలన అవసరం. అన్నీ ఒకే రాజు నిర్మించినట్లు అనిపిస్తుంది. ఒకదాన్ని చూసి రెండోది ఈర్ష్య కల్గించేదిగా కని పిస్తుంది. అధిక శ్రమకు ఇవి ప్రతీకలు" అన్నాడు. మిగతా చోట్లున్న దేవాలయాలకంటే ఖజురాహో ఆలయాలు కోణ నిర్మాణాలకు సూక్ష్మ అగ్రాలకు ప్రతినిధులుగా కనిపిస్తాయి. సమాంతరంగానైనా నిలువుగానైనా, మూలల్లోనైనా ఈ ప్రత్యేకత గోచరిస్తుంది. శిఖర సముదాయాలతో కూడిన ఆలయ శిఖరం వంకీలతో నగిషీ చెక్కినట్లుంది. ఆశ్చర్య పరుస్తుంది. ఇలా పైకి పోయి పోయి గుండ్రని ఆమలక శిఖర రూపు దాలుస్తుంది. పద్మం వికసించి సూక్ష్మ రూపంలోకి మారినట్లు, అంతరిక్ష శూన్యానికి ప్రతీకగా విశ్వమానవ కపాల భాగంగా రూపు దాల్చటం ఖజురాహో ఆలయాల విచక్షణత. రోలాండ్ భాషలో "Distinct characteristic of Khajuraho temple archi tecture is that the

temples stand on a lofty terrace and are not surrounded by usual enclosure walls, proudly proclaiming their presence asif they had nothing to fear from iconoclasts ,vandals and marauders. The terrace or the lofty platform provides an outer pradakshina or open ambulatory on which the devotees can go round the temple. The shrines can be entered into only after ascending a number of stairs which lead to the portico or Ardha mandapa .Usually most of the temples except the Chaturbhuja temple and Lalgaun Madhav temple have their entrance from the east. these two have west entrance..“



పెర్సి బ్రౌన్ అనే మరో విశ్లేషకుడు “అర్ధమండపాలు మహా శిల్పసౌందర్యం గల మకర తోరణాలతో విరాజిల్లాయి. ఇవి దంతపు నగిషీని తలదన్నే శిల్ప విన్నాణాన్ని ప్రదర్శిస్తాయి. లక్ష్మణ, కందరీయ, విశ్వనాథ దేవాలయాలను’ పంచాయతన దేవాలయాలు” అంటారు. పంచాయతన దేవాలయం అంటే గర్భగుడిలో ఆ దేవాలయానికి చెందిన పెద్ద దేవతా విగ్రహంతోబాటు నాలుగు చిన్న విగ్రహాలు నాలుగు మూలలా ఉండటం. దేవాలయ నిర్మాణం అయిదు సోపానాల్లో ఉంటుంది. అర్ధమండపం, మండపం అనే హాలు, అంతరాలయం లేక గర్భాలయం, మహా మండపం, ప్రదక్షిణ సౌకర్యం కల దారి కలిగి ఉంటాయి. ఇందులో ప్రతిదాని శైలి భిన్నంగానే ఉండి శిల్పశోభగల పైకప్పు ఉంటుంది. ప్రతి ఆలయం సంపూర్ణ కళావిలాసమై ఒకే తరహాలో కనిపిస్తుంది తప్ప దేనికది ప్రత్యేకంగా ఉండకపోవటం ఖజురహో ప్రత్యేకత.
“all these separate structure do not appear as an independent structures or buildings but are co-ordinated into a compact architectural synthesis”

ఆలయ వివిధ భాగాలు ఒకదానికొకటి సంబంధం కలిగి కోరికను బహిర్గతం చేసేదానికి చిహ్నంగా ఉంటుంది. టేర్రాస్‌పై నిలువుగా గోడలు బాల్కనీలు లోపలి గృహాలు రెండు లేక మూడు సమాంతర శిల్పాలు ఆ పైన కప్పు, ఇవన్నీ కలిసి అపురూప



శిఖరావతారం దాలుస్తాయి. ఆమలక ఉంగరపు రూపు వస్తుంది. చివరగా కలశాలు, బాల్కనీ కిటికీలు, వాటి గుండా కొద్దిగా కాంతి ప్రసారంతో ఆలయం లోపల సగం వెలుగు సగం చీకటిగా చీకటి వెలుగుల రంగేళీగా భాసిస్తుంది. గర్భ గృహం వెలుపల ప్రదక్షిణ మార్గం ఉంటుంది. ఈ మార్గంలో ఎన్నో శిల్పాలు మూడు అంతస్తులలో దివ్య విభూతితో దర్శనమిస్తాయి. ఇలా కందరియ, లక్ష్మణ, విశ్వనాధ, పార్శ్వనాధ దేవాలయాలలో ఉంటుంది. వీటిని 'సాంధార ప్రాసాదాలు' అంటారు. పార్శ్వనాధాలయంలో రెండు గర్భ గ్రుహాలుంటాయి. ఒకటి ఉత్తరానికి రెండోది దక్షిణానికి ఉంటుంది. చిత్రగుప్త, జగదాంబా, వామన, జవారి దులాదేవ్ చతుర్భుజ ఆదినాధ ఆలయాలను 'నిరాధార ప్రాసాదాలు' అంటారు. కారణం వీటికి ప్రదక్షిణ మార్గం లేక పోవటమే. పిరమిడ్ ఆకారపు ప్రత్యేక శిఖరాలు అర్ధ మండపం నుండి గర్భ గృహం వరకు పైకి వ్యాపించి ఉన్నతాశాయాలకు ప్రతిబింబాలుగా ఉంటాయి. బెంజమిన్ రోలాండ్ దీనిపై స్పందిస్తూ "The dominant impression of Khajuraho shrines is that of number of separate super structures, each with its Amalaka and final ,building up a great mountain of masonry. The verticalism is emphasized through out from the high base through the successive walls and roofs to the ultimate range of lesser peaks and constitute the main spire" అని ఆ శిల్ప నిర్మాణ రహస్యాన్ని విప్పి చెప్పాడు. అతి విశాలహాలు పైనఉన్న అతిపెద్ద శిఖరం 'సుకనాసం' (చిలుక ముక్కు) అనే స్తంభం కింది వరకు ఉంటుంది. సుక నాసమే చివరి బిందువు. ఒక సింహంపై కప్పును చూస్తూ ఉంటుంది. ముఖ్య శిఖరం ప్రక్క టెముకల సముదాయంగా అనిపిస్తుంది. ఇవన్నీ గుండ్రని కలశాలు కలిగి ఉంటాయి. శిఖరం మీద శిల్పీకరించిన విగ్రహాలలో అనేక రీతులుంటాయి. అష్ట భుజాక్రుతి కీర్తి ముఖాలుంటాయి. మొదలు వెడల్పుగా ఉండి పైకి సూచీలాగా తేలటం వీటి ప్రత్యేకత. సాలభంజికలు, తీర్ధన్కరుల విగ్రహాలతో విరాజమానమవుతాయి. ఒక్క క్షణం కూడా దృష్టిని మరల్చటానికి వీలులేనంత తన్మయ స్థితి చూస్తాం. ఆలయ లోపలి భాగాలన్నీ వాస్తు ననుసరించే ఉంటాయి. అంతరాలయంలో చంద్రశిల గర్భాలయానికి దారి తీస్తుంది. లోపల రథాలు, సలిలాన్తరాలు ముఖ్య దేవీ దేవతా విగ్రహాలతో పాటు చెక్కి

ఉంటాయి. నాగుల, శార్దూలాల శిల్పాలు మహిమాన్వితంగా ఉంటాయి. ఆలయ పైకప్పు అంతా శిల్పకళా విరాజితమే. ఖజురహో దేవాలయ శిల్పా విన్యాసం 'నాగర' శైలికి పరమోత్కృష్ట ఉదాహరణగా నిలిచింది. "khajuraho templearchi tecture was a marvel of the perfectly evolved Nagra style in which the counter pointed melodies of architecture and sculpture were held in a fine tune complex balance .The sculptors fine skill and a sense of imagination have given form to human emotion in the form of spiritual and physical love" అని ఖజురహో ఆలయ శిల్పకళా రహస్యాన్ని విడమర్చి చెప్పారు.

## మా నవరాత్రి యాత్ర-10

### ఖజురహో కళలహో అదరహో ఖజురహో శిల్పశోభ

హిందూ దేవతా విగ్రహ నిర్మాణానికి అత్యున్నత వైభవం కల్పించింది ఖజురహో. అనేక తరహాల హావభావ శోభా విలసితమైన విగ్రహాలకు ఇది తార్కాణ. పర్వతం అంత భారీ దేవాలయము. వెలుపలి లోపలి గోడలన్నీ శిల్పాకృతులతో పరవశం కలిగిస్తాయి. గోడలపై ఉన్న శిల్పకళా చాతుర్యం చూస్తే ఒకే విధమైన అపూర్వ శిల్పకళా సృష్టితో ఆకర్షించి అంతా ఒకటేనన్న భావం కలుగుతుంది. ఒక్క అంగుళం కూడా వదలకుండా గోడలన్నీ శిల్పకళతో జీవం పోసుకొన్నాయి. రెండున్నర నుండి మూడు అడుగుల ఎత్తు ఉన్న శిల్పాలు 872 కందరీయ దేవాలయం గోడలపై ఉన్నాయి. విశ్వనాథాలయంపై 674 విగ్రహాలున్నాయి. వరాహ దేవాలయంలోని వరాహమూర్తి శరీరంపై 672 హిందూ దేవతామూర్తులు శిల్పీకరించబడి ముక్కున వేలేసుకొనేట్లు చేస్తాయి. పనికిరాని రాయిని ప్రతిదానినీ అద్భుత శిల్పంగా మలిచారు శిల్ప బ్రహ్మలు. ఒక కన్య కాళ్ళు జాపుకొని ఉన్న విగ్రహం, స్నానం చేసిన తర్వాత తడి జుట్టు నుండి రాలి పడుతున్న జల బిందువులు, ఒక సురసుందరి కాలిలో



ముళ్ళు తీసుకోవటం, కండరాలు నాడులు అన్నీ అతి స్పష్టంగా కనిపించేట్లు చెక్కి దివ్య విభూతిని కలిగిస్తాయి. వీటికి సాటి శిల్పాలు ప్రపంచంలో ఇంకా ఎక్కడా మనకు కనిపించవన్న మాట. ముమ్మాటికీ నిజం అని ఢంకా బజాయించి చెబుతున్నారు శిల్ప రహస్యవేత్తలు. ఇవికాక దర్బారు సీన్లు, యుద్ధ విన్యాసాలు, రాజులు కొలువై ప్రజల ఫిర్యాదులు వినటం సలహాలివ్వటం వగైరా మనసుకు ఆహ్లాదాన్ని ఆనందాన్ని సంతృప్తినీ కలిగిస్తాయి.

ఈ అద్భుత శిల్పరాశి మధ్యలో ఖాళీ ఉండి శోభాయమానంగా ఉన్నాయి. కైమూర్ ఇసుక రాయిని ఖజురహో విగ్రహాల నిర్మాణానికి వాడారు. ఇది సూక్ష్మ శిల్పీకరణకు మైనంలాగా ఒదిగి పోతుంది. అందుకే ఈ రాయితో ఆభరణాలు, వస్త్రాలు, నీటి బిందువులు, జుట్టు వెంట్రుకలు, బట్టల మడతలు, శరీరం ముడుతలు అన్నిటినీ స్పష్టంగా కని పించేట్లు చెక్కటానికి అనువుగా ఉన్న రాయి ఇది. కనుకనే అంతటి శిలా సౌందర్యం వెల్లి విరిసింది. శిల్పశాస్త్ర విధానాన్ని తు.చ తప్పక పాటించి మలచిన విగ్రహాలివి. ముఖం కోడి అండాకృతిలో ఉండాలని శిల్పశాస్త్రం చెబుతోంది. నుదురు ధనువులా, కళ్ళు విశాలంగా కొనదేలి మత్స్యకృతిగా, కంటి రెప్పలు వేపాకుల్లా, గడ్డం మామిడి టెంకలా కాళ్ళూ చేతులూ పద్మాలుగా, చాతీ విశాలంగా, పిరుదులు చనులు బలంగా విశాలంగా ఉండాలన్నది శిల్ప శాస్త్ర నియమమే. దాన్నే పాటించారీ శిల్పులు. ఖజురహోలో సమాంతర శిలలపై నిలువు శిలలు ఉంచి కప్పు ఆకృతిని కల్పించారు. సిమెంటు గానుగ సున్నం చాలా తక్కువగా వాడారు. గ్రానైట్ శిలను ముందే శిల్పంగా చెక్కి ఉంచాల్సిన స్థానంలో అమర్చారు. ఖజురాహో శిల్పుల ప్రతిభా సామర్థ్యం సృజనా నైపుణ్యం వైవిధ్యం మాటలకు అందనివి. ఆదిశేషుడు కూడా వాటిని పొగడటానికి చాలదు అనిపిస్తుంది.

ముఖ్య దేవతా విగ్రహాలైన శివుడు, విష్ణు, సూర్యుడు జైన తీర్ధంకరులను ఆగమ శాస్త్ర నియమాలకు లోబడే శిల్పీకరించారు. మిగిలినవాటిని తమ సృజనతో తీర్చిదిద్దారు. ఇదొక విభాగం. సాధారణ దేవతా విగ్రహాలను అంటే అప్సరసలు, సుర సుందరిల విగ్రహాలను లోపలి గోడలపై చెక్కటం రెండవ విభాగం. కొన్ని విగ్రహాలు 'త్రీ డైమెన్షనల్ ఎఫెక్ట్'ను ఇవ్వటం పరమాశ్చర్యమేస్తుంది. ఖజురహో సుందరులు శిల్పుల ఊహావికాసానికి మచ్చుతునకలు. పరిపుష్టమైన అంగ సౌష్టవంతో ఉలి నుంచి జాలువారిన



సుందరీమణులు. శరీరంలోని ప్రతి అణువునూ వంపులు సొంపులను అన్నిటినీ ప్రతిఫలింప జేశాడు ముఖ్యశిల్పి. ఆవలింతలు, బట్టలు విప్పి వేయటాలు, కుచాలను హత్తుకోవటాలు, గోరింటాకు పెట్టుకోవటం, వేణువు ఊదటం, నృత్య ప్రదర్శనను అత్యంత సమర్ధంగా చేయటం, జాబులు రాయటం, రాస్తూ కలాన్ని పెదిమకు ఆనించి పెట్టుకోవటం, నిరాశా నిస్పృహ విరహంతో వేదన చెందటం ఓహ్ ఒకటేమిటి, సకల భంగిమలు ఆ శిల్పి చిత్రీకరించి జీవం పోశాడు. సేవకులు సేవికలు సజీవంగా కనిపిస్తారు.

ఖజురహో ఆలయ గోడలపై ఉన్న శృంగార భంగిమలు మైధున క్రీడకు చెందినవి. ఇవి మూడవ విభాగానికి చెందినవి. రతిక్రీడలతో అనేక భంగిమల్లో చెక్కిన శిల్పాలు కామ శాస్త్ర కేళీ విలాసానికి చెందినవే. "the couple exibit gymnastic or un natural poses described in texts like kaama sootra, rati rahasya ,ananga ranga. They fornicate in standing, sitting, supine, side and reverse positions. They engage oral sex extravaginal or autocratic sex. The lady mounts the man like mounting a tree. She bends and stands on all fours 0n the ground like a cow, while theman performs from behind. She engulfs aman in coital embrace like a creeper embraces a tree. the main performer stand on his or her head supporting other. The make up picks up and supports the girl on his this by flexing his necks while the lady wraps her arms around his neck.

A man has sex with a mare. A nude male and female showing genetial organs or touching one another form of erotic sculpture. Sexula congress in group or plural intercourse wherein four persons participate with one women or three women with one man is another type of erotic sculpture in khajuraho temples" ఇటువంటివన్నీ మూడవ విభాగానికి చెందాయి.



నాలుగో విభాగంలో గ్రూపు



డాన్సులు, సంగీత వాద్య కారులు, వేట దృశ్యాలు, జంతువులతో పోరాటాలు, సైనిక కవాతులు, శిల్పాలు చెక్కే శిల్పి బొమ్మలు ఉన్నాయి సమకాలీన చరిత్రకు అద్దం పట్టేవే ఇవన్నీ. అయిదవది చివరిదీ అయిన విభాగంలో వ్యాలంలేక శార్దూలం, కోరల సింహం దానితో పోరాడే యోధుడు. ఏనుగు ముఖాలు చిలుకలు ఎలుగు బంటి శిల్పాలు ఇందులో చేరతాయి. దాదాపు ఇవన్నీ ప్రతికాత్మికాలేనని గ్రహించాలి. ఖజురహో దేవాలయాలు రెండు తరగతులకు చెందాయి. ఒకటి లక్ష్మణ కందరీయ, మహాదేవ, దేవి, చిత్ర గుప్త, విశ్వనాథ ఆలయాలు. వీటి బయటి గోడలపై శృంగార భంగిమలున్న శిల్పాలెన్నో ఉన్నాయి. ఇక రెండవ తరగతికి చెందిన వాటిలో చతుర్భుజ, పార్శ్వనాథ, ఆదినాథ, జవారి, వామన దులాదేవ ఆలయాలున్నాయి. ఇవి 1050-1150 కాలంలో నిర్మితమైనవి. ఇందులో అసభ్యకర శృంగార శిల్పాలు అతి తక్కువగా ఉన్నాయి. దులాదేవ దేవాలయంలో చాలా శృంగార భంగిమలున్న చిత్రాలున్న యన్నది నిజమే. జవేరి వామన దేవాలయాలలో ఈ దృశ్యాలు కనిపించవు. ఆదినాథ చతుర్భుజ దేవాలయాలలో ఈ శృంగార వాసన అసలే కనిపించక పోవటం విచిత్రంగా ఉంది.

## మా నవరాత్రి యాత్ర-12

### ఖజురహో కళలహో అదరహో

### ఖజురహో దేవాలయాల వైవిధ్యం

ఖజురహో దేవాలయాలు దేవ విహార భూములు. ఈ దేవాలయ సముదాయం శివుడికో విష్ణువుకో లేక జైన తీర్థంకరులకో అంకితమివ్వబడ్డాయి. ఎనభై అయిదు దేవాలయాలకు నేడు ఉన్నవి పాతిక మాత్రమే. సౌకర్యార్థం వీటిని మూడు గ్రూపులుగా చేశారు. పడమటి తూర్పు, దక్షిణ దేవాలయాలుగా వీటిని పేర్కొంటారు.

### పశ్చిమ దేవాలయాలు

పశ్చిమ వైపున్న దేవాలయాలకు అందమైన ఉద్యానవనం స్వాగతమిస్తుంది.

ఇవి ప్రమీతా రాజ నగర్ రోడ్‌లో ఖజురహో గ్రామానికి పడమరగా ఉన్నాయి. ఇవి రెండు వరుసలలో ఉన్నాయి. చుట్టూ ఫెన్సింగ్‌తో ప్రవేశ ద్వారం గుండా ప్రవేశం ఉంటుంది. ఒకప్పుడు ఇది అంతా పెద్ద తటాకం. ఇక్కడి లక్ష్మణ, విశ్వనాథ దేవాలయాలను మహారాజులు నిర్మించారని, మూడవది అతి పెద్దది అయిన కందరీయ మహాదేవ ఆలయాన్ని రాజసంగా నిర్మించారని చెబుతారు. ఇందులోని పెద్ద ఆలయాలు ఎక్కువ భాగం తూర్పుముఖంగా ఉండి ఉత్తర దక్షిణాలకు వ్యాపించి ఉంటాయి. ఇందులో ఉన్నవి శివ లేక విష్ణు ఆలయాలే. చిత్ర గుప్త దేవాలయం ఒక్కటే సూర్య దేవాలయం.

## 1) చౌసత్- యోగిని దేవాలయం

ఇది తొమ్మిదో శతాబ్ది ఆలయం. ముతక గ్రానైట్ రాయితో నిర్మింపబడిన ప్రాచీన ఆలయం. శివసాగర్ జలాశయం ప్రాంతం నుండి నిర్మాణానికి గ్రానైట్ తెప్పించి వాడారు. దాదాపు అయిదున్నర మీటర్ల ప్లాట్‌ఫారంపై చతుర్భుజాకారంగా 31 మీటర్లు, 18 మీటర్ల కొలతలో ఉండి అరవై ఏడు చుట్టూ దేవతలతో కనిపిస్తుంది. చిన్న గూడులలో దేవతా విగ్రహాలుంటాయి. గుండ్రంగా ఉండే శిఖరం ఉంటుంది. ఇందులో ఖజురహో శైలి కొద్దిగానే ప్రదర్శితమౌతుంది. బ్రాహ్మణి, మహేశ్వరి మహిషాసుర మర్దిని పెద్ద విగ్రహాలు అబ్బుర పరుస్తాయి. మహేశ్వరి హింగులాజీ విగ్రహాలు తరువాత చేరాయి.

## 2) లాల్గాన్ - మహాదేవాలయం

క్రీ.శ 900లో నిర్మిం చారు. చౌసాత్ యోగిని దేవాల యానికి ఎనిమిది వందల మీటర్ల పడమర ఈ ఆలయం ఉన్నది పిరమిడ్ ఆకారపు నిర్మాణం. ప్రవేశ భాగం శిదిలైపోయింది. సంధి కాలానికి చెందినా ఆలయం ఇసుక రాయిని మొదటిసారిగా గ్రానైట్‌తోబాటు ఎక్కువగా వాడారు. ప్లాట్ ఫారానికి గ్రానైట్‌ను శిఖరానికి 'సాండ్ స్టోన్'ను వాడారు. ప్రవేశంలో విరిగిన నంది విగ్రహం ఉంది. పడమటి ముఖపు ఆలయమిది శివునికి అంకితమైన ఆలయం.

## 3) వరాహ ఆలయం

ఇది 900-925 కాలపు నిర్మాణం. వరాహ విగ్రహం ఒక చిన్న ఎత్తైన గుడిలాంటి ఆకారంలో ఉంటుంది. భారీ విగ్రహమే. పిరమిడ్ పైకప్పు ఉంది. విష్ణువు యొక్క వరాహావతారమే ఈ విగ్రహం. తోమ్మిదడుగుల పొడవు ఆరడుగుల ఎత్తు ఉన్న విగ్రహం ఇది. ఏక నల్ల శిలా నిర్మితం. వరాహం శరీరంపై 672 హిందూ దేవతలా విగ్రహాలు ఉండటం ఆశ్చర్యం, ఆకర్షణీయం కూడా. భూదేవతను శేషనాగుడు కాపాడే



ముచ్చటగా ఉంది. వికసించిన పద్మ శిల్పం మనోహరం. ఇది పూర్తిగా ఇసుక రాయితో చేయబడింది. బ్రహ్మ, లాల్ గువాన్ మహాదేవ దేవాలయాలు గ్రానైట్, ఇసుక రాయి వాడకపు సంధికాలం లోనివి.

## 4) మాతంగేశ్వరాలయం

900-925 కాలంలో నిర్మించబడింది. శివుడికి అంకితం. గర్భాలయంలో పెద్ద శివలింగం ఉంది. మూడున్నర అడుగుల కైవారంతో ఎనిమిదిన్నర అడుగుల భారీ శివలింగం మెరిసిపోతూ పసుపు రంగులో ఉంటుంది. విశాలమైన గౌరీ పట్టా అంటే పానువట్టం ఉంటుంది. మూడువైపులా కిటికీలున్నా చతుర్భుజ ఆలయం బ్రహ్మ దేవాలయానికిది విస్తృత రూపం. ఈ ఆలయంలోనే ఖజురాహో శిల్ప శైలి వికసించటం ప్రారంభమైందని చెబుతారు. పానువాట్టం పైనే నడిచి లింగాన్ని దర్శిస్తారు. పూజారి కూడా దాని మీదే కూచుని పూజాదికాలు చేస్తాడు.

## 5) పార్వతి ఆలయం

950-1000 కాలంలో కట్టిన ఆలయం విశ్వనాథాలయానికి దక్షిణాన ఉన్నది. గర్భగృహం హాలు ఉన్నాయి. ద్వారంపై వైష్ణవ దేవతా విగ్రహాలు, గర్భ గుడిలో గౌరీ దేవి విగ్రహం ఆమె వాహనమూ ఉంటాయి. దీనికి దగ్గరలో అంతకు ముందు వందేళ్ళ క్రితం ఛాత్రపూర్ రాజు కట్టిన ప్రాచీన ఆలయమిది.

## 6) లక్ష్మణ దేవాలయం

930-950 కాలం నాటిది. శివసాగర్ సమీపంలోని అతి విశాలమైన ఎత్తైన దేవాలయం. చందేలా రాజుల శిల్పకళా తృష్ణకు శిల్పకళా వైభావానినికి నిదర్శనం. పరిపూర్ణతకు ఉదాహరణ. చతుర్భుజుడైన వైకుంఠ విష్ణుదేవునికి అంకితమైంది. యశోవర్మ రాజు కట్టించిన ఆలయం. ఎత్తైన విశాలమైన ప్లాట్‌ఫారంపై నిర్మింపబడింది.



సహజంగా ఇది 'గరుడుడి'కి అంకితమివ్వబడింది. బ్రాహ్మణి అనే దేవి ఉంటుంది. కందరీయ, మహాదేవ, విశ్వనాధ ఆలయాలు పంచాయతన ఆలయాలు. లక్ష్మణ ఆలయంలో నాలుగు మూలలా దేవతా విగ్రహాలున్నాయి. కిందినుంచి పైకి మెట్లు ఎక్కి చేరాలి. గుర్రపు వరుసలు, ఏనుగుల వరుస, ఒంటెలు, యుద్ధ దృశ్యాలు, నృత్యకారులు, సంగీతకారులు, రతి భంగిమలలో అనేక దృశ్యాల శిల్పాలు బయటి గోడపై ఉంటాయి. లోపల రెండు మకరతోరణాలతో భాగాలున్నాయి. స్తంభాల ఆలయంలో అప్సరసలు కొలువై ఉన్నారు. ఇక్కడి ఎనిమిది శిల్పాలు తంత్ర విభాగంలో ఎనిమిది విశేషాలు. గర్భాలయానికి ద్వారంపై సింహాలు విష్ణు అవతారాలు, నవ గ్రహాలూ సాగర మధనం చేకబడ్డాయి. సురసుందరిలు అపసరాలు దేవి సేవలో తరిస్తూ కనిపిస్తారు. మధ్యయుగపు కళకు నిదర్శనంగా దేవి సేవికలు సేవాభావంతో ఎదురు చూడటం నాట్య గణపతి అద్భుత కళాఖండాలుగా ఇక్కడ దర్శనమిస్తాయి.

## 7) విశ్వనాథాలయం

దుగావాన్ అనే శిధిల సరస్సు ఒడ్డున ఉంది. 1002 కాలపు నిర్మాణం. శివునికి అంకితం. దంగా దేవా రాజు దీన్ని నిర్మించాడు. లక్ష్మణ కందరీయ దేవాలయ శైలి ఇక్కడా కనిపిస్తుంది. ఎత్తైన ప్లాట్‌ఫారంపై ఆలయం నిర్మితమైంది. దంపతులు వాహన శ్రేణులు సప్త మాతృకలు గణేష్ వీరభద్ర విగ్రహాలు ఉన్నాయి. అందమైన ముఖద్వారం గర్భాలయానికి దారి తీస్తుంది. మధ్యాహాలు చుట్టూ ప్రదక్షిణ మార్గం ఉన్నాయి. ఒక చేతిలో చిలుక, వేరొక చేతిలో పందు ఉన్న స్త్రీ శిల్పం బాగుంటుంది. మధ్యహాలు పైకప్పుపై అనేక పుష్పాలు చెక్కబడి కనువిందు చేస్తాయి. అంది విగ్రహం తూర్పున ఉంది. పిరమిడ్ ఆకారపు కప్పు ఉంటుంది.

## 8) నంది విగ్రహం

విశ్వనాథాలయానికి అనుబంధంగా నంది విగ్రహం ఉంది. ఇది బృహన్నంది.

శివాభిముఖంగా ఉంటుంది. పిరమిడ్ రూఫ్ ఉంది.

### 9) చిత్ర గుప్తాలయం

పదకొండవ శతాబ్ది ఆలయం. సూర్య దేవుడికి అంకితం. జగదాంబాలయానికి దక్షిణాన ఉంటుంది. మూడు అంతస్తుల చోప్రా అనే టాంక్ ఉంది. ముఖ్యదేవుడు సప్తాశ్వ రథ సారధి సూర్యదేవుడు ముఖ ద్వారంపై చెక్కారు. దశావతారాలూ ఉంటాయి. దీన్ని భరత్ జి దేవాలయం అంటారు. గర్భాలయంలో సూర్య దేవుడి నిలువెత్తు విగ్రహం ఉంటుంది.

### 10) జగదాంబాదేవి ఆలయం

ఇదీ పదకొండవ శతాబ్ది ఆలయమే. విష్ణువుకు అంకితం గర్భగుడిలో పార్వతి మాత విగ్రహం ఉంది. తూర్పు ముఖద్వారం. చిత్రగుప్తాలయపు నమూనానే. కాళికాలయమనీ అంటారు. బయటి గోడలపై శిల్పాలు అత్యంత నాణ్యమైనవని గుర్తించారు. విష్ణు, యమ దేవతా విగ్రహాలున్నాయి. చందేల కళ సంపూర్ణంగా వికసించిన వైభవం ఈ ఆలయంలో కనిపిస్తుంది.

## మా నవరాత్రి యాత్ర-13

### ఖజురహో కళలహో అదరహ

## ఆలయ వైవిధ్యం-2

### 11) శిధిల శివాలయం

పదకొండవ శతాబ్దికి చెందిన ఈ శివాలయం దాదాపు శిధిలమైపోయింది. కందరీయ, జగదాంబా ఆలయాల మధ్య ఉన్నది. శివుని చిత్రాలు ద్వారంపై చెక్కారు. గర్భగుడి పాడైపోయింది. శార్దూల విగ్రహం ఆకర్షణీయంగా కనిపిస్తుంది.



### 12) కందరీయ మహాదేవాలయం

1025-50 కాలంలో నిర్మితమైంది. 102,66,102 అడుగుల పొడవు వెడల్పు ఎత్తు ఉన్న బృహత్తర దేవాలయం. ఒకప్పుడు ఇది పంచాయతన దేవాలయమే. ఇప్పుడు టెర్రేన్ మూలాలు

ధ్వంసమైనాయి. ఖజురహో శైలి శిల్ప విన్యాసానికి గొప్ప నిదర్శనం. అర్ధ మండపం, మండపం, మహా మండపం, అంతరాలయం, గర్భాలయం, ప్రదక్షిణ మార్గం ఉన్నాయి. అన్నీ కలిపి ఏకాముఖీనంగా దర్శనమిస్తాయి. ఇందులోని ప్రతిభాగం యొక్క శిఖరం ఒక పర్వతాగ్రంలా మలచ బడ్డాయి. చివరికి ఆమలక, కలశాలతో విరాజిల్లుతాయి. ఖజురహో దేవాలయ సమూహంలో కందారియ దేవాలయమే సర్వోత్కృష్టమైనది. కట్టడపు పనితో ఒక హిమాలయాన్నే మన ముందు ఉంచిన అనుభూతి కలుగుతుంది. అగ్రంపై అగ్రం ముందుకు చొచ్చుకోచ్చే విభాగాలు, దేనికదే అందాలను ఆరబోసే కళాఖండాలతో అఖండ కళారాశిగా అద్భుత పనితనానికి తార్కాణంగా అపర కళావిలాసంగా భాసించే మహోన్నతాలయం. సమాంతర సముదాయ నిర్మాణం. అద్భుతమైన మెట్ల సముదాయం. హిమాలయ పర్వతారోహణ చేస్తున్న అనుభూతి కలిగిస్తుంది. కైలాసంలో పరమశివుని దర్శనానికి వెడుతున్నామా అనే భావం మనసంతా నిండిపోతుంది. శిల్పతోరణాలు, దేవతా విగ్రహాలు, మిదునాలు, పాటపాడేవారు, నృత్యభామలు, కీర్తి ముఖాలు, మకారాలుతో రెండు మకర తోరణాలున్న ఏకైక దేవాలయంగా గణనకెక్కింది. మహా మండపం పైభాగంలో వలయాలు ఒకదానిలో ఒకటి చొచ్చుకుపోయి పరమ వైభవంగా కనిపిస్తాయి. గర్భాలయ ద్వారం గోడలపై అనేక పుష్ప జాతులు కనువిందుగా శిల్పీకరించారు. గంగా, యమునా దేవీ విగ్రహాలు వారి వాహనాలు మొసళ్ళు కూర్మము దార్జంబ్‌లపై చెక్కారు. మార్బుల్‌తో చేయబడిన లింగం గర్భగుడిలో ఉంది.



800 విగ్రహాలు లోపలి, వెలుపలి గోడలపై చెక్కబడ్డాయి. అపసరసల అందాలను అనేక కోణాల్లో భంగిమల్లో శిల్పీకరించారు. మహిళల మానసిక, దైహిక స్థితిగతులను అనేకరీతుల్లో ప్రదర్శితం చేశారు శిల్పాలలో. ఖజురాహో శిల్పకళ కందూరియా దేవాలయంలో పరమ వైభవస్థితిలో అత్యున్నతంగా సర్వశ్రేష్టంగా మహా కళా విభూతిగా విరాజమానమైనదని శిల్ప మర్మజ్ఞుల మనోభావం. నగిషీలు, సూక్ష్మ విషయ పరిశీలనంలకు ఇది గొప్ప ఉదాహరణ. అనేక స్థానిక చరిత్ర గాధలన్నీ చుట్టూ చెక్కబడి చారిత్రిక నేపధ్యాన్ని కలిగించాడు శిల్పి. ఏ దేవతా విగ్రాహమైనా సర్వ శ్రేష్టంగా సంపూర్ణంగా పూర్తి వైభవంగా ఉంటుంది. అదీ దీని ప్రత్యేకత. ఇక్కడితో పడమరవైపు దేవాలయాల సందర్శన పూర్తవుతుంది.




## తూర్పువైపు దేవాలయ సముదాయం

బ్రహ్మ, వామన, ఆదినాథ, జవేరి, జైన దేవాలయాలు ఇందులో ఉన్నాయి.

### 1) బ్రహ్మ దేవాలయం

తొమ్మిది వందల కాలంలో నిర్మితం. సాదా సీదా ఆలయం. ఇసుక రాయి గ్రానైట్‌తో నిర్మాణం. వీటిని ఖజురహో సాగర్ అనబడే 'నినోరా తాల్' నుండి తెచ్చారు. నాలుగు ముఖాల విగ్రహం ఉంది. కనుక బ్రహ్మ గుడి అని పొరపాటుగా అంటున్నారు. నిజానికి విష్ణు గుడి. ఈ విషయం గర్భగుడి ద్వారంపై చెక్కబడిన శిల్పాలను బట్టి తెలుస్తోంది. పిరమిడ్ ఆకారపు శిఖరం ఉన్నది. ద్వారంపై యమునా గంగా ప్రతిమలు ప్రతి చిన్నచిన్న విషయాలతో సహా స్పష్టంగా చెక్క బడ్డాయి. మహాదేవాలయం నమూనా ఇది.

### 2) హనుమంతుడి విగ్రహం

పడమటి దేవాలయాలకు, ఖజురహో గ్రామానికి మధ్య నిర్మించిన భారీ ఆంజనేయ స్వామి విగ్రహం ఉన్నది. హర్షుడి కాలం అంటే 922కు చెందినదిగా బేస్ మీదున్న శాసనం వలన తెలుస్తోంది. ఇదే అతి ప్రాచీన శాసనం.

### 3) వామనాలయం

1050-75 కాలంలో నిర్మింపబడిన వామనాలయం శ్రీ మహావిష్ణువుకు అంకితం. గర్భాలయంలో బలిని కాళ్ళ కింద తొక్కి పాతాళంలోకి పంపే వామన మూర్తి దర్శనమిస్తాడు. చండేలా శిల్పకళ ఈ ఆలయంలో పూర్తిగా వికసిచ్చిందని అంటారు. గర్భాలయ గోడపై బుద్ధుడు భూమి స్పర్శ ముద్రతో ఆసీనుడైనట్లు చెక్కబడింది. ద్వారంపై అద్భుత శిల్ప విన్యాసం ఉంది. చతుర్భుజ



వామనమూర్తి నాలుగున్నర అడుగుల ఎత్తు ఉంటాడు.

### 4) శాంతినాథ జైనాలయం

పార్శ్వనాథ, జైన ఆలయానికి దక్షిణాన కొత్త 'శాంతినాథాలయం' ఉంది. 14 అడుగుల శాంతినాథుడు దిగంబరంగా దర్శనమిస్తాడు. అనేక జైన దేవీ దేవతల విగ్రహాలున్నాయి.

### 5) పార్శ్వనాథాలయం

ఖజురాహోలోని అతి ముఖ్యజైన దేవాలయం ఇది. పదవ శతాబ్దిది. ఆదినాథుడికి అంకితం. ఇప్పుడున్న పార్శ్వనాథ విగ్రహాన్ని 1860లో ఏర్పాటు చేశారు. 'సాన్దార ప్రాసాదం' ఉన్న గుడి. ఆదినాథ శాంతి నాథాలయాల మధ్య ఉంది. బయటి గోడలపై శిల్పకళ వర్ణించలేనంత గొప్పగా ఉంటుంది. వైష్ణవ జైన విగ్రహాలూ ఉండటం విశేషం. చక్రేశ్వరి, పరశురాముడు, రేవతీ బలరాములు, సీతారాములు హనుమాన్ ఉండటం ప్రత్యేకత. ఒక నాయిక ప్రియుడికి ఉత్తరం రాస్తున్నట్లు చెక్కిన శిల్పం మనోహరం. స్త్రీ తన గారాల పట్టి కొడుకును ముద్దాడే దృశ్యమూ మరువలేనిదే.



### 6) ఆదినాథాలయం

జైన తీర్థంకరుడు ఆదినాథునికి అంకితమివ్వబడిన ఈ ఆలయం పదకొండవ శాతాబ్దిది. గర్భాలయంలోని విగ్రహం కనపడకపోతే కొత్త విగ్రహం పెట్టారు. వామనాలయం నమూనాగా ఉంటుంది. శిఖరం కొంచెం భిన్నంగా సరళంగా ఉంటుంది. హిందూ దేవతా విగ్రహాలు గోడలపై ఉంటాయి.

### 7) ఘంట దేవాలయం

పదో శతాబ్ది ఆలయం. ఇక్కడొక గంట, గొలుసు ఉండటం వలన గంటాలయం అనే పేరొచ్చింది. జైన దేవత గరుడ వాహనంపై ఉండటం ప్రత్యేకత. ద్వారంపై మహావీర, నవగ్రహాలు ఉండి పార్శ్వనాదాలయం లా కనిపిస్తుంది.

## 8) జవేరీ దేవాలయం

చిన్న ఆలయమే అయినా శిల్పకళకు పుట్టినిల్లుగా ఉంటుంది. పెద్ద విశాలమైన టెర్రేస్ ఉండి దానిపై ఆలయం నిర్మితమైంది. 1075-1100 నాటి ఆలయం. నిరాధార ప్రాసాదం మోడల్. అర్ధమండప మహా మండప గర్భాలయాలున్నాయి. చతుర్భుజుడైన విష్ణుమూర్తి ముఖ్య దేవత. ఈయన్నే బలరాముడిగా భావిస్తారు.

## దక్షిణ దిశ దేవాలయాలు

దక్షిణ దిశాలయాలలో దులాదేవ్, చతుర్భుజ, జత్కారి ఆలయాలున్నాయి.

## 1) దులాదేవ్ దేవాలయం

దీన్ని 1100-50 మధ్య కట్టారు. దీనికి 'కున్వార్ మఠ' ఆలయం అంటారు. పెళ్లి చేసుకొన్నా నవ వధూవరులు తప్పక ఈ ఆలయానికి వచ్చి దైవదర్శనం చేసుకొంటారు కనుక ఆ పేరొచ్చింది. గంటాలయానికి దక్షిణాన ఉంది. ఖుదార్ నాలా ఒడ్డున ఉన్న ఆలయం. ఇదే ఖజురహో ఆలయాలలో ఆధునికమైనది. శివుడికి అంకితం. నిరాదారాలయం. గర్భగుడి మహా మండపం చిన్న శిఖరాలు ఇరవై మంది అప్సరస ప్రతిమలు గుండ్రని సీలింగుతో 'సింప్లీ సూపర్బ్' అనిపిస్తుంది. నృత్యం చేసే అప్సరసల హావ భావాలు చేష్టలు ఆభరణాల బరువుతో వంగిపోయినట్లు కనిపిస్తారు. అద్భుత శిల్పకళా సృష్టికి నిదర్శనం. అష్ట వసువు విగ్రహాలు మకర వాహనాలపై ఉండటం ప్రత్యేకత. ఖజురహో శైలీవైవిధ్యం దర్శనమిస్తుందిక్కడ.



## 2) చతుర్భుజాలయం

పదకొండవ శతాబ్దికి చెందిన ఈ ఆలయం జకారి గ్రామానికి అరకిలో మీటర్ల దూరంలో ఉంది. నిరాదారాలయం. మహాశిఖరంతో శోభాయమానం. చతుర్భుజ విష్ణువే ఇక్కడి ముఖ్యదేవుడు. దక్షిణామూర్తి విగ్రహం పడమటి ముఖంగా ఉంటుంది. దక్షిణామూర్తి పది అడుగుల భారీ విగ్రహం. కిరీటదారిగా ఆభారణాలతో మెరసిపోతూ దర్శనమిస్తాడు. ఈ ఏకశిలా విగ్రహం శివుని కిరీటంతో బుద్ధుడి ముఖంతో, విష్ణుమూర్తి శరీరంతో శ్రీ కృష్ణుని ముఖ భంగిమలతో ఉండటం విశేషం. సింహ శిరస్సు కలిగిన స్త్రీ ఉత్తరం



వైపు ఉండి వింత గొలుపుతుంది. ఈమె నరసింహావతార విష్ణుమూర్తికి భార్యామణి అని స్థానికులు భావిస్తారు. అర్ధనారీశ్వర శివుడున్నాడు.

## పురావస్తుశాఖ మ్యూజియం

పడమర దేవాలయ సమూహానికి దగ్గర గేటు సమీపంలో మ్యూజియం ఉంది. ఇక్కడ 2,000 పైగా శిల్పాలున్నాయి. వీటిని యాభై ఏళ్ళుగా కష్టపడి త్రవ్వి తీసి ఇందులో అమర్చారు. నృత్య గణపతి, అనేకమంది జైన తీర్ధంకరుల విగ్రహాలున్నాయి. వైష్ణవ గాలెరిలో విష్ణుమూర్తి అనేక అవతారాల శిల్పాలుంటాయి. అలాగే బుద్ధుడు అయిదు శిరస్సుల శివుడు ఉంటారు.



ఇదీ ఖజురహో దేవాలయ వైవిధ్యం. ప్రతి ఆలయాన్ని చూస్తే నాకు ఒకటి అనిపించింది. 'ఎండు ఖర్జూర కాయను' నిలబెడితే ఎలా వంపులు సొంపులుతో కనిపిస్తుందో అదే రంగుతో ప్రతి ఆలయం అలానే కని పిస్తుంది. అనేకత్వంలో ఏకత్వం గోచరిస్తుంది. అన్ని సముదాయాల నిర్మాణం ఒకే వైపుకు కలిసిపోయి ఏక నిర్మితమని అఖండత్వం అనంతత్వం కలిసి శిఖరీ భూతమై ముగుస్తుందని అనిపించింది. ఉత్తర దేశంలో ఖజురాహోను మించిన శిల్పసంపద మరెక్కడా కనిపించదు. కాని మన దక్షిణ దేశానికి ఇదేమీ కొత్త కాదు. మన దక్షిణ దేశ దేవాలయాలన్నీ మహా బృహత్తరమైనవి, శిల్పకళా శోభితమైనవీను. ముఖ్యంగా కర్నాటక రాష్ట్రంలోని హాలీ బీడు లాంటి దేవాలయాలలో రాయి మైనం ముద్దలా జిలిబిలి వంపుసోంపులు పోయి మహా నాజూకుగా శిల్ప శిరోమణులు తీర్చిదిద్దిన వైభోగం మనకు అనుభవమే. కాని ఉత్తరాది వారికి ఖజురహోను మించిన కళాసంపద లేదనిపిస్తుంది. ఈ రెండు శిల్ప కళా శైలీ విన్యాసాలను చూసిన అదృష్టం. నాది అనుభూతి పొందిన జీవితం నాది. దేనికదే గొప్పదని నా భావన. ఎక్కువ తక్కువల



ప్రసక్తి లేదిక్కడ. ఆ మహా శిల్పుల శిల్ప విన్నాణానికి చేయెత్తి జేజేలు పలకాలిసిందే అందరం. 'కళాజిందాబాద్' అనాల్సిందే. నేను చూసిన వాటిని నేను అర్థం చేసుకొన్న వాటిని నేను చదివి తెలుసుకొన్న వాటిని నాకు తెలిసిన భాషలో రాశాను. ఇది ఆసక్తి కలవారికి మరింత ఆసక్తి కలిగి అందులోని లోతులు తరచి చూడటానికి ఒక దారి మాత్రమే. ఇదే సమగ్రం, సంపూర్ణం కాదని మనవి.

ఖజురహో దగ్గర ఉన్న 'ఓర్చా' శిల్ప కళావైభవం గురించి తరువాత తెలియ జేసి ఈ ఖజురాహో సీరియల్‌ను పూర్తి చేసి మా యాత్రలో మిగిలి ఉన్న ఉజ్జయిని ఓంకారేశ్వర్ యాత్ర గురించి రాస్తాను.



## మా నవరాత్రి యాత్ర-14
## 'ఓర్చా' అచ్చా

మేము వెళ్లి చూడలేదు కాని ఓర్చాను గురించి చెప్పగా విన్నాం. దాని విశేషాలే ఇప్పుడు తెలియజేస్తున్నాను. పదహారవ శతాబ్ది నగరం ఓర్చా. బుందేల్ ఖండ్ ప్రాంతంలో 'బెట్వా నది' తీరంలో నిర్మించబడిన పట్నం. ఝాన్సి-ఖజురహో రోడ్డుపై ఉంది. ఝాంసికి పదహారు కిలోమీటర్ల దూరం. బుందేల్ రాజ పుత్ర సైన్యాధికారి రుద్రప్రతాప్ నిర్మించిన నగరం. ఇతని తర్వాత కొడుకు బీర్‌సింగ్‌దేవ్ నగరాభివృద్ధి చేశాడు. అనేక శతాబ్దాలుగా యాత్రికులకు ప్రత్యేక ఆకర్షణగా 'ఓర్చా' ఉండి 'అచ్చా' అని పించుకొంటోంది, మధ్యప్రదేశ్‌లో మరుగునపడిన మాణిక్యం ఓర్చా. ప్రేమ, త్యాగాలకు నిలయం. దీని గాథలు పాటలుగా పద్యాలుగా జనం పాడుకొంటారు. మధ్యప్రదేశ్‌కు ఉత్తరాన మాల్వా పీఠభూమిలో ఓర్చా ఉంది. వేసవిలో వేడి తక్కువగా ఉండటం శీతాకాలంలో ఆహ్లాద వాతావరణం దీని ప్రత్యేకత. బుందేల్ ఖండ్ రాజులు దీన్ని రెండు శతాబ్దాల పాటు 1531 నుండి పాలించారు. ఒకప్పుడు ఒక రాజపుత్ర వీరుడు తనను వింధ్యవాసిని దేవికి సమర్పించుకోవాలని సిద్ధపడ్డాడు. అప్పుడా దేవి అతని త్యాగానికి మెచ్చి అతన్ని 'బుందేలా' అంటే "రక్త తర్పణం చేసిన వాడా" అని పిలిచింది. అప్పటి నుంచి ఆ వంశీకులు బుందేల్ ఖండ్ రాజ పుత్రులై చరిత్రలో చిర కీర్తి సాధించారని కథనం. బుందేల రాజవంశం పదకొండవ శతాబ్దిలో ఆరంభమైంది. ఓర్చాను





రాజధానిగా చేసుకొని బుందేల రాజులు మధ్య భారతాన్ని పాలించారు. మొదట్లో గర్ఘరార్ వీరి రాజధాని. తరువాత రాజా రుద్రా ప్రతాప్ 1531లో ఓర్చాకు మార్చారు. మొగలాయీ రాజులతో బుందేల రాజుల సాన్నిహిత్యం కష్టాలనే తెచ్చి పెట్టింది. 1605–27 కాలపు రాజు బీర్‌సింగ్‌దేవ్ మొగలాయీ చక్రవర్తి అక్బర్‌కి కోపం తెప్పించాడు. దీనికి కారణం అక్బర్ కొడుకు జహంగీర్‌తో బీర్‌సింగ్‌కు మంచి దోస్తీ ఉండటమే.

1602లో అక్బర్ తన కోపాన్ని బుందేల్ఖండ్‌పై ప్రదర్శించి యుద్ధానికి దిగి నాశనం చేశాడు. 1605లో అక్బర్ చావు తర్వాత జహంగీర్ సామ్రాట్టు అయ్యాడు. స్నేహభావంతో జహంగీర్ మిత్రుడిని 1606లో ఓర్చా వచ్చి కలిసి స్నేహహస్తం చాచాడు. ఆ తరువాత ఇరవై రెండేళ్ళు జహంగీర్ బీర్‌సింగ్ మంచి స్నేహితులుగా మెలిగారు.



రెండు రాజ్యాలమధ్య స్నేహపూర్వక వాతావరణం ఉండేది. జహంగీర్ మరణం తర్వాత షాజహాన్ రాజయ్యాడు. అప్పుడు బీర్‌సింగ్ షాజహాన్‌పై దాడి చేశాడు. కాని ఔరంగజేబు దీన్ని అణచేశాడు. బుందేల్ రాజ్యాన్ని కోల్పోయినా తిరిగి వారికే స్వాధీనం చేశాడు చక్రవర్తి. 1783 బుందేల్ రాజులు రాజధానిని ఓర్చా నుండి 'తికం గర్'కు మార్చారు. ఓర్చా వైభవమంతా కోటలో ఉంది. అనేక రాజ భవనాలు, ఆలయాలు, తోటలు స్మృతి చిహ్నాలు ఉన్నాయి. 'బుందేల స్కూల్ ఆఫ్ పెయింటింగ్' ప్రసిద్ధమైనది. పుష్పాలంకరణకు ప్రసిద్ధి. బెట్వానది ఒడ్డున ఓర్చా కోట ఉంటుంది. మొగల్ చక్రవర్తి సందర్శన సందర్భంగా బీర్‌సింగ్ రాజు స్మారక మందిరం నిర్మించాడు. కోర్టు, దర్బారు గొప్పగా ఉంటాయి. హిందూ మొగల రాజ భవనాలు ఆకర్షణీయంగా తీర్చిదిద్దారు. రాజా ఇంద్రమణి అనే కవి, సంగీత జ్ఞురాలు పేర 'రాజ్ ప్రవీణ్ మహల్' నిర్మించారు. ఆమె గొప్ప అందగత్తే, నాట్యకారిణి. జహంగీర్ ఆమెను ప్రేమించాడని కథనం. వీరిద్దరి ప్రణయగాథ పాటలుగా కావ్యాలుగా ప్రసిద్ధమైనాయి. ఆమె భర్తను వదిలి వెళ్ళటం ఇష్టపడని రాజపుత్ర స్త్రీ పతివ్రత... ఆనంద మహల్, హర్దు వాల్ మందిరాలు వైభవంగా ఉంటాయి. హర్దువాల్



బీర్‌సింగ్ కుమారుడు. అన్న ఝుహార్‌కు తన అమాయకత్వాన్ని నిరూపించటానికి ప్రాణత్యాగం చేశాడు. మరణం తరువాత అతనిని దేవతాభావంతో విగ్రహం నెలకొల్పి పూజిస్తూ ఆరాధిస్తున్నారు. మధుకర్ షా భార్య రాణి గణేష్ కున్వారీదేవి అయోధ్య నుంచి శ్రీరాముని విగ్రహం తనతో ఓర్చాకు తీసుకొచ్చింది. దాన్ని రాజ ప్రాసాదంలో ఒకచోట తాత్కాలికంగా ఉంచింది. వేరొకచోట దాన్ని ప్రతిష్టిద్దామని ప్రయత్నం చేస్తే విగ్రహం ఊడి రాలేదట. చివరికి ఈ రాజ ప్రాసాదాన్నే శ్రీరాముని సమర్పించారు రాణీ రాజు. ఇక్కడ శ్రీరాముడు రాజుగా పూజింపబడుతున్నాడు. భారత దేశం మొత్తం మీద ఎక్కడా శ్రీరాముడు రాజుగా అర్చింపబడటం లేదు. ఇక్కడే అది జరుగటంతో ఓర్చా తన ప్రత్యేకతను నిలుపుకొంటోంది. కున్వారి రాణీ కోసం మధుకర్ షా చతుర్భుజ దేవాలయాన్ని ఓర్చాలో నిర్మించాడు. ఉన్నతమైన శిఖరంతో మహా గొప్ప కళానికేతన్‌గా ఉంటుంది. రామ రాజ, లక్ష్మీ నారాయణ దేవాలయాలూ ఉన్నాయి. 'బుందేల్ చిత్రకళ' విశేష ప్రాముఖ్యత పొందింది.. విప్లవవీరుడు స్వాతంత్ర సమరంలో వీర మరణం పొందిన చంద్రశేఖర ఆజాద్ ఓర్చాలో 1926-27లో నివసించటం దీని విఖ్యాతిని మరింత పెంచింది. సిద్ధ బాబా మందిర్, జుగల్ కిషోర్ మందిర్, జానకీ మందిర్ దర్శింప దగినవి. ఇక్కడ రాజస్తాని, జైన, మొగల్ శిల్పకళలు వర్ధిల్లి కళా త్రివేణీ సంగమ స్థానమైంది.





## మా నవరాత్రి యాత్ర-15

### ఉజ్జయిని శ్రీ మహాకాళేశ్వర దర్శనం

ఖజురహో నుండి ఏప్రిల్ పదమూడవ తేదీ ఆదివారం సాయంత్రం బయల్దేరి నిజాముద్దీన్, ఇండోర్ ఎక్స్ప్రెస్‌లను ఎక్కి ఝూన్సి ద్వారా ఉజ్జైన్‌కు 14 సోమవారం మధ్యాహ్నం పదకొండు గంటలకు చేరాం. రైల్వే రిటైరింగ్ రూమ్‌లు రెండు మా అబ్బాయి శర్మ ముందే బుక్ చేశాడు.



కనుక తొమ్మిదో నంబర్ ప్లాట్‌ఫాం నుండి తోపుడు బండివాడి సాయంతో ఒకటో నంబర్ ప్లాట్‌ఫాం దగ్గరున్న రిటైరింగ్ రూమ్‌లకు చేరుకొన్నాం. ఇక్కడ పాస్‌పోర్ట్ ఐడెంటిటి చూపించాలంటే చూపించాను. సామాన్లు రూమ్‌లోకి చేర్చి హాయిగా వేడినీళ్ళ స్నానాలు చేశాము. రెండు ఏ.సిలున్నాయి. విశాలమైన డీలక్స్ రూములు. అద్దె అయిదు వందలే. ఉన్నదేదో తిని విశ్రాంతి తీసుకొన్నాం. విజ్జి, రమణ కిందికి వెళ్లి అన్నం, పెరుగు కొనుక్కొచ్చారు. పెరుగులో అన్నం కలిపి తిన్నాం. దాదాపు మూడురోజుల నుండి తిండి లేనే లేదు. హార్లిక్స్ బిస్కెట్లే నాకు ఆహారం. ఏదీ తినాలనిపించలేదు. మా అమ్మాయి నా విషయంలోను వాళ్ళ మ్మ విషయంలోను శ్రద్ధ తీసుకొని గ్లాసులకు గ్లాసులు మజ్జిగ ఆరగా ఆరగా ఇచ్చి తాగిస్తూ నీరసాన్ని తగ్గించింది. మెడికల్ షాప్‌కు వెళ్లి మా ఇద్దరికీ కాప్సిల్లు టాబ్లెట్లు తినే ముందు ఒకటి తిన్న తర్వాత ఒకటి వేసి మింగించింది. రాత్రికి కొంత ఉపశమనం కలిగింది.



సోమవారం ఉజ్జయినిలో ఉన్నాం కనుక జ్యోతిర్లింగం అయిన శ్రీ మహా కాళేశ్వర దర్శనం చేసి తరించాలను కొన్నాం. సాయంకాలం మళ్ళీ స్నానాలు చేసి చేతిలో ఏమీలేకుండా రెండు కిలోమీటర్ల దూరంలో ఉన్న 'మహాకాళ్' దర్శనానికి ఆటోలో వెళ్లాం. ఇక్కడ అందరూ మహాకాల్ టెంపుల్ అంటారు. అక్కడ పెద్దగా క్యూ లేదు. మేము టికెట్ కొని వెళ్ళే మార్గంలో వెడుతుంటే మా ముగ్గుర్ని పంపి మా అమ్మాయిని గేట్ దగ్గర ఆపి టికెట్ కొనమన్నారు. అప్పటికే మేము ఆలయ ప్రవేశం చేశాం. ఏమనుకొన్నారో ఏమో మా అమ్మాయికి మాత్రమే టికెట్ డబ్బు 150 రూపాయలు తీసుకొని లోపలి పంపారు. లోపల జనం బాగానే చేరారు. దర్శనం మహా దివ్యంగా జరిగింది. ఎన్నాళ్ళ కలో ఇప్పటికి తీరింది. ఆరున్నర నుంచి ఏడింటి వరకు హారతి జరిగింది. శంఖాలు డమురుక నాదాలు తప్పెట్లు తాళాలతో అపర కైలాసమే అనిపించింది. ఒకాయన తప్పెట మోగిస్తూ విపరీతంగా తన్మయంలో ఊగిపోయాడు. ఎప్పుడో కాశీలో శ్రీ విశ్వేశ్వరాలయంలో ఈ అనుభూతిని పొందాం. మళ్ళీ ఇక్కడ లభించింది. అందరం పరమ సంతోషపడ్డాం. జన్మకో శివరాత్రి అనిపించింది. జీవితం ధన్యమని భావించాము. ఈ తన్మయత్వంలో శివ స్తోత్రాలే మర్చిపోయాననిపించింది. అంతటి ఆనందస్థితి అది. ఆలయం ఏర్పాట్లు



బాగా ఉన్నాయి. ఎక్కడా అసౌకర్యం కనిపించలేదు. నెమ్మదిగా బయటికి వచ్చాం. అక్కడే శ్రీ ఆంజనేయస్వామి ఆలయం ఉంది. దర్శించాం. మా స్వామి దర్శనం లభించటమూ పరమానందమే. ఆలయం బయట హోటల్‌లో మా అమ్మాయి పెరుగు, అన్నం తీసుకొన్నది. మళ్ళీ ఆటోలో రూములకు చేరుకొన్నాం.

ఇలా మహా పవిత్ర సోమవారం ఉజ్జయిని శ్రీ మహాకాళేశ్వర సన్నిధిలో గడిపాం. రాత్రి పెందరాళే పడుకోన్నాం.

## భస్మహారతి

ఉజ్జయినిలో స్పెషల్ 'భస్మ హారతి' దీన్ని తెల్లవారుజామున నాలుగింటి నుండి ఆరువరకు జరుపుతారు. దీనిని దర్శించాలంటే వారం పది రోజుల ముందే 'ఆన్‌లైన్‌లో రిజర్వ్' చేయించుకోవాలి. మా పక్కింటి మేష్టారువాళ్ళు వెళ్లి వచ్చారుకనుక విషయం తెలిసి మా అబ్బాయి శర్మతో మా నలుగురికి ఆన్‌లైన్ భస్మహారతి దర్శనానికి 15 ఉదయానికి బుక్ చేయించాం. దీనికి రుసుమేమేమీ లేదు. పాస్‌పోర్ట్ ఆధారంగా ఫోటో ఐడెంటిటి ఉంటుంది. దాన్ని సబ్మిట్ చేసి నెట్ ద్వారా బుక్ చేయాలి. ఆ తంటాలేవో మా శర్మే మా కోసం పడ్డాడు. వాళ్ళ అనుమతిని ప్రింట్ అవుట్ తీసుకొని దగ్గర పెట్టుకోన్నాం.

15వ తేదీ మంగళవారం తెల్లవారు జామున రెండున్నరకే లేచాం. స్నానాలు చేశాం. మగవాళ్ళు పంచ ఉత్తరీయాలతో, ఆడవాళ్ళు చీర జాకెట్‌లతోనే దర్శించాలి. భస్మ హారతి సమయంలో ఆడవారు నెత్తిమీద ముసుగు తప్పక ధరించాలి. ముసుగు లేకుండా భస్మహారతి చూడరాదని నియమం. అలానే తయారై బయల్దేరి ఆటోలో పావుతక్కువ నాలుగుకు చేరాం. మెటల్ డిటెక్టర్ సాయంతో తనిఖీ చేసి ఆన్‌లైన్ రిజర్వేషన్ కాగితాలతో మనుషులను గుర్తించి లోపలి అనుమతించారు. జనం బాగానే ఉన్నారు. నాలుగు గంటల నుండి మనం వెంట తీసుకొని వెళ్ళిన చెంబుతో దేవాలయంలో రెడీగా ఉన్న నీటిని నింపుకొని లైన్‌లో నిలబడాలి. క్యూ ప్రారంభం అయింది. అందరూ ఒక్కొక్కరుగా గర్భాలయం ప్రవేశించి శ్రీ మహాకాళేశ్వర్ జ్యోతిర్లింగాన్ని తనివి తీరా స్పర్శించి తెచ్చిన నీటిని అభిషేకం చేయాలి. అలానే మేమూ చేశాం. ఇదో దివ్యానుభూతి. ఇది అయ్యేసరికి నాలుగు ఇరవై అయింది. అప్పుడు ముందున్న ఖాళీ ప్రదేశంలో వరుసలలో కూర్చున్నాం. వెనక మెట్ల వరుసలో కొందరు కూర్చున్నారు. భక్తుల అభిషేకం తరువాత ఆలయ పూజారులు అభిషేకం చేయటం మొదలు పెట్టారు. నమకం

వినిపించింది కాని చమకం వినిపించలేదనుకొన్నాను. క్షీరం, పండ్ల రసం, పెరుగు, నేయి మొదలైన వాటితో జ్యోతిర్లింగానికి అభిషేకం చేసి చివరికి జలాభిషేకం చేశారు. ఇవన్నీ క్లోజేడ్ సర్క్యూట్ టి.వి.లలో కూడా చూసే ఏర్పాటు చేశారు. కనుక ఏదీ మిస్ అయ్యాం అనిపించదు. ఆ తర్వాత లింగానికి అలంకరణ చేస్తారు. మూతి పెదవులు కన్నులు ముక్కు చెవులు అన్నిటిని గంధంతో తీర్చిదిద్ది పరమ వైభవంగా శివలింగాన్ని మానవాకృతి ముఖంగా మారుస్తారు. భక్తులు తెచ్చిన ప్రసాదాలు వస్త్రాలు



వరుసగా తీసుకొని స్వామి ముందు ఉంచి మళ్ళీ ఎవరివి వారికి అందజేయటం ప్రత్యేకంగా కనిపించింది. స్త్రీ వాలంటీర్లు కూడా చాలా శ్రద్ధగా విధులు నిర్వహించటం బాగుంది.

ఇదంతా అయిన తర్వాత ఒక తెల్లగుడ్డలో స్మశానం నుంచి తెచ్చిన 'చితా భస్మాన్ని' మూటగా కట్టి జ్యోతిర్లింగంపై వరుసగా చల్లి అభిషేకం చేయటమే భస్మహారతి. ఒక పది నిమిషాలు. లింగం పాన వట్టం మీద ఒక్క సెంటిమీటరు కూడా వదలకుండా భస్మంతో అభిషేకిస్తారు. ఇదీ ఉజ్జయిని ప్రత్యేకత. భస్మాభిషేకం తరువాత స్వామికి నూతన వస్త్రాలను సమర్పించి అలంకారంగా ఉంచుతారు. తరువాత వివిధ దీపాలతో వివిధ భంగిమలతో అనేక రకాలుగా హారతినిస్తారు. ఈ హారతికి పావుగంట పడుతుంది. చూసి తీరాల్సిందే ఇది. ఇదొక మహా విభూతి అనిపించింది. ఎన్ని జన్మల పుణ్యఫలమో ఈ దివ్య దర్శనం అనిపిస్తుంది. ఈ జన్మకు ఇది చాలు అని సంతృప్తి కలుగుతుంది, కలిగింది. నేను మనసులో 'మిధున పతయే నమః మిధున పతాన్తికాయనమః ఊర్ధ్వాయనమః ఊర్ధ్వ లింగాయనమః ' అనుకొంటూ కళ్ళ నుండి ఆనంద బాష్పాలు రాలుతుండగా చూసి తరించాను.

మా శర్మ ఉజ్జైన్ నుండి రెండువందల కిలోమీటర్లకు పైగా ఉన్న నర్మదానదీ తీరంలోని ఓంకార జ్యోతిర్లింగా క్షేత్ర దర్శానికి ఇండికా కార్ బుక్ చేశాడు. డ్రైవర్‌కు ఫోన్ చేసి ఉదయం ఎనిమిదింటికి స్టేషన్ దగ్గరకు రమ్మని చెప్పాం. ఆలయం నుండి బయటికి వచ్చి కాఫీ తాగాం. ప్రసాదాలు కొన్నాం. ఆటోలో రూమ్స్‌కు చేరాం. డ్రైవర్ కోసం ఎదురు చూస్తూన్నాం. ఎనిమిదింటికి డ్రైవర్ వచ్చి ఫోన్ చేశాడు. అందరం బయల్దేరి ఇండికా కారులో ఎక్కి కూర్చున్నాం. ఇక ఓంకారేశ్వర్‌కు బయల్దేరాం. ఆ

యాత్ర విశేషాలు తరువాత తెలియజేస్తాను.

## మా నవరాత్రి యాత్ర-16

### శ్రీ మహాకాళేశ్వర విశేషాలు

ఉజ్జయినిలోని మహా కాలేశ్వర జ్యోతిర్లింగానికి ఒక ప్రత్యేకత ఉంది. దక్షిణాభి ముఖంగా ఉన్న ఈశ్వరుడు శ్రీ దక్షిణామూర్తిగా అర్చింపబడటం ఇక్కడి విశేషం. పన్నెండు జ్యోతిర్లింగ మహాక్షేత్రాలలో ఒక్క ఉజ్జయినిలోనే శంకరుడు దక్షిణామూర్తిగా కొలువై ఉన్న దివ్య క్షేత్రం. మరెక్కడా ఇలా లేదు. దక్షిణాభిముఖంగా స్వయం భువుడై శివుడు విరాజిల్లిన దివ్యధామం. స్మశానం నుంచి తెచ్చిన చితా భస్మముతో రోజూ తెల్లవారు ఝామున అభిషేకం చేయటం ఇక్కడి మరో విశేషం. దీని తరువాత హారతినిస్తారు. ఈ మొత్తం కార్యక్రమాన్ని 'భస్మ హారతి' అంటారు.

స్థలపురాణం ప్రకారం క్షిప్రా నదీతీరంలో ఉన్న ఉజ్జయిని సామ్రాజ్యాన్ని ఆక్రమించేందుకు ఇరుగు పొరుగు రాజులు ఎప్పుడూ సిద్ధంగా ఉండేవారు. ఉజ్జయిని రాజు శిక్షకు గురి అయిన శ్రీకరుడు అనే చిన్నపిల్లాడు అపాయాన్ని గ్రహించి పూజారికి చెబుతాడు. పూజారి రాజుగారికి ఈ విషయం చెప్పేలోపే బ్రహ్మవరంతో మాయారూపి అయిన 'దూషణుడు' అనే రాక్షసుడి అండతో శత్రురాజులు ఉజ్జయినిపై విరుచుకు పడతారు. అప్పుడు శ్రీకరుడు, పూజారి కలిసి కైలసనాథ శివుడిని ప్రార్థిస్తారు. వారి మొర ఆలకించిన రుద్రుడు ప్రళయకాల మహాఘోషతో మహా కాళేశ్వరునిగా ఉగ్రాతి ఉగ్రరూపంలో అవతరించి శత్రుసేనలను చీల్చి చెండాడి, దూషణా సురుడిని సంహరించి రాజ్యాన్ని సంరక్షిస్తాడు. తరువాత భక్తుల కోరిక మేరకు మహా కాళేశ్వరుడు అనే పేరిట జ్యోతిర్లింగమై దక్షిణాభిముఖంగా వెలసి దక్షిణామూర్తిగా పూజలు అందుకొంటూ భక్త వరదుడిగా ప్రసిద్ధి కెక్కాడు. ఆలయంలో వాత్సల్య గణపతిస్వామి పార్వతీదేవి విగ్రహ రూపంగా దర్శనమిస్తాడు.

మహాకాలేశ్వరాలయంలోనే 'తాంత్రిక శివ నేత్ర' ఆరాధన జరుగుతుంది. శివుని ముందు నందీశ్వరుడు ప్రక్కవైపున పార్వతి ఉంటారు. మూడవ అంతస్తులో 'నాగ చంద్రేశ్వర స్వామి' ఉంటాడు. దీనిని నాగ పంచమినాడు మాత్రమే దర్శించాలి. అప్పుడే ఆలయం తెరచి ఉంచుతారు. ఉజ్జయిని నగరాన్ని ప్రభావితం చేసి భక్తుల హృదయాలలో కొలువు దీరాడు మహా కాలేశ్వరుడు. సతీదేవిపై పెదిమ ఇక్కడ పడటం చేత శక్తి పీఠంగా వెలసిల్లింది. అమ్మవారు కాళికాదేవి.

ఆలయాన్ని షాసుద్దీన్ సుల్తాన్ 1234లో ధ్వంసం చేశాడు. 1736లో సింధియా రాజు హిందూ పద షాహిషా బిరుదాంకితుడు. శ్రీమంత్ రానోజీ రావు



షిండే మహారాజు, పీష్వా బాజీరావు, ఛత్రపతి సాహూ మహారాజ్‌లు కలిసి పునర్నిర్మిచారు.

## ఉజ్జయిని విశేషాలు

మహోజ్వల ధార్మిక స్థలంగా ఉజ్జయినీ నగరం వెలిగింది. క్రీ.పూ నుండి దీని కీర్తి దిశాన్తాలకు వ్యాపించింది. విక్రమార్క చక్రవర్తి పాలించిన నగరం. ప్రాచీన కాలంలో 'అవంతి' అనే పేరుతో పిలువబడింది. స్కాంద పురాణంలో దీనికి కనక, శృంగా, పద్మావతి, కుశస్తలి, కుముద్వతి అనే పేర్లున్నాయి. మహా కాలేశ్వరాలయం అద్భుత నిర్మాణం. పరిణత శిల్పశోభా విలసితం. భూగర్భం నుండి అయిదు అంతస్తులతో ఆలయం ఉంటుంది. మెట్లు దిగుతూ వెళ్లి దర్శించాలి. ఆలయంలోని 'కోటి తీర్ధ కోనేటి'లో అభిషేక జలం లభిస్తుంది. విశాలమైన మూడు ప్రాకారాలు దాటి వెడితే మహాకాళేశ్వర జ్యోతిర్లింగ దర్శన ప్రాప్తి కలుగుతుంది.

ఉజ్జయినిలోని కాలభైరవస్వామి మద్య ప్రియుడు. ఎంత మంది భక్తులు మద్యాన్ని అందించినా 'పూటు'గా సేవిస్తాడు. సీసాలో మద్యాన్ని స్వామి నోటి దగ్గర పెడితే శబ్దం చేస్తూ ఖాళీ అయిపోవటం విచిత్రం. దీనికి హేతువాదులెవరూ కారణాలు కనుక్కోలేక పోయారని అంటారు. కాలభైరవ దర్శనంతో హత్యా పాతకం పోతుందని విశ్వాసం. తాంత్రిక పూజలకు కేంద్రం.

కాళిదాస మహాకవి నాలుకపై కాళికాదేవి బీజాక్షరాలను రాసి మహాకవిగా మార్చిన ప్రదేశం ఇదే. ఇక్కడి కాళికా దేవిని ఘాట్ కాళీ అంటారు.

భర్తృహరి కవి సుభాషితాలు రాసిన గుహలు ఉజ్జయినికి ఏడు కిలోమీటర్ల దూరంలో సిప్రానది ఒడ్డున ఉన్నాయి. ఉజ్జయినికి అయిదు కిలోమీటర్ల దూరంలో శ్రీకృష్ణుడు అన్నగారు బలరాముడితో స్నేహితుడు సుదాముడనే కుచేలునితో 'సాందీప మహర్షి' వద్ద విద్య నేర్చిన సాన్దీపముని ఆశ్రమం ఇక్కడే ఉంది. ఇక్కడ కుచేలుని విగ్రహం ఆకర్షణీయం.

మహా కాలేశ్వరాలయం దగ్గరే 'హర సిద్ధి మాత' ఆలయం ఉన్నది. ఈమె ఉజ్జయిని రాజు విక్రమాదిత్యుని ఆరాధ్యదైవం. భేతాళ కథలలో పట్టువదలని విక్రమార్కుని కథలు ఇక్కడే జరిగాయి. దీనికి దగ్గరలో కృష్ణ చైతన్య, ప్రభు నిర్వహణలో ఉన్న ద్వారకాధీశ, గోపాల విగ్రహాలున్నాయి. కొండపై మంగళనాథుని పేర కుజుడిని ఆరాధించే

గుడి ఉంది. మంగళవారం విశేష పూజలు జరుగుతాయి. మహా భారతకాలంలో ఉజ్జయినిలో ఖగోళ పరిశోధనలు జరిగేవి. 1730 రాజా జై సింగ్ నిర్మించిన అయిదు నక్షత్ర శాలలు అంటే అబ్సర్వేటరీలలో ఒకటి ఉజ్జయినిలోనే ఉంది. మిగిలినవి ఢిల్లీ, కాశీ మధుర జైపూర్లలో ఉన్నాయి. ఇక్కడ సామ్రాట్ యంత్రం, రిగ్నేష్ యంత్రం నారీ వలయ యంత్రం భీతి యంత్రం ఇప్పటికీ పరిశోధకులకు ఉపయోగాపడుతూనే ఉండటం విశేషం.

కాళిదాస మహాకవి 'మేఘ సందేశం' కావ్యంలో ఈ నగర శోభను వర్ణించాడు. ఉజ్జయినికి కాళిదాసుకూ అవినాభావ సంబంధం ఎక్కువ.

ఔరంగ జేబు ఆలయ పాలన కోసమూ ధనం అందజేశాడు. కవీన్ద్రాచార్య సరస్వతి అనే కవికి రక్షణ కల్పించాడు. ఆయన రాసినవి సింధియా లైబ్రరీలో భద్రపరచారు. ఉజ్జెన్‌లో సూర్య దేవాలయం ఉన్నట్లు స్కాంద పురాణం చెప్పింది. దాని దగ్గర సూర్యకుండం బ్రహ్మకుండం ఉన్నట్లు పేర్కొన్నది. మహమ్మద్ ఖిల్జీ నగరాన్ని చల్లగా ఉంచేందుకు చుట్టూ తటాకాలు నిర్మించాడు. ఇక్కడ విక్రమాదిత్యుని పేర విక్రం యూనివర్సిటి ఉంది. మౌర్యుల గుప్తుల కాలంలో నలందా తక్షిశిలాలతో బాటు ఉజ్జయిని కూడా గొప్ప విద్యాకేంద్రం. 'నాలెడ్జి సిటి' అంటారు ఉజ్జెన్‌ను. ఇక్కడి కాళిదాస ఎకాడమి సంస్కృత సాహిత్యాన్ని సంస్కృతిని పరిరక్షిస్తూ పరిశోధనలు చేస్తూన్నది. మధ్యప్రదేశ్ ప్రభుత్వం 'కాళిదాస సమ్మాన్' అనే పురస్కారాన్ని విశేష ప్రజ్ఞ కనబరచిన సాహితీవేత్తలకు, కళాకారులకు అందజేస్తోంది. విక్రమాదిత్యుని పేర 'విక్రమ కీర్తి మందిరం' ఉంది. ఇక్కడి బజార్లకు సంస్థలకు చాణక్య, చంద్రగుప్త, మౌర్య మొదలైన పేర్లు ఉండటం గర్వించదగిన విషయం.

## మా నవరాత్రి యాత్ర-17

### ఓంకారేశ్వర యాత్ర

ఏప్రిల్ 15 మంగళవారం తెల్లవారుజామున శ్రీ మహాకాకేశ్వర భస్మహారతి కార్యక్రమంలో పాల్గొని ఎనిమిది గంటలకు ఇండికా కారులో మేము నలుగురం ఎక్కి ఓంకారేశ్వర దర్శనానికి బయల్దేరాం. ఇండోర్ మీదుగా వింధ్య పర్వతాల గుండా ప్రయాణం. శ్రీశైలం వెళ్ళే మార్గంలా అనిపిస్తుంది. ఉజ్జెన్‌కు సుమారు యాభై కిలో మీటర్ల దూరంలో ఇండోర్ ఉంది. ఇది ఒకప్పటి సంస్థానం. రైల్వే కూడలి. మాల్వా పీఠభూమి భాగం. దాదాపు ఒక గంట ప్రయాణం తర్వాత రోడ్డు పక్క దాభా దగ్గర ఆగాం. నాకేమీ తినాలనిపించేలేదు. నేను మా ఆవిడ సగం కాఫీ తాగాం. రమణ చపాతీ తిన్నాడు. మా ఇద్దరికీ దారిలో మజ్జిగా బిస్కెట్లు స్ప్రైట్ మాత్రమే ఆహారం. ఉదయం పదిన్నరకు అంటే రెండున్నర గంటల ప్రయాణం తర్వాత నర్మదా నదీతీరం

నర్మదా ఆనకట్ట దగ్గరకు చేరాం. ఓంకార్‌కు పన్నెండు కిలోమీటర్ల దూరంలో 'ఓంకారేశ్వర్ రోడ్' రైల్వేస్టేషన్ ఉంది. అక్కడినుంచి ఇక్కడికి యాత్రికులు ఆటోలో చేరుకొంటారు. మధ్యాహ్నం పన్నెండున్నరకు దేవాలయాలు మూసేస్తారని మా కారు డ్రైవర్ సోనీ చెప్పాడు. అక్కడ పడవవాళ్ళు వచ్చి మూగుతారు. ఒక పడవను రానూ పోనూ మనిషికి వంద రూపాయలకు మాట్లాడుకొన్నాం.

నది గట్టు ఎత్తుగా ఉంటుంది. స్టీప్‌గా జారుతూ దిగి నర్మదా నది ఒడ్డుకు చేరాం. ప్రవాహం బాగా ఉంది. డాంకు దగ్గరలో నర్మదా, కవేరియా రేవా నదులు సంగమిస్తాయి. అందుకే దీన్ని త్రివేణీ అంటారు. బోటువాడు ముందుగా అవతలి తీరం దగ్గరకు స్నానాల రేవు దగ్గరకు చేర్చి స్నానం చేసి ఓంకారేశ్వర దర్శనం చేసి ముందున్న రేవు దగ్గర నుంచోమన్నాడు. మధ్యలో మాలో మేము 'డిషుం డిషుం' మాటామాటా అనుకోవటం మూతులు బిగేసుకోవటం ఒక పావుగంట డ్రామా సాగింది. మా అమ్మాయికి నేను కేకలేశానని కోపమూ వచ్చింది. స్నానానికి నేను కాళ్ళ డ్రాయరు, తువ్వాల తీసుకొని దిగాను. మా ఆవిడా నాతో దిగింది. చల్లగా నర్మదా జలం సేద దీరేలా ఉన్నది. ఇదే మొదటిసారి నర్మదా నదిని దర్శించటం, స్నానించటం. పది నిమిషాలు హాయిగా స్నానం చేశాం. స్నానమంత్రం నేనే చెప్పాను. ఫోటోలు ఒక్కొక్కటి పది రూపాయలిచ్చి ఇన్స్టంట్ ఫోటోలు స్నానఘట్టంలో తీయించుకొన్నాం. మా అబ్బాయి రమణతో కూడా మంత్రం చెప్పి స్నానం చేయించాను. మా అమ్మాయి 'షరించి' స్నానానికి దిగలేదు. మేము నర్మదా నీళ్ళు దానిపై చిలకరించి స్నానం చేసిన ఫలితం కలిగించాము. బట్టలు మార్చుకున్నాం. ఇక్కడ నది రెండు కొండల మధ్య ప్రవహిస్తుంది. మేము స్నానం చేసిన తీరంలో మెట్లుఎక్కి పైకి వెడితే 'ఓంకారేశ్వర స్వామి' దర్శనం కలుగుతుంది. దీనికి ఎదురుగుండా ఉన్న రేవు దగ్గర 'మమలేశ్వరాలయం' ఉంది. ఈ రెండిటిని ఇక్కడ జ్యోతిర్లింగాలనే అంటారు.

స్నాన ఘట్టం నుండి నెమ్మదిగా ఎత్తైన మెట్లు సుమారు ఎనభై ఎక్కితే కాని ఓంకారేశ్వర దర్శనం లభించదు. మాకు ఇబ్బంది లేదుకాని మా ఆవిడకు మెట్లు ఎక్కటం కష్టమే. అలాగే ఓపికగా నెమ్మదిగా మెట్లు ఎక్కి రాగలిగింది. క్షేత్ర మహాత్మ్యమే. లేకపోతే మూడు రోజులుగా కడుపులో ఏదీ ఘన పదార్ధం పడకుండా ఇంత ఓపిక యెట్లా వస్తుంది? రెండు కొండల మధ్య బ్రిడ్జిలు కట్టారు. నడిచి అలానూ వెళ్ళవచ్చు. పడవ ప్రయాణాన్నే మేము ఎంన్నుకున్నాం.

## శ్రీ గోవింద భగవత్పాదుల వారి నివాసం

తీరం నుండి ఇరవై మెట్లు ఎక్కగానే కుడి వైపున ఒక గుహ ఉంటుంది. ఇక్కడికే శ్రీ శంకర భాగవత్పాదులనే ఆదిశంకరాచార్యులవారు కేరళ నుండి చిన్నతనం

లోనే తల్లి ఆర్యాంబచేత సన్యాస దీక్షకు ఒప్పించి ఇల్లు వదిలి దేశ సంచారం చేస్తూ తగిన గురువును వెదుక్కుంటూ ఈ నర్మదా తీరంలోని ఓంకార క్షేత్రానికి చేరుకొన్నారు. గోవింద భగవత్ పాదులవారు అప్పుడు ఈ ప్రాంతం మహా విద్వాంసులుగా బ్రహ్మ సూత్ర, వేదం శాస్త్ర అధ్యాపకులుగా చిరకీర్తి నార్జించి ఉన్నారు. శంకరాచార్య గురువు గారిని చేరి అనుమతితో ఇక్కడే వారి ఆశ్రమంలో ఉన్నారు. ఒకరోజు అర్ధరాత్రి నర్మదా నదికి విపరీతంగా వరదలు వచ్చి ఆశ్రమంలోకి ఉద్ధృతంగా ప్రవేశించ బోతోంది. గురువు గారు గాఢ నిద్రలో ఉన్నారు. భగవత్ పాదులు అపాయం గ్రహించి నర్మదా నదిపై ఆశువుగా స్తోత్రం చెప్పి ఆమెను అనుగ్రహించి ఉద్రుతాన్ని తగ్గించుకోమని ప్రార్థించారు. శాంతించిన నర్మదామాత దిశ మార్చుకొని వెళ్లిపోయింది. ఉదయం లేచి గురువు గారు గోవింద భగవత్ పాదులు ప్రమాద విషయాన్ని శంకరుల నివారణా రహస్యాన్ని గ్రహించారు. తాను ఎదురు చూస్తున శిష్యుడు శ్రీ శంకరులే అని గ్రహించి దీక్షనిచ్చి శిష్యునిగా స్వీకరించి విద్య నేర్పి బ్రహ్మ సూత్రాలకు భాష్యం రాయించారు. ఇక్కడ గుహలో శ్రీ గోవింద భగవత్ పాదుల చిన్న విగ్రం శ్రీశంకరచార్యుల విగ్రహాలు ఉండి చరిత్రకు సాక్షీభూతంగా నిలుస్తున్నాయి. ఈ ఫిబ్రవరిలో ఆదిశంకరుల జన్మస్థలం కేరళలోని 'కాలడి'ని దర్శించటం, ఇప్పుడు ఆయన దేశ సంచారం చేసి తగిన గురువు శ్రీ గోవింద భగవత్ పాదుల వద్ద శిష్యులై సన్యాస దీక్ష పొంది విద్యనేర్చి గ్రంథ రచనకు శ్రీకారం చుట్టిన చరిత్ర సృష్టించిన ప్రదేశం ఓంకార క్షేత్ర దర్శనం చేయటం మా పూర్వ జన్మ సుకృతం. జన్మ చరితార్థం. భక్తీ ప్రపత్తులతో ఆ గురుశిష్యులకు ప్రణమిల్లి మెల్లగా మెట్లెక్కి ఓంకారేశ్వర సన్నిధానం చేరుకొన్నాం. గుడి చిన్నది మార్గమూ ఇరుకు. దీనికి తోడూ 'పండాల', 'దందా' .. పైనుంచి చూస్తే శోభాయమానమైన ప్రదేశం అనిపిస్తుంది. ఓంకారేశ్వరుడినే 'అమరేశ్వరుడు' అని కూడా అంటారు. ఈ జ్యోతిర్లింగాన్ని స్పృసించటానికి, అభిషేకం చేయటానికి వీలులేకుండా గ్లాసు చేంబర్ ఉంటుంది. ప్రక్కనే ఉన్న మరో లింగానికే అభిషేకం పూజా. ఇది స్పర్శనీయం. మా అమ్మాయి కూడా లోపలి వచ్చి మా ముగ్గురితోబాటు దర్శనం చేసుకొన్నది. మా రమణను ఒక 'పండా' పట్టుకొని పూజ అంటూ వెంబడి పడ్డాడు. వాడు మేము ఒద్దని చెప్పినా ఆలయం బయట హాలులో కూర్చోబెట్టి 'భుషం భుషం' అంటూ చెప్పిన మంత్రాలే చెప్పి మాతో కూర్చోబెట్టి కలశ ఆవాహన చేసి పూజలాగా ఏదో చేసి, అమ్మవారి దర్శనమూ చేసి మెట్లు దిగి మళ్ళీ రేవు దగ్గరకు చేరంగానే పడవవాడు రెడీగా ఉన్నాడు.

## ఓంకారేశ్వరి విశేషాలు

మధ్యప్రదేశ్‌లో నర్మదానదీ తీరాన ఓంకార జ్యోతిర్లింగా క్షేత్రం ఉంది. ఉజ్జైనుకు సుమారు రెండు వందల కిలోమీటర్లు. ఇక్కడి శివలింగం 'భాణలింగం'. నర్మదానదిలో

లభించిన భాణలింగం అత్యుత్తమమైనదని శివపురాణం చెప్పింది. అన్ని నదులూ తూర్పు దిశగా ప్రవిహించి సముద్రంలో కలిస్తే, నర్మదా నది పడమరగా ప్రవహించి అరేబియా సముద్రంలో కలవటం విశేషం. అదీ ఈ క్షేత్ర ప్రశస్తి. ఉజ్జైని దేవాలయంలో కింద శ్రీమహాకాలేశ్వరుదు, పైన ఓంకారేశ్వరుడు ఉంటారు. ఇక్కడ ఓంకారేశ్వర్లో కింద ఓంకారేశ్వరుడు, పైన మహాకాలేశ్వరుడు ఉండటం విచిత్రం. గుడి నాలుగు అంతస్తులుగా ఉంటుంది. కింద ఓంకారేశ్వరుడు, మొదటి అంతస్తులో మహాకాలేశ్వరుడు ఉండగా మిగిలిన అంతస్తులలో ఉప ఆలయాలు ఉంటాయి. శివుడు అమ్మవారి విగ్రహాలు ఇందులో ఉన్నాయి . నర్మదానది నర్మదా, కావేరికా అనే రెండు పాయలుగా చీలి ప్రవహిస్తోంది. ఈ రెండు పాయల మధ్య ప్రదేశాన్ని శివపురి మాందాత్రుపురి అని పిలుస్తారు. ఓంకారేశ్వర జ్యోతిర్లింగం మధ్యన చిన్న చీలిక ఉందట. ఈ చీలిక ద్వారా అభిషేక జలం నర్మదానదిలో కలిసి పవిత్రీకరిస్తుందని భావిస్తారు.

## పురాణ గాధ

సూర్యవంశానికి మాంధాత రఘువంశ మూలపురుషుడు. మాంధాత ఇక్కడే పర్వతంపై తపస్సుచేసి శివుని ప్రసన్నం చేసుకొన్నాడు. స్వామి అనుగ్రహంతో ఇక్కడే పర్వతంమీద ఆలయం నిర్మించాడు. ఈ పర్వతంమీద ఉన్న అనేక దేవాలయాలు ఓం అనే ప్రణవ ఆకారంలో ఉండి ఓంకారేశ్వర్, దేవాలయం ప్రణవంపై సూర్యభగవానుడి లాగా ప్రకాశిస్తోంది. దగ్గరలో విష్ణుపురి బ్రాహ్మపురి కొండలున్నాయి. వాటి మధ్యనుంచి కపిలధార అనే నది ప్రవహించి నర్మదానదిలో కలుస్తుంది. ఒకప్పుడు నారదమహర్షి గోకర్ణ క్షేత్రంలో శివుని అర్చించి తిరిగి వస్తూ వింధ్యపర్వతం వద్దకు వచ్చాడు విన్ధ్యుడి పూజ గ్రహించాడు. తనలో రత్నమాణిక్యాలున్నాయని వింధ్యుడు గర్వంగా మహర్షితో అన్నాడు. "నువ్వు మేరు పర్వతంకంటే తక్కువే. మేరు శిఖరాలు స్వర్గం వరకు వ్యాపించాం" అన్నాడు. సిగ్గుపడ్డ వింధ్యుడు శివునికోసం ఆరు నెలలు ఈ క్షేత్రంలో ఘోర తపస్సు చేశాడు. ప్రత్యక్షమైన శంకరుని చూడగానే మనోబాధలు పోయాయి. తనకు ప్రశాంత మనసు ఏర్పడిందని తన శిరస్సుపై శాశ్వతంగా ఉండిపొమ్మని శివుని వేడుకొన్నాడు. సంతోషించిన శివుడు ప్రణవాకారాంలో జ్యోతిర్లింగంగా ఇక్కడే స్థిరపడిపోయి భక్తుల అభీష్టాలను నేరవేరుస్తున్నాడు. ఓంకారేశ్వరుడని, పార్ధివాకారంలో అమలేశ్వరుడని రెండు పేర్లతో ఈ జ్యోతిర్లింగాన్ని అర్చిస్తారు.

ఓంకార క్షేత్రంలోనే ఆదిశంకరాచార్యులవారు ఉపనిషత్తులకు భాష్యం రాశారు. ఈయన గురువుగారితో నివసించిన గుహను ఈ మధ్యనే పునరుద్ధరించారు. ఇక్కడి గౌరీసోమనాథ మందిరంలో శివలింగ దర్శనం చేస్తే పునర్జన్మ ఉండదని విశ్వాసం. రాబోయే జన్మరహస్యాలు కూడా తెలుస్తాయట. అందరూ గర్భాలయం చేరి అభిషేకం

చేయవచ్చు.

## మామలేశ్వర జ్యోతిర్లింగం

నర్మదా నదీతీరంలో శ్రీ మామలేశ్వర జ్యోతిర్లింగం క్షేత్రం ఓంకారేశ్వరుకు ఎదురుగా ఉంది. ఇక్కడ సహస్ర శివలింగ పూజ ప్రత్యేకం అభిషేకం మనమే చేసుకోవచ్చు. వెనక పార్వతి అమ్మవారు శివలింగం వెనుక ఉంటారు . ఒకప్పుడు నారదుడి ప్రేరేపణతో వింధ్యపర్వతం శివుడి గూర్చి తపస్సు చేస్తే అనుగ్రహింపబడి దేవతల కోరికపై ఇక్కడే మామలేశ్వరుడిగా ఉండిపోయాడు. వర గర్వంతో వింధ్యపర్వతం మేరువును దాటి గర్వంగా పెరిగిపోయింది. సూర్యుడు ఉత్తరదిశలోనే ఉండిపోయాడు. దక్షిణభాగం అంతా అంధకారం. అప్పుడు దేవతలు విష్ణువును ప్రార్ధించారు. వింధ్య గర్వం హరించటానికి అతని గురువు అగస్త్య మహర్షికి మాత్రమే సాధ్యమని చెప్పి కాశీ పంపాడు. మహర్షిని ప్రార్ధించి వింధ్య గర్వాపహరణం చేయమన్నారు . సరేనన్న మహర్షి కాశీవిశ్వనాదుడిని వదలలేక వదలలేక వింధ్యపర్వతం సమీపించి దక్షిణానికి ప్రయాణమైనాడు. శిష్యుడు వంగి గురువుకు నమస్కరించాడు. తాను దక్షిణదేశానికి వెళ్తున్నానని తిరిగివచ్చే దాకా అలాగే ఉండిపొమ్మని శిష్యుడిని శాసించాడు. అప్పటి నుండి అలానే వింధ్యపర్వతం ఉంది. అంటే ఇక్కడే వింధ్యపర్వత గర్వాపహరణం జరిగిందన్నమాట.

బోటు ఎక్కి నెమ్మదిగా అవతలి ఒడ్డున ఉన్న శ్రీమమ లేశ్వర జ్యోతిర్లింగ దేవాలయానికి చేరుకొన్నాం. గట్టుకు దగ్గరే పెద్దగా మెట్లు ఎక్కక్కరలేదు. రద్దీ లేదు. హాయిగా విశ్రాంతిగా శ్రీమామలేశ్వర జ్యోతిర్లింగా దర్శనం చేశాం. దాదాపు మధ్యాహ్నం పన్నెండున్నర దాటింది. అక్కడే బయట బత్తాయి రసం తాగి సేద దీరాం. ద్వాదశ జ్యోతిర్లింగాలు తెలుగులో డివిడి ఉజ్జైన్సై డివిడి రెండూ కలిపి వందరూపాయలకు కొన్నాం. ప్రసాదాలు తీసుకొన్నాం. ఆలయం బయట ఇద్దరు కుర్రాళ్ళు మొలతాడు లాంటి దారాలతో మనం ఏ పేరు చెబితే ఆ పేరుతో 'బ్రెస్లెట్' తయారుచేస్తున్నారు. మా అబ్బాయి అమ్మాయి చూశారు. ఆ ఆర్టు ముచ్చటగా ఉంది. మా మనవాళ్ళు మనవరాళ్ళు అందరికీ తలోటి ఆర్డర్ ఇచ్చి అల్లించారు. రమణ వాడి విలేకరి మిత్రుల పేర ఆర్డర్ ఇచ్చి అల్లించాడు. ఒక్కోదాని ఖరీదు పదిరూపాయలే. అల్లిక మహా తమాషాగా ఉంది. దారం ఖరీదు కూడా రాదు ఆరేట్కి. వాళ్ళ నైపుణ్యానికి వెల కట్టలేము.

రెండు కొండల మధ్య నర్మదా నది ఈ దివ్యక్షేత్రాలు ఆకాశం నుండి చూస్తే 'ఓం' ఆకారంగా కనిపిస్తుందిట. అందుకే ఓంకార క్షేత్రం అని పేరు. ఓంకారేశ్వర కొండపై పెద్ద అక్షరాలతో ఓం రాయబడి ఉంటుంది.

## ఉమామహేశ్వర పురం

సుమారు రెండున్నరకు మళ్ళీ కారులో బయల్దేరాం. నాలుగుగంటలకు 'ఉమామహేశ్వరం' అనే గ్రామం చేరాం. ఇది నర్మదా నది ఒడ్డున ఉంది. ఇక్కడే హోల్కార్ రాజులు నదీ తీరాన బ్రహ్మాండమైన కోట కట్టుకొన్నారు. ఉమామహేశ్వర దేవాలయం నిర్మించారు. పటిష్టమైన భద్రత కలిగించారు. శ్రీరామమందిరమూ శ్రీహనుమ విగ్రహమూ ఉంది. మెట్లు దిగి ఇవన్నీ చూశాము ముగ్గురం. మా ఆవిడా కారులోనే కూర్చుంది. హోల్కరు రాణి అహల్యాబాయి నిలువెత్తు కాంశ్య విగ్రహం కోట బయట ఉంది. ఆమె చేతిలో భక్తీప్రపత్తులతో పట్టుకొన్న శివలింగం ఉంటుంది. అహల్యాబాయి భర్త, మామగారు నిరంతరం యుద్ధాలలో మునిగి, రాజ్యవిస్తరణ కోసం పోరాడుతూ ఉండేవారు. అహల్యాబాయి కోటను సంరక్షిస్తూ ప్రజల ఆలనాపాలనా చూసేది. కాశీ నుంచి రామేశ్వరం దాకా ఆమె అనేక దేవాలయాలకు ఎన్నో సేవలందించింది, యాత్రికులకు సౌకర్యాలు కలిగించింది. అన్నసత్రాలు ఎర్పరచింది. ఆమె కీర్తి చిరస్థాయిగా ఉండిపోయింది. మంచి డిప్లమాట్గా పేరు పొందింది. భర్త రాజాకుమ్హేర్హోల్కార్ యుద్ధంలో 1754లో మరణించాడు. పన్నెండేళ్ళ తర్వాత మామగారు మల్హరావుహోల్కార్ మరణించాడు. ఏడాది తర్వాత 'మాలా' సామ్రాజ్యానికి రాణిగా పట్టాభిషిక్తురాలైంది. 'ధగ్గుల' దోపిడీ నుంచి రాజ్యాన్ని కాపాడింది. తుక్కోజిరావు హోల్కార్ను ముఖ్య సేనానిగా నియమించి స్వయంగా యుద్ధానికి దిగింది. రాణీ అహల్యాబాయి దేశంలో ఎన్నో దేవాలయాలను నిర్మించింది. అన్నసత్రాలను ఏర్పరచింది. గుజరాత్లోని ద్వారకలో, ఉత్తరప్రదేశ్లోని కాశీలో, ఉజ్జైన్లో నాసిక్లో గయాలో, వైద్యనాదలలో ధర్మశాలలను నిర్మించి సేవలందించింది. గుజరాత్లోని జ్యోతిర్లింగా క్షేత్రమైన సోమనాద్లో సోమనాదాలయం ధ్వంసం కాగా దగ్గరుండి కొత్త ఆలయాన్ని నిర్మించిన మహాభక్తురాలు రాణి అహల్యాబాయ్. దాదాపు వంద క్షేత్రాలలో అహల్యాబాయి దేవాలయలు ధర్మశాలలు నిర్మించి చరిత్ర సృష్టించింది. హోల్కారాజవంశీకులు ప్రజాధనాన్ని తమ స్వంత ఖర్చులకోసం వినియోగించుకోని త్యాగధనులు . వారి స్వంత డబ్బునే తమ కోసమైనా దేవాలయ ధర్మశాలల నిర్మాణనిర్వహణలకైనా ఖర్చుచేసి నగొప్ప రాజవంశం హోల్కారులది. రాణి అహల్యాబాయికి సంవత్సరానికి ఆ కాలంలోనే పదహారు కోట్ల స్వంత ఆదాయం వచ్చేది. దానినే ఖర్చు చేసేది. ప్రజల డబ్బు ఒక్క రూపాయి కూడా ఖర్చు చేసేది కాదు. 35 ఏళ్ళు రాజ్యపాలన చేసి 1795 ఆగస్ట్ పదమూడున రాణి అహల్యాబాయి స్వర్గాస్తురాలైంది. ఇంతటి మహనీయురాలు తిరుగాడిన నేలపై మేమూ తిరిగామనే గర్వం కలిగింది. రాజదర్బారు రాజమందిరాలు అన్నీ పకడ్బందీగా ఉన్నాయి. ప్రభుత్వం ఉమామహేశ్వరంను జాతీయ స్మారక చిహ్నంగా చేసి సైనిక కాపలా పెట్టి సంరక్షిస్తున్నారు.

మళ్ళీ బయల్దేరాం. మా అమ్మాయి కోట దగ్గర ఒక అమ్మాయి అమ్మిన 'శివలింగం ఆకారం' ఉన్నదీ 'శివపార్వతుల' ఆకారంలో ఉన్నదీ అయిన రెండు రుద్రాక్షలను ఇరవై రూపాయలిచ్చికొన్నది. దారిలో నర్మదానది నుండి ఇండోర్కు నీటి సప్లైని కొండలమీద నుంచి పెద్ద పెద్ద వేడల్పు గొట్టాలతో సరఫరా చేసే వాటర్స్కీం కనిపించింది. ఇండోర్మీదుగా ఉజ్జైన్కు రాత్రి ఎనిమిదింటికి చేరాం. మళ్ళీ మూడోసారి శ్రీమహాకాలేశ్వర దర్శనం చేద్దామంటే మా వాళ్ళు "రాలేముబాబోయ్" అన్నారు. నేను మాత్రం వెంటనే స్నానం చేసి బయటికొచ్చి ఆటోలో రాత్రి తొమ్మిదింటికి బయల్దేరి శ్రీకాలేశ్వర జ్యోతిర్లిగ్గాన్ని మూడవసారి మహా ఆనందంగా స్పర్శించి దర్శించి తరించాను. ఈ జన్మకు ఈ అనుభవం చాలు అనిపించింది. జనం పెద్దగా లేరు. హాయిగా దర్శనం అయింది. కాళికా ఆలయం చూడాలంటే ఆటోలో వెళ్లాలని చెప్పారు. తిరిగి రూమ్కు చేరి మజ్జిగ తాగి బిస్కెట్లు తిని హాయిగా పడుకొన్నాం. తెల్లవారుజామున మూడున్నరకు కోయంబత్తూర్ ఎక్స్ప్రెస్ ఎక్కి విజయవాడకు బయల్దేరి వెళ్ళాలి.

## మా నవరాత్రి యాత్ర-18 (చివరి భాగం)

### తిరుగు ప్రయాణం

16 ఏప్రిల్ బుధవారం తెల్లావారు జామున మేము ఉంటున్న రైల్వే రిటైరీ రూములకు ఆనుకొనే ఉన్న ఒకటవ నంబర్ ప్లాట్ఫాం మీదకు సామాను చేర్చాము. జైపూర్-కోయంబత్తూర్ సూపెర్ ఎక్స్ప్రెస్ సరిగ్గా నాలుగు పదికి స్టేషన్ చేరింది. మా ఎసి కంపార్ట్మెంట్లోకి చేరాం. మాకు ఈ బోగీలో రిజర్వేస్సన్ భోపాల్ నుంచే దొరికింది. ఉజ్జైన్ నుంచి ఎస్ 5లో భోపాల్ వరకు శర్మ ముందే రిజర్వ్ చేశాడు. సామాన్లతో మళ్ళీ మళ్ళీ మారలేమని ఎసి కంపార్ట్మెంట్లోనే చేరిపోయాం. నిజానికి మా బెర్త్లు ఖాళీగానే ఉన్నాయి. కండక్టర్ను మేనేజ్ చేసి ఎవరో ఆక్యుపై చేశారు. మా సీట్లకేమీ ఇబ్బంది లేదు కూర్చున్నాం.

### భోపాల్-ప్రీతి

ఉజ్జైన్ నుంచే భోపాల్లో ఉన్న విజ్జి స్నేహితురాలు ప్రీతికి ఫోన్ చేసి ఈ ట్రెయిన్లో వస్తున్నామని, అవకాశం ఉంటే స్టేషన్లో కలవమని మా అమ్మాయి ఫోన్ చేసి చెప్పింది. ఉదయం ఏడు గంటలకు భోపాల్ చేరాం. ప్రీతి భర్త శాస్త్రిగారు వాళ్ళమ్మాయి మా బోగీలోకి వచ్చి పలకరించారు. మేము వాళ్లకు ప్రసాదం దేవుడి ఫోటో ఒక బాగ్లో ఉంచి అందజేశాం. పది నిమిషాలే భోపాల్లో ట్రెయిన్ ఆగింది. మాకు కేటాయించిన బెర్త ప్రీతికరమైన ప్రీతి ఇడ్లీలు, పెరుగన్నం. ప్రీతీ ఫామిలి మమ్మల్ని చూసి ఏంతో సంతోషించారు. ప్రీతీ కుటుంబం చేత అమెరికాలో డెట్రాయిట్ దగ్గర

ట్రాయ్‌లో శ్రీ సత్యనారాయణస్వామి వ్రతం పూజ చేయించిన సంగతి గుర్తుకొచ్చింది. వాళ్ళు వీడ్కోలు చెప్పి దిగి వెళ్లిపోయారు. ఒక తెలుగాయన భోపాల్‌లో ఎక్కారు. నా వయస్సువారే. భమిడిపాటి సుబ్రహ్మణ్యంగారు కృష్ణాజిల్లా కౌతవరంలో జన్మించారట. అక్కడే విద్యాభ్యాసం. తండ్రి భమిడిపాటి మృత్యుంజయుడుగారు జిల్లా పరిషత్ హైస్కూల్‌లో హెడ్ మాస్టారుగా చేశారట. భోపాల్‌లో బి హెచ్ ఇ లోలో ఉద్యోగం చేస్తూ నలభై ఏళ్ళుగా ఇక్కడే ఉంటున్నారట. అక్కడ ఆ సంస్థ కట్టించిన బాలాజీ దేవాలయ నిర్మాణ సంఘంలో అధ్యక్షులుగా ఇప్పటికీ సేవ చేస్తున్నారు. సరదాగా గడిచిపోయింది ఆయనతో సంభాషణం. ఆయన తిరుపతి వెళ్తున్నారు.

ప్రీతీ కారీ బాగ్‌లో ఏమిచ్చిందో చూశారు మావాళ్ళు. ఫ్లాస్క్ నిండా కాఫీ పోసిచ్చింది ప్రీతీ. తలో అరా ముందు తాగేశాం. తరువాత ఇడ్లీలపై పడ్డాం. మనిషికి నాలుగు ఇడ్లీలు వంతున పాక్ చేసి మహా రుచికరమైన చట్నీ పెట్టింది. ఇడ్లీలు పచ్చడీ అదరహో అనిపించాయి. గుటకలేస్తూ హాయిగా తిన్నాం. ఎన్ని రోజులయిందో కడుపులో తృప్తిగా ఏదైనా పడి. తృప్తిగా తినేశాం. మళ్ళీ కాఫీ తాగాం. మందులేసుకొన్నాం. బెర్తుల మీదకు చేరాం. కాసేపు నిద్రపోయామేమో. కింద భమిడిపాటివారు మా అమ్మాయితో పిచ్చాపాటీ మాట్లాడుతున్నారు. మా ఎదురు కింది బెర్త్ మీద ఇద్దరు గున్నయేనుగుల్లాంటి అమ్మాయి అబ్బాయి ఎక్కిన దగ్గర్నుంచి నాన్‌స్టాప్ కబుర్లే కబుర్లు. మొగుడూ పెళ్ళాలు అనిపించలేదు. సహ ఉద్యోగులేమో? గలల్లా ప్రయాణం.

నాగపూర్ వచ్చేసరికి హైదరాబాద్ రేడియో స్టేషన్ డైరెక్టర్ శ్రీ మంగళగిరి ఆదిత్య ప్రసాద్‌గారు ఫోన్ చేశారు. “మాస్టారూ! మహిళా మాణిక్యాలు పుస్తకం అందింది. మహా గొప్పగా ఉంది. ఇంత ఇన్ఫర్మేషన్ ఎక్కడి నుంచి సంపాదించారో ఆశ్చర్యంగా ఉంది. చాలా గొప్ప ప్రయత్నం. వైవిధ్యం అద్భుతం” అని మెచ్చుకొన్నారు. నేను నాగ్‌పూర్‌లో ఉన్నానని ఇంటికి వచ్చి మళ్ళీ మాట్లాడతానని చెప్పి, కృతజ్ఞతలు తెలియజేశాను. ప్రసాద్ గారెప్పుడూ నన్ను ‘మాస్టారూ’ అని సంబోధిస్తారు .అదీ ఆయన సంస్కారం.

పదహారవ తేదీ రాత్రి రెండు గంటలకు మా రైలు విజయవాడ స్టేషన్ చేరింది. ముందే మా ఆస్థాన డ్రైవర్ రాముకు ఫోన్ చేయటం వలన కారు తెచ్చి రెడీగా ఉంచాడు. సామాను మేమే తీసుకొని స్టేషన్ బయటికి తెచ్చాం. కారులో సామాను ఎక్కించి బయల్దేరాం. పదిహేడు గురువారం ఉదయం మూడుమ్పావుకే ఉయ్యూరులో మా ఇంటికి చేరుకొన్నాం.

ఉదయం శ్రీమతి పుట్టపర్తి నాగపద్మిని గారికి నేను కాశీలో ఇచ్చిన మాట ప్రకారం ఫోన్ చేసి మాట్లాడాను. 2012 జనవరిలో బెజవాడ పుస్తక మహోత్సవంలో శ్రీ తిరుమల రామచంద్ర, శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యు వారి శతజయంతి వేడుకలలో

పద్మినిగారు మాట్లాడిన విశేషాలు ఆ సభావిశేషాలు నేను మర్నాడే సరసభారతిలో వ్యాసంగా రాశాను. ఆ విషయం ఆమె సోదరి చూశారట. ఆ విషయం తనతో చెప్పారట. బెజవాడ పుస్తక మహోత్సవంవారు ఫోటోలు ఆ వివరాలు పంపిస్తామని చెప్పి ఇంతవరకూ పంపలేదని నా దగ్గర ఆ వ్యాసం ఉంటే పంపమని కోరారు. మెయిల్ అడ్రస్ తీసుకొని పంపించాను. ఆమెను సాహితీ బందులో చేర్చాము. అప్పటి నుండి రెగ్యులర్‌గా సరసభారతి ఆర్టికల్స్ పంపుతూనే ఉన్నాం. సరసభారతి ప్రచురించిన పుస్తకాలు ఆ రోజే ఆవిడకు కొరియర్‌లో పంపాను. మర్నాడే ఆమెకు అందగా ఫోన్ చేసి కృతజ్ఞతలు చెప్పి నా కృషికి ఎంతగానో మెచ్చుకొని నన్ను మరో 'జానుమద్ది హనుమచ్చాస్త్రి' అని మెచ్చారు. "అంత సీను నా దగ్గర లేదని" చెప్పానామెకు వినమ్రంగా.. ఆమెతో మాట్లాడటం నాకూ ఆనందం కలిగింది. మన సరసభారతి బ్లాగ్‌కు ఆమె వీర అభిమాని.

## సోమనాథ్ నుంచి కాశీ విశ్వనాథ్ దాకా

## 8) మూడు రోజుల మా ఒంటిమిట్ట క్షేత్ర సందర్శనం

### నేపథ్యం

ఈ దసరాలలలో ఒంటి మిట్టనుండి డా.జి.శివకుమార్, ఆయన మిత్రులైన ఆర్.ఎం.పి.డాక్టర్ల బృందం మా మూడవ అబ్బాయి డా.నాగ గోపాలకృష్ణమూర్తి ఆహ్వానంపై ఉయ్యూరులో ఏర్పాటు చేయబడిన రెండు రోజుల సదస్సుకు వచ్చి మా ఇంటిలో, మా దంపతులకు తిరుమల నుంచి తెప్పిచ్చిన శాలువా లడ్డు ప్రసాదం, శ్రీ ఒంటిమిట్ట శ్రీ కోదండ రామస్వామి వారి ఫోటో అందజేసి మమ్మల్ని అక్కడికి రమ్మని కోరారు. సరే అని సరసభారతి 14 ప్రచురణలు మొత్తం సుమారు 350 పుస్తకాలు ఇచ్చి ఆ ప్రాంతంలో సాహిత్య సాంస్కృతికాభిమానులకు అందజేయమని కోరాను. మహా ప్రసాదంగా తీసుకువెళ్ళారు. అన్నీ సద్వినియోగం చేశారనే భావించాను. అప్పటినుంచి ఒంటిమిట్ట ప్రయాణం ఆలోచన తీవ్రమైనది. పిల్లలకు సెలవులు కలిసొస్తాయని ఈ నెల 13 శుక్రవారం బయల్దేరి, 14,15 తేదీలలో అక్కడ చూడాల్సినవి చూసి 15 మధ్యాహ్నం తిరుగు ప్రయాణం చేయాలని భావించాం. శివ దంపతుల ఇంట్లోనే బస భోజనాదులు అని మా మూర్తి చెప్పాడు. మనవరాలు రమ్యకు అనుకోకుండా 'పారాయణ' వారు పరీక్ష పెట్టటంతో, మా అన్నయ్యగారి అబ్బాయి రామనాథబాబు వస్తానంటే సరే అని 'సెవెన్ సీటర్'గా నేనూ మా శ్రీమతి ప్రభావతి, మా మూడవ కోడలు శ్రీమతి రాణి, వాళ్ళ అమ్మగారు, మా వియ్యపురాలు శ్రీమతి దేవిగారు, మనవడు చరణ్, అన్నగారబ్బాయి రామనాథబాబు, డ్రైవర్ ఈసాతో ఇన్నోవాలో వెళ్లాలని తయారయ్యాం.

## ప్రయాణం

13వ తేదీ శుక్రవారం ఉదయం 4కే లేచి, స్నాన సంధ్యావందన పూజాదికాలు పూర్తి చేసి, టిఫిన్ కాఫీలు లాగించి మేమిద్దరం 8కి సిద్ధమయ్యాము. మిగతావాళ్ళు అందరూ రెడీ అయ్యేసరికి 8-30 దాటింది. దారిలో భోజనానికి ఇంట్లోనే అన్నం, కూర కొబ్బరిచట్నీ, పులిహోరా, మెంతిమజ్జిగ తయారు చేశారు అత్తాకోడళ్ళు. అన్నీ సర్దుకొన్నాం. అక్కడి శ్రీరామ, సీతాలక్ష్మణులకు, సంజీవరాయ హనుకు నూతన వస్త్రాలు కొన్నాము. కిలోన్నర చేమంతి పూలతో దండలు కట్టింది మా శ్రీమతి. దొడ్లోని కనకాంబరాలు డిసెంబర్ పూలు కోసి పూజకు తీసుకువెళ్లాం. మా వాటర్ ప్లాంట్ వాటర్ రెండు పెద్దకాన్‌లలో పెట్టుకొని ప్లేట్లు గ్లాసులు, పెరుగు కమలాపండ్లు చక్రకేళిలతో బిస్కెట్ పాకెట్‌లతో 9 గంటలకు బయల్దేరాం. గుంటూరు హైవే మీదుగా చిలకలూరిపేట, అద్దంకి, దరిశి, పొదిలి మీదుగా కనిగిరి దగ్గరలో అక్కడి గిరి సముదాయం, అందమైన ప్రకృతికి 'ఫిదా' అయి, కొండపై ఉన్న శ్రీ బాలార్క విశ్వేశ్వర స్వామి కోవెల ఉందని తెలిసి క్రిందనే అరుగులు ఉంటే భోజనానికి అనువుగా ఉంటుందని అక్కడ చేరి తెచ్చుకొన్నవి కడుపారగా ఆరగించాం డ్రైవర్తో సహా. చక్రకేళీలు తిన్నాం. కొండపైకి వెళ్లి అక్కడ జరుగుతున్న చండీయాగం చూశాం. మమ్మల్ని భోజనానికి ఉండమని చేసేవారు చేయించేవారు కోరినా కుదరదని వినయంగా చెప్పి, కిందకు దిగి బయల్దేరి, కనిగిరి మీదుగా బద్వేల్ చేరి, అక్కడి నుంచి సిద్ధవటం, మాధవవరం మీదుగా ఒంటిమిట్ట డా.శివ గారింటికి సాయంత్రం 4కు చేరాం. ఆయన, అర్ధాంగి శ్రీమతి పద్మ(జ) దంపతులు మాకోసం ఎదురు చూసి ఆహ్వానించారు. కమ్మని కాఫీ ఇస్తే తాగాం. మగవాళ్ళంపై అంతస్తులో ఉన్న గదిలో 'గాస్ సిలిండర్ ద్వారా గీజర్ ఏర్పాటు ఉన్న వేడి నీటి స్నానాలు చేసి కాసేపు విశ్రాంతి తీసుకొని, కిందికి దిగి ఈలోపు పద్మ సిద్ధం చేసిన కమ్మటి బజ్జీలు తిని రెడీ అయ్యాం .

సాయంత్రం 5-30కు శివ మమ్మల్ని అందర్నీ తాళ్ళపాక తీసుకు వెళ్ళారు. దారిలో చేయ్యేరు ప్రాజెక్ట్ దానికి చేరువలో ఒక శివాలయం ఉందని ఆ శివాలయంలో ప్రతి కార్తీక మాస మూడవ సోమవారంనాడు శివలింగంలోకి నీరు వస్తుందని ఈ మిస్టరి ఎవరూ ఇంతవరకు చేధించలేదని చెప్పారు. తాళ్ళపాకలో అన్నమాచార్య జన్మించారు. ఊరి బయట 108 అడుగులున్న అన్నమయ్య భారీ విగ్రహం ఉంది. అన్నమాచార్య విద్యాకేంద్రం ఉన్నది. అన్నమయ్య తండ్రి ఇక్కడి సిద్దేశ్వరస్వామి దేవాలయంలో పూజారి శైవులు. అన్నమయ్య తిరుమల వెళ్లి అక్కడ వైష్ణవం స్వీకరించి అడ్డబొట్టును నిలువుబొట్టుగా మార్చుకొన్నాడట. ఆయన జన్మించిన ఇల్లు, కూర్చుని రాసుకొన్న చోటు, ద్యానమందిరం చూశాం. ప్రక్కనే శ్రీ లక్ష్మీ చెన్నకేశవ స్వామి దేవాలయం చూశాం. ఈ ఆలయంలో శ్రీ ఏకా తాతయ్య అనే మహాభక్తుడు నిరంతరం తలకాయ



నొప్పితో బాధపడుతూ ఇక్కడి ఈ స్వామిని దర్శించి నొప్పి మాయమవగా, దేవుని ఎదురుగా స్వయంగా శిలారూపం పొంది, తనలాగే ఎవరైనా శరీర బాధలు పడేవారు తమ శిరసును తన శిరసుపై మూడుసార్లు ఉంచితే నివారణ ఆయే వరం పొందాడు. అందుకని భక్తులు మూడుసార్లు ఆయన శిరసుకు తమ శిరసు ఆనించి మొక్కు కొంటారు అని శివ చెప్పారు.

తిరిగి వెడుతూ దాములూరు గ్రామంలో శ్రీ సౌమ్యనాథస్వామి ఆలయం చూశాం. ఉగ్ర నారసింహుడు తన ఉగ్రాన్ని తగ్గించుకొని శాంతమూర్తిగా ఇక్కడ అవతరించి సౌమ్యనాథస్వామిగా మారాడు. భారీ విగ్రహం. స్వామి వెనుక అంతే ఎత్తులో శ్రీ ఆంజనేయస్వామి ఉండటం మరో విశేషం. స్వామి తోక కూడా బాగా కనిపిస్తుంది. రెండు విగ్రహాలు కలిసిపోయినట్లే ఉండటం మరో వింత. వివాహాలు కానివారు, సంతానం లేనివారు, మరేదైనా కోరిక ఉన్నవారు ఆలయం చుట్టూ 8 ప్రదక్షిణాలు చేసి కోరిక తెలియబరచాలి. కోరిక తప్పక తీరుతుంది. తీరిన తర్వాత 108 ప్రదక్షిణాలు చేయాలి. చాలా మహిమ గలస్వామి అని శివ చెప్పారు. ఇక్కడి మూడు దేవాలయాలలో అర్చకస్వాములంతా శివగారికి బాగా పరిచయస్తులు. ఈ మూడు గుడులలో పూజారి గార్లచేత నాకు స్వామి పుష్పమాలలను తీసి నా మెడలో వేయించారు. అంతటి పలుకుబడి డా.శివగారిది. ఇవన్నీ చూసుకొని మళ్ళీ ఒంటిమిట్ట శివగారింటికి చేరేసరికి రాత్రి 8.అయింది. అప్పటికే పద్మగారు వంట చేసి సిద్ధంగా ఉంచి మాకు వడ్డించారు. పప్పు, కాబేజికూర, చట్నీ, సాంబారు, పెరుగు, అప్పడంలతో కమకమ్మని వేడి వేడి భోజనం మా 'సెవెన్ సీటర్స్' వడ్డించి కొసరి కొసరి తినిపించారు. అన్నీ మహా రుచికరంగా ఉన్నాయి. ఈ దంపతుల ఆత్మీయత, ఆదరణ, అతిధి సేవ అమోఘం అద్భుతం.

రాత్రి 8-30కు శ్రీ కోదండరామ స్వాములకు ఏకాంత సేవ. అంటే పవళింపు సేవ. దానికోసం మాకు ఏర్పాట్లు చేసి మమ్మల్ని తీసుకువెళ్ళారు శివ. ఒక అరగంట సేపు జరిగింది. చాలా దగ్గరగా చూడగలిగాం శివగారి వలన. ఇక్కడ ఒకే రాతిపై శ్రీరామ, సీతా లక్ష్మణ స్వాముల విగ్రహాలు కొలువై ఉండటం అరుదైన. ప్రపంచంలో ఎక్కడా లేని విశేషం. నేను కృష్ణాజిల్లా పెనుగంచిప్రోలులో సైన్సుమాస్టర్‌గా పని చేసినప్పుడు



అక్కడి పురాతన శ్రీ యోగానంద లక్ష్మీ నరసింహస్వామి కోవెలలో ప్రతి శుక్రవారం రాత్రి సుమారు రెండు గంటలు పవళింపు సేవ వృద్ధ పూజారిగారు భార్య భక్తులు అతి శ్రద్ధగా చేయటం పాటలు పడటం భజనలు చేయటం చూశాను. మళ్ళీ ఇన్నేళ్ళకు ఇక్కడ చూశా. మా ఉయ్యూరు శ్రీ సువర్చలాంజనేయ స్వామి ఆలయంలో ఒకసారి అర్చకస్వామి శ్రీవేదాంతం దీక్షితులు ఇలా ఏకాంత సేవ చేయించి పాటలు పాడించి గొప్ప వైభవం కలిగించాడు. కాని ఇక్కడ అంత గొప్పగా జరిగినట్లు నాకు అనిపించలేదు. తంత్రం ఎక్కువ మంత్రం తక్కువ అన్నట్లు జరిగింది.

ప్రతి శనివారం ఒంటిమిట్ట శ్రీ కోదండ రామస్వామి దేవాలయంలో ఉదయం 6 గంటలకు స్వామివారలకు అభిషేకం నిర్వహిస్తారు. దీనికి టికెట్ 150 రూపాయలు. ఇద్దర్ని అనుమతిస్తారు. మూడు టికెట్లు కొనిపించి ఉదయానికి రిజర్వ్ చేయించారు శివ. ఇక్కడి పూజార్లు ఆయన అంటే మహా గౌరవం. అందరినీ చనువుగా "మామా మామా" అని ఆప్యాయంగా పిలుస్తారు శివ. ఆయనకు ఇక్కడ అడ్డు ఏమీ ఉండదు. డైరెక్ట్ ఎంట్రన్సే. నవ్యాంధ్రప్రదేశ్ ఏర్పడ్డాక ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ఇక్కడ ఆలయంపై ప్రత్యేక దృష్టి పెట్టి సౌకర్యాలు కలిగించి తిరుమల తిరుపతి దేవస్థానానికి దీని నిర్వహణ బాధ్యత అప్పగించారు. అప్పటి నుంచే ఇక్కడ ఉత్సవాలు బాగా జరుగుతున్నాయి. సౌకర్యాలు సేవలూ పెరిగాయి. కళ్యాణమండప నిర్మాణానికి 100 కోట్లు శాంక్షన్ చేశాడు బాబు. ప్రభుత్వం మారటంతో పనులు మందంగా జరుగు తున్నాయి. మా రెండవ రోజు యాత్ర విశేషాలు రేపు తెలియజేస్తాను.

## మా ఒంటిమిట్ట క్షేత్ర సందర్శనం-2

డా.శివగారింట్లో మేడపై గదిలో మగాళ్ళం డ్రైవర్‌తో సహా పడుకొన్నాం. నేను మంచంపైనా చరణ్, రాంబాబు కింద పరుపులపైనా, డ్రైవర్ వసారాలో మంచం మీదా పడుకున్నాం. శివగారిల్లు నిత్య కల్యాణం పచ్చతోరణంలా ఎప్పుడూ బంధువులు స్నేహితులతో రద్దీగానే ఉంటుంది. కనుక పది మంది వచ్చినా హాయిగా పడుకొనే ఏర్పాట్లున్నాయి. ఆడవాళ్ళను ముగ్గుర్ని కింద మంచాలపై పడుకోబెట్టి, శివ దంపతులు

నేలమీద పడుకొన్నారు. నాకు, మా ఆవిడకు గురువారం రాత్రి అంతా పెద్దగా నిద్రలేదు. ఆవిడ వంట హడావిడి, నాకు ఏ హడావిడి లేకున్నా నిద్రలేదు. శుక్రవారం రాత్రి ఒంటి గంటకే మెలకువ రాగా మూడున్నర దాకా అటూ ఇటూ దొర్లి, లేచి పండ్లు తోమి కాలకృత్యాలు కానిచ్చి, రాంబాబుతో గీజర్ ఆన్ చేయించి, హాయిగా వేడి నీటితో స్నానం చేశాను. సంధ్యావందనం, పూజ పుస్తక పఠనంతో పూర్తి చేశా. అప్పటికే పద్మగారు కాఫీ కలిపి గ్లాస్ నాకు పైకి పంపిస్తే త్రాగాను. మిగిలినవారూ సిద్దమయ్యారు. అందరం 14వ తేదీ శనివారం ఉదయం 5కు సిద్ధమై, గుడి ఇంటికి దగ్గరే అయినా కారులో శివగారితో సహా బయల్దేరి 5-30కి చేరి మెట్లు ఎక్కి ఆలయ ప్రవేశం చేశాం. 5-45కు అంతరాలయంలో మా అభిషేకం టికెట్లు వెరిఫై చేసి, మమ్మల్ని స్వామికి అతి సమీపంలో కూర్చోబెట్టారు. అందరి గోత్రనామాలు చదివి పూలున్న పళ్ళెం మాతో తాకించి, మేమంతా అభిషేకంలో పాల్గొనే అర్హత కలిగించారు. ఆ రోజు 30 మంది అభిషేకం టికెట్లు కొన్నారు. సరిగ్గా ఉదయం 6 గంటలకు ఆలయం ఆఫీసర్‌కు సంప్రదాయ తలపాగా చుట్టి చేతుల్లో పూలు, పండ్లు మేమిచ్చిన నూతన వస్త్రాలతో పూలదండలతో పండ్లతో స్వాములపాదలవద్ద ఉంచమని ఇచ్చిన దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు రెండుభాగాలు సహా నూతన వస్త్రాలున్న పళ్ళెం ఇచ్చి తెల్ల గొడుగు పట్టించి, అర్చకస్వాములు మాతో సహా అందర్నీ ఆలయ ప్రదక్షిణ మూడుసార్లు మంత్ర పూతంగా మంగళవాద్యాలు మ్రోగుతుండగా చేయించి, మళ్ళీ అంతరాలయంలోకి తీసుకు వెళ్ళారు.

## అభిషేకం

అప్పటికే శ్రీరామ, లక్ష్మణ, సీతామాతలతో ఉన్న కోదండరామస్వామికి అభిషేక వస్త్రాలు, పూలమాలలు ధరింపజేసి మంత్రాలతో అభిషేకం మొదలు పెట్టారు. తర్వాత హారతి ఇచ్చి, రెండోసారి పసుపు, ఆవుపాలు, పంచామృతాలతో అభిషేకం చేసి శిరసులపై రంధ్రాల పళ్ళెంతో జల్లు స్నానంలాగా చేసి మళ్ళీ హారతిచ్చారు. మూడవసారి పవిత్ర జలాలతో జల్లుస్నానంతో అభిషేకం పూర్తిచేసి హారతిచ్చారు. ఇదంతా అయ్యేసరికి ఉదయం 7-30 అయింది. నాకేమనిపించింది అంటే మంత్రాలకన్నా తంత్రాలే ఎక్కువయ్యాయని.. అందరం జంపఖానాలపై కూర్చున్నాం. మా శ్రీమతికి, వియ్యపురాలికి అంతరాలయం వెలుపల శివగారు కుర్చీలు వేయించి స్పష్టంగా కనబడేట్లు కూర్చో పెట్టించారు. అందర్నీ బయటకు పంపించి స్వామివారికి నూతన వస్త్ర ధారణా అలంకరణ, నిత్యపూజా చేసేసరికి 8-45 అయింది. నేను అభిషేకమవగానే బయట మెట్లపై కూర్చుని తెచ్చుకొన్న శ్రీరామ అష్టోత్తర, సహస్రనామాలు, సీతా అస్టోత్తర సహస్రనామాలు చదువుతూ కాలాన్ని సద్వినియోగం చేసి, మళ్ళీ అందరం అంతరాలయంలోకి వెళ్లాం. శ్రీ కోదండ రాములకు హారతిచ్చి, మాకు అభిషేకజలం



శిరసుపై జల్లి, తీర్థం ఇచ్చారు. మేమిచ్చిన వస్త్రాలు అయ్యవార్లకు అమ్మవారికి అలంకరించి మేమిచ్చిన పూలదండలు స్వామివార్లకు వేసి కనులపండువ చేశారు. మా శ్రీమతి ఆనందం వర్ణనాతీతం. పరవశించింది. నాకు అర్చకస్వామి చేత మెడలో స్వాముల శేషవస్త్రం ఖండువా కప్పించి స్వామికి వేసిన పుష్పమాల వేయించారు శివ. మేమందరం ఈ రెండున్నర గంటలలో దివ్యానుభూతిని పొందాం. దీన్ని ఇలా ఏర్పాటు చేయించిన శివగారిని యెంత మెచ్చుకున్నా చాలదు. అందరం బయటకు వచ్చి, అక్కడ ప్రసాదాలు పెట్టే మందిరం దగ్గరకు వెళ్లి దొప్పలలో అందజేసిన వేడి వేడి పొంగలి, పరవాన్నం తిన్నాం. మహా రుచికరంగా ఉన్నాయి. ఒక్కొక్కరం రెండేసి దొప్పల ప్రసాదం లాగించాం. శుక్రవారం రాత్రి శ్రీ సౌమ్య వేంకటేశ్వరాలయంలో 'మలిహోర' అనే ప్రసాదం పెట్టిన సంగతి ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. మహా రుచిగా ఉంది. అడిగి మళ్ళీ పెట్టించుకొని తిన్నాం.

ఆలయ లోపల, ముఖ మడపంలోనూ, బయటి గోపురం బయటా లోపల శిల్పకళ అత్యద్భుతంగా ఉన్నది. వాటిని మాకు దగ్గరుండి చూపిస్తూ వివరించారు డా.శివ. ఒక శిల్పంలో గుర్రం ఏనుగు తలలు కలసి ఉండటం ఆశ్చర్యం. బయటి మెట్లకు కుడిప్రక్కన ఆవరణలో కడప నవాబు ప్రతినిధి 'ఇమాం బేగ్' త్రవ్వించిన బావి ఉన్నది. దీని జలమేస్వాములకు అభిషేకజలంగా వాడుతారు. ఇలా శ్రీ ఒంటిమిట్ట కోదండరామ స్వాముల దర్శనం, అభిషేకం కనులపండువుగా చూడగలిగిన అదృష్ట వంతులమయ్యాం. ఆలయంలో ఒక ప్రక్క చిన్న మందిరంలో చిన్న శ్రీ ఆంజనేయస్వామి విగ్రహం ఉంది. బయట చిన్నగూడులో శ్రీ ఆంజనేయస్వామి విగ్రహం ఉంది. జాంబవంతుడిలాగా అనిపిస్తాడు. జాంబవంతుడే విగ్రహ ప్రతిష్ట చేశాడని అతిహ్యం. కనుక జాంబవంత క్షేత్రంగా భావిస్తారు. బయట చిన్నగూడులో పోతనామాత్యుల విగ్రహం, దానికింద పద్యం ఉన్నాయి. పోతనగారి జన్మస్థలం ఒంటిమిట్ట అనే ఏకశిలా నగరం. ఇక్కడ ఆయన జయంతి ప్రతి ఏడాది ఘనంగా నిర్వహిస్తారు. పోతన మడి (పొలం), శ్రీనాధుడు గాలిలో పల్లకీ నిలిపిన చోటు ఇక్కడే ఉన్నాయి. పోతన తెలంగాణాలో పుట్టినట్లు అక్కడివారు భావిస్తారు. మార్కండేయుని తండ్రి మృకండ మహర్షి ఈ క్షేత్రంలో తపస్సు చేశాడనీ కనుక మృకండ క్షేత్రం అనే పేరు కూడా ఉందని అంటారు. ఈ వివరాలు ఆలయ చరిత్రలో తర్వాత రాస్తాను.

## శ్రీ సంజీవ రాయ హనుమ

శుక్రవారం రాత్రే కోదండరామ దర్శనానికి ముందు సంజీవరాయ దర్శనం చేశాం. కోదండ రామునికి ఎదురుగా ఆలయం మెట్లకు ఎదురుగా ఈ స్వామి ఆలయం ఉంది. సుమారు 5 అడుగుల భారీవిగ్రహం. మహా వర్చస్వంతంగా దర్శనమిస్తాడు. హనుమ ఈ క్షేత్రపాలకుడు సంజీవరాయహనుమ. మేము ఉయ్యూరు నుంచి తెచ్చిన, మా దొడ్లోని తమలపాకులు కట్టి తెచ్చిన చేమంతిపూల దండ నూతన వస్త్రాలు, దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు రెండుభాగాలు, కొబ్బరికాయ వగైరా పళ్ళెంలో పెట్టి అర్చక స్వామికి అందజేశాం. ఆయన మా అందరి గోత్రనామాలు అడిగి చెప్పి అష్టోత్తర పూజ చేస్తుండగా నేను అష్టోత్తర సహస్ర నామాలు తృప్తిగా చదివి స్వామికి వినిపించా. దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు రెండు భాగాల పుస్తకాలు స్వామి చరణాల వద్ద అర్చక స్వామితో పెట్టించాను. మేమిచ్చిన వస్త్రాలు స్వామిపై వేసి ఆనందం కలిగించారు. నైవేద్యం హారతి ఇచ్చారు. నాకు అర్చకస్వామితో ప్రసాదం ఇప్పించి స్వామి శేషవస్త్రం కప్పించి పుష్పహారం వేయించారు శివ. శనివారంనాడు మా ఇలవేల్పు హనుమ సంజీవరాయ రూపంతో దివ్యదర్శనం చేశాం. మధురానుభూతి పొందాం అందరం.

శివగారితో ముందే చెప్పి ప్రతి శనివారం ఇక్కడ అమ్మే తిరుమలస్వామి లడ్డూలు 10 కొన్నాం. ఒక్కోటి 50 రూపాయలు. ప్రసాదం తిని, కారులో శివగారింటికి 9-30కు చేరాం. అందరికి వేడి వేడి మినపట్లు తిన్నవారికి తిన్నంతగా రెండుచట్నీలతో చేసి పెట్టారు శ్రీమతి పద్మ. మహా రుచికరంగా ఉన్నాయి. ఆమెకు ధన్యవాదాలు చెప్పాం. ఆమె సన్నగా పీలగా ఉన్నా మహా చలాకీ మనిషి. నిమిషాలలో అన్నీ సిద్ధం చేస్తారు. మనిషికాదు మానవత్వం, ఆపేక్ష, ఆత్మీయత రంగరించిన యత్రం అనిపిస్తుంది ఆమె స్పీడ్ చూస్తే.

### పుష్పగిరి సందర్శనం

శనివారం ఉదయం 10-30కి శివగారింటి నుంచి అందరం కారులో బయల్దేరి, దారిలో సీతాదేవికి దప్పిక అయితే శ్రీరాముడు వేసిన బాణంతో భూగర్భాగంగ ఉబికి పైకి వచ్చిన రామతీర్థం, లక్ష్మణుడు వేసిన బాణంతో భూగర్భ జలంగా వచ్చిన లక్ష్మణ తీర్థం చూశాం. ఈ రెండు నీళ్ళ రుచి భిన్నంగా ఉంటాయట. రామతీర్థం కొబ్బరినీళ్ళు లాగా, లక్ష్మణతీర్థజలం, కొంచెం తక్కువ





తీయంగా ఉంటాయంట. ఒకదానికొకటి 10 అడుగుల దూరంలో ఉన్నప్పటికీ. సరాసరి పుష్పగిరి చేరాం 11 గంటలకు. ఆ వూళ్ళో ఎవరో చనిపోతే ఆలయం మూసి పూజారి వెళ్ళాడట. ఊళ్ళో శవం ఉండగా ఇక్కడ ఆలయాలు తీయరట. ఒకమ్మాయి తాను చెప్పి పిలుచుకోస్తానని చెప్పి వెళ్లి వెంట ఉండి తీసుకొచ్చింది అర్చకుడు యువకుడే. ఒక్కో ఆలయం తలుపు తీసి దీపం వెలిగించి దర్శనం చేయించాడు. ఇక్కడ శివుడు 'వైద్యనాథేశ్వరుడు'. అమ్మవారు కామాక్షిదేవి విడిగా చిన్న గుడిలో ఉంటుంది. అమ్మవారి ఎదురుగా శ్రీ చక్రం ఉంది. ఈ ఆలయం శక్తి పీఠం. అష్ట మాతృకల విగ్రహా లున్నాయి. సిద్దేశ్వ రాలయమూ, శ్రీ లక్ష్మీ చేన్నకేశవాలయమూ ఉంది. అన్నీ చక్కగా చూసి ఇక్కడి పుష్పగిరి పీఠం చూద్దామని ఆశపడితే, పీఠాధిపతి ఇక్కడ ఉండటం లేదని చెప్పాడు పూజారి. కాని గో సంరక్షణ ఉన్నది. సరే, అని అది ఉన్న చోటు చూసి ఫోటోలు దిగాం. పుష్పగిరి పీఠం ఆంధ్రుల ముఖ్యపీఠం. కంచిది తమిళులది, శృంగేరి కన్నడిగులది. ఒకప్పుడు మహా వైభవంగా ఉండేది. పుష్పగిరి పీఠాధిపతి మందీ మార్బలంతో దేశమంతా పాదయాత్ర చేసి శ్రీచాక్రార్చన చేసేవారు. ఇప్పుడు అంతా వెల వెల బోతోంది ఇక్కడి వాతావరణం. పూలతో శోభిల్లే గిరి పుష్పగిరి. ఇప్పుడా శోభ లేకపోయే సరికి ఉసూరు మనిపించింది. పీఠ విశేషాలు తర్వాత రాస్తాను. పుష్పగిరిలో పెన్నానదికి అవతల ఎత్తైన కొండపై శ్రీ చెన్నకేశవ ఆలయం దూరానికే ముచ్చటగా అనిపిస్తుంది. వెళ్లి చూసే టైం లేక వెళ్ళలేదు. కానీ చూడాల్సిన దేవాలయం.

కడప ప్రాంతం అంటే బాంబులతో దద్దరిల్లు తుందనే భయం ఉండేది. 15 ఏళ్ళ నుంచి ఫాక్షనిజం లేదని శివ చెప్పారు. రోడ్డుకు ఇరువైపులా వరి చేలు కంటికింపుగా ఎక్కడ చూసినా కనిపించటం మరో విశేషం. పొట్టి వంగడం 'జిలకర మసోరి' ఈ ప్రాంతపు ప్రత్యేక వరిపంట. ఇది ఎక్స్‌పోర్ట్ వెరైటీ. నాణ్యమైన సన్నబియ్యం బియ్యం జిలకర మసూరి.

## దేవుని గడప

పుష్పగిరి నుంచి సరాసరి దేవుని గడపకు వెళ్లాం. ఇది కడపకు బయట 5 కిలో మీటర్లలో ఉంటుంది. పాత కడప అనీ అంటారు. ఇక్కడ శ్రీ లక్ష్మీ వేంకటేశ్వర దేవాలయం సుప్రసిద్ధం. తిరుమల వెళ్ళే యాత్రికులకు ఇది గడప వంటిది. అందుకే



దేవుని గడప అని అంటారు. ఈ స్వామి దర్శనం చేస్తే తిరుమల బాలాజీని దర్శించినట్లే అవ్వాలని ఒక భక్తుని కోరికపై ఇక్కడ స్వామి వెలిశాడని అతిహ్యాం. ఇక్కడ కూడా డా.శివగారు తన బంధువుకు ముందే ఫోన్‌చేసి చెప్పి మాకు శీఘ్రదర్శనం కలిపించి స్వామివారి కైంకర్యం మాకు లభించేట్లు చేశారు. అంతటి నెట్‌వర్క్ శివగారిది.

## కడప బ్రౌన్ మెమోరియల్ లైబ్రరి

దేవుని గడపనుంచి సరాసరి కడప వెళ్లి సి.పి.బ్రౌన్ మెమోరియల్ లైబ్రరీకి వెళ్లాం. అప్పటికే ఒంటిగంట అయింది. మూసేశారు. అక్కడి లేడీ అటెండర్ తలుపులు తీసి మాకు లోపల అంతా చూపించింది. సరసభారతి ప్రచురణలు 14 లైబ్రరీలో లైబ్రేరియన్‌కు ఇవ్వాలని తెచ్చాను. కనుక గీర్వాణం-3, ఆధునిక ప్రపంచ నిర్మాతలు పుస్తకాలు ఆ అటెండర్‌కిచ్చి ఫోటోలు తీసుకొన్నాం. మిగిలిన పుస్తకాలను ప్రస్తుతం తిరుపతిలో ఉన్న లైబ్రరి ట్రస్ట్ సెక్రెటరి శ్రీ తట్టా నరసింహాచారిగారికి ఫోన్ చేసి ఆయన రాగానే తాను అందజేస్తానని శివగారు అంటే వారికి అప్పగించాను. కడప కలెక్టర్‌గా చేసిన బ్రౌన్ ఆంధ్రభాషకు చేసిన సేవ అమూల్యం అనితర సాధ్యం. ఎన్నో అపూర్వ గ్రంథాలు సేకరించి పండితులను తనస్వంత ఖర్చుతో నియమించి పరిష్కరింపజేసి ప్రచురించాడు. తానూ స్వయంగా తెలుగు-ఇంగ్లీష్, ఇంగ్లీష్-తెలుగు




నిఘంటువులు 'బ్రౌణ్యం' కూర్చిన ఆంధ్రులకు ప్రాతస్మరణీయుడు బ్రౌన్. ఇంగ్లాండ్‌లో పుట్టి ఇక్కడికి వచ్చి తెలుగు నేర్చి తెలుగు భాషాభివృద్ధికి యెనలేని సేవ చేశాడు. వేమనగారి శతకపద్యాలు సేకరించి మొదటగా ప్రచురించాడు బ్రౌన్. ఇక్కడ బ్రౌన్ లైబ్రరి,




రిసెర్చ్ కేంద్రం ఏర్పడటానికి ముఖ్యకారకులు మహాపండితులు, విమర్శకులు విశ్లేషకులు స్వర్గీయ శ్రీ జానుమద్ది హనుమచ్ఛాస్త్రిగారు. ఎన్నో ఉపయుక్త గ్రంథ రచన చేశారు. సరసభారతి పుస్తకాలు వారికి పంపిస్తే, చదివి బాగున్నాయని ఫోన్ చేసి, లేక ఉత్తరం రాసి వాటిని బ్రౌన్ లైబ్రరీకి అందజేస్తున్నట్లు తెలిపిన సౌజన్యశీలి శాస్త్రిగారు. ఆయనతో మాట్లాడటం అంటే పుంభావ సరస్వతితో మాట్లాడినట్లు ఉండేది. ఇక్కడి నుంచి బయల్దేరి సరాసరి ఒంటిమిట్ట శివగారి ఇంటికి మధ్యాహ్నం 2-30కు చేరాం. శ్రీమతి పద్మ రెడ్డీ చేసిన భోజనం తిని కాసేపు విశ్రమించాం.

సాయంకాలం 5 గంటలకు డా. శివ దంపతులకు మా దంపతులం మా కోడలు నూతన వస్త్రాలు, పసుపు కుంకుమ, పండ్లు అందజేసి, ఇద్దరికీ చెరొక శాలువా కప్పి సరసభారతి ఆత్మీయ సత్కారం జరిపాం. అందరం కాఫీ త్రాగి సిద్ధవటంకు రెడీ అయ్యాం.



## సిద్ధవట సందర్శనం

శ్రీశైలానికి దక్షిణ ద్వారం సిద్ధవటం. ప్రక్కనే గలగలా పారే పెన్నానది. అందులోకి సోమశిల నుంచి లిఫ్టి ఇరిగేషన్‌తో కలిసే కృష్ణాజలాలు కను విందు చేస్తుంది. సిద్ధవటంలో వటవృక్షం క్రింద పూర్వం సిద్ధులు తపస్సు చేసి సిద్ధి పొందేవారు. అందుకే ఆ పేరు. నది ప్రక్కనే వట వృక్షం ఉన్నది. ప్రశాంత వాతావరణం. సిద్ధవటంలో రాజులకోట ఉంది. దూరం నుంచే చూసి తిరుగు ప్రయాణంలో ఫోటోలు తీసుకొన్నాం.

## జ్యోతి గ్రామ ప్రత్యేకత

సిద్ధవటానికి సుమారు 10 కిలోమీటర్లలో జ్యోతి గ్రామం ఉంది. ఎన్నో వందల ఏళ్ళక్రితం ఇక్కడి సిద్దేశ్వరాలయం, కామాక్షీ ఆలయం గోపురం వగైరా వరదనీటిలో మునిగి ఇసుకలో కూరుకు పోయాయని, 15 ఏళ్ళ క్రితం పురాతత్వ శాఖవారి త్రవ్వకాలలో

ఆలయ గోపుర పైభాగం కనిపిస్తే కిందిదాకా త్రవ్వితే 50 అడుగుల గోపురం దానికెదురుగా శిధిలావస్థలో కొంచెం ఎత్తుమీద ఉన్న శ్రీ సిద్దేశ్వరాలయం, దానికి కుడిప్రక్క శ్రీ కామాక్షీ ఆలయం బయటపడ్డాయని, ఆవరణ చుట్టూ గోడ కూడా ఉండేదని ఒకభాగం గోడ కనిపించిందని, గోడలమధ్య ఎక్కడ చూసినా శివలింగాలే ఉన్నాయని కుమారస్వామి విగ్రహం కూడా బయటే మట్టిలో సగం కూరుకుపోయి ఉందని, ప్రాంగణం సుమారు 5 ఎకరాల విస్తీర్ణంలో ఉందని చెప్పి స్వామి, అమ్మవార్ల దర్శనం, లింగాల దర్శనం చేయిస్తూ వివరించారు శివ.

జ్యోతి గ్రామం నుంచి సిద్ధవటం చేరి అక్కడి గుడిలో ఉన్న శ్రీ సిద్ద వటేశ్వర స్వామిని, కామాక్షి అమ్మవారినీ దర్శించాం. పూజారి ఉన్నాడు. శ్రీశైలం నుంచి నెల కొక పూజారి ఇక్కడికి వచ్చి స్వామివారి నైవేద్యం పూజాదికాలు నిర్వహిస్తారట. ఈ ప్రాంతపు ఆలయాలన్నిటిని శ్రీశైల దేవస్థానం దత్తత తీసుకొని సంరక్షిస్తూ భక్తులకు అందుబాటులో ఉంచటం విశేషం, అభినందనీయం. శివగారింటికి రాత్రి 7-30కు చేరాం. అప్పటికే పద్మగారు మా అందరికి కావలసినన్ని మిరపకాయ బజ్జీలు వేడి వేడిగా తయారుచేసి తినటానికి పెట్టారు హాయిగా తిన్నాం. కాసేపు టివి చూసి ఇక రాత్రి భోజనం అక్కరలేదనిపించి పైకి వెళ్లి పడుకొన్నాను. రాత్రి 9 గంటలకు సేమ్యా ఉప్మా ప్లేట్‌లో పెట్టి, మజ్జిగ గ్లాసుతో చరణ్‌కిచ్చి పంపారు పద్మ. నాకు సేమ్యా పెద్దగా ఇష్టం ఉండదు, కొద్దిగా తిని మజ్జిగతాగి హాయిగా నిద్రపోయా. మాంచి నిద్ర పట్టింది. ఆదివారం ఉదయం 7-30కు తిరుగు ప్రయాణం అనుకొన్నాం. ఆదివారం విశేషాలు రేపు రాస్తాను.

## మా ఒంటిమిట్ట క్షేత్ర సందర్శనం-3 (చివరి భాగం)

15-12-19 ఆదివారం

గత రెండు రోజులుగా రాత్రి నిద్రలేనందున శనివారం రాత్రి మాంచి నిద్రపట్టి ఆదివారం ఉదయం 6-30కు మెలకువ వచ్చి, కార్యక్రమాలు కానిచ్చి, గీజర్ వేడి నీటి స్నానం చేసి సంధ్య, పూజా పుస్తక పఠనంతో పూర్తి చేశాను. ఈలోపే కిందినుంచి శ్రీమతి పద్మ మా మనవడితో కాఫీ పంపిస్తే సేవించి, సామానంతా సర్దేసుకొని బాగ్‌తో 7-15కి కిందకి దిగాను. మావాళ్ళు స్నానానికి ఉపక్రమించారు. ఆడవాళ్ళు ఇంకా బద్ధకంగానే ఉన్నారు. స్నానాలు కాలేదు. అందరి స్నానాలు అయేసరికి పద్మగారు అందరికీ పూరీ కూర సిద్ధం చేయగా, కావలసినన్ని అడిగి అడిగి వేసి తినిపించారు. తృప్తిగా అందరం తిన్నాం. ఇంతమందికి అంటేమా 'సెవెన్ సీటర్స్'కు శివగారికి, తనకూ అనగా 'నవగ్రహాలకు' పూరీ బ్రేక్‌ఫాస్ట్ మహా ఫాస్ట్‌గా చేసి వడ్డించారు. అందరం

ఆమె వర్క్ హాలిక్ తనానికి మెచ్చుకొన్నాం. తనకు ఇలా ఇంటికి బంధువులు స్నేహితులు వస్తే వడ్డించి భోజనం పెట్టటంలో ఎంతో సంతృప్తి ఉందన్నారామె. శనివారం సాయంత్రం శివ దంపతులకు మేము 'చిరు సత్కారం' చేస్తే, పద్మగారు "ఎన్నాళ్ళయిందో మా పుట్టింటి వారు ఇలా చీర సారే పెట్టి. అచ్చంగా మా అమ్మా నాన్నల్లాగా మీరు నన్ను ఆదరించారు" అని ఆనందబాష్పాలు రాల్చారు. మా శ్రీమతి "అమ్మా! మీలాంటి వాళ్ళందరూ మా అమ్మాయిల్లాంటి వారే. వారికి ఏదైనా ఇలా చేయటంలో మాకు కొండంత సంతృప్తి ఉంది" అని భుజాన చేయివేసి దగ్గరకు తీసుకొని ఆప్యాయంగా తల నిమిరి ఆలింగనం చేసుకొన్నది. ఆ అనుభూతి మాకు మహదానందంగా ఉన్నది.

## మృకండ మహర్షి ఆశ్రమ సందర్శనం

అనుకొన్న సమయం కంటే గంటన్నర ఆలస్యంగా ఆదివారం ఉదయం 8-30కు సామాన్లన్నీ కారులో సర్దేసి శివగారితో సహా కారు ఎక్కు తుండగా ఎదురింట్లో ఉన్న ఆయన తమ్ముడు, లాయర్ శ్రీ ఆదినారాయణరావుగారు వాళ్ళ అబ్బాయి వారి బంధువు వాకిట్లో నిలబడి మాకు సెండాఫ్ ఇచ్చారు. రావుగారు శుక్రవారం రాత్రి వచ్చి మాట్లాడి 1) శ్రీ మదొంటి మిట్ట కోదండరామాలయ దివ్య చరిత్రము, 2) ఒంటిమిట్ట శ్రీరామకథ, 3) జయం జయం పుస్తకాలిచ్చారు. కారుకు శుభ శకునంగా శ్రీమతి పద్మ ఎదురు రాగా బయల్దేరాం అందరికీ వీడ్కోలు చెప్పి. రైల్వేస్టేషన్ దగ్గర పట్టాలు దాటాక మృకండ మహర్షి ఆశ్రమం పది నిమిషాలలో చేరాం. అక్కడి పూజారికి ముందే శివ గారు చెప్పి ఉండటంతో మాకు విఐపి ట్రీట్‌మెంట్ జరిగి 'శ్రీ మృకండేశ్వర స్వామిని' పూజచేసి, తీర్థ ప్రసాదాలిచ్చారు. నాకు పుష్పహారం కూడా వేశారు. ఇక్కడే మార్కండేయుడి తండ్రి మృకండ మహర్షి తపస్సు చేశారు. ఇక్కడ ఒక కళ్యాణ మండపం కూడా ఉంది. పెళ్ళిళ్ళు బాగానే జరుగుతాయి. శివగారి వివాహం పద్మగారితో ఈ కళ్యాణ మండపంలోనే జరిగిందని జ్ఞాపకం చేసుకొని శివ చెప్పారు.

ఒంటిమిట్ట దగ్గర 'మాధవరం' గ్రామం చేనేత వస్త్రాలకు ప్రసిద్ధి. రెండు రోజుల నుంచి అదే రూట్‌లో వేదుతూండటంతో ఒకసారి దిగి చూడాలనిపించి శివగారికి భార్యకు చెబితే, సరసమైన రెట్లతో ఇచ్చే 'శ్రీ సాయి ఈశ్వర్ హాండ్‌లూం స్టోర్స్' దగ్గర మమ్మల్ని దింపి, షాప్ వోనర్‌తో మాగురించి చెప్పగా, ఇంటికి మా కారులోనే ఆయన్ను డ్రాప్ చేసివచ్చారు మావాళ్ళు. షాప్ ఇంకా తెరవలేదు. మమల్ని చూసి హడావిడిగా ఊడ్పులు, ముగ్గులు వేసి ఓపెన్ చేసి సరుకు చూపించాడు వోనర్. మేము 12 చీరలు, మా కోడలు మామనవరాలి కోసం టాపులు, వియ్యపురాలు రెండు, రాంబాబు వాళ్ళమ్మకు రెండు కొన్నాం. మంచి 'హోమ్ మేడ్' కాఫీ ఇచ్చారు అందరికీ. షాపింగ్ అయేసరికి 10-30 అయింది. సరాసరి బ్రహ్మంగారి మఠానికి బయల్దేరాం.

## బ్రహ్మంగారి మఠ సందర్శనం

మాధవరం నుంచి సిద్ధవటం మీదుగా కచ్చాపచ్చా రోడ్‌పై ప్రయాణం చేసి, చివరికి సింగిల్ రోడ్‌లోనూ ప్రయాణించి కందిమల్లయపల్లి అనే బ్రహ్మంగారి మఠం అనే గ్రామానికి మధ్యాహ్నం 12-15కు , శివగారి బంధువుల ఇంటికి చేరాం. శివగారు వీరికి చెప్పి ఉండటం చేత వారబ్బాయి డాక్యుమెంట్ రైటర్ 'శివ' మా కోసం ఎదురు చూస్తున్నాడు. అతను బైక్ మీదా మేము కారులో బ్రహ్మంగారి మఠం చేరాం అయిదు నిమిషాలలో. శ్రీ మద్విరాట్ పోతులూరి వీర బ్రహ్మేంద్రస్వామి కాశీలో అత్రి మహర్షి ఆశ్రమంలో పెరిగి, ఇక్కడికి వచ్చి తత్వబోధలు చేస్తూ సంఘ సంస్కరణకు పాల్గొనగా ఊరి జనం వెలి వేస్తే, నీరు ఆహారం లేకుండా చేస్తే, ఒకరోజు రాత్రి మహాసంకల్పంతో చేతిలో ఉన్న చిన్న కొమ్ముతో బావి తెల్లారేటప్పటికి తానొక్కడే త్రవ్వి తన సంకల్ప బలం నిరూపించారు. ఆ బావి నీరు మహారుచిగా ఉన్నాయి. ఏ బావి ఎండిపోయినా ఈ బావి నీరు ఎప్పుడూ ఎండక పోవటం విశేషం. గ్రామ దేవత పోలేరమ్మకు ఊరి జనం జంతువులను బలి ఇస్తుంటే ఆపేసిన కారుణ్యమూర్తి బ్రహ్మంగారు. తను చుట్ట కాల్చుకోవటానికి నిప్పుకావాలంటే పోలేరమ్మ దేవతతో స్వయంగా తెప్పించుకొన్న మహిమామూర్తి బ్రహ్మంగారు. ఆయన నివశించిన ఇల్లు కూడా చూశాం. అసలు మఠంలో బ్రహ్మంగారు జీవసమాధి అయ్యారు. దానిపై శివలింగం ఏర్పాటు చేశారు. భార్య వీర పాపమాంబ కూడా ఇక్కడే సిద్ధిపొందారు. వీరిద్దరి సమాధులు ప్రక్క ప్రక్కనే ఉన్నాయి. వెనక భాగాన ఒక నూనె దీపం ఇరవై నాలుగు గంటలూ వెలుగుతుంది. బ్రహ్మంగారు జీవించి ఉన్నప్పుడు నీటితో దీపం వెలిగించారు. ఆయన పోయాక నూనె దీపం పెట్టి కాపాడుతున్నారు. బ్రహ్మంగారు కొడుకు, కోడలు కూడా ఇక్కడే సమాధి అయ్యారు. బ్రహ్మంగారు రాసిన కాలజ్ఞానం ప్రతులు వెండి బాక్సుల్లో ఆయన సమాధి వద్ద భద్ర పరచారు. కాలజ్ఞానం ఆయన బనగానపల్లిలో రాశారు. అక్కడి నుండి ఇక్కడికి వచ్చాకనే ఇక్కడ సమాధి అయ్యారు. మఠంలో నిత్యాన్నదానం జరుగుతుంది. ఈ విషయాలన్నీ 'చిన్న శివ' మాకు దగ్గరుండి చూపిస్తూ వివరించాడు. ఇవన్నీ చూపించి చిన్న శివ ఇంటికి మమ్మల్ని తీసుకువెళ్ళాడు. ఆ శివకు ఈ శివకు చుట్టరికం ఏమిటి? ఆ శివ అన్నగారి అమ్మాయి ఈ శివ అమ్మగారు. అదీ బంధుత్వం. శివ నాన్నగారు గ్రామకరణం చేసి తర్వాత డిగ్రీ బి.ఎడ్ పాసై టీచర్‌గా చేరి హెడ్ మాస్టర్గా రిటైరయ్యారు. వీరి పేరు సుబ్రహ్మణ్యంగారు. పనిమీద బెజవాడ వెడితే ఈ శివ మా బాధ్యతా అంతా ఆ శివ చెప్పగా తీసుకొన్నాడు. ఇంట్లో ఆడవారందరూ మహా కలుపుగోలుగా మమ్మల్ని దగ్గర బంధువులుగా ఆదరించి మర్యాద చేసి కమ్మని భోజనం వండి వడ్డించి కొసరి కొసరి తినిపించారు. శివ బ్రదర్స్ నలుగురు. అందరూ ఉద్యోగస్తులే. దగ్గరలోనే పని చేస్తున్నారు. ఉమ్మడి కుటుంబం. కోడళ్ళు, అత్తగారు మహా నిదానస్తులు. అతిథి

మర్యాద బాగా తెలిసినవారు. ఆ ఆదరణకు మేము 'ఫిదా' అయ్యాం. ఒక మనవరాలు మహాలక్ష్మి చాలా కలుపుగోలుగా చాలాకీగా ఉండి, నన్ను "తాతయ్యా తాతయ్యా" అని ఆత్మీయంగా పిలుస్తూ, నా నవ్వు చాలా బాగుందని మెచ్చుకొని, కావాలని నవ్విస్తూ ఫోటోలు తీసింది. నిజంగా మనవరాలే అనిపించింది ఆ చిన్నారి. తొమ్మిదో తరగతి చదువుతోంది. అక్కడి ఫోటోలన్నీ ఆ పిల్లే తీసింది. జామచెట్టు, మిగిలిన చెట్లతో వాతావరణం బాగుంది. ఈ ప్రాంతాలలో కోతులెక్కువ. కరెంట్ తీగలమీద కూడా కూర్చునే సాహసం వాటిది. భోజనాలు కాగానే ఆకు, వక్కా ఇచ్చి తాంబూలం వేసుకోమన్నారు. అరటిపళ్ళు తినటానికిచ్చారు. జామకాయ కోసి ముక్కలు పెట్టారు. ఆడవారికి జాకెట్ పసుపు, కుంకుమ పూలు ఇచ్చి మర్యాద చేశారు. వాళ్ళ అందరి భోజనాలు అయ్యేదాకా మేము ఉండి, వీడ్కోలు చెబుతుంటే "వీలైనప్పుడల్లా వస్తుండండి. మాకేమీ ఇబ్బంది లేదు. మీవాళ్ళు ఎవరొస్తున్నా చెప్పండి. అన్నీ దగ్గరుండి మా శివ చూపిస్తాడు" అని ఆప్యాయత వర్షించి మమ్మల్ని తమవాళ్ళను చేసుకొన్న సౌజన్యం వారందరిదీ. ఎక్కడో ఒంటిమిట్ట శివగారికి తెలిసిన మాకు ఇంతటి ఆప్యాయత ఆత్మీయతా చూపటం పరమాశ్చర్యంగా ఉంది. ఆ సంస్కారం అలాంటిది. బాంబుల సీమలో 'ప్రేమ అనురాగ ఆత్మీయ బాంబులు' పేల్చిన ఆ కుటుంబం ఎన్నటికీ మరపురాదు. శివను అడిగి వాళ్ళ అడ్రస్ తీసుకొని ఇంటికి వెళ్ళగానే సరసభారతి పుస్తకాలు పంపిస్తానని చెప్పి, ఉయ్యూరు రాగానే 16వ తేదీ సోమవారం 12 పుస్తకాలు రిజిస్టర్డ్ పార్సిల్‌లో పంపి కొంతవరకు రుణ విముక్తులం అయ్యామనుకొన్నాను.

## త్రిపురాంతక సందర్శనం

బి.మఠంలో చిన్న శివ ఇంటివారందరికీ ధన్యవాదాలు చెప్పి, షార్ట్‌కట్‌లో ప్రయాణం ఎలాగో తెలుసుకొని మధ్యాహ్నం 2-30కు బయల్దేరాం ఆనందంగా. ఇక్కడి నుంచి కడపజిల్లా పోరుమామిళ్ల మీదుగా, ప్రకాశంజిల్లా బేస్తవారి పేటకు సాయంత్రం



4కు చేరి, కాఫీలు తాగాం. ఇక్కడ ఒక విషయం జ్ఞాపకం వచ్చింది. ప్రకాశంజిల్లా కనిగిరి మీదుగా వచ్చేటప్పుడు ప్రయాణం చేశాం కదా. కనిగిరిని కాటమరాజు అనే యాదవరాజు, నెల్లూరును మనుమసిద్ధి మహారాజు పాలిస్తున్నప్పుడు పాలించాడు. పశువుల 'పుల్లరి'

(పచ్చిక బీడులలో మేపుకోవటానికి ఇచ్చే డబ్బు) విషయమై తగాదా వచ్చి యుద్ధం జరిగింది కనిగిరిలో. మనుమసిద్ధి సేనాని ఖడ్గ తిక్కన. మంత్రి తిక్కన సోమయాజి. ఖడ్గ తిక్కన యుద్ధంలో వీరవిహారం చేసి మరణించిన సంగతి, అంతకుముందు యుద్ధం నుంచి ఇంటికి తిరిగి వచ్చినప్పుడు తండ్రీ తల్లీ భార్య ఆయన్ను ఆడదానికింద జమకట్టి నిష్ఠూరాలాడటం విరిగిన పాలు అన్నంలో పోయటం మంచం వెనక స్నానానికి నీళ్ళుపెట్టి అవమానించటం మనకు తెలిసిన విషయాలే. పేట నుంచి 30 కిలోమీటర్ల దూరంలో 'గుంట' వెళ్లి, అక్కడి నుంచి సుమారు 20 కిలో మీటర్లదూరంలో ఉన్న ప్రకాశంజిల్లా త్రిపురాంతకం చేరేసరికి సాయంత్రం 5-30 అయింది. ముందుగా కొండ దిగువన ఉన్న శ్రీ బాలాత్రిపుర సుందరి అమ్మవారి ఆలయంలో అమ్మవారి దర్శనం చేశాం. అమ్మవారు మహా వైభవంగా వెలిగిపోతోంది. ఇక్కడ అమ్మవారు ఒక చెరువు నూతిలో ఉంటుంది. ఇది గొప్ప శక్తి పీఠం. అమ్మవారు మహా మహిమాన్విత. 'బాల' ఆకారంలో ఉంటుండటం విశేషం. త్రిపురాంతకంలో కొండపైన మహాశివుడు తారకాసురుని ముగ్గురు కొడుకులను అమ్మవారి సహాయంతో ఇక్కడే సంహరించాడు కనుక త్రిపురాంతకం అని పేరు. పార్వతీ సమేత శ్రీ త్రిపురాంతకేశ్వర స్వామిగా ఇక్కడి శివుడిని పూజిస్తారు. త్రిపురాంతకం శ్రీశైలానికి 100 కిలో మీటర్లు. శ్రీశైలానికి తూర్పు ముఖద్వారం త్రిపురాంతకం.

సాయంత్రం 6-30కు త్రిపురాంతకం నుండి బయల్దేరి, నరసరావుపేట ఔటర్ ద్వారా గుంటూరుకు రాత్రి 8-30కు చేరి, అక్కడ మదీనా మొబైల్ టిఫిన్ సెంటర్‌లో టిఫిన్ తిని 9 గంటలకు బయల్దేరి రాత్రి 10-30కి ఉయ్యూరు చేరాం. బయల్దేరిన దగ్గర నుండి మొత్తం 61 గంటలు ఈ మూడు రోజుల్లో. మా డ్రైవర్ ఈసా చాలా నిదానస్తుడు. ఎంతో జాగ్రత్తగా సుమారు 1200 కిలోమీటర్లు ప్రయాణం చేసినా మాకు అలుపు లేకుండా చేశాడు. అతని ఓర్పుకు హాట్సాఫ్. అందుకే ఘనంగానే అతనికి మామూలు ఇచ్చాం అడగకపోయినా. ఇలా శ్రీ ఒంటిమిట్ట కోదండరామ దర్శనంతో మొదలుపెట్టి, శ్రీ త్రిపురాంతకేశ్వర బాలాత్రిపుర సుందరీ దర్శనంతో యాత్ర ముగించి హరిహరాద్వైతాన్ని చాటామేమోననిపించాం.



ఒంటిమిట్ట శ్రీ కోదండ రామాలయం, పుష్పగిరి, సిద్ధవట వివరాలు, విశేషాలు తరువాత తెలియజేస్తాను. ఇన్ని రోజులు ఇంతదూరం మాతో ప్రయాణించిన మీకు ధన్యవాదాలు.

## 1) ఒంటిమిట్ట శ్రీ కోదండరామ దేవాలయం -1

ఒకప్పుడు ఆది శేషునికి, వాయుదేవుడికి బల, పౌరుషాలపై వివాదం వచ్చింది. శేషుడు మేరు పర్వత శృంగాన్ని ఒకదాన్ని పట్టుకొని, దమ్ముంటే తనను కదిలించమని వాయు దేవుడికి సవాల్ విసిరాడు. వాయుదేవుడు ప్రళయగంభీరంగా వీస్తున్నా శేషుడు కదలలేదు. కసి హెచ్చి ఇంకా బలంగా ఢీ కొట్టాడు. ప్రళయా నిలుని ధాటికి, ఊపుకు తట్టుకోలేక శేషుడు అటూ ఇటూ అవగా మేరు శృంగం ఆయన పట్టులోనించి జారి, గిరగిరా తిరుగుతూ భూమి మీద పడింది. దేవతలు దిగివచ్చి ఇద్దర్నీ శాంతింపజేసి ఒకరిని 'మహాబలుడని', మరొకరిని 'మేరు నగధీరుడని' బిరుదులిచ్చారు. ఆ విరిగిన మేరు శృంగమే శేషాచలం అయింది. ఆ పర్వతాలవరుస కొనసాగి కడప మండలం నల్లమల వరకు వ్యాపించింది, శేషాచలం అగ్రభాగాన తిరుమల, మధ్యభాగమైన దండకారణ్యంలోని ఒంటిమిట్ట, చివర దేవుని గడప అయ్యాయి. తిరుమలలో శ్రీనివాసుడు, ఒంటిమిట్టలో శ్రీ కోదండరామస్వామి, దేవుని కడపలో శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామి కొలువై ఉన్నారు. దండకారణ్యం దక్షిణాన కావేరి నది ద్రావిడ, పాండ్య దేశాలు, మధ్యభాగంలో 'సిరగుజ' పడమట గుజరాత్‌లోని కుశస్థలి, వింధ్య దక్షిణ ప్రాంతమైన బీరారు, కన్యాకుమారి అగ్రం, తూర్పున ఒరిస్సా వైతరణీ నది మధ్యప్రదేశ్‌ను ఆక్రమించి కృష్ణా, గోదావరి మధ్యున్న ఆంధ్రదేశం వరకు దండకారణ్యం వ్యాపించి ఉన్నది.

పితృవాక్య పాలనకోసం శ్రీరాముడు సీతా లక్ష్మణులతో దండకారణ్యానికి నడుచుకొంటూ వచ్చి, ఎండవేడికి తాళలేక ఒక చెట్టుక్రింద కూర్చోగా కరుణాంతరంగ సీతమ్మ ఆ ప్రాంతంలో 'జీవ జంతు సముదాయం దప్పిక ఎలా తీర్చుకొంటాయి?' అని ప్రశ్నిస్తే, జానకి దాహం వేస్తోందని గ్రహించి విల్లు ఎక్కు పెట్టి బాణం సంధించి భూమిలోకి వేస్తే అమృతోపమానమైన పాతాళగంగ భూమిని చీల్చుకొని పైకి వస్తే ముగ్గురూ దాహం తీర్చుకొన్నారు. అదే ఇప్పుడు 'శ్రీ రామతీర్థం'గా ఇక్కడ ప్రసిద్ధమైంది. ఎన్ని కరువు కాటకాలు వచ్చినా ఈ తీర్థజలం తగ్గదు. అంతేకాదు, నల్లపూస వేసినా కనిపించేంత స్వచ్ఛంగా నీళ్ళుంటాయి. ఆధి వ్యాధులను తీర్చే గుణమూ ఉంది . పూర్వం దీని చుట్టూ మొగలి పొదలు దట్టంగా వ్యాపించి పాములు కీచురాళ్ళకు నిలయమై, ఎవ్వరూ ఇక్కడికి రావటానికి సాహసం చేయకపోతే ఆంధ్రవాల్మీకి శ్రీ వావికొలను సుబ్బారావుగారు, స్వంత ఖర్చులతో వాటిని తొలగించి, పైనుంచి కిందకు దిగటానికి మెట్లు కట్టించి రామతీర్థాన్ని స్నాన యోగ్యంగా మార్చి పుణ్యం కట్టుకొన్నారు. ఒంటిమిట్ట అంటే కొదండరాముడి తర్వాత గుర్తుకొచ్చేది వాసుదాసు మహనీయులే. అంతటి అవినాభావ సంబంధం ఉంది ఆయనకు. ఆయన పద్య రామాయణం 'మంధరం' ఇక్కడే రాశారు. రామతీర్థానికి ఉత్తరంలో ఉన్న చిన్నకొలను లక్ష్మణ తీర్థం. దండకారణ్యంలో తపస్సు

చేసుకొంటున్న మునిగణాలను రాక్షసులు బాధిస్తుంటే వారు శ్రీరాముని శరణు వెడితే అభయమిచ్చి రాక్షససంహారం చేసి శాంతి కల్గించాడు. ఆంధ్రవాల్మీకి ఈ సందర్భంగా చెప్పిన పద్యం – "ఈ ముని కోటి కంతటికీ నీవె శరణ్యుడ, వీవెధర్మ ర – క్షా మహితుండవో నుత యశా! గురు వర్యుడు బూజ నీయుడున్
స్వామియు, మాననీయుడును, శాసకుడు న్నృపు డీవ సుమ్ము, మ–త్స్వామివి నీవ, నీవు వసధారుణి నుండిన, నూరనుండి నన్" అని మహర్షులు గుర్తు చేశారు రామునికి.

మరి కొంతకాలానికి సీతాన్వేషణం చేస్తూ, హనుమ, జాంబవంతులు ఈ ప్రదేశానికి వచ్చి రాత్రి నిద్ర చేయగా స్వప్నంలో సీతా లక్ష్మణ సహితంగా శ్రీ కోదండ రామస్వామి దర్శనమిచ్చాడు. ఉదయమే లేచి చూడగానే ఏకశిలపై ఆ ముగ్గురు మూర్తులు 'ప్రకటిత'మయ్యారు. మునులు ముక్తికాములు కనుక సీతామాత వామభాగం అంటే హృదయస్థానంలో, 'రామస్య దక్షిణో బాహు' అన్నట్లు లక్ష్మణుడు కుడిప్రక్కన అంగ రక్షకుడై ధనుర్ధారియై ఉంటాడు. రాక్షససంహారం కోసం శ్రీరాముడూ కోదండాన్ని బాణాన్ని ధరించి కొదండరామస్వామిగా కనిపిస్తాడు. ఈ దివ్యమంగళ మూర్తులను తనివారా దర్శించి, పులకించారు హనుమ, జాంబవంతులు. జాంబవంతుని ఆత్మబలంతో ఇది సాధ్యమైనందు వలన ఈ క్షేత్రం 'జాంబ వత్ప్రతిస్టం' అని పేరు పొందింది.

త్రేతాయుగంలో జాంబవంతుడు రామునితో మల్లయుద్ధం చేయమని కోరితే, ద్వాపర యుగంలో అది సాధ్యం అని చెప్పటం, శ్రీ కృష్ణుడు శ్యమంతకమణిని వెతుకుతూ జాంబవంతుని గుహలోకి వెళ్ళటం ఇద్దరి మధ్య భీకరయుద్ధం జరిగి అమేయ బల సంపన్నుడు జాంబవాన్ ఓడిపోవటం కృష్ణుడే రాముడు అని గ్రహించటం, తన కూతురు జాంబవతిని శ్యమంతకమణిని ఇచ్చి పంపటం మనకు తెలిసిన విషయాలే. ఇలా త్రేతా, ద్వాపర యుగాలతో జాంబవంతునికి సంబంధం ఉండటం వలన జాంబవంత క్షేత్రం అని గట్టిగా చెబుతారు.

శ్రీరాముడు అవతారం చాలించి వైకుంఠం వెడుతుంటే 'ఎల్లవేళలా నీ రూప దర్శనం, నామం అనుగ్రహించు' అని కోరగా అనుగ్రహించాడు రాముడు. అందుకే ఇక్కడ కొండ దిగువన కొదందరామునికి ఎదురుగా శ్రీ సంజీవరాయలుగా వెలసి, అంజలి బద్ధుడై అనుక్షణ నిత్య సేవాభాగ్యం పొందుతున్నాడు హనుమ.

శివుడు వైరాగ్యంతో తపస్సు చేసింది కూడా ఈ క్షేత్రంలోనే. అందుకే ఇక్కడి శివుడు 'శ్రీరామలింగేశ్వరునిగా ప్రసిద్ధుడు. క్షేత్రానికి వాయవ్యంలో మృకండ మహర్షి ఆశ్రమం ఉంది. ఇక్కడే కుమారుడు మార్కండేయుడు శివపూజతో మృత్యువును జయించాడు. శృంగిముని తపస్సు చేస్తుండగా మెడదలో చచ్చిన పాము వేశాడని నిష్కారణంగా పరీక్షిత్తు మహారాజును శపించి, ఆ పాపం పోవటానికి శ్రీరామ తీర్థం దగ్గర ఉన్న కొండపై తపస్సు చేశాడు. అదే శృంగి శైలం. అదే ఆంధ్రవాల్మీకి వాసుదాసు

గారి ఆశ్రమం అయింది.

## ఒంటిమిట్ట శ్రీ కోదండరామ దేవాలయం-2

### చారిత్రిక ప్రాధాన్యం

పూర్వం నుంచి ఒంటిమిట్ట ప్రాంతాన్ని పాలించిన రాజులెవరో తెలీదుకాని విజయనగర సామ్రాజ్యకాలంలో, పొత్తపి నాటి చోళుల పాలనలో కొంత వైభవం పొందింది. క్రీ.శ.1556 తళ్ళికోట యుద్ధం ముగిశాక పొత్తపినాటి చోళులైన 'మట్లి వంశపు' రాజులు పాలిచారు. వీరి కాలంలో ఈ క్షేత్రాభివృద్ధి బాగా జరిగింది. ఆలయం మూడు పర్యాయాలు నిర్మింపబడినట్లు తెలుస్తోంది. గర్భ గృహం, అంతరాలయం, ముఖమండప గోపుర ప్రాకారాదులు వేర్వేరు కాలాలలో నిర్మించారు. శ్రీ కృష్ణ దేవరాయల తర్వాత సవతి తమ్ముడు అచ్యుతరాయలు 12 ఏళ్ళు పాలించాడు. అతను చనిపోయాక చిన్న పిల్లాడైన కొడుకు వేంకటపతి రాయలుకు పట్టాభిషేకం చేసి, అచ్యుతుని బావమరది సకలం తిమ్మయ్య మంత్రిగా ఉన్నాడు. తర్వాత మేనల్లుడిని చంపించి తానే రాజుగా ప్రకటించుకొన్నాడు. ఇది గిట్టక రాయల అల్లుడు అళియరామరాయలు లేక అరవీటి రామరాయలు సకలం తిమ్మయ్యను చంపి, అచ్యుతుని అన్నకొడుకు సదాశివరాయలును నామమాత్రపు రాజును చేసి, బాక్‌సీట్ డ్రైవింగ్‌గా రాజ్యమేలాడు. అప్పటి నుంచి అర వీటి వంశ ప్రాభవం పెరిగింది. రాజ్యం అత్యున్నత స్థితిలోకి తెచ్చినా, చివరికి నానా అల్లరి పాలై తళ్ళికోట యుద్ధంలో దక్కన్ సుల్తాను చేతిలో చనిపోయాడు. దేవాలయంలోని రెండు శాసనాలలో ఈ చరిత్ర అంతా దర్శనమిస్తుంది. ఇవి 1555 మరియు 1558 కాలం శాసనాలు.

### దండ రామాలయ శిల్ప వైభవం

గర్భాలయం, అంతరాలయం, ముఖ మండపాలపై విద్యానగర శిల్ప విన్యాసం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ద్వారపాలకులైన జయవిజయులు, గరుడుని ముందున్న ప్రభు, దేవేరుల విగ్రహాలు అంజలి ముద్రతో ఉంటాయి. గోపుర నిర్మాణంలో చోళ శైలి కనిపిస్తుంది. కిందున్న సంజీవరాయ గుడి మొదలైనవి హంపీ విఠలాలయంను పోలి ఉంటాయి. అక్కడి ఇసుకతో ఉన్న యెర్ర రాయినే ఇక్కడా వాడారు. అక్కడి శిల్ప విన్యాసమే ఇక్కడా ఉన్నది. అంతటి బండరాళ్ళు ఎలా తెచ్చారో ఎలా కష్టపడి మలిచారో, ఎంతటి అంకితభావంతో జీవకళ సృష్టించారో ఆలోచిస్తే ఆశ్చర్యమేస్తుంది. పై శాసనాల కాలానికి కోదండరామ స్వామికి 'శ్రీ రఘు నాయకులు' అనే పేరున్నట్లు తెలుస్తోంది.

## గ్రామనామం

ఒంటి మిట్ట అంటే ఒక్కటే ఐన మిట్ట. మిట్ట అంటే కొండ, బెట్ట, శైలం అని సమానార్థాలున్నాయి. కనుక ఏక శిలానగరం అన్నారు. ఒకప్పుడు ఇది నగర స్థాయి పొందిందన్నమాట.. కోటలు, బురుజులూ ఉండి, కాలక్రమంలో అంతరించి ఉండవచ్చు. పడమటి భాగంలో గొప్ప చెరువు శాసన కాలానికే ఉంది. ప్రాచీన వీరాంజనేయ గుడి చెరువు గట్టున ఉంది. ఈ కట్టపై నుంచి కాశీ, రామేశ్వరంలకు పోవచ్చు. విశ్రాంతి సత్రాలు అన్నసత్రాలుతో పచ్చగా కళకళలాడే ఏక శిలానగరం ప్రాభవం కోల్పోయి ఇప్పుడు గ్రామంగానే ఉండిపోయింది.

క్షేత్రానికి వాయవ్యంలో మృకండాశ్రమం, ప్రక్కన సెలయేరు ఉన్నాయి. దీని ప్రక్కనే రైల్వేట్రాక్ ఇప్పుడు వచ్చింది. సర్వేయర్ లార్డ్ మెకంజీ 160 ఏళ్ళక్రితం ఈ సంగతులన్నీ ' కై ఫీయత్'లో నమోదు చేశాడు.

## ఈ క్షేత్ర సందర్శనంతో తరించిన భక్తులు

### 1) త్రిపురాంతకుడు అనే అయ్యలరాజు తిప్పరాజు

విద్యానగర ప్రౌఢ దేవరాయల ఆస్థాన కవి అయ్యలరాజు తిప్పరాజు ఒంటిమిట్ట వాసి. రఘు వీర శతకం రాశాడు– "తారుణ్యోదయ యొంటిమిట్ట రఘునాథా! నీకు నే పద్యముల్ - నూరున్ జెప్పెద, నూరు బేరు వెలయన్ నూత్నంబుగా,నంత నా నోరుం బావన మౌను, నీ కరుణ గాంతున్ భక్తి, నన్నందరున్–రారమ్మందురు గారవించి, రఘు వీరా, జానకీ నాయకా"

ఇతని మనుమడు అయ్యలరాజు రామభద్రుడు రామాభ్యుదయం కావ్యం రాశాడు.

### 2) బమ్మెర పోతనామాత్యుడు

మందారమకరంద భాగవతాన్ని రచించిన పుణ్యమూర్తి బమ్మెర పోతరాజు అనే పోతనామాత్యుడు ఇక్కడే ఉన్నాడు. కాలం 1405–70. తల్లి అక్కమాంబ. తండ్రి కేసనమంత్రి. శైవులు. అన్న తిప్పన. పలికించెడివాడు రామభద్రుడు అని చెప్పాడు భక్తపోతన. 'శ్రీ కైవల్య పదంబు జేరుటకు చింతించి' ముముక్షు జనసేవ్యం బైన భాగవతం రాశాడు. ఫలితం భవహరం.

పోతన తెలంగాణావాడని అక్కడి వారి అభిప్రాయం. 1770లో పురాణం హయగ్రీవ శర్మగారు పోతన చరిత్రను భాగవత పీఠికలో చెప్పారు. ఆ తర్వాత వందేళ్ళకు నివాసంపై వివాదమేర్పడింది. ఆంధ్ర వాల్మీకి శ్రీ వావికోలను సుబ్బారావుగారనే వాసు దాసుగారు 'బమ్మెర పోతన నికేతన చర్చ' అనే గ్రంథం రాశారు. "మగిడి ఏక శిలా

నగరమునకు చను దెంచితిని" అనటంతో భాగవత రచన చేయటానికి ఇక్కడికి వచ్చాడని తెలుస్తోంది. అప్పటికి తెలంగాణలోని బమ్మెర గ్రామం రచనకు అనుకూలంగా లేక పోవచ్చు. ఆధునిక పోతన బిరుదున్న శ్రీ వానమామలై వరదాచార్యులవారు 'పోతన చరిత్ర' కావ్యం రాశారు. దశమాశ్వాసం 26వ పద్యంలో 'నొంటి మిట్టన్ కవి వరే ణ్యుడుంటతెలిసే'

27వ పద్యంలో – 'నొంటిమిట్ట రాముని వర మందిరాంగణము ముందొక పందిరి క్రింద

నందరున్ ఘన దీక్ష రామగుణగాన మొనర్పెడిపుణ్య రూపునిన్'

46వ పద్యంలో– 'ఒంటి మిట్ట లోననె వసియింప నాజ్ఞ నిడె నాకు రఘూత్తము డింక–నేను సింగన నృపతి సమ్ముఖమ్ము నకు గ్రమ్మర బమ్మెర కేగ నొల్ల'

49వ పద్యంలో– 'శ్రీరామనవమీ మహోత్సవములు నవుడె–భాగవతమ్ము రామాంకితముగ–కృతి సమర్పణ సేయుటుచితమగును'

59వ పద్యంలో– 'అంత విప్ర జనాను జ్ఞాతుండై, రామ భ్రుత్యుం డగు సహజ పాం డిత్యుండు'

పోతనార్యు డానందాశ్రుపూర మొల్క–వరదు పాద సన్నిధి నుంచె భాగవతము

రామగళ సూనహార మా గ్రంథము పయి–నూడి పడె గృతికాంత పెండ్లాడె ననగ"

ఈ విషయాలనన్నిటిని విమర్శక శిఖామణులు ఆచార్య దివాకర్ల వెంకటావధాని, రీడర్ శ్రీ పల్లా దుర్గయ్య, పరిశోధకులు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గట్టిగా సమర్థించారు.

పోతనగారు వర్ణించిన 'మెరుగు చెంగట నున్న మేఘుంబు కైవడి – నువిద చెంగట నుండ నొప్పువాడు' పద్యం ఒంటిమిట్ట కోదండరాముని గురించి చెప్పినదే. దేవాలయంలో పోతన విగ్రహం ఉంది. దేవాలయంలో 'భాగవత తాంబూలం' అనే మర్యాద ఉంది. శ్రీరామ తీర్థానికి తూర్పున 'పోతన మడి' ఉంది. శ్రీనాధ మహాకవి పల్లకీ ఎక్కి పోతూ పోతన కొడుకు మడి దున్నుతుంటే "హాలికులా!" అని హాస్యమాడినచోటు, పోతన ఇల్లు శిధిలం కాగా అక్కడే దైవ యోగంతో మరో ఇల్లు నిర్మాణమవటం, పోతన రామ దర్శనం పొంది కృష్ణకథ భాగవతం రాయటం, జాంబవాన్ శ్రీరామ శ్రీకృష్ణావతార కాలాలో ఉండటం. పోతన ఈ ఒంటిమిట్టలోనే ఉన్నాడని రుజువు చేసే సాక్ష్యాలు అంటారు ఈ చరిత్ర రాసిన ఒంటిమిట్ట వాసి శ్రీ రామావఝుల వేంకటేశ్వర్లుగారు.

ఆంధ్ర వాల్మీకి కూడా తన 'ఆంధ్ర వాల్మీకి రామయణకావ్యం'లో –

"బమ్మెర పోతరాజు నిరపాయ సుఖస్థితుజేయు పొంటె, వా – క్యమ్ములనిల్పి, భాగవత

మార్ద్ర సుధారస ధార లొల్కబూ
ర్వమ్మును–నేడు నింక సరివారలు మిన్నలు లేక యుండ, సా – రమ్ముగ బల్కు నేక శిల రాముడు నాకు బ్రసన్నుడయ్యెదున్" అని పోతనామాత్యుని ఏకశిలారామభక్తి ప్రశస్తి చేశారు.

## ఒంటిమిట్ట శ్రీ కోదండరామ దేవాలయం–3

## ఈ క్షేత్ర సందర్శనంతో తరించిన భక్తులు–2

### 3)అయ్యలరాజు రామభద్రుడు



శ్రీ రామాభ్యుదయం రాసిన అయ్యలరాజు రామభద్రుడు 1550 కాలంవాడు. అలియరామరాయల మేనల్లుడు. గొబ్బూరి నరసరాజుకు శ్రీరామాభ్యుదయ కావ్యం అంకితమిచ్చాడు. ఒంటిమిట్ట వాసి ఐన కవి 'ఇది శ్రీ మదొంటిమిట్ట రఘు వీర శతక నిర్మాణ కర్మఠ జగదేక ఖ్యాతి ధుర్య అయ్యలరాజు తిప్పయ మనీషి పర్వతాభిదాన పౌత్రాక్కయార్య పుత్ర పరిశీలిత సమిద్ధ రామానుజ మతసిద్ధాంత ముమ్మడి వరదా చర్య కటాక్ష వీక్షా పాత్ర, హృదయ పద్మాసనస్థ శ్రీరామభద్ర – శ్రీరామభద్రకవి ప్రణీతంబైన' శ్రీరామాభ్యుదయ ము' అన్నాడు.

"శిలజిగురు బోడియై యుల్లసిల నొనర్చి –ఎత్తి పోయిన గౌతము నిల్లు నిలిపె
నడుగు కెందమ్మి కమ్మపుప్పొ డిని ఇంక–నేమని నుతియించవచ్చు శ్రీరాము మహిమ"

ఇతని గురించి ఒక ఐతిహ్యం ఉంది. కవి చిన్నపాపడుగా ఉండగా తల్లి కోదండ రామాలయంలో జరిగే ఉత్సవానికి ఈ శిశువు నెత్తుకొని వెళ్ళగా, ముద్దుగా ఉన్న అతడిని చూసి అక్కడి స్త్రీలు ఎత్తుకొని ముద్దాడుతుండగా, వాళ్ళదగ్గరే పిల్లాడు ఉంటాడని ఇంటికి వచ్చి, యెంత సేపటికీ బిడ్డ రాకపోవటంతో ఊరంతా వెదకింది. ఆ రాత్రి శిశువు దేవాలయంలోనే ఉండిపోయి తల్లికోసం అలమటిస్తుంటే సీతమ్మతల్లి బిడ్డను ఎత్తుకొని, లాలించి, ఆకలి తీర్చటానికి స్తన్యం ఇచ్చింది. అమృతోపమానమైన అస్తన్యంతో శిశ ఉల్లాసంగా ఉన్నాడు. తెల్లవారుజామున పూజారులు స్వామి

సుప్రభాతానికి వస్తే, సీతమ్మ పాదాల చెంత బిడ్డ ఆడుకొంటూ కనిపించి ఆశ్చర్యపరచాడు. అతని తల్లికి వర్తమానం పంపి రప్పించి శిశువును అప్పగించారు. ఆ రాత్రి ఆ బిడ్డడు మూడుసార్లు సీతమ్మతల్లి పాలు త్రాగినట్లు గుర్తులున్నాయి. పెదవులపై సీతమ్మవారి గుర్తులున్నాయి. చూసి పరమానదభరితులయ్యారు. ఈ కవిని గురించి ఆంధ్రవాల్మీకి రాసిన సీసపద్యం చూద్దాం–

'అమ్మక! కోవెలందు దన – యమ్మయు నొంటిమివీడిపోవ,రే
పమ్మిన యాకతటన్ శిశువు – పాలకు నేడ్వగ నాలకించి, తా
నమ్మగ స్తన్యమిచ్చిన దయామయి – నన్గనగ వమ్మ అమ్మ! సీ – తమ్మభయ క్షుధార్దితుని
నయ్యలరాజు కులోద్వాహుం బలెన్" (ఆంధ్రవాల్మీకం–బాలకాండ –86వ పద్యం)

## 4) ఇమాం బేగ్

1640లో కడప నవాబు రాజులలో అబ్దుల్ నబీఖాన్ మొదటివాడు. నవాబుల కాలంలో సిద్దవటం కోట ఉంది. మట్లి అనంతరాజు ఈ కోట, అందులో శివాలయం 1604లో కట్టించాడు. నవాబు కోటను స్వాదీనం చేసుకొని శివాలయం ధ్వంసం చేసి మసీదు కట్టించాడు. దేవాలయ అవశేషాలు ఇప్పటికీ కనిపిస్తాయి. నవాబు ప్రతినిధి ఇమాం బేగ్. ఒంటిమిట్ట కోదండరామ మహాత్యాన్ని స్వయంగా చూడాలని వచ్చి, "మీ దేవుడిని పిలిస్తే పలుకుతాడా?" అని అడిగితే "పలుకుతాడు" అని చెప్పగా దేవాలయం లోనూ, బయటా మనుషులెవ్వరూ లేకుండా, పోకుండా చేయించి "ఓ రామా! ఒంటిమిట్ట రామా!" అని ఆర్తిగా మూడుసార్లు పిలిచాడు ఇమాం బేగ్. మూడవ పిలుపుకు "ఓ–ఓ–ఓ" అని వినిపించగా నవాబు సంతోషంతో సాష్టాంగపడి ఆనంద బాష్పాలు రాలుస్తూ, పులకిత శరీరుడై వినయంగా శ్రీరాముని ప్రార్థించాడు. స్వామి మహాత్మ్యాన్ని గ్రహించి తనవంతు కైంకర్యంగా, దేవాలయం మెట్లకు దక్షిణాన ఒక బావి త్రవ్వించాడు. చుట్టుప్రక్కల బావుల్లో ఉప్పునీరు ఉంటే నవాబుగారి బావిలో స్వచ్ఛమైన మధుర జలం ఊరింది. ఈ నీటినే స్వామి పూజా కైంకర్యాలకు వినియోగిస్తారు దీనినే "ఇమాం బేగ్ బావి" అంటారు . అంతేకాదు, దగ్గరున్న మసీదులో పిల్చినా రాముడు పలికాడట.

## 5) మాల ఓబన్న

200 ఏళ్ళక్రితం ఆలయానికి తూర్పున అరమైలు దూరంలో 'మలకాటపల్లె' అనే ఊరులో ఓబన్న అనే మాలకులస్తుడు పుట్టి మహా భక్తుడయ్యాడు. విద్య, శుచి, ఆచారం లేనివాడు. మాలలలో చెన్న దాసరులు వైష్ణవ మతావలంబులు. భగవద్రామానుజులు కంచి గోపురమెక్కి తిరుమంత్ర రహస్యాన్ని వివరించినప్పుడు రహస్యంగా విన్నవారే చెన్నదాసరులు. ఓబని సంసారం పెద్దది. బాల్యంలోనే

రామాయణ భాగవతాది పురాణాలు విని, భక్తితో స్వామిని భజించేవాడు. నాలుగవ జామునే లేచి స్నానించి ఊర్ధ్వ పుండ్రాలు ధరించి తంబూర, చిటి తాళంతో, కాలిగజ్జెలతో కోదండరాముని కోవెలముందు భజన చేస్తూ పారవశ్యంలో ఇహలోక స్పృహ లేకుండా చాలాకాలం చేసి ఇంటికి వచ్చేవాడు రోజూ. ఇది చూసి కన్ను కుట్టిన కొందరు సోంబేరులు, స్వామి అర్చన కోసం పూజారులు తీర్థజలాన్ని తీసుకొని వెడుతూ వేద మంత్రాలు ఉచ్చరిస్తుంటే, శూద్రుడు అక్కడ ఉంటే అపవిత్రం అవుతోందని గగ్గోలు పెట్టి, నానాయాగీ చేశారు.

ఒకరోజు తహసీల్దారు వస్తే ఆలయ ధర్మకర్తలు ఉద్యోగులు ఎదురువెళ్ళి స్వాగతం పలికి మేళతాళాలతో గుడిలోకి తీసుకువెడుతున్నా అదేమీ పట్టనట్లు ఓబయ్య తన భజన తాను చేసుకొంటున్నాడు. ఆయనకు పూజార్లు అతనిపై చాడీలు చెప్పి పురెక్కించగా, ఆయనా వివేకం కోల్పోయి 'వాటీజ్ దిస్ నాన్సెన్స్' అని బిళ్ళబంత్రోతుల చేత ఓబని మెడబట్టి దూరంగా నెట్టేయించాడు. ఆలయం పడమటి భాగానికి వెళ్లి యధాప్రకారం భజన కొనసాగించాడు.

మర్నాడు ఉదయం అర్చకులు ఆలయం తలుపులు తెరిచి చూడగా స్వామి పడమటి వైపు ముఖంతో కనిపిస్తే అవాక్కై, కిందపడి పొర్లు దణ్ణాలు పెడుతూ పొలికేకలు పెట్టారు. జనమంతా పోగయి ఆశ్చర్య పోయారు. ఆ రోజు రాత్రి తహసిల్దార్ కలలో కనిపించి, మర్నాడు ఓబని తన సముఖానికి తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు. ఏమి జరుగుతుందో అని ఊరి జనమంతా ఆలయంలోకి చేరారు. రామభజనలతో, మంగళ వాద్యాలతో అర్చకులు, తహసీల్దారు గ్రామపెద్దలు ఓబని సమీపించి తమ అపరాధాన్ని క్షమించమని కోరారు. భూనభోంతరాలు దద్దరిల్లేట్లు అందరూ మహా గౌరవంగా ఓబన్నను కోదండరామ సన్నిధికి తీసుకువెళ్ళారు. మళ్ళీ ఆశ్చర్యం కలిగిస్తూ స్వామి తూర్పు ముఖంగా దర్శనమిచ్చాడు.

ఓబన్న 120 సంవత్సరాలు జీవించాడు. తనివితీర దేవాలంయలోకి వెళ్లి స్వామిని దర్శించి పూజించి ఆడి పాడి ధన్యుడయ్యాడు. బాగా ముసలివాడు అయ్యాక కోవెలకు రాలేక తన ఊరిలోనే ఉంటూ, మనుమల సాయంతో పడమటి గోడవరకు వచ్చి, గోపుర దర్శనం చేసి, తాను తినే రాగి సంకటి స్వామికి నైవేద్యం పెట్టి, ఆ ప్రసాదాన్ని తినేవాడు. అనాయాస మరణంతో ఓబన్న సాయుజ్యం పొందాడు. 'భవనాశి' వంశీయుడైన ఓబన్న తరువాత తరాలవారంతా వైష్ణవులే. స్వామి బ్రహ్మోత్సవాలలో ఓబని స్తంభం వద్ద పందిట్లో వీరంతా భజనలు చేస్తారు. ఓబన్న స్మృతిచిహ్నం ఇప్పటికీ ఉన్నది. ఇక్కడే ఆయన భజన చేసేవాడు. గరుడోత్సవంనాడు వీరంతా ఉపవాస ఉండి, స్వామి గరుడ వాహనంపై ఊరేగుతూ మహాద్వారం దగ్గరకు రాగానే స్తంభంపై పెద్ద జ్యోతి వెలిగించి, గోవిందనామాలతో చుట్టూ తిరుగుతూ భజనలు చేస్తారు. ఈ

మర్యాద ఇప్పటికీ అమలు ఉన్నది. ధన్యుడు మహాభక్తుడు ఓబన్న.



## ఒంటిమిట్ట శ్రీ కోదండరామ దేవాలయం-4 (చివరిభాగం)

## ఈ క్షేత్ర సందర్శనంతో తరించిన భక్తులు-3 (చివరి భాగం)

### 6) మహాయోగి, త్యాగి, భక్త శిఖామణి ఆంధ్ర వాల్మీకి శ్రీ వాసుదాసు

ఆంధ్ర వాల్మీకి వాసుదాసు అనే శ్రీ వావికొలను సుబ్బారావుగారు ఈ క్షేత్రాభివృద్ధికి ఆధునిక కాలంలో యెనలేని కృషి చేశారు. ప్రముఖ రచయిత, గ్రాంథికవాది కందుకూరి వీరేశలింగం పంతులు తర్వాత, మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో ఆంధ్ర పండితులుగా 1904-1920 మధ్యకాలంలో పనిచేశారు. భక్తి సంజీవని మాసపత్రిక సంపాదకులు. ధర్మసమాజాన్ని స్థాపించారు. రామభక్తుడు. రామాయణము ఆంధ్రీ కరించి "ఆంధ్ర వాల్మీకి" బిరుదు పోందారు. ఒంటిమిట్టలోని కోదండ రామాలయాన్ని పునరుద్ధరించడానికి ఒక కొబ్బరి చిప్పను బిక్షాపాత్రగా విరాళాలను పోగు చేశారు. టెంకాయ చిప్ప శతకాన్ని రచించారు.

గిడుగు వారి వ్యావహారిక భాష వల్ల తెలుగు సాహిత్యానికి అపకారం జరుగుతుందని పండితుల్లో అలజడి బయలుదేరి మద్రాసులో జయంతి రామయ్యపంతులు అధ్యక్షతన ఆంధ్ర సాహిత్య పరిషత్తు ఏర్పడింది. వావిలికొలను సుబ్బారావు, వేదం వేంకటరాయ శాస్త్రిలాంటి పండితులు గ్రాంధికభాష పరిరక్షణ కోసం ఉద్యమం లేవదీసారు.

### జీవిత విశేషాలు

వావిలికొలను సుబ్బారావు జనవరి 23, 1863న రాయలసీమలోని కడప మండలం జమ్మలమడుగులో జన్మించారు. తండ్రి రామచంద్రరావు. తల్లి కనకమ్మ. భార్య రంగనాయకమ్మ. ఏడేళ్ళ వయసు వచ్చేదాకా మాటలు రాలేదు. తర్వాత వచ్చి చదువులో అందరికంటే ముందుండేవారు. ఆంగ్ల పాఠశాలలో ఎఫ్.ఏ.చదువుతూ, తెలుగు, సంస్కృతాలలో గట్టిపట్టు సాధించారు. 1883లో ప్రొద్దుటూరు తాలూకా ఆఫీసులో నెలకు 7 రూపాయల జీతంతో డిస్పాచ్ గుమాస్తాగా చేరి, రెవెన్యూ ఇన్స్పెక్టర్‌గా పదోన్నతి పొంది 1896 వరకు పనిచేశారు. ఇన్స్పెక్షన్‌కు వెళ్ళినప్పుడు ఎవరి ఇంట్లోనూ

భోజనం చేయకుండా, ఏదిచ్చినా తీసుకోక ఆదర్శంగా ఉద్యోగించారు. వీలులేకపోతే స్వయంగా వండుకు తినేవారు.

## వివాహం

నెల్లూరు శ్రీ కాంచనపల్లి శేషగిరి రావు గారిపుత్రిక శ్రీమతి రంగనాయకమ్మను పెద్దలు కుదర్చగా వివాహమాడారు. వీరికి ఒక కొడుకు పుట్టినా చిన్నతనంలోనే చనిపోయాడు. భార్య 1910లో పరమపదించారు.

## గ్రంథ రచన

మొదటగా 'శ్రీ కుమారాభ్యుదయం' అనే ప్రౌఢ ప్రబంధం 25వ ఏట రాశారు. నెల్లూరు ఆవిష్కరణ సభలో ఇంత పిన్నవయసులో మహా ప్రబంధ రచనా అని చిన్నా, పెద్దా అనుకోవటం విని, ఆ సభలోనే ఆశువుగా 'శ్రీ తల్పగిరి రంగనాథ శతకం' చిత్ర పదకల్పనా చాతుర్యంతో చెప్పగా ప్రక్కనున్న వారు రాశారు. అలాగే ఆతర్వాత 'కౌసల్యా పరిణయం 'బంధకవిత్వంతో సహా అనేక ప్రక్రియలతో రాశారు. శీర్షికలోనే అనేక తమాషాలు అంటే శ్లేషలు చూపారు.

1) శ్రీ కుమారాభ్యుదయం–వమన్మథచరిత్ర, 2) కుమారాభ్యుదయం–వమన్మథచరిత్ర, 3) మారాభ్యుదయము – మన్మథచరిత్ర, 4) రామాభ్యుదయము – మన్మథచరిత్ర ఇలా ఒకొక్క అక్షరం తీసేసినా అదే అర్థం వస్తుంది.

## లెక్చరర్ సుబ్బారావు

వావికొలను వారి పాండితీ ప్రకర్ష గుర్తించిన బ్రిటిష్ ప్రభుత్వం మద్రాస్ ప్రెసిడెన్సి కాలేజిలో ఆంధ్ర ఉపన్యాసకునిగా 1904 నియమించి గౌరవించింది. ఇక్కడే 16 ఏళ్ళు 1920 వరకు పని చేశారు. ప్రిన్స్ ఆఫ్ వేల్స్ యువరాజు భారతదేశాన్ని చూడటానికి వచ్చినపుడు, కళాశాల తెలుగు పండితుడు గనుక యువరాజును స్తుతిస్తూ కవితలు చెప్పమని బ్రిటిషు ప్రభుత్వం ఆయన్ను ఆదేశించింది. బహుమతిగా బంగారు కంకణం ఇస్తామని ఆశ చూపింది. దాన్ని ఖరాకండిగా తిరస్కరించి తాను "రామదాసునే గాని కామదాసును"గానని తేల్చి చెప్పారు.. 'ఆంధ్ర భాషాభివర్దినీ సమాజం' స్థాపించి ఎందరినో భాషా సంస్కృతులలో నిష్ణాతులను చేశారు. ఇక్కడ పని చేస్తున్నప్పుడే 'ఆర్యనీతి, ఆర్య చరిత్ర రత్నావళి, హిత చర్యమాలిక రాశారు. ఆనాడు ప్రతి పాఠశాలలో, గ్రంథాలయంలో వీరి రచనలు కనిపించేవి. ప్రతిదీ 20 కంటే ఎక్కువసార్లు పునర్ముద్రణం పొందటం విశేషం. విద్యార్థులకోసం 'సులభ వ్యాకరణం' మూడు భాగాలుగా రాశారు. 'సుభద్రా విజయం' నాటకమూ రచించారు. భగవద్గీతను 'ద్విపద భగవద్గీత'గా తెనిగించారు.

## ఆంధ్ర వాల్మీకి

సుబ్బారావు వాల్మీకి సంస్కృత రామాయణాన్ని 'ఇరవై నాలుగు వేల ఛందో భరిత పద్యాలుగా' తెలుగులో సప్త కాండలుగా 1900లో వ్రాశారు.. ఇది అనితర సాధ్యమైన విషయం. వాల్మీకి రామాయణాన్ని (24000 శ్లోకాలనూ) '108 సార్లు నియమ పూర్వకంగా పూర్తిగా పారాయణం' చెయ్యటం వలన ఆయనకు అందులోని నిగూఢ అర్ధాలు స్ఫురించాయి. ఆయన వ్రాసిన రామాయణాన్ని ఒంటిమిట్ట శ్రీ కోదండరామస్వామికి అంకితమిస్తూ 1908 అక్టోబర్ 9,10,11 తేదీలలో మహాజన సమక్షంలో ఆవిష్కరింపజేశారు. మహాసభ ఒంటిమిట్ట రామాలయంలో శ్రీరామునకు అంకితం ఇచ్చారు. సభలో మహాపండితులు ఆయనకు 'ఆంధ్ర వాల్మీకి' అని బిరుదు ప్రదానం చేసి సత్కరించారు.

## దివ్యానుభూతులు

ఒకరోజు మధ్యాహ్నం ఒంటిగంటకు ఇంటికి వస్తుంటే ఆకలితో ఉన్న ఒకతను అన్నం పెట్టమని అడిగితే, ఇంట్లో వంట చేసేవారు లేకపోతే ఆ విషయం ఆలోచిస్తూ వెనక్కి తిరిగితే ఆ వ్యక్తి కనిపించలేదు. ఇంటికి వస్తే సిద్ధవటం తహసీల్దార్ జయరామ నాయుడు "ఒంటిమిట్ట రామాలయంలో స్వామికి నిత్య నైవేద్య దీపారాధనలు జరగటం కష్టంగా ఉంది. మీరు పూనుకొని ఆ లోటు పూరిస్తే బాగుంటుంది" అని రాసిన ఉత్తరం కనిపించింది. తనను అన్నం అడిగింది సాక్షాత్తు రామచంద్ర ప్రభువే అని అర్థం చేసుకొని, అప్పటినుంచి నెలకు 10 రూపాయలు స్వామి కైంకర్యానికి ఒంటిమిట్ట పంపారు.

ఒకసారి యోగసాధనలో ఘటికాచలంలో ఉండగా ఒకనాటి స్వప్నంలో తాను ముండ్లబాటలో నడుస్తున్నాడని ఇద్దరు బాటసారులు చేయిపట్టుకొని మంచి దారి చూపించారు. ఇదీ రామ మహిమగానే భావించి హఠయోగం కన్నా భక్తియోగం మిన్న అని స్వామి ఆజ్ఞగా భావించి, తానూ సాధించి ఇతరులకు బోధిస్తూ 'ఘటికాచల నృసింహ కేశవా' మకుటంతో శతకం రాస్తుంటే, ఒకరోజు రాత్రి కలలో ఇద్దరు బైరాగులు కనిపించి "ఇక్కడేం చేస్తావ్ ఒంటి మిట్టకు రారాదా" అని పిలిచారు. ఉదయం లేవగానే ఇక కాలస్యం చేయకుండా ఒంటిమిట్టకు బయల్దేరి వెళ్ళారు. బాల్యం నుంచి తన ఇష్ట దైవం కోదండరాముని ఆజ్ఞగా భావించి స్వామి సేవలో తరించటానికి వెళ్ళారు.

## టెంకాయ చిప్పతో స్వామికి కానుకల నిధి

రాజులు ఆలయానికి ఇచ్చిన వందలాది ఎకరాల మాన్యాలు ఎవరికీ వారు భోంచేయగా రామునికి నైవేద్యం కరువైన స్థితికి ఆలయం వచ్చిం ఉద్ధరించటానికి కంకణం, తనకున్న సర్వస్వం రామార్పితం చేసి, కౌపీనం మాత్రమే ధరించి టెంకాయ

చిప్పను చేతిలో పట్టుకొని ఆంధ్రదేశంలో ఊరూరా తిరిగి బిచ్చమెత్తి ఆ ధనంతో ఆయన ఆలయాన్ని పునరుద్ధరించారు తన ధనం దానిలో పడినా ఏదీ ఉంచుకోనక. రామునకిచ్చి చివరకు తాను ఖాళీ అయిన టెంకాయ చిప్పను చూచి–

"ఆంధ్ర వాల్మీకి హస్తంబు నందు నిలిచి రూప్యములు
వేన వేలుగా ప్రోగు చేసి దమ్మిడైనను వాని లో
దాచుకొనక ధరణి జాపతి కర్పించి ధన్యవైతి
కర్మ గుణపణిముల కుప్ప! టెంకాయ చిప్ప!" అంటూ 'టెంకాయ చిప్ప శతకం' చెప్పిన మహాకవి.

ఆయన ఎంతటి మహాకవి యంటే 'నెల్లూరు'లో జరిగిన ఒక సభలో సభ అందరి ఎదురుగానే కొన్ని గంటలలో ఆశువుగా 'రంగనాయకునిపై నూరు పద్యాలు ఆశువుగా' చెప్పి శతకాన్ని పూర్తి చేశారు.

## ఆలయ జీర్ణోద్ధారణ

విమాన గోపుర జీర్ణోద్ధారణ గర్భాలయ, అంతరాలయ నేలను బాగు చేయించటం, మహాద్వారానికి తలుపులు సంజీవరాయ దేవాలయ జీర్ణోద్ధరణ, శ్రీరామ సేవాకుటీరం అనే సత్ర నిర్మాణం నూతన రథం ఏర్పాటు, శృంగి శైలంపై వాల్మీకి ఆశ్రమం, ఇమాం బేగ్ బావి మరమ్మత్తులు, ప్రక్కన భవన నిర్మాణం వాసుదాసుగారు సేకరించిన నిధితో సమకూర్చారు. ఈ పనులన్నీ 1923 నుంచి 4 ఏళ్ళు 27 వరకు జరిగాయి.

## వస్తు పరికరాలు ఆభరణాలు

వెయ్యి మందికి వంట చేయటానికి పాత్ర సామగ్రి, 108 కాసుల మాల, 108 మంగళ సూత్రాల హారం, ఉత్సవమూర్తులకు బంగారు కిరీటాలు, మరికొన్ని ఆభరణాలు వెండి సామాను చేయించి స్వామికి అర్పించారు ఆంధ్ర వాల్మీకి.

## గృహాలు

1) ఒంటిమిట్టలో ఒక భవనం, 2) కడపలోని తన నివాసాన్ని 'శ్రీరామ చంద్ర భవనం'గా మార్చిఅర్పించటం 3) మద్రాస్ తిరువళి క్కేణిలోని శ్రీ రామజయమందిరం అన్నీ కొదండరామార్పితం చేశారు వాసుదాస కవి. టెంకాయ చిప్ప బిక్షాపాత్ర వలన వచ్చిన ద్రవ్యం, శిష్యులు గురుదక్షిణగా సమర్పించిన డబ్బు, స్వీయ గ్రంథాల అమ్మకం వల్ల వచ్చిన ధనం ఆ రోజుల్లోనే రెండు లక్షల రూపాయలకు పైగా ధనాన్ని వెచ్చించారు. రామార్పణంగా వావికొలను సుబ్బరాయవాసు కవిగారైన ఆంధ్ర వాల్మీకి. ఎంతటి నిస్వార్థమో ఊహకు అందని విషయం. అక్కడ భద్రాచల రామదాసు, ఇక్కడ ఈ వాసు

దాసు శ్రీరామ సేవలో పునీతులై తరించారు.

1920లో ఒంటిమిట్టకు చేరిన వాల్మీకిగారు, ఇంటికి వచ్చిన అతిథి అభ్యాగతి బంధువర్గాలను పోషిస్తూ, పుస్తక ప్రచురణ చేశారు. దేవాలయ ఉత్సవాలు కైంకర్యాలు మహా వైభవంగా దగ్గరుండి జరిపించారు. సాధారణ భక్తులకు తెలియని ఒంటిమిట్ట క్షేత్రాన్ని బహుళవ్యాప్తి చెందించి అశేష భక్త జనానికి ఆకర్షణ కలిగించారు.

## మహా సామ్రాజ్య పట్టాభిషేకోత్సవం

వాల్మీకి రామాయణాన్ని 108 సార్లు పారాయణ చేసి హృదయగతం చేసుకొని ఆంధ్రవాల్మీకం రాసి, పూర్వాంగంగా 'మందరం' రచించి ఆసేతు హిమనగ పర్యంతం హరిద్వార, సింధు, బ్రహ్మపుత్ర మొదలైన 500 దివ్య క్షేత్రాలలో సహస్ర ఘటాభి షేకాలు, కొత్తగా తయారు చేయించిన కనకరత్న కిరీటాలతో మిత్రుల తోడ్పాటుతో శ్రీరామ సామ్రాజ్య పట్టాభిషేక మహాయజ్ఞాన్ని 50 వేల ప్రజల సమక్షంలో నిర్వహించిన మహా భక్త శిఖామణి శ్రీ వావికొలను సుబ్బారావుగారు.

## మందర రచన

వాల్మీకి రామాయణానికి సంస్కృతంలో మహేశ్వర తీర్థ, గోవిందరాజు మొదలైన వారు వ్యాఖ్యానాలు రాశారు. అప్పటికి తెలుగులో ఎవరూ వ్యాఖ్యానం రాయలేదు. ఆ కొరత తీర్చారు ఆంధ్రవాల్మీకి. వాల్మీకి హృదయాన్ని ఆవిష్కరిస్తూ, ఆ అమృతాన్ని అందరూ పొందాలని భావించి తానూ తెలుగులో రాసిన రామాయణం ఆధారంగా కవి వాల్మీకి హృదయానికి అద్దం పడుతూ, తన ప్రయోగ వైశిష్ట్యాలను, ప్రయోగించిన పదాల సొరును, వాటికి పూర్వకవుల ప్రయోగాలు చూపిస్తూ, చమత్కార గర్భిత పదాలకు వివరణ ఇస్తూ, వ్యాకరణాది విశేషాలు తెలియజేస్తూ సంప్రదాయ అర్థాలను సమన్వయ పరుస్తూ వ్రాసిన మహా ఉద్గ్రంథమే వాసుదాసు గారి 'మంధరం'.

రామాయణ బాలకాండ ఒంటిమిట్ట వాల్మీక్యాశ్రమంలోనే రాశారు. నగరి సమీపం మేల్పట్టు గ్రామంలో శ్రీ గుడుపూడి దొరస్వామి నాయుడుగారి ఆహ్వానం మేరకు వెళ్లి 'అయోధ్యకాండ' రాశారు. రావుగారి శిష్యుడు నాయుడుగారు గురుదక్షిణగా రామార్పణం చేసినా స్వామికి చేరలేదు. గుంటూరు మండలం నడిగడ్డ పాలెంలో ప్రణవాశ్రమం నిర్మించి మౌనవ్రతం చేస్తూ 'అరణ్యకాండ' రాశారు. పంచవటి, పంపాసరోవరం, కిష్కింద, మాల్యవంతం, భద్రాచలం నుంచి హంపి వరకు స్వయంగా దర్శించి తుది నిర్ణయం చేసి రాశారు. తూర్పుగోదావరి జిల్లా కోలంక జమీందారిణి శ్రీ రాజారావు రామాయమ్మగారు వాసుదాసుగారిని ఆహ్వానించి ఒక వనంలో విడిది ఏర్పాటు చేయగా, మౌనవ్రతంతోనే, అవధూత నియమాలు పాటిస్తూ ఒక సంవత్సరంలో కిష్కింద,

సుందర, యుద్ధ, ఉత్తర కాండలు రచించారు. 70 ఏళ్ళ వయసులో, రోజుకు 20 గంటలు రామకావ్యానికే వినియోగించారు.

## మందరం చివరలో చెప్పిన పద్యం-

'ఆ తల్లి గారిట్లు లాదరంబున బ్రోవ-యామార్తి సుబ్బా దాసార్య వరుదు - శిష్యుడై హితుడయి, చేదోడు నగుచు-నిఖిల కార్యంబుల నిర్వహింప
సీతమ్మ ప్రావుగ చిల్లర లక్ష్మమ్మ-ఏక పున్నమ్మయు నెల్ల విధుల-మేనిని బ్రోవంగ మేకొన
నీ విట్లు-వీరి నొసంగిన కారణమున
సొంతముగ గ్రంథమంతయు సలుపగంటి-నేక చిత్తంబు తోడ, నే లోకమందు
నైన వీరల తోడి పోత్తమరియుండ-జేయవే జానకీ నాథ! శ్రీ సనాథ"

మంధరంను కోదండ రామునికి అర్పించటానికి వాసుదాసుగారు ఒంటిమిట్ట వచ్చారు. 1934 జ్యేష్ఠ శుద్ధ ద్వాదశినాడు భక్తులతో ఆలయం క్రిక్కిరిసి ఉన్నది స్వామికి పూజ అయ్యాక 'మంధరం'ను తన బంగారు కలంతోపాటు స్వామికి సమర్పించారు. "కోదండరాముడు నాకిచ్చిన బలం కలం. కనుక దానిని స్వామి పాదాల చెంత ఉంచాను. రాముడు నాతో పలికిస్తేనే రాయగలిగాను. నేను రాసినవన్నీ ముద్రించటానికి డబ్బు కావాలి. వయసు మీదపడి బలహీనుడనయ్యాను. రాముని సొమ్ము రామునికే అర్పించాను. కార్యభారానికి రాముడే సమర్థుడు" అన్నారు వినయంగా ఆంధ్ర వాల్మీకి.

"శ్రీరామ భిక్షాం దేహి" అంటూ వాసుదాసుగారు ఊరూ వాడా కాలినడకన నిరాహారులై ఎండనక, వాననక దేశమంతా తిరిగి తాను పాదం పెట్టిన చోటల్లా కనకవర్షం కురిసింది. దాన్ని చేతితోనైనా తాకే వారు కాదు. ప్రక్కవారు లెక్క పెట్టాల్సిందే, వాళ్ళే ఖర్చు చేయాల్సిందే. విలువ నిలవ చూసే పద్ధతి వారికి లేదు. ఉదాసీనులు. శిష్యాగ్రణి శ్రీ దాస శేషస్వామి దాసుగారి పాదసేవ చేస్తూ, పట్టాభిషేకానికి రెండు సంవత్సరాల ముందు వచ్చారు. దాసుగారి రచనా భారమంతా ఆయనే సమర్థంగా చేసేవారు. ఎప్పటికప్పుడు లోటుపాట్లు లేకుండా కట్టుదిట్టం చేశారు. దీనితో తేరగా తినటానికి వచ్చిన బంధుగణానికి నోట్లో పచ్చి వెలక్కాయ పడినట్లై నెమ్మదిగా జారుకొన్నారు. ఊళ్ళో కలహాలవలన దేవాలయానికి అర్పించిన వస్తువులు ఆభరణాలు, పెద్ద గంటతోసహా దాసుగారింట్లోనే ఉన్నాయి. దేవాలయానికి ఎదురుగా శ్రీరామ సేవా కుటీరం నిర్మించి, శ్రీ వరదాభయ కోదండ రాములు అనే పేరుతో 'నకిలీ సన్నిధి' ఏర్పరచారు.

## దాసుగారి వీలునామా

తాను సంపాదించిన సర్వస్వం ట్రస్టీలను ఎన్నుకొని వారి ద్వారా శ్రీరామునికి అర్పిస్తానని ఒక సభలో ప్రకటించారు. తాను నడుపుతున్న 'భక్త సంజీవని' పత్రిక

లోనూ అలానే రాశారు. కాని అలా చేయలేదు. చనిపోవటానికి 13 రోజుల ముందు ఒంటిమిట్ట వచ్చారు.. చాలా నీరసంగా ఉండటం చేత స్వామిని దర్శించి మద్రాస్ వెళ్ళారు. అక్కడ అవసాన దశలో తమ తమ్ముడి కొడుకు శ్రీ లక్ష్మాజీరావును ట్రస్టీగా చేసి, శ్రీ వరదాభయ కోదండరామస్వామి పేర తమకున్న యావదాస్తీ సమర్పిస్తూ వీలునామా రాశారు. అప్పటికి వారి ముద్రితా ముద్రిత గ్రంథాలు, ఆభరణాలు తప్ప ద్రవ్యం ఏమీ లేదు. రెండు వందలు మిగిలితే ఉత్తర క్రియలకు వాడమని రాశారు. నమ్మిన శిష్యుడు శ్రీ దాస శేష స్వామికి చక్రాంకం వేసే శంఖ చక్రాలు భక్తి సంజీవని పత్రికా నిర్వహణ అధికారమిచ్చారు. ఆంధ్రవాల్మీకి వాసుదాసకవి శ్రీ వావికొలను సుబ్బారావుగారు మద్రాస్‌లోనే 73వ ఏట 1-8-1936 పరమపదించారు.

## దాసుగారి తదనంతరం

దాసుగారి నిర్యాణం తర్వాత లక్ష్మాజీరావుకు నిర్వహణ బాధ్యత చేతకాలేదు. ప్రజలలో అసమ్మతి పెరిగితే, కడప బారిస్టర్ శ్రీ కృష్ణస్వామి ఒక భక్త సంఘం ఏర్పాటు చేసి రావుగారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ స్వామి వారి ఆస్తినంతటిని సంఘానికి దఖలు చేయమని కోరారు. ఇంతలో రావుగారింట దొంగలుపడి మొత్తం దోచుకుపోయారు బ్యాంకులో ఉన్న స్వామి నగలు మాత్రం దక్కాయి. చేసేదిలేక రావు గారు కడప వెళ్లి బారిస్టర్‌గారి సమక్షంలో దాసుగారు రాసిన వీలునామా ప్రకారం అంతా భక్త సంఘానికి బదిలీ చేసి ఊపిరి పీల్చుకొన్నారు.

## దాసుగారులేని లోటు

దాసుగారు జీవించి ఉండగానే స్వామి నిత్యభోగానికి ప్రయత్నించారు. వారున్నప్పుడు నిత్యపూజా కైంకర్యాలు ఉత్సవాలు మహా వైభవంగా జరిగేవి. గుంటూరు జిల్లా వెళ్ళగానే మళ్ళీ పరిస్థితి మామూలయింది. బారిస్టర్‌గారి పూనికతో మళ్ళీ వైభవం వచ్చింది. 1949 ట్రస్టీ పదవి నుంచి విరమించుకోగా, వితరణశీలి శ్రీ పుట్టం రెడ్డి రమణారెడ్డి ట్రస్టీగా వచ్చి, దేవాలయ ఆస్తులను ఇతరులనుంచి స్వాధీనం చేసుకొని ఆలయానికి దఖలు పరచి 'నిత్య నైవేద్య పూజా నిధి' ఏర్పరచి లోటు లేకుండా చేశారు. దాసుగారి కోరిక 'నిత్యభోగ కల్పనం' రెడ్డిగారి వలన తీరింది. శ్రీ దాస శేషస్వామి దాసుగారి రచనలన్నీ పునర్ముద్రణ చేసి జిజ్ఞాసువులకుందుబాటులోకి తెచ్చారు.

## దాసుగారి రచనలు

1) ఆంధ్రవాల్మీకి రామాయణం, 2) శ్రీకృష్ణలీలామృతము, 3) ద్విపద భగవద్గీత, 4) ఆర్య కథానిధులు, 5) ఆర్య చరిత్రరత్నావళి, 6) సులభ వ్యాకరణములు, 7) శ్రీకుమారాభ్యుదయము (రమాకుమార చరితం), 8) గాయత్రీ రామాయణం, 9)

శ్రీరామనుతి, 10) కౌసల్యా పరిణయం, 11) సుభద్రా విజయం నాటకం, 12) హితచర్యమాలిక, 13) ఆధునిక వచనరచనా విమర్శనం, 14) పోతన నికేతన చర్చ, 15) పోతరాజు విజయం, 16) రామాశ్వమేధము, 17) ఆంధ్ర విజయము, 18) టెంకాయచిప్ప శతకము, 19) ఉపదేశ త్రయము, 20) మంధరము, 21) శ్రీరామావతార తత్వములు, 22) శ్రీకృష్ణావతార తత్వములు, 23) దేవాలయతత్త్వము, 24) దండక త్రయము.

## శ్రీ సీతారామ కల్యాణం

ఒంటిమిట్టలో శ్రీ సీతారామస్వామి కల్యాణం శ్రీరామనవమినాడు కాక చైత్రపౌర్ణమినాడు రాత్రి వేళ జరగటం విశేషం. మర్నాడు ఉదయం రథోత్సవం 'మెరవణి' చేస్తారు. సిద్ధవటం పాలించిన మట్లి రాజులకాలంలో కల్యాణం 5 రోజులు రాత్రిపూట నిర్వహించేవారు. బుక్కరాయల కాలంలో చైత్ర శుద్ధ నవమి నుంచి కళ్యాణ ఉత్సవాలు ప్రారంభమై, రథత్సవంతో ముగిసేవి. శ్రీరామనవమినాడు పోతన జయంతి నిర్వహిస్తున్నారు.

## బ్రహ్మోత్సవాలు

1356లో బుక్కరాయుల కాలంలో స్వామివారికి బ్రహ్మోత్సవాలు ప్రారంభమయ్యాయి. ఆయన చంద్రవంశం రాజు కనుక చంద్రుడు శ్రీరామచంద్రుని కల్యాణం తిలకించి పులకించాలని పౌర్ణమినాటి రాత్రి సీతారామ కల్యాణం ఏర్పాటు చేశాడు. ఇది చంద్రుడికి శ్రీరాముడు ఇచ్చినవరం కూడా అంటారు. చైత్ర శుద్ధ నవమి నుంచి బహుళ విదియ వరకు బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. చంద్రుని వెలుగుల్లో స్వామివారి బ్రహ్మోత్సవాలను ఇక్కడ నిర్వహించడం ఈ ఆలయ ప్రత్యేకత. దీని వెనుక ఒక పురాణగాథ వుంది. క్షీరసాగర మథనం తరువాత మహాలక్ష్మీదేవి అమ్మవారిని నారాయణుడు తన సతీమణిగా స్వీకరించాడు. పగలు జరిగే స్వామివారి వివాహాన్ని తాను చూడలేకపోతున్నానని ఆమె సోదరుడు చంద్రుడు స్వామివారికి విన్నవించగా ఒంటిమిట్టలో వెన్నెల వెలుగుల్లో తన కల్యాణాన్ని వీక్షించవచ్చని వరమిచ్చాడు. దాని ప్రకారమే రాత్రిళ్లు ఇక్కడ స్వామివారి బ్రహ్మోత్సవాలను నిర్వహిస్తారు. ప్రతి యేటా శ్రీరామనవమి ఉత్సవాలు తొమ్మిది రోజులపాటు ఘనంగా నిర్వహిస్తారు. ప్రశాంత వాతావరణానికి నెలవైన ఈ ఆలయంలో పర్యాటక శాఖవారు ఏర్పాటు చేసిన విద్యుద్దీపాల వెలుగులు ఎంతో శోభనిస్తున్నాయి.

## నవ్యాంధ్ర ప్రదేశ్‌లో ఒంటిమిట్ట

నవ్యాంధ్ర ప్రదేశ్ ఏర్పడ్డాక భద్రాచలం తెలంగాణాలోకి వెళ్ళాక ఒంటిమిట్టకు విశేష ప్రాధాన్యం తెచ్చాడు ముఖ్యమంత్రి చంద్రబాబు. కళ్యాణ మండపం కట్టటానికి

100 కోట్లు సాంక్షన్ చేశాడు. ఆలయ పూజాదికాలు తిరుమల తిరుపతి దేవస్థానానికి అప్పగించాడు. మళ్ళీ ప్రాభవం తీసుకొచ్చాడు.

## ఒంటడు మిట్టడు ఒంటిమిట్ట

ఒంటిమిట్ట రామాలయం అంటే ఒంటడు మిట్టడు అనే బోయసోదరులే ముందు గుర్తుకు రావాలి. విజయనగరాన్ని కంపరాయలు పాలిస్తున్నప్పుడు చెరువులు నిర్మించి గ్రామాలు నెలకొల్పి, వ్యవసాయాన్ని పెంచి సామ్రాజ్య వైభవాన్ని ద్విగుణీకృతం చేశాడు. అయన ఎప్పుడు ఇక్కడికి వచ్చినా ఒంటడు, మిట్టడు అనే బోయ సోదరులు ఆయనకు సకల సౌకర్యాలు కలిపించేవారు. వారి భక్తీ ఆసక్తి వినయాలకు రాజు సంతోషించి ఏదైనా కోరుకోమంటే ఇక్కడి రామాలయం అభివృద్ధి చేయమని అడిగారు. వెంటనే డబ్బు శాంక్షన్ చేసి ఖర్చుపెట్టే బాధ్యత ఈ సోదురులపై పెట్టాడు. అ డబ్బులో ఒక్క కానీ కూడా వ్యర్ధం చేయకుండా ఆలయాన్ని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దారు. కంపరాయలు మళ్ళీ వచ్చి చూసి పరమానంద భరితుడై ఇంకా ఏదైనా కావాలంటే చేస్తాను అన్నాడు. దానికి ఆ సోదరులు ఈ గ్రామం తమ పేర వర్ధిల్లేట్లు చేయమని కోరారు. అలాగే అని ఆ గ్రామానికి వారిద్దరి పేరు వచ్చేట్లు ఒంటిమిట్ట పేరు పెట్టినట్లు స్థానిక కథనం. ఆ బోయసోదరుల పూర్వజన్మ సుకృతం అలాంటిది. స్వామి సేవలో తరించారు. తమ పేర్లను సార్ధకమూ చేసుకోగలిగారు. వీరిద్దరినీ మర్చిపోతే చరిత్ర మనల్ని క్షమించదు.

## విదేశీ, దేశీ యాత్రికులు

క్రీ.శ. 1652లో ఫ్రెంచ్ యాత్రికుడు జీన్ బాప్టిస్ట్ ట్రావర్నర్ ఒంటిమిట్ట ఆలయం చూసి, ఇక్కడి ఆలయ శిల్పవిన్యాసాన్ని వేనోళ్ళ మెచ్చాడు. ఇక్కడి గోపురం అరుదైన వాటిల్లో ఒకటిగా పేర్కొన్నాడు. సంకీర్తనాచార్యుడు అన్నమాచార్య ఈక్షేత్రం సందర్శించి రామునిపై కీర్తనలు రాసి, రామునికి పాడి వినిపించాడు. మట్లి రాజుల ఆస్థాన కవి ఉప్పుగుండూరు వేంకటకవి స్వామిపై 'దశరథ రామా!' మకుటంతో శతకం రాశాడు. స్వామి సేవలో తరించిన వరకవి నల్లకాల్వ అయ్యప్ప కాలంలో నెల్లూరు తిరుపతి బద్వేలు, నందలూరు రాజంపేట వరకు తురుష్కులు జరిపిన దాడులను 'శత్రు సంహార వేంకటాచల విహార' అనే మకుటంతో శతకం రాశాడు. భవనాశి ఓబుల దాసు గురించి చెప్పుకొన్నాం. ఆయన రాసిన పదమాలికలు కొన్ని తెలుసుకొందాం– "రామనామము రామనామము రమ్యమైనది రామనామము" అనేది ఇప్పటికీ జనం పాడుకొంటున్నారు. అలాగే "రాముని దాసులమయ్యా–ప్రేమను గనుగొనరయ్యా–పరులమాటకు మేము రాము–పరుల బాటకు నడ్డపడము–పరసతులను మేము పాలించి చూడము–తరుణులందరు మాకు తల్లి తోడులయ్యా" మరొకటి "చెప్పవే తల్లి చెప్పవే సీతమ్మ–నీవైన చెప్పవే రాముతోడ" అంటూ భక్తీ ఆర్తీలతో పాడి తరించాడు.

## పోతన సాహిత్య పీఠం

1995లో ఒంటిమిట్ట ప్రాంత కవులు తెలుగుపండితులు అధ్యాపకులు కలిసి 'పోతన సాహిత్య పీఠం' ఏర్పాటు చేసి కోదండరామాలయంలో సాహితీ సమావేశాలు, ధార్మిక ప్రసంగాలు నిర్వహిస్తున్నారు. భాగవత సప్తాహాలు, ధనుర్మాసంలో నిత్యం ధార్మిక ప్రసంగాలు ఏర్పాటు చేస్తున్నారు. వాసు దాసుగారు మొదలు పెట్టిన పోతన జయంతిని ఆలయ అధికారులతో కలిసి ఘనంగా నిర్వహిస్తున్నారు. ప్రముఖ భాషా పరిశోధకులు, కడప బ్రౌన్ లైబ్రరీ ట్రస్ట్ సెక్రెటరి శ్రీ కట్టా నరసింహులు ఇక్కడ అనేక సాహిత్యకార్యక్రమాలు బహు ఉత్సాహంగా జరుపుతున్నారు.

## ఒంటిమిట్ట క్షేత్రం అభివృద్ధికి ఆలోచనలు

1) ఒంటిమిట్ట రైల్వేస్టేషన్‌లో వెంటనే రైల్వేహాల్ట్ ఏర్పాటు చేయాలి.

2) కళ్యాణమండప నిర్మాణం త్వరలో పూర్తి చేసి సకల వసతులు కల్పించాలి. ఇక్కడ ఆంధ్రవాల్మీకిగారి అద్భుత శిలావిగ్రహం నెలకొల్పాలి. శ్రీరామునిపై ఆయన రాసిన ముఖ్య పద్యాలను గోడలపై రాయించాలి. అలాగే అయ్యలరాజు రామభద్రుని పద్యాలు రాయించాలి.

3) వాసుదాసుగారి ముఖ్యపద్యాలు మంచి గాయకులతో పాడించి రికార్డ్ చేసి సిడిలుగా తేవాలి. తిరుమలలో అన్నమయ్య కీర్తనలు వినిపిస్తున్నట్లు, నిరంతరం దాసుగారి పద్యాలు ఆలయం బయటా, ఊరిలో వినబడేట్లు ఏర్పాటు చేయాలి.

3) సామాన్యులకు ధర్మసత్రాలు ఏర్పాటు చేయాలి.

4) ఆలయంలో పూజాదికాలలో మంత్రాలు తంత్రాలతోపాటు సమానంగా ఉండాలి.

5) ఏకాంత సేవ మొక్కుబడిగా కాక అర్ధవంతంగా, స్వామిపై కీర్తనల గానంతో పరవశించేట్లు నిర్వహించాలి.

6) ఆలయ చరిత్రను చిన్న పుస్తకాలుగా ముద్రించి అందుబాటులోకి తేవాలి.

7) ఆధ్యాత్మిక గ్రంథ విక్రయశాల నెలకొల్పాలి.

8) శనివారం మాత్రమేకాక స్వామి లడ్డూ ప్రసాదం నిత్యం అమ్మే ఏర్పాటు చేయాలి.

9) మరింత విస్తృతంగా ఒంటిమిట్ట కోదండరామ వైభవాన్ని ప్రచారం చేయాలి. దీనికోసం ప్రత్యక్ష ప్రసారాలు కూడా నిర్వహించాలి.

## సమాప్తం

మనవి- ఒంటిమిట్ట శ్రీ కోదండరామ దేవాలయంపై రాసిన 4 ఎపిసోడ్‌లకు ముఖ్య ఆధారం 1) శ్రీ రంగావఝుల వేంకటేశ్వర్లుగారి రచన - శ్రీ మదొంటిమిట్ట కోదండ రామ దేవాలయ దివ్యచరిత్రము 2) శ్రీ అలపర్తి పిచ్చయ్య చౌదరి రచన - ఒంటిమిట్ట

రాముడు కోదండరాముడు పుస్తకాలు. వీరికీ ఈ పుస్తకాలు మా ఒంటిమిట్ట యాత్ర సందర్భంగా మాకు ఆతిధ్యమిచ్చిన డా. శివకుమార్ గారికీ, ఈ పుస్తకాలు నాకు అందజేసిన వారి తమ్ముడు లాయర్ శ్రీ ఆదినారాయణరావు గార్లకు ధన్యవాదాలు.

## 2) సిద్ధవటం

సిద్ధవటం, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములోని కడపజిల్లా, సిద్ధవటం మండలంలోని గ్రామం. కడప నుంచి భాకరాపేట మీదుగా బద్వేలు వెళ్ళే మార్గంలో పెన్నా నది ఒడ్డున సిద్ధవటం ఉంది. కడప నుంచి ఇక్కడికి 20 కి.మీ. దూరం. సిద్ధులు నివసిస్తున్న వట వృక్షాలు (మఱ్ఱిచెట్లు) విస్తారంగా ఉన్నందున ఈ ప్రాంతానికి సిద్ధవటం అని పేరు వచ్చింది. సిద్ధవటం పరిసర ప్రాంతాల్లో జైనులు నివసిస్తూ ఉండేవారు. 1807 నుంచి 1812 వరకు సిద్ధవటం జిల్లా కేంద్రంగా ఉండేది. అయితే పెన్నానది పొంగినప్పుడల్లా బయటి ప్రపంచంతో సంబంధాలు తెగిపోతూ ఉండడంతో జిల్లా కేంద్రాన్ని అక్కడి నుంచి కడపకు మార్చారు. శ్రీశైలానికి దక్షిణద్వారం సిద్ధవటం. 1956లో సిద్ధవటం కోట పురావస్తుశాఖ ఆధీనంలోకి వచ్చింది. సిద్ధవటం సమీపంలో ఏటి పొడవునా దేవాలయాలున్నాయి. రంగనాథస్వామి ఆలయం చెప్పుకోదగినది. ఇక్కడి స్మశానవాటికలో భాకరాపంతులు పేర నిర్మించిన 16 స్తంభాల మంటపం ఉంది. సిద్ధవటం దోసకాయలకు ప్రసిద్ధి. ఇది సమీప పట్టణమైన కడప నుండి 24 కి.మీ. దూరంలో ఉంది.

## చరిత్ర

విజయనగర సామ్రాజ్య చక్రవర్తియైన వీర నరసింహదేవరాయలు క్రీ.శ.1506 నుంచి 1509 వరకూ సామ్రాజ్యాన్ని పరిపాలించారు. ఆయన పరిపాలన కాలంలో ఈ ప్రాంతాన్ని సంబెట గురవరాజు అనే సామంతుడు పరిపాలిస్తూండేవాడు. సంబెట గురవరాజు ఘోరమైన శిక్షలు విధించేవారు. ప్రజల వద్ద డబ్బు స్వీకరించేప్పుడు సొమ్ము ఇవ్వనివారి స్త్రీల సంఖ్యను పట్టి అసభ్యంగా వారి స్తనాలకు చిరతలు పట్టించేవాడు. కూచిపూడి భాగవతులు ఈ గ్రామానికి వచ్చి ప్రదర్శనలు చేస్తూన్నప్పుడు గురవరాజు ఘోరకృత్యాలను చూసి తట్టుకోలేక విద్యానగరం (విజయనగరం) వెళ్ళిపోయారు. వీర నరసింహరాయల సమక్షంలో కూచిపూడి భాగవతులు ప్రదర్శన ఇచ్చేప్పుడు అవకాశం వినియోగించుకుని గురవరాజు వేషం, ఆయన ధనం సంపాదించే ప్రయత్నాలు చేయడం, చివరకు యువతి వేషం వేసుకున్న నటుడిని అసభ్యంగా స్తనాలకు చిరుతలు పట్టించడం వంటివి ప్రదర్శించారు. ఈ అసాధారణ ప్రదర్శన చూసి, ఇది ఇలా ఎందుకు ఉందని మంత్రులను, కొందరు సన్నిహితులైన సామంతులను ప్రశ్నించారు. వారిలో కొందరు సంబెట గురవరాజు చేస్తూన్న ఘోర కార్యకలాపాల గురించి వివరించారు. దీనిపై ఆగ్రహోదగ్రుడైన రాయలు తర్వాత రోజు ఉదయాన్నే గురవరాజుపైకి సైన్యాన్ని పంపి,

బందీని చేసి తీసుకువచ్చి, మరణశిక్ష విధించి వధించారు.

## సిద్ధవటం కోట

పవిత్ర పెన్నానది ఒడ్డున క్రీ.పూ. 40-30 సంవత్సరాల మధ్యకాలంలో సిద్దవటం కోట రూపుదిద్దుకుంది. సుమారు 36 ఎకరాలపైబడి విస్తీర్ణంలో ఏర్పాటైన ఈ కోటను 18 రాజవంశీయులు పాలించారు. మౌర్యుల నుంచి తూర్పు ఇండియా వర్తక సంఘం వరకూ ఈ కోటను పాలించారు. 1543 నుంచి 1579 వరకూ సాగిన పాలనను స్వర్ణయుగంగా పరిగణిస్తారు. 1605 వరకూ ఉన్న మట్టి కోట కాస్తా రాతికట్టడంగా మారింది. క్రీ.శ.1792లో టిప్పుసుల్తాన్ చేతి నుంచి నైజాము నవాబుల పాలనలోకి, వారి నుంచి 1880లో తూర్పు ఇండియా వర్తక సంఘం ఆధీనంలోకి ఈ కోట చేరింది. బ్రిటిష్ పాలనలో 1808 నుంచి 1812 వరకూ ఇది తొలి జిల్లా కేంద్రంగా ఉండి, పరిపాలన కేంద్రంగా భాసిల్లింది. ఇక్కడ మధ్యయుగంనాటి కోట ఒకటి ఉంది. దక్షిణం వైపు పెన్నా నది, మిగిలిన మూడు వైపుల లోతైన అగడ్తతో శతృవులు ప్రవేశించేందుకు వీలు కాని రీతిలో ఈ కోట నిర్మించబడింది. మట్లి రాజులు నాయంకరంగా ఈ కోటను పాలించే నాటికి ఇది మట్టి కోట. శ్రీ కృష్ణదేవరాయల అల్లుడు వరదరాజు మొదట ఈ కోటను పాలించాడు. అంతకు ముందు ఈ కోట ఉదయగిరి రాజ్యంలో ఉండేది. రెండవ వెంకటపతిరాయలకు మట్లి ఎల్లమరాజు యుద్ధాల్లో బాగా సహకరించాడు. అందుకు గుర్తుగా ఎల్లమరాజుకు అమర నాయంకరంగా సిద్ధవటాన్ని ఇచ్చాడు. మరికొన్ని ప్రాంతాలను సిద్ధవటానికి చేర్చాడు. మట్లి అనంతరాజు మట్టికోటను శతృదుర్భేధ్యమైన రాతికోటగా నిర్మించాడు. ఈయన తన తండ్రి పేర ఎల్లమరాజు చెరువును, తన పేర అనంతరాజు చెరువును త్రవ్వించాడు. అనంతరాజు 'కకుత్స్థ విజయము' అనే కావ్యాన్ని రచించాడు. ఈయన ఆస్థానంలో ఉప్పుగుండూరు వెంకటకవి, కవి చౌడప్ప ఉండేవారు. మట్లి రాజుల పతనం తర్వాత ఔరంగజేబు సేనాని మీర్ జుమ్లా సిద్ధవటాన్ని ఆక్రమించి పాలించాడు. ఆ తర్వాత ఆర్కాటు నవాబులు సిద్ధవటాన్ని స్వాధీనం చేసుకున్నారు. కడపను పాలిస్తున్న అబ్దుల్ నబీఖాన్ 1714లో సిద్ధవటాన్ని తన ఆధీనంలోకి తెచ్చుకొన్నాడు. మయానా నవాబులు సిద్ధవటాన్ని పాలించారు. 1799లో సిద్ధవటం ఈస్టిండియా కంపెనీ వశమయింది.[4] కోట: కోటకు పడమట, తూర్పున రెండు ద్వారాలున్నాయి. ముఖద్వారం ఇరువైపులా ఆంజనేయుడు, గరుత్మంతుడు శిల్పాలు ఉన్నాయి. పశ్చిమ ద్వారం ఇరువైపులా నాట్య భంగిమలో అందమైన శిల్పాలు ఉన్నాయి. పశ్చిమ ద్వారం లోపలి పైభాగాన రాహు గ్రహణం పట్టు విడుపులు ఉన్నాయి. కోట మధ్య భాగంలోని అంతఃపురం శిథిలమై ఉంది. రాణి దర్బారు, ఈద్గా మసీదు, సమీపంలో నగారాఖానా ఉన్నాయి. నగారాఖానా వెనుక కోట గోడకు మధ్య తాగునీటి కోనేరు ఉంది. కోటలో సిద్ధవటేశ్వరస్వామి

ఆలయం, ఎదురుగా నంది విగ్రహం ఉన్నాయి. శిథిలమవుతూ ఉన్న కామాక్షి ఆలయాన్ని మరమ్మత్తులు చేసి ఉంచారు. తూర్పు ద్వారానికి సమీపంలో బిస్మిల్లా షావలి దర్గా ఉంది. టిప్పు సుల్తాన్ కాలంలో దీన్ని నిర్మించారు. ప్రక్కనే మసీదు ఉంది. మసీదుకు తూర్పుగా కోటగోడలో సొరంగ మార్గాన్ని ఏట్లోకి నిర్మించారు. చక్రయంత్రం ద్వారా ఏట్లో నీటిని మసీదు తొట్టిలోకి తోడేవారు.

లంకమలలోని నిత్యపూజ కోనలో మహాశివరాత్రి ఉత్సవాలు ప్రతి సంవత్సరం మూడు రోజులపాటు వైభవంగా నిర్వహించేవారు. జిల్లాలో పెద్దయెత్తున శివరాత్రి ఉత్సవాలు జరిగే ప్రాంతాలలో పొలతల తరువాతి స్థానం నిత్యపూజ కోనదే.

సిద్ధవటంలో 120 దేవాలయాలు ఒకప్పుడు మహా వైభవంగా ఉండేవి. అన్ని దేవాలయాలు దైవారాధనతో కళకళలాడేవి. నిధులు నిక్షేపాలకోసం అన్వేషణ ప్రారంభమై దేవాలయాల, విగ్రహాల ధ్వంసరచన హింసనచన జరిగి ప్రస్తుతం శిధిలావస్థలో చాలా ఉన్నాయి. విగ్రహాల కళ్ళూ కాళ్ళూ ముక్కు మూతి కోల్పోయినవి ఎన్నో కనిపిస్తాయి. రంగనాధస్వామి ఆలయంలో స్వామి కాళ్ళు విరగ్గొట్టారు. బాల బ్రహ్మేశ్వరాలయం, దక్షిణ ద్వారం, ఆంజనేయాలయం, గంట సిద్దేశ్వరాలయం, వరసిద్దేశ్వరాలయం, విమల సిద్దేశ్వరాలయం, జ్యోతినాథ రంగనాథ ఆలయాలు మొదలైనవి 18 వంశాల రాజులచేత చక్కగా పోషింపబడి, చారిత్రిక ప్రసిద్ధి పొంది, నేడు దిక్కూ దివాణం లేకుండా ఉండటం విచారకరం. ఒకప్పుడు 'దేవ భూమి' అనిపించుకొన్న సిద్ధవటం నేడు దెయ్యాల దిబ్బగా మారటం శోచనీయం. ఇక్కడి శ్రీ జ్యోతి సిద్దేశ్వర స్వామి దేవాలయం బహు ప్రసిద్ధి చెందినది.

16వ శతాబ్ది శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి సిద్ధవటంలో చాలాకాలం తపస్సు చేశారు. సిద్ధవటం పాలించిన మహా భక్తుడు పద్మ చోళ మహారాజు నిత్యం ఈ ఆలయాలన్నీ దర్శించి పూజించిన తర్వాతే మంచినీరు త్రాగి భోజనం చేసే వాడట. రాజుకు తగ్గట్లే రాణులు కూడా నిత్య పెన్నానదీ స్నానంతో పునీతులై దైవ దర్శనం చేసి పూజాదికాలు నిర్వహించేవారు. ఎందరో రాజులు ఇక్కడి ఆలయ దేవతలకు బంగారు ఆభరణాలు కానుకలు సమర్పించారు. ఇవే 'ట్రెజర్ హంటర్స్'కు ఆదాయ మయ్యాయి ఇప్పుడు. కడప జిల్లా 'ఊటీ'గా సిద్ధవటంను భావిస్తారు. అంతటి ఆహ్లాద వాతావరణం ఇక్కడ ఉంటుంది. కడప పర్యాటక విశేషాలను తెలియజేసే 30 పుస్తకాలను శ్రీ సిద్ధవటం సీతారామయ్య రచించి వ్యాప్తి చేశారు. జిల్లాలోని వారసత్వ, చారిత్రిక కట్టడాల విశేషాలను ఆయన నవతరానికి అందించి ప్రశంసలందుకొన్నారు.

## జ్యోతి గ్రామం

సిద్ధవటానికి 6 కిలో మీటర్ల దూరంలో జ్యోతి గ్రామం ఉంది. ఇక్కడ కొన్ని

శతాబ్దాల క్రితం సుమారు 5 ఎకరాల విస్తీర్ణంలో శ్రీ సిద్దేశ్వర స్వామి దేవాలయం ప్రక్కనే శ్రీకామాక్షీ ఆలయం ఎదురుగా సుమారు 50 అడుగుల ఎత్తున్న గోపురం ఉండేవి. వీటిని పల్లవ రాజులు నిర్మించారు. పెన్నానది వరదలలో ఇవన్నీ ఇసుకలో కూరుకుపోయి బయటి ప్రపంచంతో సంబంధం లేకుండా పోయాయి. సుమారు 15 ఏళ్ళ క్రితం పురావస్తుశాఖ ఇక్కడ త్రవ్వకాలు జరుపుతుంటే గోపురం పైభాగం కనిపిస్తే క్రమంగా క్రిందదాకా త్రవ్వితే ఇవన్నీ బయటపడ్డాయి. నాలుగు వైపులా గోడలున్నట్లు, ఒకవైపు గోడ సగం శిధిలమై కనిపిస్తోంది. ఆ ప్రదేశంలో వివిధ సైజుల్లో శివలింగాలు ఎక్కడ పడితే అక్కడ కనిపిస్తాయి. ఇసుకలో సగం కూరుకు పోయిన కుమారస్వామి విగ్రహం కనిపిస్తుంది. సిద్దేశ్వరాలయం కొంచెం ఎత్తు మీద ఉంటుంది. అమ్మవారి గుడి కింద ఉంటుంది. వీటిని శ్రీ శైలం దేవస్థానం దత్తత తీసుకొని పరిరక్షిస్తోంది. పూర్వం దుర్గమారణ్య మార్గంలో నడిచి వచ్చి స్వామి దర్శనం చేసుకొనేవారు భక్తులు. "హరహరమహాదేవ" నామంతో చుట్టుప్రక్కల గ్రామాలు పులకించిపోయేవి. దీన్ని 'తపో భూమి'గా భావించేవారు. అలాంటిది నేడు శాపగ్రస్త భూమి అయింది.

## 3) పుష్పగిరి

పుష్పగిరి ఆలయముల సముదాయము ఆంధ్రప్రదేశములోని కడపజిల్లా, చెన్నూరు మండలములోని పుష్పగిరి గ్రామంలో ఉంది. కడప జిల్లా కేంద్రమైన కడప పట్టణమునకు 16 కిలోమీటర్ దూరములో ఉంది. అనేక శైవవైష్ణవాలయముల సముదాయము పుష్పగిరి.

## పేరు

పుష్పగిరి అనే పేరు ఈ గ్రామానికి రావటం వెనుక పురాణములలో ఉటంకింపబడిన ఒక గాథను పేర్కొంటారు. కశ్యప మహర్షికి ఇరువురు భార్యలు. వినత, కద్రువ. వినత, కద్రువ ఇరువురూ గర్భం దాల్చి ఉండగా ఒకనాడు వినత కద్రువతో ఆడిన ఆటలో ఓడి, కద్రువకు, కద్రువ సంతతియైన సర్పములకు దాస్యము చేయుటకు అంగీకరిస్తుంది. వినత వైనతేయుడైన గరుత్మంతునికి జన్మమివ్వగా, గరుత్మంతుడు ఒకనాడు తన తల్లిని గూర్చి తమ దాస్యమునకు కారణమును అడిగాడు. దానికి ఆమె ఇచ్చిన సమాధానమును విన్న గరుత్మంతుడు కద్రువను చేరి, తామిద్దరికీ దాస్యవిముక్తి కల్గించమని ప్రార్థించగా కద్రువ, తనకూ, తన బిడ్డలకూ అమృతాన్ని స్వర్గము నుండి తెచ్చి ఇస్తే దాస్యం తొలగుతుందని చెప్పగా దానికి సమ్మతించిన గరుత్మంతుడు, దేవేంద్రునితో విరోధించి అమృతభాండమును స్వర్గము నుండి తెచ్చే సమయంలో ఆ పాత్రనుండి ఒలికిన రెండు అమృతబిందువులు ఈ ప్రదేశములోని ఒక సరస్సులో జారిపడ్డాయి. ఆ సరోవరమునందు స్నానము చేస్తే నిత్యయవ్వనులై, జరా

మృత్యుభయము లేకుండా ఉంటారు.

ఈ విషయమును గమనించిన దేవతలు, మానవులు మృత్యుహీనులగుదురేని సృష్టిక్రమమునకు విరోధమగునని భావించి శ్రీ మహావిష్ణువును శరణు వేడగా విష్ణువు గరుత్మంతుని ఆ సరోవరమును ఒక పర్వతభాగముతో కప్పివేయమని ఆజ్ఞాపించాడు. కానీ అమృతబిందు మహత్యము వలన ఆ పర్వతభాగము సరోవరమునందు పుష్పంలాగా తేలియాడింది. ఆనాటి నుండి ఈ ప్రదేశమునకు పుష్పగిరి అనే పేరు సార్థకమయిందని స్థలపురాణం.

ఈ విషయం తెలిసి దేవతలు, మరలా మహావిష్ణువును శరణు కోరగా,బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు తమ పాదములతో ఆ పర్వతమును అణచివేసిరి. ఈనాటికీ పుష్పగిరి గ్రామ సమీపమందు విష్ణుపాదము, రుద్రపాదము అను నామములతో వారి పాదముద్రలు కనిపిస్తాయి. స్కాంద పురాణం శ్రీశైల ఖండంలో ఇక్కడి దేవాలయాన్ని 'నివృత్తి సంగమేశ్వరాలయం' అని పేర్కొన్నారు.

భౌగోళికముగా పుష్పగిరి ఆలయ సముదాయము సముద్రమట్టానికి రమారమి 380 metres (1,000 ft) ఎత్తులో ఉన్నది. ఈ ఆలయ సముదాయము ఇంచుమించు 7.5 చ.కి.మీ విస్తీర్ణములో వ్యాపించి ఉన్నది. ప్రక్కనే ఉన్న పెన్నానది మూలముగా సంవత్సర పర్యంతమూ వరిచేలతో ఇక్కడి పొలాలు కళకళలాడుతూ ఉంటాయి. కడప జిల్లాలోని కొన్ని ప్రాంతాలలో నీటి ఎద్దడి ఉన్నా కూడా, ఇక్కడ మాత్రము భూగర్భజలాలు పుష్కలముగా ఉంటాయి.

ఋతుపవనాల కాలములో వర్షాల తరువాత మామూలుగా ఎక్కువగా ఉన్న ఉష్ణోగ్రతలు చల్లబడుతాయి. పినాకినీ నదితో ఇక్కడ నాలుగు ఉపనదులు సంగమించినందువల్ల ఈ ప్రదేశమును పంచనదీ సంగమమని, పంచ ప్రయాగ అని పిలుస్తారు. పినాకినీ నదితో కలిసే మిగిలిన నాలుగు నదులు: కుముద్వతి, బాహుదా, మందాకినీ, పాపాఘ్ని. పినాకినీ నది కర్ణాటక దేశములోని నందికొండలలో పుట్టి ఇక్కడ పెద్దగా పెరిగి చూపరులను ఆకట్టుకునేలా ఉంటుంది. పెన్నా పూర్వగామిని. కానీ ఈ ప్రదేశములో కొద్దిగా దిశ మార్చుకొని దక్షిణాభిముఖముగా ప్రయాణించి పుష్పగిరి తరువాతి శివాలపల్లె అను గ్రామము వద్ద తిరిగి తూర్పుకు మళ్ళి ప్రవహిస్తుంది.

## చరిత్ర

### పూర్వ రాజుల కాలము

పుష్పగిరి ఆలయ సముదాయము గురించి అతి విలువైన చారిత్రిక ఆధారాలు,

చరిత్ర ఉన్నది. పుష్పగిరి గురించిన మొట్టమొదటి ప్రస్తావన స్కంద పురాణములోని శ్రీశైలఖండములో ఉన్నది. అదే విధముగా సత్యనాథుడు రాసిన 'రసరత్నకారము'లో కూడా పుష్పగిరి ప్రస్తావన ఉన్నది. ఇక్ష్వాకు రాజుల శాసనాలలో శ్రీశైలమల్లికార్జున జ్యోతిర్లింగ క్షేత్రమునకు దక్షిణ ద్వారముగా పుష్పగిరి వర్ణింపబడినది. పూర్వ చోళుల వంశానికి చెందిన కరికాళచోళుని శాసనములో ఈ స్థలము అత్యంత పవిత్రమైనదిగా చెప్పబడినది. పుష్పగిరిలోని అనేక భవనములు, దేవస్థానములు చోళ చాళుక్య శిల్పకళా వైభవానికి అద్దముపట్టినట్టుగా ఉంటాయి. అదే విధముగా తరువాతి రాజులు చేసిన మార్పులు, చేర్పుల మూలముగా వారి వారి శిల్ప వాస్తు కళా సంపాదన చేర్చబడినాయి. పినాకినీ నది గురించి ఇక్కడ ఒక్క ప్రస్తావన చేసి తీరాలి. కర్ణాటకలోని నంది కొండలలో వెలసియున్న భోగనందీశ్వరస్వామి దేవస్థానము వద్ద మూడు నదుల ఆవిర్భావమున్నది. అందులో ఒకటి పినాకినీ కాగా, మిగిలిన రెండు ఆర్కావతి మఱియు పాలారు. అందు ఆర్కావతి, పాలారు క్రమముగా దేశగర్భములో కలిసిపోయినా, పినాకినీ ఒక్కటీ దేశములన్నీ దాటి కడపను ప్రవేశించింది. ఒక నానుడి ప్రకారము, పరమేశ్వరుడు చేసిన ఆనందతాండవ ఫలితముగా ఉద్భవించిన నందికొండలలో పినాకినీ ఈశ్వరుణ్ణి తన జన్మకారణమడిగి దిశానిర్దేశము చేయమనినప్పుడు ఈశ్వరుడు తన చేతిలోని ధనస్సుతో భూమిమీద ఒక రేఖ వ్రాసి దానిని అనుసరించమని ఆ నదీమ తల్లిని ఆజ్ఞాపించినాడని, ఆ నది ఆ మార్గముగుండా వెళ్ళగా పుష్పగిరి దగ్గర చతుర్నదులు అందులో సంగమించి ఇప్పటి పెన్నా నది అయినదని లోకోక్తి.

శివుని ధనుస్సు పేరు పినాకము అయినందువలన ఆ నది పినాకినీ అయినదని పద వ్యుత్పత్తి. పూర్వ కాలపు రాజులు ఎందఱో ఈ క్షేత్రమును ఆరాధించి, పునరోద్ధారణ గావించి మదులు, మాన్యాలు సమర్పించి ధన్యులయినారు.

## మధ్యమ యుగపు రాజులు మఱియు పాలేగాళ్ళు

రాజులూ, రాజ్యాలు చేతులు మారినా పుష్పగిరి ప్రభావము తగ్గలేదు. ఎందఱో రాజులు, వారి పాలేగాళ్ళు ఇక్కడి వైద్యనాథ, చెన్నకేశవ మూర్తులను ఆరాధించి, సేవించి, మాన్యములు సమర్పించినారు.

1. వైదుంబ వంశానికి చెందినా సోమదేవుడు ఈ క్షేత్రమును సేవించినాడు.
2. చోళుల నుండి రాజ్యాధికారమును స్వాదీనపరచుకొన్న పల్లవరాజు చిద్దన దేవరాజు ఈ క్షేత్రమునకు మాన్యములు సమర్పించినట్టు చారిత్రక ఆధారములు లభ్యమవుతున్నాయి.
3. కేశవంశపు యాదవ సింగన ఇక్కడి వైద్యనాథేశ్వరున్ని పూజించినాడు.
4. రాష్ట్రకూట చక్రవర్తియైన కృష్ణవల్లభుడు వైద్యనాథలింగమునకు నిత్యపూజావరసమై మాన్యములు సమర్పించినట్టు శాసనములు చెపుతున్నాయి. ఈ మేరకు ఒక రాతి

శిలాఫలకమును భారతీయ పురాతత్వ సంస్థ కనుగొన్నది.
5. కాకతీయుల కాలమునాటి పాలేగాళ్ళు అయిన గంగయ సాహిణి మఱియు అంబ దేవుడు ఇక్కడి దేవతామూర్తులను కొలవడమే కాక అత్యంత మనోహరమైన దేవస్థానములను తమ భార్యల, కూతుళ్ళ పేర్లతో నిర్మించి, వాటికి మాన్యములిచ్చి పోషించినారు.
6. విజయనగర సామ్రాజ్యపు పాలేగాళ్ళు అయిన ముసునూరి నాయకులు ప్రస్తుత చెన్నకేశవస్వామి దేవస్థానమును నిర్మించినారు.
7. పుష్పగిరిలో దొరికిన ఒక రాతి శాసనము మూలముగా ఒక తంత్రవేత్త అయిన 'అఘోరశివాచార్యులు' అను సాధువు చెన్నకేశవస్వామి దేవస్థాన ముఖద్వారమును, మూలగోపురమును నిర్మించినాడని తెలుస్తున్నది.

## సంస్కృతి

తెలుగు జనబాహుళ్యముచేత మాట్లాడబడు భాష. కానీ ఏటేటా జరిగే జాతరకు కర్ణాటకాంధ్ర ప్రదేశముల నుండి విరివిగా జనులు ఇక్కడికి వస్తారు. ప్రాచీన కాలము నుండి ఇక్కడ వివిధమైన సంస్కృతులు ఉన్నట్టు ఇక్కడి శిల్పముల ద్వారా తెలుస్తున్నది. నేపాళ దేశములో బహుళ ప్రాచుర్యమున్న వీరపాశుపతము ఇక్కడ కూడా పాటించినట్టు కొన్ని శిల్పముల ద్వారా బహిర్గతమవుతోంది. పెన్నానది ఒడ్డున ఉన్న శ్రీవైద్యనాథేశ్వర స్వామి దేవస్థానములోని నకులీశుని (లకులీశుడని కూడా అంటారు) శిల్పము ఇక్కడ వీరపాశుపతము ప్రాచుర్యములో ఉన్నదనడానికి సాక్ష్యము.

ఆ కాలములో దేశ సంచారము చేయుచుండిన సాధువులు, అఘోరాలు ఇక్కడ శాక్తేయ పద్ధతులను సాధన చేసేవారు. శ్రీ ఆదిశంకర భగవత్పాదాచార్యుల వారు దేశ సంచారము చేస్తూ ఈ ప్రదేశానికి వచ్చినప్పుడు ఇక్కడి వైద్యనాథస్వామి వారి దేవస్థానములోని కామాక్షి అమ్మవారి విగ్రహము ఎదుట శ్రీచక్రమును స్థాపించారు. ఆ దేవస్థానముకు అనుబంధముగా ఒక మఠమును కూడా స్థాపించారు. బ్రిటీష్ కాలమునాటి కైఫియత్తుల ప్రకారము శ్రీశైల మల్లికార్జున భ్రమరాంబికా క్షేత్రము ఈ మఠము వ్యాప్తి కిందికి వస్తుందని ఆచార్యులవారు నిర్దేశించినారని తెలుస్తున్నది.

ఎఱ్ఱగుడిపాడు గ్రామమునుండి చింతలపత్తూరు గ్రామము వరకు బయల్పడిన శాసనముల మూలముగా కూడా ఇక్కడ వివిధ వామాచార, దక్షిణాచార పద్ధతులను అవలంబించారని తెలుస్తున్నది.

ఈ ఆలయ సముదాయములో వివిధ శైవ వైష్ణవ సాంప్రదాయములకు చెందిన దేవస్థానములు ఉన్నవి. శైవ వైష్ణవ విభేదాలు మిన్నంటిన కాలములో కూడా ఇక్కడ ఆ రెండు ఆచారాలు సామరస్యముగా ఉండడము విశేషము. దీనికి నలువైపులా కొండలు

నదులతో కూడి ఉన్న కడపజిల్లా భౌగోళికస్థితి కూడా ఒక కారణము కావచ్చును.

## వాస్తు శిల్ప కళ

పుష్పగిరిలోని వాస్తు శిల్పకళారీతులు ఇక్ష్వాకుల కాలము మొదలు విజయనగర సామ్రాజ్యపు రాజుల రీతుల వరకు ఉన్నాయి. చుట్టూ కొండలు, నదులతో ఉన్న కడప జిల్లా భౌగోళిక పరిస్థితులు చాలా మటుకు ఇతర సామ్రాజ్యాలను నిలువరించ గలిగినాయి. దీని మూలాన స్థానిక పరిస్థితులు స్వతంత్ర చిన్న రాజ్యాలకు, దొరలకు వీలు కల్పించినాయి. ఈ పరిస్థితులు బహు కాలము కొనసాగినాయి. ఇందువల్ల ఇక్కడి దేవస్థానములలో చాలా మటుకు ఇక్ష్వాకుల కాలమునుండి స్థానిక జమీందారుల కాలము వరకు శాసనాలు కనిపిస్తాయి. ఉదాహరణకు ఇక్ష్వాకుల, పల్లవుల, చోళుల, చాళుక్యుల, రాష్ట్రకూటుల, వైదుంబుల, కాయస్థుల, విజయనగర సామ్రాజ్యపు అవశేషాలు ఇంకా ఇక్కడి రాళ్ళలో కనపడుతాయి.

వైద్యనాథస్వామి దేవస్థానము ఒక్క అద్భుతమైన శిల్పకళా విశేషము. ఇందులో లెక్కకు మీరి దేవతామూర్తి ప్రతిమలు ఉన్నాయి. అన్నిటికంటే ముఖ్యముగా కామాక్షి అమ్మవారి గుడిలోని శ్రీచక్రము ఒక విశేషము. దేవస్థానములో రెండు గర్భ గృహములున్నవి. ఒకటి స్వామివారికి కాగా రెండవది అమ్మవారిది. చుట్టూ ఉన్న అనేక దేవతాప్రతిమలు ఇప్పుడు భారతీయ పురాతత్వ శాఖ పర్యవేక్షణలో ఉన్నాయి. శైవ- వైష్ణవ విభేదాలు మిన్నంటుతున్నటువంటి కాలములోనే కడపజిల్లాలో మతసామరస్యం పరిఢవిల్లింది, ముఖ్యముగా పుష్పగిరి పరిసర ప్రాంతములలో ఈ ధోరణి కనపడుతుంది. శైవ-వైష్ణవ ఆలయములు పక్క పక్కన ఉండి కూడా భావ విరోధమూ లేకుండా ఆలయాలకు ఎటువంటి నష్టం కలగించకుండా ఉండడం చెప్పుకోదగ్గ విషయం. వీటిలో రెండు దేవస్థానములు కేవలం 2 కి.మీ. దూరములో ఉండి ఈ భావ సారూప్యానికి సాక్ష్యం చెపుతున్నాయి. ప్రధాన వైష్ణవాలయమైన చెన్నకేశవ స్వామి దేవస్థానం చుట్టూ ఇంద్రనాథేశ్వర దేవస్థానము, భీమేశ్వర, త్రికూటేశ్వర మఱియు వైద్య నాథేశ్వర దేవస్థానములు ఉన్నవి. పెన్నానది తూర్పు తీరము నందు పశ్చిమ దిక్కు వైపు తిరిగి ఉన్న చెన్నకేశవస్వామి దేవస్థానము శిఖరము చూపరులును ఆకట్టుకుంటుంది. ఇంద్రనాథస్వామి దేవస్థానము నదీ తీరమునకు ఉత్తర దిక్కున ఉంది. ఈ దేవస్థానమునకు చెందిన అతి ప్రాచీనమైన శాసనము 1076 C.E నాటిది. వైదుంబ వంశమునకు చెందిన అల్లమదేవుడనే రాజు దేవస్థానమునకు ఇచ్చిన కొన్ని భూమి మాన్యముల గురించి ఈ శాసనము ప్రస్తావిస్తుంది.

విజయనగర రాజు సాలువ నరసింహదేవరాయలు ఇక్కడి శ్రీ చెన్నకేశవ స్వామికి ఎన్నో విలువైన కానుకలు సమర్పించాడు. ఈ క్షేత్ర సందర్శనానికి వచ్చే యాత్రికులను బందిపోటు బాధిస్తుంటే నరసింహరాయలు తన ప్రతినిధి వెంకట కుమారా

ధూళి బసివి నాయుడిని పంపి, యాత్రికులకు క్షేమం కలిగింపజేశాడు. కొంతకాలం తర్వాత శ్రీ కృష్ణదేవరాయల కాలంలో, నాయుడి వారసులు బందిపోట్లతో చేతులు కలిపి యాత్రికులను పీడిస్తుంటే ముసిలినాయుడిని పిలిపించి తీవ్రంగా హెచ్చరించి దారిలో పెట్టి జిల్లెల్ల గ్రామాదులు అతని అధీనంలో ఉంచాడు.

చెన్నకేశవ స్వామి దేవాలయానికి తాంత్రిక యోగి అఘోర శివాచార్య ముఖ ద్వారం నిర్మించాడు. ఇక్కడ జరిగే ఉత్సవాలకు దేశం నలుమూలనుంచి యాత్రికులు వస్తారు. శాతాబ్దాల కాలం నుండి ఇక్కడవీర పాశుపత, వీర శైవ మొదలైన వామాచార విధానాలు అమలులో ఉన్నాయి. వైద్యనాథ ఆలయానికి పడమర పెన్నానది ఒడ్డున ఉన్న 'నకులేశ' లేక 'లకులేశ' విగ్రహం ఇక్కడ అనేక ప్రాచీన హిందూమత విధానాలు అమలులో ఉండేవని చరిత్రకారుల భావన. ఈ మూర్తి చేతిలోని దండానికి సర్పం చుట్టుకొని ఉండటం విశేషం. శ్రీ శైలంలోని హఠ కేశ్వరదేవాలయం పాశు పతాచారానికి ప్రసిద్ధి.

పుష్పగిరిలో తూర్పుముఖంగా ఉన్న ఇంద్రనాథ దేవాలయం మెట్లు పెన్నానదిలోకి ఉంటాయి. ఇక్కడి బిల్వ వృక్షం ప్రసిద్ధమైనది. ముఖ్యాలయంలో 16 స్తంభాల ముఖ మండపం, అంతరాలయం గర్భాలయం ఉంటాయి. ఇక్కడి చెన్నకేశవాలయం చోళరాజుల నిర్మాణం. స్వామి పశ్చిమముఖంగా ఉంటాడు. అమ్మవారు రాజ్యలక్ష్మి దేవి. ఏ ఆలయంలో చూసినా అనేక దేవీ దేవతా విగ్రహాలు శిల్పకళా వైభవంగా దర్శనమిస్తాయి.

## ఇక్కడి శాసనాలు

క్రీ.శ. 991 త్రైలోక్య మల్లరాజు శాసనం, 1062లోని మురారికేశవ రాజు దేవరాజు శాసనం ఆహవమల్ల శాసనం, 1083 మల్లదేవరాజు శాసనం, 1104 బిల్వునిబిజ్జున పల్లవరాజు శాసనం, సింహాన భూపతిరాజు శాసనం, భుజబల వీరమల్ల రాజు శాసనం, కృష్ణ కన్నడ దేవరాయ శాసనం, 1171 మల్లి క్షతీశం రాజు శాసనం, 1178 కమలాబాయి శాసనం, 1179 కాకతి గణపతి దేవ శాసనం, 1179 కాయస్థ గంగయ సాహిని శాసనం, 1226 త్రిపురారి శివయ్య శాసనం, 1348 సమ్మెట కంపయ్యశాసనం, 1509 శ్రీ కృష్ణ దీవరాయ శాసనం. పుష్పగిరిలో ముఖ్యంగా శైవా రాదన ఉన్నా, వైష్ణవారాధనా కనిపిస్తుంది. ఇక్కడ జైన బౌద్ధ గోలకి, ఆరాధ్య, కాపాలిక, కాలముఖ, రస శైవం, శాక్తేయ, సౌర మతాలు కూడా వర్ధిల్లాయి.

**ఇక్కడి ముఖ్య ఆలయాలు–** శ్రీ లక్ష్మీ చెన్నకేశవ, శ్రీ కామాక్షీ వైద్యనాథేశ్వర, శ్రీ సంతానమల్లేశ్వర, శ్రీ త్రికూటేశ్వర, శ్రీ ఇంద్ర నాథ, శ్రీ కాశీ విశాలాక్షి విశ్వేశ్వర, శ్రీ సాక్షి మల్లేశ్వర, శ్రీ అగస్త్యేశ్వర, శ్రీ భీమేశ్వర, శ్రీ ఉమామహేశ్వర, శ్రీ పాతాళ గణపతి శ్రీ యోగాంజనేయ, రుద్రపాద, శ్రీ విష్ణుపాద, శ్రీ పాప వినాశనేశ్వర, శ్రీ డుంరి వినాయక,

శ్రీ కమల సంభవేశ్వర, దుర్గాంబ దేవాలయాలున్నాయి. ఇవికాక ఇంకా ఎన్నో శిథిలాలయాలు, విరిగిన విగ్రహాలు అనేకం.

ఆదిశంకరాచార్యులు పూజించిన చంద్రమౌళీశ్వర లింగం, విద్యారణ్యులు ప్రతిష్ఠించిన శ్రీ చక్రం ఉంది. ఏనుగుల వీరాస్వామి తన కాశీయాత్రలో 1830లో ఇక్కడ విడిది చేశాడు. ఆయన పుష్పగిరి గురించి ఇలా వ్రాశారు: "పుష్పగిరి పుణ్యక్షేత్రము. పినాకినీ తీరము. నది గట్టున కొండ వెంబడిగా రమణియ్యమైన యొక దేవస్థలమున్నది. అది హస్తినిక్షేపము చేయతగిన పుణ్యస్థలము. స్మార్త పీఠాధిపతి యయిన పుష్పగిరి స్వాములవారు, అక్కడ మఠము గట్టుకొని నివాసము చేస్తున్నారు. 18 బ్రాహ్మణ గృహములున్నవి. అక్కడి బ్రాహ్మణులు కొంత వేదాంత విచారణ గలవారుగా కనబడు చున్నారు. అన్ని వస్తువులకు పేటకు పోవలెగాని, అక్కడ దొరకవు. నది దాటి ఊరు ప్రవేశించవలెను. మళ్ళీ నది దాటి భాటకు రావలెను. ఊరు రమ్యమైనది".

హరి హర క్షేత్రమైన పుష్పగిరిలో శ్రీ లక్ష్మీ చెన్నకేశవ స్వామికి బ్రహ్మోత్సవాలు ఏప్రిల్ 15 ప్రారంభమై 21 కల్యాణోత్సవం, 22 రథోత్సవం, 23 అశ్వవాహన సేవ, 24 చక్రస్నానం, పూర్ణాహుతి, పుష్పయాగం నిర్వహిస్తారు. శ్రీ కామాక్షీ వైద్యనాథ స్వామికి ఏప్రిల్ 15 మృత్సంగ్రహణం, అఖండ దీపారాధన, 21 కల్యాణం, 22 రథోత్సవం, 23 నిత్యహోమం, 24 చక్రస్నానం జరుపుతారు.

ఆలయాల గోడలపై శిల్పాలు ఏనుగుల వరుసలు, గుర్రాలపై వీరుల విన్యాసాలు, రామాయణ, భాగవత ముఖ్యఘట్టాలు, కిరాతార్జున గాథ, నటరాజ నృత్య భంగిమ చూసి తరించాలి. ప్రతి అంగుళంలో అద్భుత శిల్పకళ కట్టి పడేస్తుంది. అమ్మవారి సేనాపతులైన సప్త మాతృకల విగ్రహాలునాయి.

జన్మలో ఒక్కసారైనా అందరూ దర్శించాల్సిన క్షేత్రం పుష్పగిరి. ఆంధ్రుల పీఠం పుష్పగిరి. దీని ఆధీనంలోనే శ్రీశైలపీఠం కూడా ఉండేది. ప్రస్తుత పీఠాధిపతి హైదరాబాద్‌లో ఉంటున్నారట.

## 4) శ్రీ సౌమ్యనాథ స్వామి దేవాలయం - నందలూరు

నందలూరు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములోని కడప జిల్లా, నందలూరు మండలం లోని గ్రామం, ఈ మండలానికి కేంద్రం. ఇది సమీప పట్టణమైన రాజంపేట నుండి 10 కి.మీ. దూరంలో ఉంది.

### గ్రామచరిత్ర

నందలూరు గురించి యాత్రాచరిత్రకారుడు ఏనుగుల వీరాస్వామయ్య తన కాశీయాత్రా చరిత్రలో పలు విశేషాలు నమోదు చేశారు. 1830 నాటికి ఈ గ్రామం పుణ్యక్షేత్రంగా పేరొందింది. వీరాస్వామయ్య ఈ గ్రామాన్ని గురించి వ్రాస్తూ "ఊరి వద్ద

చెయ్యారనే నది గడియదూరం వెడల్పు కలిగుందన్నారు. నదికి ఇరుపక్కల గుళ్ళున్నవని, పరశురాముని మాతృహత్య నివర్తించిన స్థలమని ఆయన పేర్కొన్నారు". ఈ గ్రామం ఒకప్పుడు బౌద్ధ క్షేత్రం. నందలూరుకు సమీపంలోని ఆడపూరు దగ్గర బౌద్ధారామముండేది. ఇప్పటికీ దీనిని బైరాగిగుట్ట అని పిలుస్తారు. ఈ గుట్ట కింద సొరంగ మార్గముంది. నందలూరు దగ్గర చాలా గుహలున్నాయి. సిద్ధవటం కోటలోనుంచి నందలూరు గుహల్లోకి రహస్య మార్గముందంటారు. పురావస్తు శాఖవారి తవ్వకాల్లో బౌద్ధ స్తూపాలు, బౌద్ధ విహారం, కొన్ని కట్టడాలు, 1600 పైగా సీసపు నాణేలు, మరికొన్ని బౌద్ధ చిహ్నాలు దొరికాయి.

## పేరు వెనుక చరిత్ర

ఈ గ్రామానికి పూర్వం తొండమండలం, నిరంతపురం, చొక్కనాథపురం అనే పేర్లు ఉండేవి. నిరంధర అనే మహారాజు నిరంతపురం అనే గ్రామాన్ని నిర్మించగా అది బాహుదా నది వెల్లువలో కొట్టుకుపోగా తరువాత నలంద అనే రాజు ఉంపుడుగత్తె ఈ ప్రదేశాన్ని సందర్శించి నెలందలూరు అనే పేరుతో తిరిగి గ్రామాన్ని నిర్మించినట్టు మెకంజీ కైఫీయత్‌లో పేర్కొనబడింది. పూర్వం ఒక తెలుగు చోడ ప్రభువు గోహత్య పాప నివారణార్థం బాహుదానదీ తీరం వెంబడి 108 శివాలయాలను నిర్మించాడు. ఆ దేవాలయాలలో నంది విగ్రహాల ప్రతిష్ఠాపనకు ప్రాధాన్యత ఇచ్చినందువల్ల ఆ నది గట్టున ఉన్న గ్రామానికి నం(ది)దుల ఊరు అనే పేరు వచ్చిందనీ అదే వ్యవహారికంలో నందలూరుగా మారిందని మరొక ఐతిహ్యం.

## చూడదగ్గ ప్రదేశాలు

### సౌమ్యనాథ స్వామివారి ఆలయం

11వ శతాబ్దంలో చోళవంశ రాజులచే నిర్మించబడిన ఆలయం. సంతాన సౌమ్యనాథునిగా, వీసాల సౌమ్యనాథునిగా ప్రసిద్ధికెక్కాడు. ఎనిమిది ఎకరాల విస్తీర్ణంలో 108 స్తంభాలతో చోళ కళాశిల్ప నైపుణ్యానికి ప్రతీక. 11వ శతాబ్దపు పూర్వార్థంలో చోళరాజులు నిర్మించి స్వామివారికి 120 ఎకరాల మాన్యం ఇచ్చినట్లు ఆలయంలోని శాసనాల్లో లిఖించబడి ఉంది. అప్పటి నుండి చోళపాండ్య కాకతీయ మట్లి మున్నగు రాజులు 17వ శతాబ్దం వరకు దశలవారీగా ఆలయనిర్మాణం చేపట్టి పలు రాజుల పాలనలో శ్రీవారి ఆలయం ప్రసిద్ధికెక్కింది. 12వ శతాబ్దంలో కాకతీయ ప్రతాపరుద్రుడు ఆలయానికి గాలిగోపురం కట్టించి నందలూరు, ఆడపూరు, మందరం, మన్నూరు, హస్తవరం అయిదు గ్రామాలను సర్వమాన్యంగా ఇచ్చినట్లు శాసనాలు ఉన్నాయి. ఆ

గ్రామాల రెవెన్యూ ఇప్పటికీ ఆలయానికే అందుతోంది. అన్నమయ్య జన్మస్థానమైన తాళ్ళపాక గ్రామం నందలూరుకు నాలుగు కిలోమీటర్ల దూరంలో ఉంది.

శ్రీ సౌమ్యనాథుని చొక్కనాథుడని కూడా పిలుస్తారు. ఆలయ నిర్మాణానికి ఎర్ర రాయిని వినియోగించారు. ఆలయ కుడ్యాలపై వివిధ రాజుల సంకేతాలుగా మత్స్య, సింహ, అర్థచంద్రాకారపు చిహ్నాలున్నాయి. తమిళ శాసనాలు అధికంగా ఉండగా, తెలుగు శాసనాలు కొన్ని మాత్రమే. దేవస్థానంలో గోడలపైన కాకుండా నిలువు బండలపై 11వ శతాబ్దం నుండి విజయనగర పాలన వరకు ముఖ్యమైన అనేక వివరాలతో 54 శాసనాలు ఉన్నాయి.

ఆలయం చుట్టూ 9 ప్రదక్షిణలు చేసి, కోర్కెను మొక్కుకుని, 108 ప్రదక్షిణలు చేస్తే, నెరవేరుతుందని భక్తుల నమ్మకం. ఆలయానికి జిల్లా నలుమూలల నుండియే గాక, తమిళనాడు, కర్నాటక తదితర ప్రాంతాలనుండి గూడా భక్తులు అధిక సంఖ్యలో విచ్చేస్తారు. ప్రతి సంవత్సరం ఆషాఢమాసంలో బ్రహ్మోత్సవాలు జరుపుతారు. ఈ బ్రహ్మోత్సవాలలో ప్రతి రోజూ సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తారు.

దక్షిణ భారతదేశంలో ఉన్న సుప్రసిద్ధ ఆలయాల్లో నందలూరులోని సౌమ్యనాథాలయం ఒకటి. శ్రీ సౌమ్యనాథునికి చొక్కనాథుడని, చొక్కనాథ పెరుమాళ్ అని, కులోత్తుంగచోళ ఎంబరుమన్నార్ విన్నగర్ అనే పేర్లు గలవు. దీన్ని బట్టి చూస్తే తమిళనాడుతో ఈ ఆలయానికి చారిత్రాత్మక అనుబంధం ఉందని చరిత్రకారులు చెబుతున్నారు. సౌమ్యనాథుడన్నా..చొక్కనాథుడన్నా సౌందర్యవంతుడని అర్థం. సౌమ్యనాథుడనగా సౌమ్యకు (శ్రీలక్ష్మీదేవికి) నాథుడని అర్థం. స్వామి మూలవిరాట్ ఏడడుగుల ఎత్తు ఉండి చాలా సౌమ్యంగా అభయ ముద్రాలంకితమై ఉంటుంది.

### ప్రత్యేకత

బ్రహ్మ మానసపుత్రుడు.. త్రిలోకసంచారి.. లోకకల్యాణ కారకుడు.. కలహప్రియుడు నారదుడు నందలూరు గ్రామంలో వెలసిన సౌమ్యనాథాలయంలో సౌమ్యనాథస్వామి మూలవిరాట్‌ను ప్రతిష్ఠించారని శాసనాలు ధ్రువీకరిస్తున్నాయి.

## ఎటువంటి దీపం లేకున్నా..

ఎటువంటి దీపం లేకున్నా సౌమ్యనాథస్వామి ఉదయం నుంచి సాయంకాలం వరకు దేదీప్యమానంగా వెలుగొందే విధంగా ఆలయం నిర్మించడం అద్భుతం. గర్భగుడి ప్రధాన ద్వారానికి వంద గజాల దూరం నుంచి కూడా స్వామి చాలా స్పష్టంగా కనిపిస్తారు. ఏడాదిలో ఏదో ఒక రోజు సూర్యకిరణాలు స్వామి పాదాలపై ప్రసరించే విధంగా శిల్పులు నిర్మించారు. స్వామి తిరుమల బాలాజీని పోలి ఉంటాడు కానీ ఇక్కడి సోమ్యనాద స్వామికి వరద హస్తం ఉంటే, తిరుమల స్వామికి 'కటి వరద హస్తం' ఉంటుంది.

సౌమ్యనాదునిపై అన్నమయ్య 16 కీర్తనలు రాశాడు.

## దేవాలయంలో మరో ఆలయం

ఆలయంలో లోపలికి ప్రవేశించగానే రాతి మంటపంపై నుంచి గర్భాలయంలో ప్రవేశించాల్సి ఉంది. ఈ మంటపం ముందుభాగం శిఖరంలో సింహం తల ఆకారంలో ఇరువైపులా ఉన్నాయి. ఏ దేవాలయానికి అయినా ఆలయ పైభాగంలో సింహం తలలు అమర్చిబడి వుంటాయి. కానీ సౌమ్యనాథస్వామి ఆలయంలో లోపలి మంటపంలోని ఓ భాగమంతా సింహం తలలతో నిండి ఉండటం కనిపిస్తుంది. కాబట్టి ఆలయ పైభాగంలో ఉండే ఈ సింహం తలలు ఆలయ లోపల ఉండటం వల్ల.. భూగర్భలో మరో ఆలయం ఉన్నట్లుగా గోచరిస్తోంది. రాతి మంటపం అడుగున ఉన్నది శివాలయంగా చెప్పుకుంటున్నారు.

## మత్స్య, సింహం చిహ్నాలు

ఆలయ కుడ్యాలపై (లోపల)పై భాగంలో మత్స్య, సింహం చిహ్నాలు ఉన్నాయి. మత్స్య ఆకారాన్ని మలిచి ఉన్నారు. లోపల సీలింగ్‌పై ఒక పెద్ద మత్స్యం చెక్కబడింది. భవిష్యత్తులో పెద్ద ఎత్తున వరదలు వచ్చి ఆలయాన్ని ముంచెత్తినప్పుడు లేక ప్రళయం సంభవించినప్పుడు ఈ మత్స్యానికి ప్రాణం వచ్చి వరదలలో కలిసిపోతుందని స్థానికుల నమ్మకం. అంటే అప్పటికి కలియుగం అంతమైపోతుందనే అర్థం వస్తుందని చెబుతుంటారు..

## ఆలయ నిర్మాణం

ఆలయాన్ని దాదాపు 10 ఎకరాల విస్తీర్ణంలో 180 స్తంభాలతో వైఖానస, వైష్ణవగామ ఆర్షపోక్త వాస్తుయుక్తముగా సువిశాలంగా నిర్మించారు. ఈ దేవాలయానికి 120 ఎకరాల మాన్యం ఉన్నట్లు శాసనాలలో ఉంది. ఇప్పుడు ఆ పరిస్థితి కనిపించడం లేదు. రాజంపేట మండలంలోని ఆడపూరు, మన్నూరు, మందరం, హస్తవరం అనే ఐదు గ్రామాలను బహుమానంగా ఇచ్చినట్లు శాసనాలు చెబుతున్నాయి. అధికంగా తమిళ శాసనాలు కనిపిస్తాయి. సింహద్వారంలో గాలిగోపురం ఉత్తరగోపురం, దక్షిణగోపురం ద్వారాలు ఉన్నాయి. ఆలయంలో రాతి దీపస్తంభం, బలిపీఠం, ధ్వజస్తంభం, గరుడమందిర, మత్స్యమంటపం, ఆంజనేయమంటపం, చిన్నకోనేరు, జయవిజయాలు, అంకుర్పారణ మంటపం, వంటశాల, శ్రీ యోగనరసింహస్వామి, శిల్పకళ, అంతరాళం ఉన్నాయి. దేవాలయ ఆవరణలో పెద్ద కోనేరు ఉంది.

## శాసనాలు

ఆలయంలో 54 శాసనాలు ఉన్నాయి. తొలిశాసనం క్రీస్తు శకం 1078

లోనిదిగాను, క్రీ.శ. 1619లో శాసనం చివరి శాసనంగా గుర్తించారు. ఇందులో దాన శాసనాలే అధికంగా ఉన్నాయి. ఈ శాసనాలలో ఉన్న వాటికి సంబంధించి ఇప్పుడైతే ఏమీ లేవనే స్పష్టమవుతోంది. క్రీ.శ. 11వ శతాబ్దం మధ్యలో నందలూరులోని సౌమ్యనాథ స్వామి దేవస్థానం మొదటి వైష్ణవ ఆలయంగా గుర్తించారు. ఆళ్వారుల విగ్రహాలు ఒకే రాతిపీఠంపై ఉండేవి.. ఇప్పుడు లేవు. వీటిలో కొన్ని ధ్వంసం అయ్యాయి. మరికొన్ని పురావస్తు శాఖ మ్యూజియంకు తరలించారని అంటున్నారు.

## కోర్కెలు తీర్చే దేవుడు

కోరిన కోర్కెలు తీర్చే దేవుడిగా సౌమ్యనాథస్వామి ప్రసిద్ధి చెందారు. గర్భగుడి చుట్టూ తొమ్మిది ప్రదక్షిణలు చేస్తే కోర్కెలు నెరవేరుతాయనే విశ్వాసం భక్తుల్లో ప్రగాఢంగా ఉంది. కోర్కెలు తీరిన తర్వాత గర్భగుడి చుట్టూ 108 ప్రదక్షిణలు చేయడం క్షేత్ర సంప్రదాయంగా వస్తోంది. సంతానం కలగని వారు స్వామిని ప్రార్థిస్తే కలుగుతుందని భక్తులు నమ్ముతున్నారు. స్వామిని దర్శించి స్మరిస్తే పాపాలు తొలిగిపోతాయట. మనసారా పూజించే వారికి భూత, ప్రేత, పిశాచాల బాధలు తొలిగిపోవడమే కాక చెడు కలలు రావడం ఉండవని చెబుతున్నారు. విదేశీయానానికి సిద్ధమవుతున్న వారు ఇక్కడికి వచ్చి.. స్వామి ఆశీస్సులు తీసుకోవడం జరుగుతోంది.

శ్రీ మహా విష్ణువు నృసింహావతారం దాల్చి హిరణ్యకశిపుని సంహరించి, మహోగ్రరూపంగా కొంతకాలం తిరిగి ఉగ్రం తగ్గి సౌమ్యుడిగా మారి ఇక్కడ వెలిశాడని అతిహ్యం.

ఈ గ్రామంలోనే శ్రీ కామాక్షీ సమేత ఉల్లంఘేశ్వరస్వామివారి ఆలయం కూడా ఉన్నది. దీనిని 10 శతాబ్దంలో చోళరాజులు నిర్మించారు. తమిళంలో సంస్కృతంలో కూడా ఉల్లం అంటే మనసు అని అర్థం. ఇక్కడి చండీశ్వరునికి చేసే ప్రదక్షిణాలకు గొప్ప ఫలితం ఉంటుంది.

నందలూరుకు సమీపంలో ఒంటిమిట్టకు దగ్గరలో చేయ్యుర్‌లో ఉన్న శివాలయంలో కార్తీకమాసం మూడవ సోమవారం శివలింగంలోకి నీరు చేరుతుందట. మిగతా ఎప్పుడూ అక్కడ నీటి జాలు ఉండదట.ఇదొక విశేషం.

## 5) శ్రీ లక్ష్మీ వేంకటేశ్వర స్వామి దేవాలయం - దేవుని కడప

"కాదనకు నామాట కడపరాయ - నీకు గాదెంబోసే వలపులు కడపరాయ చ : కప్పుర మియ్యఁగరాదా కడపరాయా - నీకుఁ గప్పితి నాపయ్యెదెల్లఁ గడపరాయ కప్పుమివే కుచములు కడపరాయా - వో కప్పుమొయిలు మేనిచాయ కడపరాయ చ : కందువకు రారాదా కడపరాయా - ముందే గందమిచ్చినవాఁడవు కడపరాయ కందము నీమాటలిఁ

కఁ గడపరాయా – వో కందర్పగురుఁడ మొక్కేఁ గడపరాయ చ : కలసితివిటు నన్నుఁ గడపరాయా – నా కల నేఁడు నిజమాయఁ గడపరాయ కలదాననే నీకుఁ గడపరాయా – వో కలికి శ్రీవేంకటాద్రి కడపరాయ అని అన్నమయ్య కొలిచిన దేవుని కడప శ్రీ లక్ష్మి వెంకటేశ్వర స్వామి దేవాలయం.

ఇక్కడ ఉన్న శ్రీ లక్ష్మీ వేంకటేశ్వరాలయం మూలంగా ఈ ప్రాంతానికి దేవుని కడప అని పేరు వచ్చింది. తిరుమల క్షేత్రానికి దేవుని కడప గడప అంటారు. ఇక్కడి వేంకటేశ్వర స్వామిని కృపాచార్యులు ప్రతిష్ఠించారని ప్రతీతి. అందువలన ఈ పట్టణానికి కృపాపురమని పేరు వచ్చింది. కృపాపురమే కడపగా మారిందంటారు. క్రీ.శ. 2వ శతాబ్దంలో టాలెమీ అనే విదేశీ యాత్రికుడు కడపను దర్శించాడు. ఈ ఊరిని కరిపె, కరిగె అంటారని రాశాడు. కరిపె అనే మాటే చివరికి కడపగా మారి ఉండవచ్చు.

ఏడుకొండల వేంకశ్వరునికి ప్రతిబింబంలా కనిపించే స్వామి దేవుని కడపలో వెలసిన శ్రీలక్ష్మీప్రసన్న వేంకటేశ్వరుడు. ఈ గుడిలో ఒక మందిరంలో వేంకటేశ్వరుడు, ఎడమ వైపు మందిరంలో శ్రీ మహాలక్ష్మి ఉన్నారు. మాఘ శుద్ధ పాడ్యమి నుండి సప్తమి (రథసప్తమి) వరకు బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. సప్తమి రోజు రథోత్సవం జరుగుతుంది. ఆనాడు వేలాది మంది భక్తులు పాల్గొంటారు.

విజయనగర రాజులు, నంద్యాల రాజులు, మట్లి రాజులు ఈ ఆలయాన్ని అభివృద్ధి చేశారు. మడిమాన్యాలు, బంగారు సొమ్ములు ఈ స్వామికి సమర్పించారు. తాళ్ళపాక అన్నమాచార్యులు ఈ స్వామి మీద 12 కీర్తనలు చెప్పాడు. ఈ గుడిలో విష్వక్సేన మందిరం, నాగుల విగ్రహాలు, ఆండాళ్ మందిరం, శమీ వృక్షం, ఆళ్వార్ల సన్నిధి, కళ్యాణ మంటపం, ఆలయం వెలుపల పుష్కరిణి చూడదగినవి. ఇక్కడ ఇటీవల నిర్మించిన అద్దాల మందిరం ఒక ప్రత్యేక ఆకర్షణ.

గర్భగుడి వెనుకవైపు ఎత్తైన ఆంజనేయస్వామి విగ్రహముంది. ఈ ఆంజనేయస్వామి ఈ క్షేత్రపాలకుడు. ఈ ఆలయ ప్రాంగణంలో ఉండే వినాయక విగ్రహానికి నిలువు నామాలుండడం విశేషం. దేవుని కడపలో ఇంకా సోమేశ్వరాలయం, దుర్గాలయం, ఆంజనేయ మందిరం ఉన్నాయి. తిరుమల తిరుపతి దేవస్థానం వారు నిర్మించిన కళ్యాణ మంటపముంది.

## క్షేత్ర ప్రాశస్త్యం

దేవుని కడప క్షేత్రం తిరుమలకు తొలిగడపగా ప్రసిద్ధిగాంచింది. దక్షిణ ప్రాంత యాత్రికులు కాశీ వెళ్ళడానికి ఉత్తర భారతదేశ యాత్రికులు రామేశ్వరం వెళ్ళడానికి తిరుమల వేంకటేశ్వరుని వద్దకు కాలిబాటన వెళ్ళేవారికి కడపే ప్రధాన మార్గం. ఈ కారణంగా మూడుచోట్లకు వెళ్ళే భక్తులు కచ్చితంగా ఇక్కడ మొదటిగా శ్రీ లక్ష్మీప్రసన్న

వేంకటేశ్వరుణ్ణి, సోమేశ్వర స్వామిని దర్శించుకుని అనంతరం మూడు క్షేత్రాలకు వెళ్ళేవారు. ఇందువల్లనే మూడు క్షేత్రాల తొలి గడపగా దేవుని కడప ప్రసిద్ధి చెందింది.

తిరుమల వరాహ క్షేత్రం కాగా ఇది హనుమ క్షేత్రం. అందుకు చిహ్నంగా ఇక్కడ స్వామి వెనుక భాగాన నిలువెత్తు విగ్రహరూపంలో ఆంజనేయ స్వామి నెలకొని ఉన్నాడు. ఆలయ ప్రాంగణంలో ఆండాళమ్మ, విష్వక్సేన, పద్మావతి అమ్మవారు, శంఖ చక్ర ధ్వజ గరుడ ఆళ్వారు, హన్మత్ పెరుమాళ్ళు, నృత్య గణపతి తదితర దేవీ దేవతలు కొలువై ఉన్నారు. సాధారణంగా ఎక్కడైనా వినాయకుని విగ్రహానికి అడ్డనామాలు ఉంటాయి. వాటికి భిన్నంగా ఇక్కడ నృత్య గణపతికి నిలువు నామాలుంటాయి. అలాగే కంచి తరహాలో ఇక్కడ కూడా ఆలయ మండప పైభాగంలో రాతి బల్లులు ఉండటం విశేషం. పాపనివారణ కోసం భక్తులు ఆ బల్లుల్ని తాకుతారు.

ఈ ఆలయానికున్న మరో విశిష్టత మతసామరస్యం. ఉగాదినాడు ఈ చుట్టుపక్కల ప్రాంతాల్లో ఉండే ముస్లిం సోదరులు స్వామి వారిని దర్శించుకోవడం కనిపిస్తుంది. వారితో పాటు జైనులు కూడా వస్తుంటారు. రథసప్తమి రోజు జనసందోహం మధ్య స్వామి రథాన్ని కులమతాలకతీతంగా లాగడం మతసామరస్యానికి నిదర్శనం.

### ఉత్సవాలు

దేవుని కడప ఆలయ చెరువుల సముదాయాన్ని హరిహర సరోవరంగా పిలుస్తారు. హనుమ క్షేత్రం అయినందున హనుమత్ పుష్కరిణి అనికూడా అంటారు. కొలనులోని నిరయమంటపం, పడమరన తీర్థవాశి మంటపం ఉన్నాయి. పాతకడప చెరువు నుంచి నీరొచ్చే మార్గం ఉంది. పుష్కరిణిలో స్వామి తెప్పోత్సవాలను వైభవంగా నిర్వహిస్తారు. ఏటా ధనుర్మాసంలో ప్రత్యేక పూజలు నిర్వహిస్తారు. ప్రతి ఏడాది మాఘ శుద్ధ పాడ్యమి నుంచి ఏడురోజుల పాటు అంగరంగ వైభవంగా ఉత్సవాలు జరుగుతాయి. ఏడో రోజు మాఘ శుద్ధ సప్తమి (రథసప్తమి) నాడు జరిగే రథోత్సవం, కల్యాణోత్సవం, గరుడవాహన సేవలో పాల్గొనేందుకు భక్తులు వేలాదిగా తరలివస్తారు. రథోత్సవంలో భాగంగా స్వామి గ్రామంలో ఊరేగుతాడు.

40, 50 సంవత్సరాల క్రితం వరకు కడప జిల్లాలోని కోడూరు ప్రాంతం నుంచి తిరుమలలోని గోగర్భం వరకు కాలిబాట వుండేది. తిరుపతి ప్రాధాన్యత తగ్గకూడదన్న విషయంపై పలు చర్చల అనంతరం కోడూరు నుంచి వున్న అడ్డదారి గురించి వెలుగులోకి రాకుండా చేశారు. త్రేతాయుగంలో శ్రీ రాముడు సీతాదేవిని వెతుకుతూ వింధ్య పర్వతాల నుండి బయలుదేరి ఆంధ్రతీర ప్రాంతాల నుంచి బయనిస్తూ దట్టమైన అరణ్యంలో రాక్షస సంచారం ఎక్కువగా వుండడం వలన దారిపొడవునా హనుమంతుని చిత్రాలు గీస్తూ వెళ్లాడని చరిత్రకారులు చెబుతున్నారు. ఆ విధంగా పెద్ద బండరాయిపై గీసిన చిత్రం నేటికీ దేవునికడపలో వుంది. నేటికీ చరిత్ర చెప్పిన

సాక్ష్యాల ప్రకారం ముందుగా దేవుని కడపకు హనుమత్ క్షేత్రం పేరు. ద్వాపర యుగంలో కురుక్షేత్ర సంగ్రామం అనంతరం కలి ప్రవేశం జరిగిందని కృపాచార్యులు కలియుగ దైవం వెంకటేశ్వరుని దర్శించుకుందామని వింధ్య పర్వతాల నుంచే కాలి నడకన బయలుదేరారు. అలా నడుచుకుంటూ వచ్చిన కృపాచార్యులు హనుమత్ క్షేత్రం వచ్చిన తరువాత ఆయన ప్రయాణం ముందుకు సాగలేదు. అలాంటి దశలో కృపాచార్యులు ఏ హనుమత్ క్షేత్రం వద్దకు వచ్చిన తరువాత ఆయన ప్రయాణం ముందుకు సాగలేదు. అలాంటి దశలో కృపాచార్యులు నాబోటి వారికే దర్శనం కష్టంగా వుందని తలచి శ్రీవెంకటేశ్వరును ప్రార్థించారు. కృపాచార్యునికి హనుమత్ క్షేత్రంలో వెంకటేశ్వరుడు దర్శనమిచ్చి తమ దర్శనానికి వచ్చే భక్తులు ముందుగా హనుమత్ క్షేత్రంలో తమను దర్శించుకొని తిరుమలకు వస్తారని కృపాచార్యులకు చెప్పారని చరిత్రకారులు చెబుతున్నారు. అప్పుడు కృపాచార్యులు స్వామి అనుమతితో లక్ష్మీ వెంకటేశ్వర్లు ప్రతిమలు ప్రతిష్టించారని ప్రతీతి. తిరుమలకు తొలి గడపగా హనుమత్ క్షేత్రం చివరి గడపగా వరాహ క్షేత్రాన్ని కొలుస్తున్నారు. నేటికీ కూడా తిరుమల కొండల క్రింద హనుమంతును పెద్ద విగ్రహం దర్శనమిస్తుంది. దేవుని కడపలోని శ్రీ వెంకటేశ్వర స్వామి మూలవిరాట్ విగ్రహ వెనుకభాగంలో పెద్దరాతిపై హనుమంతుని విగ్రహం వుంది. దండకారుణ్యమైన ఈ ప్రాంతంలో రాక్షస సంచారం ఎక్కువగా వుండేదని అందువలన భక్తజన సంరక్షకుడిగా ప్రసన్న వెంకటేశ్వరునిగా ప్రసిద్ధుడైన స్వామిగా వెలసిన ప్రాంతమే దేవుని కడప. దండ కారణ్యంలో హనుమత్ క్షేత్రాలు ఎక్కువగా వున్నాయి. కృపాచార్యులచే ఈ ప్రాంతంలో వెంకటేశ్వరుని ప్రతిష్ట జరిగిందని ఈ ప్రాంతాన్ని ఇక్కడి ప్రజలు కృపావతి మండలంగా పిలుస్తుండేవారు. పామరజనం నోట కృపావతిగా పిలువను రాక కురుపాయి, కదుపాయి, కడపగా మార్పు చెందింది. గత 70, 80 సంవత్సరాల క్రితం బ్రిటిషు పరిపాలనలో కలెక్టర్ల వద్ద పనిచేసే బిళ్ళ బంట్రోతుల వద్ద గల బిళ్ళలపై కదుపాయి తాలూకాగా వున్న నిదర్శనం వుంది. కడపకు వచ్చిన నెహ్రూ కూడా కడపను కడప అని సంబోధించక కుడుప్పాయి అని సంబోధించారు. ఈ ఆలయ పునరుద్ధరణకు కృషి చేసినవారు ఎందరో వున్నప్పటికీ 14వ శతాబ్దం నుంచి కొంతమంది మహారాజుల పేరు చరిత్రకారులు పొందుపరచిన సమాచారంలో వున్నాయి. విజయనగర సామ్రాజ్య హరిహరరాయులు, బుక్కరాయులు, పాల్యం వంశీయుడైన నరసింహరాయులు, ఆంధ్రభోజుడు శ్రీకృష్ణ రాయులు, స్వామి ఆరాధన కోసం అమూల్యమైన ఆభరణాలు, మడిమాన్యాలు, సమర్పించారు. నంద్యాల అహోబిలేశ్వర దేవమహారాజు స్వామి కైంకర్యానికి భూదానం చేశారు. మగమండలేశ్వరుని తిమ్మయ్య దేవ మహారాజు ఉదయగిరి సీమలోని గ్రామానికి చెందిన రాబడిని ఈ ఆలయానికి ఇచ్చారు. ఆరణం సర్వప్ప స్వామికి కిరీటం సమర్పించారు. చిన్న ఆవు బలరాజు స్వామికి పూలతోట కోసం భూమిని దానం

చేశారు. ఈ వివరాలన్నీ ఆలయంలో వున్న శాసనాల ద్వారా తెలుస్తున్నాయి. వెంకటేశ్వరుని వరప్రసాదాన జన్మించిన మహాభక్తుడు తాళ్లపాక అన్నమాచార్యుడు కడపలోనే కొంతకాలం వుండి కడపరాయుడైన వెంకటేశ్వరుని ప్రత్యక్షంగా సేవించినట్లు తెలుస్తోంది. ఆలయ ప్రాంగణంలోని స్వామి సన్నిధిలోని మండపం విజయనగర రాజుల కాలంలో నిర్మించబడింది. తాండవ గణపతి శిల్పం మనోహరమైంది. ఆలయ రాజగోపురం మట్లిరాజుల కాలంలో నిర్మింపబడినదిగా చెప్పబడుతోంది. గోపుర ద్వారాన ఇరువైపులా రాయలవంశీకుల శిల్పాలు వున్నాయి. ఏడుకొండల వేంకశ్వరునికి ప్రతిబింబంలా కనిపించే స్వామి దేవుని కడపలో వెలసిన శ్రీలక్ష్మీప్రసన్న వేంకటేశ్వరుడు. ఈ గుడిలో ఒక మందిరంలో వేంకటేశ్వరుడు, ఆయనకు ఎడమ వైపు మందిరంలో శ్రీ మహాలక్ష్మి ఉన్నారు. మాఘ శుద్ధ పాడ్యమి నుండి సప్తమి (రథసప్తమి) వరకు బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. సప్తమి రోజు రథోత్సవం జరుగుతుంది. ఆనాడు వేలాదిమంది భక్తులు పాల్గొంటారు. ఈ ఆలయ ప్రాంగణంలో ఉండే వినాయక విగ్రహానికి నిలువు నామాలుండడం విశేషం. దేవుని కడపలో ఇంకా సోమేశ్వరాలయం, దుర్గాలయం, ఆంజనేయ మందిరం ఉన్నాయి. తిరుమల తిరుపతి దేవస్థానంవారు నిర్మించిన కళ్యాణ మంటపముంది. ఆలయ ప్రాంగణంలో ఆండాళమ్మ, విష్వక్సేన, పద్మావతి అమ్మవారు, శంఖ చక్ర ధ్వజ గరుడ ఆళ్వారు, హన్మత్ పెరుమాళ్ళు, నృత్య గణపతి తదితర దేవీ దేవతలు కొలువై ఉన్నారు. సాధారణంగా ఎక్కడైనా వినాయకుని విగ్రహానికి అడ్డనామాలు ఉంటాయి. వాటికి భిన్నంగా ఇక్కడ నృత్య గణపతికి నిలువు నామాలుంటాయి. అలాగే కంచి తరహాలో ఇక్కడ కూడా ఆలయ మండప పైభాగంలో రాతి బల్లులు ఉండటం విశేషం. పాపనివారణ కోసం భక్తులు ఆ బల్లుల్ని తాకుతారు. ఈ ఆలయానికున్న మరో విశిష్టత మతసామరస్యం. ఉగాదినాడు ఈ చుట్టుపక్కల ప్రాంతాల్లో ఉండే ముస్లిం సోదరులు స్వామి వారిని దర్శించుకోవడం కనిపిస్తుంది. వారితోపాటు జైనులు కూడా వస్తుంటారు. రథసప్తమి రోజు జనసందోహం మధ్య స్వామి రథాన్ని కులమతాలకతీతంగా లాగడం మతసామరస్యానికి నిదర్శనం.

ఇక్కడి శ్రీ సోమేశ్వరాలయంలో వర్షాలలకోసం సహస్ర ఘటాభి షేకం చేస్తారు. మంత్రపూతంగా 108 బిందెల నీరు స్వామికి అభిషేకం చేస్తే, ఆలయంలో అభిషేక జలం యెంత ఎత్తున ఉంటుందో, ఆ తర్వాత ఎంతమంది ఎన్ని వందల బిందేల నీరు భక్తులు తెచ్చిపోసినా ఒక్క మిల్లీమీటరు కూడా అభిషేక జల మట్టం పెరగదు. అదీ ఇక్కడి సోమేశ్వరస్వామి మహాత్మ్యం అని ప్రత్యక్షంగా చూసిన ఒంటిమిట్ట డా. శివకుమార్ మాకు చెప్పారు.

